NPR01A275

# ఆకలి

మూలం
నట్ హామ్సన్

అనుసరణ
రెంటాల గోపాలకృష్ణ



CI

# ఆకాశదీపాలు

(కథల సంపుటి)

రచన:

అవసరాల సూర్యారావు

98 పేజీలు రు. 1-0-0

“ఈనాటి కథకులలో అభ్యుదయభావాలూ, వాస్తవిక దృక్పథమూ బాగానే విస్తరించి ఉన్నప్పటికీ, జీవిత పోరాటానికి సన్నిహితంగా వుండి, ఆ పోరాటంలో ప్రముఖపాత్ర నిర్వహించే ప్రజల మనస్తత్వాలనూ, పరిసరాలనూ జీర్ణంచేసుకుని కథలు రచిస్తున్న కథకులు బహుకొద్దిమంది. ఆ కొద్ది మందిలో ఈ రచయితకు మంచిస్థానమున్నదని నిస్సంకోచంగా చెప్పవచ్చు. ఈ కథలను చదివిన యువరచయితలు తాము కథారచన చెయ్యటానికి కొత్త ఉత్సాహాన్ని ఈ కథల ద్వారా పొందగలుగుతారని నా నమ్మకం.”

—కొడవటిగంటి.

# ఆ క లి

[న వ ల]



మూలం :

'నట్ హామ్సున్'

అనుకరణ :

రెంటాల గోపాలకృష్ణ

కృష్ణాజిల్లా పెనమలూరు గ్రామస్తులు
చిగురుపాటి బుచ్చిరామయ్య గారూ
డా॥ చంద్రశేఖర్ గారు
బహూకరించిన పుస్తకం

'నగారా' ప్రచురణాలయం

గుంటూరు.

# మా మాట

నవలా రచయితగా, కథకుడుగా, వ్యాసకర్తగా 'నట్ హామ్సన్' విశ్వవిఖ్యాతి నార్జించుకున్నాడు. నార్వే జాతీయుడైన నట్ హామ్సన్ తన మాతృదేశపు యువరచయితలందరికీ ఆదర్శ ప్రాయుడైనాడు. అనన్యమైన సాహితీసంపద, పెంపెక్కిన పాండితీపటిమ, విశిష్టలక్షణాలతో విలసిల్లే వాస్తవిక రచనా చతురత – యివన్నీ యితడికి 1920 లో 'నోబెల్' బహుమతిని సంతరించిపెట్టాయి. ఇతని రచనలన్నిటిలోనూ ''హంగర్'' (ఆకలి) తలమానికంగా ప్రపంచరచయితలచే ప్రస్తుతించబడ్డది.

నేటి నికృష్ట సామాజికవ్యవస్థలో ఆకలిగొన్న మేధావి అనుక్షణం అనుభవించే దుర్భరమానసిక, శారీరక ఆవేదనను ప్రజ్ఞాశాలియైన యీ నవలాకారుడు తన ''ఆకలి'' కి యితివృత్తంగా తీసుకొని సజీవమైన పాత్రసృష్టిద్వారా పాఠకుల మనోభావాలలో మహత్తరమైన మార్పు కల్గిస్తాడు. తానే ఆకలిచిచ్చుకుగురైన కథానాయకునిపాత్ర స్వీకరించి, దానిలో సంలీనమై, పాఠకుల హృదయాంతరాళాలను కలచివేస్తాడు. భయంకరమైన ఆకటితో మలమలమాడి వేసటచెందే మేధావి యొక్క బాహ్యాంతర మనఃప్రవృత్తులను అద్దంలోవలె అతి సమర్థతతో ప్రతిబింబింపజేస్తాడు.

ఈ నవలలోని యితివృత్తం సంక్షుభితమైన పెట్టుబడిదారీ వ్యవస్థలో సతమతమయ్యే యే దేశానికైనా యేజాతికైనా అన్వయిస్తుంది. అందుచేత ఉదాత్తమైన యీ రచనకు సార్వకాలీనత, సార్వజనీనత సిద్ధించింది.

నట్ హామ్సన్ మానవహృదయకుహరంలో జొరబడి లోతులు వెదకే శోధకుడు. మానవుని వ్యష్టిజీవితంలోగల బలహీనతలను మభ్యపరచడంగాక, అతనియందు అడుగడుగునా

పరిణామంచెందే ఆలోచనలను, ఆశలను, చిత్తప్రవృత్తులను, ఒడుదుడుకులను, క్రోధోద్వేగాలను ప్రగాఢమైన సానుభూతితో నిర్మొగమాటంగా బహిర్గతంచేస్తాడు. ఈ కర్తవ్యనిర్వహణ అనివార్యమైన తన విధ్యుక్తధర్మంగా పాటిస్తాడుగూడా.

ఇన్ని విశిష్టలక్షణాలు యితణ్ణి వరించబట్టే, సాహిత్య క్షేత్రంలో ధృవతారలా వెలుగొందాడీ మహాకవి.

ఈ గ్రంధం రచించిన దినాల్లో దీన్నిచూచి పెట్టుబడిదారీపాలకవర్గం కంపించిపోయింది. తమ వర్గవ్యవస్థ ఉనికికి యీ గ్రంధం మహాప్రమాదకరంగా పరిణమించిందని దురపిల్లింది. పలుతావులనుండి విమర్శలుగూడా బయల్దేరాయి. ఆ రోజుల్లో యీ నవల యెడల సానుభూతిప్రకటించటమే యెంతో సాహసకార్యంగా యెంచబడేది. ఈ అంశంవల్లనే నట్ హామ్సన్ యొక్క ప్రతిభావిశేషం దేశదేశాలా వెల్లడైంది. అతడానాడిచ్చిన ఉపన్యాసపరంపరలు ప్రపంచాన్ని ఉర్రూతలూగించాయి. కష్టజీవులైన మేధావివర్గంలోనూ, పాఠకవర్గంలోనూ అపూర్వమైన ఆలోచనాశక్తిని రేకెత్తించాయి. ఇతణ్ణి ఒకప్రతిభావంతుడైన ప్రజారచయితగా, నవలాకారునిగా కొనియాడింది ప్రపంచం.

నట్ హామ్సన్ ప్రజలమధ్య ప్రజలకొరకై జీవించి స్వయంశక్తిపై ప్రజ్ఞాప్రాభవాలు గడించిన వ్యక్తిగా పేరెన్నికగన్నాడు. ప్రజాజీవితాని కంకితంచేయని కళ సార్థకమైన కళకాదనీ, అది నిర్జీవమైన ప్రేతకళమాత్రమేననీ యితడు తెగనాడేవాడు.

నట్ హామ్సన్ భాషలో ప్రత్యేకతఉన్నది. ప్రతివాక్యం స్పష్టంగా, స్ఫటికంలా కనపడుతుంది. ప్రతిమాటలో సౌందర్యం, సమగ్రత, సంపూర్ణత తొణికిసలాడుతూ ఉంటాయి. పదాల్ని

బానిసలుగా చేసుకుని బంతుల్లా దొర్లిస్తాడు. ఎగరేసి ఆటలాడి
స్తాడు. అవి నిండుగా పరుగిడుతాయి. ఒక్కొక్కచోట నిప్పు
రవ్వల్లా గుండెలకు తగులుతాయి. వీటివెనక ఏదో విశిష్టత, అవ్య
క్తమైన భావం దాక్కొని తొంగిచూస్తూ ఉంటాయి. అందుచేతనే
నట్ హామ్సన్ వ్రాసిన ప్రతిపంక్తీ ఒక కమ్మని కావ్యంగా
పరిఢవిల్లుతుంది.

ఇతని రచనలో అపూర్వమైన శిల్పం, అనన్యమైన ప్రతిభ
గోచరిస్తాయి. కథాసంవిధానంలోనూ, పాత్రసృష్టిలోనూ, రూప
కల్పనలోనూ, యితనిదొక విశిష్టస్థానం. ఇలాంటి సృజనాత్మక
శక్తి ప్రపంచ రచయితల్లో బహుఅరుదుగా కనిపిస్తోంది. "ఆకలి"
అనే అపూర్వమైన కళాఖండంలో వాస్తవిక కళారూపాన్ని
పోతపోసి చూపిస్తాడు నట్ హామ్సన్.

ఇట్టి ఉత్తమ గ్రంథాన్ని తెలుగు వాతావరణంతో
మేళవిస్తే పాఠకులు మరింత సాన్నిహిత్యంతో, సానుభూతితో
ఆనందిస్తారనే అభిప్రాయంతో పేర్లనుమాత్రం మార్పుచేసి,
మూలానికి వన్నె తెచ్చే మధురమైన తెలుగు నుడికారంతో
యీ నవలను శ్రీ రెంటాల గోపాలకృష్ణగారు మనోజ్ఞంగా అను
వదిస్తూనే అనుసరించారు.

ప్రథమశ్రేణికి చెందిన యీ ఉత్తమ నవలారచనను
ఆంధ్రలోకం ఆప్యాయతతో ఆదరిస్తుందనీ, మాకు సర్వవిధాలా
చేయూతనిచ్చి ప్రోత్సాహమిస్తుందనీ ఆశిస్తున్నాం.

ఇట్లు,

నగారా ప్రచురణకర్తలు.

# 1

## ఒకటో అధ్యాయం

అవి నేను బస్తీలో పనేమీలేక వస్తులుంటూ తిరుగుతూన్న రోజులు. అది సాధారణమైన బస్తీకాదు. ఒక విచిత్రమైన నగరం. అక్కడ కొద్దికాలం ఉంటేచాలు. అనేక అనుభవాలు కలుగుతాయి. వాటిని మర్చిపోవడం ఎవరికీ సాధ్యంకాదు.

అది నగరంలో ఒక మూల గొట్టుప్రదేశం. హైకోర్టుకు, మార్కెట్టుకు, స్టేషనుకు, బస్ స్టాండుకు అన్నిటికీ దూరంగా ఉంటుంది. అక్కడ ఉండేవాళ్ళంతా అలగాజనం. రిక్షావాళ్ళు, జట్కావాళ్ళు, రింగ్ లీడర్లు, రికామిగా తిరిగేవాళ్ళు, తాగుబోతులు, దగాకోర్లు, తుంటర్లు, జూదగాళ్ళు, రౌడీలు, రంగసాన్లు ఇలాంటివాళ్ళందరికీ ఆ ప్రదేశం నిలయం. అన్నీ సందులు, గొందులు; మురికికాలవలు, పెంటకుప్పలు; అక్కడ విద్యుద్దీపాలుకూడా లేవు. అక్కడక్కడ లాంతరు స్థంభాలుమాత్రం వెలుగుతుంటాయి. ఏంచేయను మరి? గత్యంతరంలేదు. నగరంలో చౌకగా ఇళ్లెక్కడ దొరుకుతాయి? అందుకనే నేనక్కడ ఒక మేడ పైభాగంలో అద్దెకుంటున్నాను.

అదొక పాతమేడ. పడిపోవడానికి సిద్ధంగా ఉంది. ఆ మేడను ఒక్కక్షణం చూస్తూ నిలుచుంటే మనకు తెలియకుండానే యేదో భయం కలుగుతుంది. ఒక పెద్ద భూతం నల్లగా జుట్టు విరయబోసుకొని ఏడుస్తూ ఉంటే ఎట్లాఉంటుందో అట్లాఉంటుందా మేడ. అందుకనే అందరూ దాన్ని 'దయ్యాల మేడ' అని పిలుస్తుంటారు. పై అంతస్తులో దాదాపు పదిగదులున్నాయి. చిన్న చిన్న గదులు. ఒక్కొక్క గదిలో ఒక మనిషికంటె ఎక్కువమంది ఉండడానికి వీల్లేదు. అన్నిటి కంటె వెనకాల ఉన్న గదిలో నా మకాం. అందులో నేను అయిదారు నెలల బట్టీ ఉంటున్నాను. మిగతా గదుల్లో అప్పసంగా ఎవరూ ఉండరు. ఎక్కువ అద్దె ఇచ్చుకోలేని నాబోటి దౌర్భాగ్యులెవరో అప్పుడప్పుడు వస్తుంటారు. వాళ్ళపనులు కాగానే వెళ్ళి పోతుంటారు. ఒక్కొక్క గదికి అద్దె నెలకు అయిదు రూపాయలు.

ఆ ఇంటి యజమానురాలు ఒక ఆడకూతురు. పేరు నాగమణి. వయస్సు నడికారు దాటింది. ఆమె క్రిందభాగంలో ఉంటుంది.

నేను నాగదిలో మంచంమీద పడుకొని ఉన్నాను. అప్పుడే నాకు మెలుకువ వచ్చింది. క్రిందభాగంలో ఉన్న గడియారం ఆరుగంటలు కొట్టింది. అప్పటికే తెల్లగా తెల్లవారింది. వీధుల్లో జనం తిరుగుతున్నారు. ఎదురుగా వీధిగోడమీద ఉన్న 'అడ్వర్టైజ్‌మెంట్లు' నాకంటబడ్డాయి. రోజూ నేను నిద్రలేవగానే దర్శనమిచ్చేవి ఇవే. ఆ రోజు విడుదలయ్యే కొత్తసినిమాలు, ఆడుతున్న వాటికి ప్రారంభమయ్యే కొత్తవారాలు, కొత్త'మార్కు' బీడీలు, ఆరోజు జరిగే సభలు, సమావేశాల్లు,

పాటకచ్చేరీలు, నృత్యప్రదర్శనాలు, ఇంకా రకరకాల ప్రకటనలు; అలా వాటివైపు ఎంతోసేపు చూశాను. అనేక ఆలోచనలు, ఊహాలు; అవును. అన్నీకొత్త. అన్నిటికీకొత్త. మరి ఈ రాబోయ్యే రోజు నాకెలాగడుస్తుందో? ఈ నాడైనా నా జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభమవుతుందా? ఏమో! నమ్మకంలేదు. కాదు. నమ్ముతాను. తప్పకుండా మార్పువస్తుంది. ఏదో ఆశ! మరి బ్రతకొద్దూ? ఆకలికడుపుకు అదైనా లేకపోతే ఆత్మహత్యే చేసుకోవాల్సిందే.

ఇలా నా ఆలోచనలతోటే బారెడు ప్రొద్దెక్కింది. లేచి బట్టలు వేసుకొనేసరికి గడియారం ఎనిమిదిగంటలు కొట్టింది. కిటికీ తలుపులుతీసి బయటికి చూచాను. అక్కడ నిలుచుంటే ఒక చిన్న వీధి కనబడుతుంది. వరుసగా ఉన్న చిల్లరకొట్లూ, వాటిప్రక్కనే పెద్ద ఖాళీజాగా, అక్కడ కుప్పగాపోసిన చెత్త చెదారం, దాన్ని ఎత్తిపోసి బాగుచేస్తున్న పనివాళ్లు; కిటికీ తలుపులు పట్టుకొని చాలసేపుచూస్తూ నిలుచున్నాను. చలికాలం అవటంచేత మంచుపడుతోంది. వీధుల్లో అలజడి ఎక్కువౌతోంది. అందరూ హడావిడిగా పోతున్నారు. నాకూ ఆశ కలిగింది. బయటికిపోతే బాగుంటుందనిపించింది. గదిలో కూర్చుంటే ఏముంది? గదంతా గలీజు, దుమ్ము కొత్తెత్తుతున పేరుకొని ఉంది. బూజుపట్టిన మూలలు. చెదలు తినిపోతున్న కడ్డీలు, పాతకంపుకొడుతున్న గోడలు, చెడువాసనవేస్తూ 'నోరు తెరచుకొన్న శవం' లా ఉంది నా గది. గదికి తలుపులు కూడా సరిగాలేవు. బందుకట్లు లేనందున తలుపులు దడదడమని కదులుతుంటాయి. చేతులు పట్టేంత రంధ్రాలుకూడా ఉన్నాయి. తెగిపోయిన నులకమంచం, పాత జంపకానా, పిగిలి

పోయి దూది బయటికొళ్ళుకొచ్చిన దిండు, ఇవీ నాగదిలో ఉన్న సామాన్లు. నా కిష్టమైన మరి రెండు వస్తువులుకూడా ఉన్నాయి. ఒక పాతటేబులు, ఒక పడకకుర్చీ. పడకకుర్చీకి ఎర్రరంగు వేయించాను. నా కిష్టమైనరంగు. ఆ కుర్చీలో సాయంత్రం పూట కూర్చొని వ్రాసుకొంటూ ఉంటాను. దాన్ని అటూ ఇటూ ఊపుతూ రాగాలు తీస్తుంటాను. అప్పుడప్పుడు అందులోనే కునుకుతీస్తుంటానుకూడా.

గది తలుపు తీశాను. బజారులో ధ్వనులన్నీ ఒక్కసారి గదిలో ప్రతిధ్వనించాయి. గోడలు, నేలమీదరాళ్లు అన్నీ ఒక్కసారి మూల్గినట్లనిపించింది. ముఖం కడుక్కుందామని పంపు దగ్గరికి వెళ్ళాను. నీళ్ళు రావడంలేదు. అంత పొద్దెక్కితే పంపెలా వస్తుంది? పంపుతో పనున్నవాళ్లు పెందలకాడే లేస్తారు. గుడ్డలు పిండుకొనే గబ్బుతొట్టిలో కాసిని నీళ్లున్నాయి. వాటితోటే ముఖం కడుక్కొని గదిలోకి వచ్చేశాను. ఏదైనా తింటానికి దొరుకుతుందేమో అని గది నాలుగుమూలలూ వెదికాను. ఏముందిగనుక దొరకడానికి ? ఆకలి అవుతోందికాదుమరి ! కడుపునిండా అన్నంతిని అప్పటికి రెండు మూడురోజులవుతుంది.

మనస్సేమీ బాగాలేదు. ఏవేవో పిచ్చి పిచ్చి ఆలోచనలు వస్తున్నాయి. ఏమీ తోచడంలేదు. ఒకచెంపన కడుపులో మండుతూంటే ఏం తోచిచస్తుంది ? మళ్ళీ కిటికీ దగ్గరికి వెళ్ళి నిలుచున్నాను. తిరిగీ ఆలోచనలు. నేను ఏంచేయడానికి పనికొస్తానో ఆ దేవుడికే తెలియాలి. ఉద్యోగం కోసం ఎన్నో ప్రయత్నాలు చేశాను. అన్నిరకాల ఉద్యోగాలకూ అప్లికేషన్లు పెట్టాను. అయినవాళ్లను, కానివాళ్లను ఆశ్రయించాను. స్నేహితుల చుట్టూ చెడిబ్రతికినవాళ్లచుట్టూ తిరిగాను. అన్ని

ప్రయత్నాలు విఫలమైనాయి. అన్నిచోట్లా అపజయమే కలిగింది. కాని ఇంకా నాకు ఆశవదల్లేదు, ఏవో భ్రమలు, ఎన్నో కోరికలు. మళ్ళీ ప్రయత్నం చేయాలని ఉంది. అందుచేతనే నేను చావడానికి సాహసించలేకపోయాను.

చివరసారి గట్టిగాచేసిన ప్రయత్నాలుకూడా చెడిపోయినాయి. ఒకచోట ఒకచిన్న గుమాస్తాపని ఉందంటే వెళ్ళాను. బాకీలు వసూలుచేసుకరావాలన్నారు. 'సరే' అన్నాను. యాభైరూపాయలు ధరామత్తు (Security) కట్టమన్నారు. కళ్లు తేలవేసి బయటికొచ్చాను. ఒకసారి పోలీసు ఉద్యోగానికి కూడా ధరఖాస్తు పెట్టాను. 'ఇంటర్వ్యూ'కు పిలిచారు. వంద మంది మనుష్యుల్లో ఒకణ్ణిగా నిలబడ్డాను. అధికారి అందర్ని వరసగా చూస్తూ ఏవో ప్రశ్నలువేస్తూ నా దగ్గరికొచ్చాడు. లేని బలాన్ని తెచ్చుకొని వళ్ళు ఉబికిన్నూ, రొమ్ము విరుస్తూ ఆశగా అతనివైపు చూశాను. అధికారి ఒకక్షణం నావైపు పరీక్షగా చూసి తల ఊపాడు. 'నీకు దృష్టి సరిగాలేదు. నీవీ ఉద్యోగానికి పనికిరావు' అంటూ వెళ్ళిపోయాడు. అవును మరి. నా కళ్లకు జబ్బున్నమాట నిజమే. కనుకనే జోడు పెట్టుకొన్నాను. ఆ మాట మరిచిపోయి కళ్లజోడు తీయకుండానే వెళ్ళాను. అంచేత అతనలా అన్నాడు. అయినా నేను ప్రయత్నంమానలేదు. మళ్లీ ధరఖాస్తుపెట్టాను. ఈసారి కళ్ళద్దాలులేకుండాపోయి వరసలో నిలబడ్డాను. కళ్ళల్లో జబ్బేమీలేదనుకోవాలని కళ్ళు పెద్దవిచేసి తీక్షణంగాచూస్తూ నిలుచున్నాను. ఈసారికూడా అధికారి నా దగ్గరకువచ్చి నన్ను ఎగా దిగా చూచాడు. చిరునవ్వునవ్వి వెళ్ళిపోయాడు. అవునుమరి. ఇదివరకు నేను వచ్చినవాణ్ణేనని అతనికి తెలిసిపోయింది. అతను నన్ను గుర్తుపట్టాడు. నాకు తలకొట్టేసి

నష్టింది. అభిమానం వళ్ళంతా దహించుకుపోయింది. నే చేసిన పనికి నేనే సిగ్గుపడ్డాను.

ఇలా పరిస్థితులు నా పట్ల ఎంత వ్యతిరేకంగా ఉంటున్నాయి? ఇలా ఎంతకాలం భరించాలో తెలియడంలేదు. జరిగిపోయిన అనేక విషయాలు, విషాదసంఘటనలు తలపుకు వస్తున్నాయి. వాటిని ఎలా భరించగలుగుతున్నానో నాకే ఆశ్చర్యంగా ఉంది. దువ్వుకోడానికి దువ్వెనైనా లేదు. చదువుకోడానికి ఒక పుస్తకంకూడా లేదు. నా బ్రతుకెంత పనికి మాలింది?

పార్కుల్లో కూర్చొని పత్రికలకు వ్యాసాలు, కథలు వ్రాసేవాణ్ణి. రకరకాల విషయాలు తీసుకొని రచనలు చేసేవాణ్ణి. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండడంవల్ల నా మనస్సుకు విశ్రాంతి ఉండేదికాదు. వ్యాసాలకూ, కథలకూ నేను తీసుకునే విషయాలు విచిత్రంగా ఉంటాయి. అసలలాంటి విచిత్రమైన సంఘటనలు, సన్నివేశాలే నాబుద్ధికి తటతాయి. అవి అందరికీ సులభంగా అర్థమయ్యేవికావు. అంచేత పత్రికలవాళ్ళు నా రచనలు వేసుకునేవాళ్ళుకాదు. ఇలా నేను రాసిందల్లా వాళ్ళు వేసుకోకపోవడం, నా రచనలన్నీ త్రిప్పిపంపేస్తూఉండడం జరుగుతుండేది. అయినా నేను నిరుత్సాహపడలేదు. ఒకరచన తిరిగిరాగానే మరొక రచన పంపేవాణ్ణి. ఇలా చేయగాచేయగా ఎప్పుడో ఒకసారో, అరసారో, అదృష్టంపండి నా రచన అచ్చుకావడం, దానికి ఓ అయిదు రూపాయలు రావడం సంభవిస్తూవుండేది. ఆ అయిదురూపాయలతో ఆ రోజల్లా హాయిగా, జల్సాగా గడిపేవాణ్ణి. అయితే నాకు నమ్మకం ఉంది. ఎప్పుడో

ఒకప్పుడు నాకు విజయం రాకతప్పదనీ, నా కష్టానికి నాలుగు రెట్ల ప్రతిఫలం వచ్చితీరుతుందనీ.

కిటికీ దగ్గర్నుంచి ఇవతలి కొచ్చాను. మామూలు ప్రకారం కాగితం, పెన్సిలు జేబులో పెట్టుకొని వీధిలోకి వెళ్లి పోయాను. మేడమెట్లుదిగి క్రిందకు వచ్చేటప్పుడు పిల్లిలాగా నిశ్శబ్దంగా వచ్చేశాను. ఇంటి యజమానురాలు 'నాగమణి' కనిపిస్తుందేమో అని నాభయం. ఆమెకు అద్దె బాకీపడ్డాను. ఏం చేయనుమరి? తీర్చేమార్గం దొరకొద్దూ?

అప్పటికి తొమ్మిదిగంటలయింది. శీతాకాలం అవడం చేత చలిగాలి కొడుతోంది. ట్రాములూ, బస్సులూ, రిక్షాలూ, గుఱ్ఱంబండ్లు, నగరమంతా సందడిగా ఉంది. వచ్చే జనానికీ, పోయే జనానికీ విధీవిరామం లేదు. రైల్లకూతలు, కారుహారన్లు, గుఱ్ఱంబండ్లవాళ్ల కొరడాధ్వనులు, పత్రికలమ్మేవాళ్ల కేకలు, రోడ్డుపక్క టకటకమని బూట్లు చప్పుడు చేసుకుంటూ నడుస్తోన్న జనం, అంతా గోలగాఉంది. ఈ గోలంతా చూస్తోంటే నాకూ ఉత్సాహం వచ్చింది. నేనూ వాళ్లలాగే బ్రతుకు తెరువుకోసం వరిగెత్తాలనిపించింది. అందరూ ఎవరివనిమీాద వాళ్లు పోతున్నారు. కాని నాకేంపనుంది? ఉదయాన్నే చల్ల గాలికి నడవడం ఆరోగ్యానికి మంచిదే! అయినా ఈ గాలి నా ఊపిరి తిత్తులకు ఏవిధంగా ఉపయోగపడుతుంది? నాకేం ఆరోగ్యం తక్కువ? దుక్కలా ఉన్నాను. ఎంతోబలంగా భీముడులా ఉన్నాను. నాచేతుల్తో ఓ చిన్న కారు ఆపగలను?

ఇలా ఆలోచించుకుంటూ గోడలమీాద అంటించి ఉన్న బొమ్మలు, అడ్వర్ టైజ్ మెంట్లు చూస్తూ నడుస్తున్నాను. పర ధ్యాన్నంగా ఉండడంచేత నా భుజాలు అప్పుడప్పుడు వచ్చే

పోయే జనానికి తగులుతున్నాయి. వాళ్లు నావైపు అదోమాది రిగా చూసి వెళ్లిపోతున్నారు. ఎండబడ్డకొద్దీ నా కాకలి ఎక్కువౌతోంది. ప్రొద్దున్నే ఏదో కాస్త కడుపులో పడ్డట్టయితే ఎంతో హాయిగా ఉండేది.

మార్కెట్టుదగ్గర ఒక ఆడమనిషి నిలబడి మాంసం బేరం చేస్తోంది. దుకాణంముందుగా నే వెడుతోంటే ఆమె నా వైపు ఒక్కక్షణం ఎగాదిగా చూసింది. ఆమె కోరపన్ను పొడుగ్గా బయటికి వెళ్ళుకొచ్చింది. ఆ పన్ను చిటికెనవ్రేలంత పొడుగున ఉంది. చిగుళ్లు ఎర్రగా మాంసంముద్దల్లా మెదమెద లాడుతున్నాయి. ఆమె వికృతంగా నా వైపుచూచేసరికి నా ఆకలి చల్లారిపోయింది. కడుపులో తిప్పటం మొదలుపెట్టింది. డోకు వస్తున్నట్లనిపించింది. గబగబనడచి పెద్దమార్కెట్టు చేరు కున్నాను. అక్కడ పంపుదగ్గరకెళ్ళి ముఖం కడుక్కొని పుక్కి లించి ఉమ్మేసి కాసిని నీళ్లు త్రాగాను. మార్కెట్టుమీద గడి యారంలో పది గంటలయింది. మళ్ళీ నడక ప్రారంభించాను. మనస్సులో దేన్నిగురించీ ఆలోచించకుండా చాలా బజార్లు, గొందులు, సందులు దాటేశాను. వచ్చీవచ్చీ ఒకమూల తిరు గుళ్ళో హఠాత్తుగా ఆగాను. నాకో అవసరమైనపని, ఒక ఉద్దేశ్యం, ఒకగమ్యం అంటూ ఏమీలేవు. అందరిలాగా నేనూ హాయిగా తిరగాలనుకున్నాను. అంతే. మంచిగాలి వేస్తోంది. నా మనస్సుకూడా నిర్మలంగానే ఉంది.

అలా ఆ మూలతిరుగుళ్ళో పదిసమిషాలసేపు నిలబ డ్డాను. నా ముందునుంచి ఒక కుంటివాడు పోతున్నాడు. అతని భుజంమీద ఏదో పెద్దమూట ఉంది. దాన్ని మోసుకపోవడా నికి అతను నానా యాతనలు పడుతున్నాడు. శరీరం యీడ్చుకుంటూ

కదిలిస్తున్నాడు. శక్తినంతా ఉపయోగించి చక చకా నడవాలని ప్రయత్నిస్తున్నాడు. అతనలా రొప్పుతూ రోజుతూ రోడ్డుమీద నా ముందుగా నడుస్తోంటే నాకు చెప్పలేనంత దుఃఖంవచ్చింది. అంత పెద్దమూట. అందులో కుంటివాడు. నాకు జాలివేసింది. నేనుకూడా ఒక చెయ్యివెయ్యాల్సిఉంటుందేమో అనుకున్నాను. కాని నేనేమీ అతన్ని పలకరించలేదు. ఇంతలో 'హనుమంత రావు' ఎదురుపడ్డాడు. తలఊపుతూ తప్పుకొని వెళ్ళిపోయాడు. ఒక్కక్షణమైనా ఆగలేదు. ఒకమాటైనా మాట్లాడలేదు. ఎందుకలా పారిపోయాడు? ఏమిటా తొందర? అతన్నొక రూపాయి అడుగుదామనుకున్నాను. అదీకాక చలితో అవస్థ పడుతూ కప్పుకోడానికని, అతని దుప్పటి తీసుకొచ్చాను. దాదాపు నెలరోజులైంది. అది అతనికి తిరిగి ఇచ్చేయాలి.

మళ్లీ నామనస్సు ఆలోచనతో నిండిపోయింది. దుప్పటి మాట ఎట్లాఉన్నా హనుమంతరావు ఒకరూపాయి ఇస్తాడని ఆశపడ్డాను. అవకాశం ఇవ్వకుండా దాటిపోయాడు. ఈరోజైనా కాస్త కడుపులో పడకపోతే కథరాయడం ఎట్లా? కడుపులో ఎత్తులేంది కలంనడవదే! ఒకకథ, ఒకవ్యాసం రెండూ ఈ రోజే పూర్తిచేయ్యాలి. కథపేరు 'చెల్లనిరూపాయి' వ్యాసంపేరు 'భావస్వాతంత్ర్యం.' పేర్లు బాగానే ఉన్నాయి. ప్రతిభావంతంగా రాయాలి. రెండిటికీ పదిరూపాయలైనా వస్తాయి.

రచన విషయం జ్ఞాపకంరాగానే పార్కులోకి పోవాలనిపించింది. వెంటనే రెండు రచనలూ పూర్తిచేస్తే బాగుండు ననితోచింది. కాని ఆకుంటివాడు నన్నువదలందే! నాముందుగానే నడుస్తున్నాడు. వాడివళ్లు పాములా మెలికలు తిరుగు

తోంది. దారిపొడుగునా ఈ దౌర్భాగ్యుణ్ణి చూస్తోంటే నాకు వళ్లు మండుతోంది. అతనినడక అంతులేకుండా ఉంది. కొంప తీసి నే వెళ్లాల్సినచోటుకే వీడూవస్తాడేమో? అదే నిజమైతే వీడు దారిపొడుగునా నాకు తగలాటకమే. తప్పించుకొనే మార్గంలేదు. పైగా వాడు మెల్లగా అడుగులో అడుగులేసు కుంటూ పోతున్నాడు. రోడ్డు మలుపు తిరుగుళ్లు వచ్చినప్పుడు కొంచెం ఆగి మూట బిగించుకొని భుజం మార్చుకుంటున్నాడు. నే నేదో వనపోతానో వాడు కనిపెడుతున్నాడు. అందుకే వాడిట్లా చేస్తున్నాడని నాకుతోచింది. వాడి అవస్థంతా నేను గమనిస్తూనే ఉన్నాను. ఆచేతగాని దద్దమ్మ చేష్టలుచూస్తోంటే నాకు చెడ్డ చిరాకువేస్తోంది. ఏంచేయాలి? వీడు నా ఖర్మకొద్దీ దాపురించాడు. కాస్సేపైనా హాయిగా గడుపుదామనుకుంటే మనస్సంతా పాడుచేస్తున్నాడు. అసలే అధ్వాన్నంగా ఉన్న నామనస్సు మరీ నీచస్థితికి దిగజారిపోతోంది. వాడు నాకళ్లకు ఒకపెద్ద కదల్లేని పాములా కనిపిస్తున్నాడు. నానాబాధలు పడుతూ లేనిబలాన్ని తెచ్చుకుంటున్నాడు. రోడ్డంతా భుక్తం చేసుకుని ఆ విధంగానైనా లోకంలో వాడొక ఉన్నతస్థానాన్ని పొందాలనుకుంటున్నాడు. చివరికి వాణ్నెలాగైనా తప్పించుకోవా లని ఒక చిల్లరకొట్టు దగ్గర ఆగాను. వాడివైపు చూడకుండా నిలబడ్డాను. కొంచెంసేపటికి తిరిగిచూస్తే వాడూ కదలకుండా నిలబడి ఉన్నాడు. అతనికీ నాకూ నాలుగైదు గజాలు ఎడం ఉంటుందేమో? నాకు చెప్పలేనంత ఆవేశం వచ్చింది. గబగబా వెళ్ళి వాణ్ణి భుజంమీద చరిచాను. గబుక్కున వాడు నాముఖం కేసి చూశాడు. మూలుగుతూ 'ఒక అణా ఇవ్వండి బాబూ'

అని అడిగాడు. ఓ అదీ అసలుసంగతి. నేను నా స్వెట్టరు జేబుల్లో చేతులుపెట్టి ఇలా అన్నాను.

'ఈరోజుల్లో డబ్బుకెంత కష్టంగాఉందో తెలుసా? అణా అంటే సామాన్యంగా ఉందనుకున్నావా? అయినా అంత అవసరం ఏమొచ్చింది?'

'నిన్నటిబట్టీ ఒక్కముద్ద అన్నం తినలేదు. పనిలేదు. ఒక్క పైసాకూడా దొరకలేదు. కాస్త టీ తాగుదామనీ.'

'నీ వేంపని చేస్తుంటావ్?'

'చెప్పులు కుటతాను.'

'బాగుంది. నేనే దరిద్రుణ్ణనుకుంటే, నాకంటే దరిద్రుడివి దొరికావు. ఇక్కడే ఉండు. ఇప్పుడేవస్తాను. ఒక పావలా అయినా దొరుకుతుందేమో ప్రయత్నిస్తాను.'

ఆప్రక్కవీధిలో మేడమీద నాకు తెలిసిన ఒక తాకట్టు వ్యాపారి ఉన్నాడు. పాతవస్తువులు, కొత్తవస్తువులు, ఏవైనా సరే తాకట్టుపెట్టుకొని డబ్బిస్తూ ఉంటాడు. త్వరత్వరగా ఆ మేడ దగ్గరకి వెళ్ళాను. మేడ ఎక్కుతూ నా స్వెట్టరుతీసి చుట్ట చుట్టి చంకలో పెట్టుకున్నాను. అతను ఆఫీసులోనే ఉన్నాడు. ఏదో పద్దులు చూసుకుంటున్నాడు. పోగానే ఒక నమస్కారం పారేసి స్వెట్టరు అతని బల్లమీద పడేశాను.

'రూపాయి అరణాలొస్తుంది' అన్నాడతను వెంటనే.

'సరే. ఇవ్వండి. అదికొంచెం వదులయింది. అందుచేత వాడడంలేదు.' అన్నాను నేను అభిమానంతో.

డబ్బూ, చీటి తీసుకొని మేడదిగాను. అప్పుడు నేనున్న పరిస్థితిలో అంతకన్నా గత్యంతరంలేదు. ఆ పూటనేను తిండి తినడం ప్రధానం, లేకపోతే నా రచనలు పూర్తికావు.

ఆ కుంటివాడి పీడ వదిలించుకుందామని గబ గబ వెళ్ళాను. అత నా చిల్లరకొట్టుదగ్గరే నిలబడి ఉన్నాడు.

'ఇదుగో రూపాయి. తీసుకో. నేనే అడుక్కొని బ్రతుకు తున్నాను. నన్ను ముష్టేత్తే నీలాంటివాడొకడున్నందుకు నాకు సంతోషంగా ఉంది.' అన్నాను నేను రూపాయి అతని చేతుల్లో పెడుతూ. అత నా డబ్బుతీసుకొని నన్ను ఎగా దిగా పరిశీలిస్తూ చూశాడు. రెప్పవాల్చకుండా నా మోకాళ్ళవైపే చూడడం మొదలుపెట్టాడు. ఎందుకతనలా చూస్తాడు? మోకాళ్ళ దగ్గర చిరిగిపోయిన నా ట్రౌజరును పరీక్షిస్తున్నాడనిపించింది నాకు. నన్నూ ఒక ముష్టివాడిక్రింద జమకట్టి ఎగతాళిచేస్తున్నాడతను. సిగ్గులేకుండా అతనలా చూస్తోంటే నాకు చాల బాధకలిగింది. అతని చూపుల్తో నన్ను కటికి దరిద్రుడిక్రింద కట్టేశాడు. నిజంగా ఆ వెధవ అనుకున్నంత దౌర్భాగ్యుణ్ణా నేను? ఒక కథ రాసి పది రూపాయలు సంపాదించగలనే! అడగ్గానే రూపాయిడబ్బు లిచ్చేశాను. పైగా నాకు భవిష్యత్తునుగురించి భయంలేదు. ఎన్ని బాధలైనా భరించగలను. ఇనుము నిప్పును చూచి భయపడుతుందా? ఎంతకాలిస్తే అంత గట్టిపడుతుంది. చివరకతన్ని అడిగాను.

'ఎందుకోయ్ అలా చూస్తావ్? ఏదో పాపం అని రూపాయిస్తే బదులైనా చెప్పవేం? కృతజ్ఞతైనా చూపించ కుండా నన్నొక పిచ్చిపుల్లాయను చూసినట్లు చూస్తావేం?'

మళ్ళీ అతనేదో నసిగాడు. ఏదో చెప్పుదామని నోరు తెరిచాడు. కాని చెప్పలేకపోయాడు. అతని ఆకలిపేగుల్లో ఏదో అర్థంకాని ఆవేదన ఉంది. నా డబ్బు నేను తిరిగీ తీసుకో వాలనుకుంటున్నట్లు భావించాడతను.

తిరిగి నేనే అతనితో ఇలా అన్నాను.

'నా డబ్బు నాకిచ్చేయమని నిన్నేమీ అడగడంలేదు. నీవా రూపాయి తిరిగి నాకివ్వక్కర్లేదు. మరేం భయపడకు. వెళ్లు.'

అతనిముఖం చాటంత అయింది. ఏదో సంతృప్తి పడ్డట్లు కనపడ్డాడు. మళ్ళీ నడక ప్రారంభిచాను. ఏం? అందరూ అలాంటివాళ్ళే. అసలు ప్రపంచమే ఒక రుణానుబంధం. ఒకరు మరొకరికి ఏదోరకంగా రుణపడి ఉంటారు. అలాగే నేనూ ఆ కుంటివాడికి ఒకరూపాయి బాకీ పడ్డాను. పాతబాకీ తీర్చేశాను. ఒక మనిషిముందు, ఒకమానవ ధర్మం ముందు, అతను నిలబడి చేయిచాపాడు. ఇందులో తప్పేముంది? ఒకమాటలో చెప్పాలంటే ఆ రూపాయి అతనిది. అతనిసొమ్ము అతను పట్టుకపోయాడు. అందుకు కృతజ్ఞత తెల్పాల్సిన అవసరమేముంది? అక్కర్లేదు. అతను నన్ను అభినందించాల్సిన పనిలేదు. అతడలాచేసినందుకు నాకెంతో సంతోషంగా ఉంది.

ఎలాగైతేనేం ఇంతసేపటిబట్టీ వేధిస్తూన్న ఆ కుంటివాడి పోడుతప్పించుకొని నిశ్చింతగా నడక సాగించాను.

వల్లెవీధిగుండా పోతున్నాను. అక్కడొక మంచి 'టీ స్టాలు' ఉంది. అలమారుల్లో అనేక పదార్థాలున్నాయి. అద్దాల్లోంచి రకరకాల తినుబండారాలు కనబడ్డాయి. నాను రొట్టెలు, బన్ను, బట్టర్, కేకులు, జాం. నాకు నోరూరింది. అణగివడున్న ఆకలి నాలో ఒక్కసారి విజృంభించింది. ఆవురావురుమంటూ అన్నీ ఒకేమాటు తినేయాలనిపించింది. కాని ఏం లాభం? నా దగ్గర ఆరణాలు మాత్రమే ఉన్నాయి. రూపాయి ఆరణాల్లో కుంటివాడికి రూపాయి పోయింది.

'నానురొట్టె, వెన్న, పొట్లంకట్టి ఇవ్వండి' అంటూ చేతులోఉన్న అరణాలూ, గల్లాపెట్టెమీద పెట్టాను.

'మొత్తం అరణాలకూ ఇవ్వనా?' డబ్బు డ్రాయర్లో వేసుకుంటూ అడిగాడతను.

'అవును. మొత్తానికి. రొట్టె, వెన్న తాజాది చూసి ఇవ్వండి.' అన్నాను నేను ఠీవిగా.

అతనెంతో లావుగా కదల్లేనివాడికిమల్లే ఉన్నాడు. అయినా ఒక్క నిముషంలో రొట్టె, వెన్నపొట్లంకట్టి ఇచ్చాడు. అవితీసుకొని ఇక అక్కడొక క్షణంకూడా నిలబడకుండా పార్కు వైపు వరిగెత్తాను.

పార్కులో ఒక మూల కుంకుడుచెట్టొకటుంది. దానిక్రిందనే బెంచీ. రోజూ దానిమీదనే నేను కూర్చొనిరాసుకుంటుంటాను. నా మామూలుచోటు మరెవరూ ఆక్రమించుకో లేదుగదా? లేదు. బెంచి ఖాళీగానే ఉంది. కాళ్లు బారజాపి బెంచీమీద కూర్చున్నాను. రొట్టె కరకరలాడుతూ కమ్మగా ఉంది. వెన్నలో నంచుకొని తింటోంటే రెండురోజులనుంచీ అన్నంతినని నాకు పంచభక్ష్యాలతో భోంచేసినట్లుంది. అయిదు నిముషాల్లో అంతా తినేశాను. పంపుదగ్గరికి వెళ్లి కడుపునిండా నీళ్లు తాగాను. కాళ్లల్లోకి కావల్సినంత సత్తువొచ్చింది. వంట్లో ఉత్సాహంగా ఉంది. ఇక రచన మొదలుపెడితే కలం వడిగా పోతుందను కున్నాను. నాకలం-నాకు కలం ఎక్కడుంది! పెన్సలు. 'అరె- నాపెన్సలేదీ?' పెన్సలుకోసం జేబు తడిమాను. ఊహు. లేదు. 'అరె. నాపెన్సలేమైంది? చచ్చిందిపండెం!' పెన్సలు కనపడక పోయేసరికి నాకు వళ్లంతా వణుకు పుట్టింది. ఆ సమయంలో నాకాధారం అదే. అదిలేకపోతే నా రచన సున్నా. లక్ష

రూపాయల నిధి పోగొట్టుకున్నట్లు బాధపడ్డాను. చేయిజారి ఎక్కడైనా పడిపోలేదు కదా? ఒకక్షణం మనస్సుస్థిమితంచేసుకొని జ్ఞాపకం తెచ్చుకొన్నాను. నాపెన్సలు స్వెట్టరు జేబులో ఉంది. చొక్కాజేబుకు చిల్లి ఉండడంచేత స్వెట్టరు జేబులో పెట్టాను. తీసుకోవడం మరిచిపోయాను. స్వెట్టరుతో పాటు పెన్సలూ తాకట్టు వ్యాపారికి దత్తంఅయింది.

ఆరిభగవంతుడా! ఈవాళ్ళ ఏపని చేయబోయినా ఎదురు తిరుగుతోందేమిటి? కాసేపు కూర్చొని నన్ను నేనే తిట్టుకున్నాను. ఆతరువాత తిన్నగా లేచి ఆ పెన్సలు తెచ్చుకొనేందుకు బయలు దేరాను. పార్కుదాటి బయటికి వచ్చేసరికి బజార్లో పుట్టు పురుగు కనపడలేదు.

ఎవరో ఇద్దరు నర్సులు మాత్రం ఏదో మాట్లాడుకుంటూ పోతున్నారు. నాకుచెప్పలేనంత దుఃఖం వస్తోంది. నేను ఎటు వైపు వెళుతున్నానో నాకే తెలియడంలేదు. పిచ్చివాడిలా ముందుకు వెనుకకు నడుస్తున్నాను. తాగినవాడికి మల్లే తూలు తూపోతున్నాను. ప్రతివిషయం ఎంతవిషాదంగా పరిణమిస్తోందీ? అమూల్యమైన నా రచనలవ్యవహారం అనాపెన్సలులో పరిష్కారమై పోయింది. వెధవ పెన్సలు ముక్కకోసం ఇంత గొడవ పడాల్సి వస్తోంది! వెళ్ళి పెన్సలు తీసుకొస్తాను. ఆ తాకట్టు వ్యాపారి దగ్గరే ఉంటుంది. లేకపోతే వ్యవహారం సాగదు. సాయంత్రమైతే పార్కునిండా జనం పోగవుతారు. ఎలాగైనా వెంటనే రచనలు పూర్తిచేయాలి. చేతిలో కానీ, లేదు. అద్దె చెల్లించాలి. మేడదిగి వస్తోంటే 'నాగమణి' నావైపు కొరకొర లాడుతూ చూచింది. అద్దె ఇవ్వలేదనే మాటతో ముడియపెట్టుకొని వెళ్ళిపోయింది. హనుమంతరావు దగ్గర రూపాయి తీసు

కాని ఎన్నిరోజులైందీ? ఏవిషయాన్ని గురించి ఆలోచిస్తున్నా ఎంత హాయిగా గడుపుదామనుకున్నా లోపల ఒకవైపు ఈ బాకీలు నన్ను బాధిస్తున్నాయి. వీటిని వదిలించుకోక పోతే లాభంలేదు.

ఇలా ఆలోచిస్తూనే ఆనందరావ్ హాస్పిటల్ దాటాను. సంతబజార్లోకి వెళ్ళేసరికి జనం సందడిగా ఉంది. సరుకులుకొనే వాళ్ళు, సరదాగా తిరిగే వాళ్ళు – నా ప్రక్కనుంచి ఇద్దరు ఆడవాళ్ళు పోతున్నారు. నేను చేతులూపుకుంటూ పరధ్యా నంగా నడుస్తున్నాను. ఆ తొందర్లో నా చెయ్యి పొరపాటున పోతోన్న ఆడకూతురుకు తగిలింది. నేను గాభరాతో ఆమె వైపు చూశాను. ఆమె ముఖం తెల్లగా పాలిపోయి ఉంది. నన్ను చూడగనే ఆమె నవ్వింది. ఆ మరుక్షణంలోనే ఆమె ముఖం మనోహరంగా మారిపోయింది. ఆమె నవ్వటానికి కారణమేమిటో నాకు తెలియలేదు. బహుశా దారినపోయే వాళ్ళు ఏదైనా తమాషామాటనుకుంటూపోతే అది విని నవ్వొ చ్చిందేమో? లేక ఆమె మనస్సులో దాక్కొని ఉన్న మధుర స్మృతులేవైనా జ్ఞాపకంవచ్చి నవ్విందా? అసలివేవీకాక నా చెయ్యి తగిలినందువల్లే ఆమెకింత సంతోషం వచ్చిందేమో? ఆ ఇద్దరు ఆడవాళ్లూ నేనూ పక్క పక్కనే నడుస్తున్నాం. ఆమె అంతటితో ఊరుకోక విచిత్రంగా ప్రవర్తించడం మొదలు పెట్టింది. తన వక్షస్థలాన్ని కావాలని నాలుగైదుసార్లు పైకి ఉబికించింది. పమిట సవరించుకుంటున్నట్లు నటిస్తూ రెండు మూడుసార్లు తన ఎత్తైన వక్షోజాలు నాకు కనబరచింది. చేతిలో ఉన్న గొడుగు పిడితో (Handle) మధ్య మధ్య రొమ్ములమీద

గట్టిగా అదుముకుంటోంది. ఏమిటీ పిచ్చిచేష్టలు ? ఎందుకామె అలా చేస్తుంది ? నాకేమీ అర్థంకాలేదు.

నేను కొంచెం నడక తగ్గించి వాళ్లను ముందు వెళ్ల నిచ్చాను. నేనిలాంటి అనుభవం ఎన్నడూ ఎరగను. అసలే పెన్సలుపోయి నే నఘోరిస్తోంటే ఈ గొడవొకటొచ్చిపడింది నా మనస్సు మరింతపాడవడానికి. ఆకలితో ఉండీ ఉండీ అంత రొట్టె నమిలీ నమలకుండా తినేశాను. తిన్న తర్వాత ఒక్క క్షణమైనా విశ్రాంతి తీసుకోకుండా తిరగడం మొదలుపెట్టాను. అంచేతనే నాకడుపులో ఏదో నొప్పిగా ఉంది.

నేను కొంచెం నడక తగ్గించేసరికి ఆ ఆడవాళ్లు నాకంటె నాలుగడుగులు ముందుపోతున్నారు. కాని తిరిగీ నాకెందుకో ఆమెను వెంటాడాలనిపించింది. ఆమె ఎవరో, ఎక్కడికి వెడు తుందో, తెలుసుకోవాలని కుతూహలం కలిగింది. ఆమెతో ఏదోరకంగా మాటాడాలని మక్కువ కలిగింది. తిరిగీ గబగబ నడిచి ఆమెలో కల్సుకున్నాను. తీరా దగ్గరికి వెళ్లింతర్వాత ఏం మాట్లాడాలో తోచలేదు. ఇంతలో ఆమె నావైపు చూసింది. నేనేదో చెప్పబోతున్నానని గ్రహించింది. ఇక నేనేదో ఒకటి అనకపోతే నాపరువు దక్కేట్లు లేదు. నాగొంతు పట్టుకుంది. గుండె దడదడ కొట్టుకుంది. నీళ్లు నమిలాను.

'మీ పుస్తకం పడిపోయిందండీ!' కంగారుపడి ఏదో నోటికి వచ్చినమాట అనేశాను.

'పుస్తకమా ? నాదా ?' ఆమె తన స్నేహితురాలు వైపుచూస్తూ అంది.

వాళ్లిద్దరూ నిలబడకుండా పోతునే ఉన్నారు. నిజానికి

ఆమె గొడవ నాకెందుకు? ఆమె ఏమైపోతేనాకేం? ఎక్కడికి పోతే నాకేంపని? కాని నాకు తెలియకుండానే నాలో ఏదో పిచ్చి ప్రవేశించింది. వెర్రిమొర్రి చేష్టలు చేయడం మొదలు పెట్టాను. అంచేత ఆమె సరీగా సమాధానం చెప్పకపోయినా ఆగకుండా నాపని నేను చేస్తూనే ఉన్నాను. ఆమె వినాలని వెనకాలే వెళ్లి పెద్దగా దగ్గాను. అయినా ఆమె వెనక్కుతిరిగి చూల్లేదు నాపిచ్చి అంతటితో ఆగితే బాగుండిపోను! ఊహు. ఇంకా ఎక్కువైంది. ఆమెను దాటేసి నడవడం మొదలు పెట్టాను. ఆమె తన చూపుల్తో నావీపున పొడుస్తున్నట్లని పించింది నాకు. దారి తప్పాను. తప్పుత్రోవలో పడ్డాను. ఆమె కెంతో అపకారం చేశాను. ఆమెపట్ల చాలా అసహ్యంగా ప్రవర్తించాను. నా అంతరాత్మ నన్ను బాధించ సాగింది. సిగ్గుతో నాతల వాలిపోతోంది.

'ప్రేమియర్ బుక్ షాపు' దాకా వచ్చి అక్కడ ఆగాను. కొద్ది నిముషాల్లో వాళ్లూ అక్కడికి చేరుకున్నారు.

'మీా పుస్తకం పోయిందండీ' పక్కగా నిలబడి మళ్లీ ఆమాటే అన్నాను. ఈసారి ఆమె సూటిగా నాకళ్లలోకి చూచింది. నేను దిగ్భ్రాంతుడనయ్యాను. ఎంత చక్కనికళ్లు. 'జలజ' అన్నాను పెద్దగా. ఏదో అలా నోటికి వచ్చిందేకాని అంతకుముందు ఆపేరుగల మనిషి నాకు తెలిసికాదు. ఆపేరు నేనెప్పుడూ వినలేదుకూడా-ఆమెపేరు అదికాదు. అంచేత ఆమె ఉలిక్కిపడింది.

'ఏం పుస్తకం? పుస్తకమేమీాలేదే!' అన్నదామె ఖంగారు పడుతూ.

'ఇతనేదో పుస్తకం పోయిందంటాడేమిటి? ఏం పుస్తకం?' ఆమె తిరిగి తన స్నేహితురాలితో అంది.

ఆమె కంగారుపడి చూచినప్పుడు ఆ కళ్లల్లో మెరుపులు మెరిశాయి. ఒకరిచావు మరొకరికి పెళ్ళిలా ఉన్నట్లు ఆమె భయపడుతోంటే నాకు బ్రహ్మానందం కలిగింది. భయంలో ఆమె ఎంతబాగుంది! ఎలాగైతేనేం? ఆమెను భయపెట్టాను. సందిగ్ధావస్థలోపడేశాను. ఎంత గొప్పపని చేశానూ? ఇంత ఘనకార్యం చేసినందుకు నాకెవరు 'కంగ్రాచులేషన్సు' చెప్తారు? అందుకని నన్ను నేనే కౌగలించుకొని అభినందించుకున్నాను. ఆమె దగ్గర పుస్తకమేమీలేదు. ఆఖరుకు ఒక అట్టముక్కకూడాలేదు. అబద్ధమాడేశాను. శుద్ధ అబద్ధం. బెదురు చూపుల్తో ఆమె అటూ ఇటూ వెదికింది. ఆమె కళ్లు బరువుగా, బాధగా ఏదో పోగొట్టుకున్నట్లు వెదుకుతోంటే నాకెంత బాగుందనుకున్నారూ? ఆమె మెళ్ళో ఉన్న ముత్యాలుకూడా ఏదో భయంతో నావైపు చూస్తున్నట్లనిపించింది.

ఆమెకు పమిట తొలగిపోయింది. ఆమె జాకెట్టుకున్న తెల్లటిగుండీలు కూడా జడిసిపోయి నావంకే చూచాయి.

'అతని మాటలకేం? అతను తాగాడు. రా వెడదాం!' అంటూ స్నేహితురాలు ఆమెను లాక్కెళ్ళింది. ఇక నేనక్కడ నిలుచోలేకపోయాను. నా నరాలన్నీ స్పందించాయి. విపరీతంగా బాధపడ్డాను. విచిత్రమైన బాధ; వికదవర్చలేని బాధ, నాకు తెలియని బాధ; నేను తెల్సుకోలేని బాధ. నల్లటి కుక్క ఒకటి రోడ్డుమీద నాకడ్డంగా పరుగెత్తింది.

ఒక మేడ పైఅంతస్థులో కిటికీ దగ్గర ఎవరో ఆడమనిషి

నిలబడి ఉంది. పనిమనిషిలావుంది. పాతగుడ్డతో కిటికీ అద్దాలు తుడుస్తోంది. ప్రతి చిన్న విషయాన్ని నేను గమనిస్తున్నాను.

ఆ యిద్దరూ 'హార్మోనియమ్ల కంపెనీ' వద్ద ఆగారు. ఏదో మాట్లాడుకున్నారు. అందాకా వాళ్లు వేసుకున్న దుస్తులు నేను గమనించనేలేదూ. ఇద్దరూ యూనిఫారంలా ఒకేరకమైన బట్టలు వేసుకున్నారు. నీలిరంగు జాకెట్లు తొడుక్కుని ఎర్రని సిల్కురుమాళ్లు మెడకు చుట్టుకున్నారు. ఆ ఇద్దరూ అక్కచెల్లెళ్ళేమో అనుకున్నాను. వాళ్లు అక్కణ్ణుంచీ మళ్ళీ వెనక్కు వచ్చారు. నావైపు చూస్తూ ప్రక్కసందులోకి మళ్లారు. మలుపుతిరుగుళ్లో మరోసారి నన్ను ప్రశ్నిస్తున్నట్లు ముఖం పెట్టి వెళ్ళిపోయారు. ఇక నేను వాళ్ళ వెంట వెళ్ళదలచుకోలేదు. వాళ్లను బాధించకూడదనుకున్నాను. కాని మనసు నిలవలేదు. ఏ ఇంట్లోకి వెడతారో తెలుసుకోవాలని కుతూహాల పడ్డాను. నే నామెకు అపకారం చేశాను. కనీసం ఆమె సురక్షితంగా ఇంటికి చేరేవరకూ కనిపెట్టి ఉండడం నా ధర్మం. అలాగైనా నా హృదయానికి కొంత శాంతి, సంతృప్తి కలుగుతుంది. వెంటనే నేనూ ప్రక్కవీధిలోకి పరుగెత్తాను. రెండో ఇంట్లోకి వాళ్లు వెళ్ళబోతున్నారు. నే నా ఇంటిముందున్న లాంతరు స్తంభాన్ని ఆనుకుని నిలబడ్డాను. వాళ్లు మెట్లెక్కి పై అంతస్థులోకి వెడుతున్నారు. మెట్లెక్కుతున్న చప్పుడు నాకు స్పష్టంగా వినబడుతోంది. నేను పై అంతస్థువైపే చూస్తూ నిలబడ్డాను.

ఇంతలో మరొక విచిత్రం జరిగింది. పై గదిలో కిటికీ తలుపులు తీసి ఎవరో ఆడమనిషి చువ్వల సందుల్లోంచి తొంగి

తొంగి చూస్తూ నిలబడింది. మళ్ళీ అవే కళ్లు. కళకళలాడే కళ్లు. తళతళ మెరిసే కళ్లు. 'జలజ' అని అరిచాను పెద్దగా.

ఆమె ఎందుకలా చూస్తూ ఊరుకుంటుంది? నేను తన వైపు చూస్తున్నందుకు ఆదగ్గరేఉన్న పూలతొట్టి తీసుకుని నా బుర్రమీద విసరదేం? అలాచేస్తే నాతల పగిలిపోయేది! తగిన శాస్తి అయ్యేది! లేకపోతే నౌకరును పిలిచి నన్ను మెడబట్టి నెట్టించకూడదూ? నాకేమీ అర్థంకాలేదు. అలా మేమిద్దరం ఒకర్ని ఒకరం చూచుకుంటూ ఓ రెండు నిముషాలసేపు నిల బడ్డాం. మా ఇద్దరి భావాలను కిటికీలోంచి వీధిలోకి, వీధిలోంచి కిటికీలోకి బాణాల్లా విసురుకున్నాం. కాని ఒకమాటైనా మాట్లాడుకోలేదు. హఠాత్తుగా ఆమె కిటికీ పక్కకు తప్పు కుంది. అదే సమయంలో నా బుజంమీద ఎవరో బలంగా చేయివేసి నన్ను వెనక్కు తిప్పారు. నా ఒళ్లు జలదరించింది. తిరిగిచూస్తే ఎవరో పెద్ద మనిషి నాముందునుంచి వెడుతు న్నాడు. 'అవును. నాపిచ్చి చేష్టలుచూచి బుద్ధిచెప్పాలనిఅలా చేసి ఉంటాడు. చెయ్యడూమరి? అలాంటి అపభ్రంశం పనులు చేస్తే ఎవడైనా ఊరుకుంటాడా? ఇంకానయం. నాకు దేహ శుద్ధి చేయకుండా వెళ్లిపోయాడు.'

ఇక నేనక్కడ నిలుచోలేక పోయాను. అభిమానం, ఆవేశం ఒక్కసారిగా పొంగాయి. తలవంచుకుని గబగబ నడ వడం మొదలు పెట్టాను. 'బహుశా ఆదేసమయంలో ఆమె కూడా కిటికీ దగ్గరకొచ్చి నన్నవమానపరచడం చూసి ఉంటుంది. నాకు దుఃఖం పొర్లుకొస్తోంది. నా వెనుక ఎంతో మంది మనుషులు నన్ను వేళ్లుపెట్టి చూపిస్తున్నట్లనిపించింది. ఎలాగైతేనేం ఆవీధి దాటేసి వెళ్లిపోయాను.

పెన్సలుకోసం నేనంతగా శ్రమపడలేదు. విషయం చెప్పగానే తాకట్టు వ్యాపారి స్వెట్టరుతీసి నాచేతికిచ్చి వెదుక్కో మన్నాడు. పెనసలు జేబులోనే ఉంది. కథకోసం నోట్సు వ్రాసుకున్న కాగితంకూడా ఉంది.

''ప్రస్తుతం ఈ పెన్సలే నాకు ప్రాణాధారం. దీంతో కథ రాయాలి. 'చెల్లనిరూపాయలు' '' అన్నాను నేను అతనికి కృతజ్ఞత తెలుపుతూ.

'చెల్లని రూపాయలా ? మీారేనా ? మీారు రచయితా' అన్నాడతను కొంచెం ఆశ్చర్యంతో.

అవును. అతనాపేరు అంతకుముందు పత్రికలో చూచి ఉంటాడు. కనీసం విన్నైనా ఉంటాడు. చెల్లని రూపాయలనే పేరుతో నేను కొన్ని కథలు రాశాను.

'అవును. అది రాసింది నేనే.'

నేను రచయితననీ, ఎంతో గొప్పవాణ్ణనీ, అతనికి తెలియడానికని ఉబలాటపడుతూ ఆ మాటన్నాను. అతను నమస్కారం చేశాడు. నేను 'థ్యాంక్సు' చెప్పాను.

గుమ్మంలో ఎదురుగా ఓ బిచ్చగత్తె నిలబడి చేయి చాపింది. ఏదైనా ఇద్దామని జేబులో చెయ్యిపెట్టాను. ఎంత పిచ్చివాణ్ణి. జేబులో ఏముందిగనుక ఇవ్వడానికి.

పొద్దు నెత్తిమీాదికొచ్చింది. బహుశా పన్నెండుగంటలై ఉంటుంది. పనులుచేసుకుని ఇళ్లకుపోయేవాళ్లు, హోటళ్లోకి భోజనానికి వెళ్ళేవాళ్లు, బజార్లన్నీ సందడిగా ఉన్నాయి. హాయిగా తిరుగుతోన్న మనుషులమధ్య నేను అపురూపంగా కనబడుతున్నాను. నా జీవితంలో గంట గంటకూ జరిగిపోతున్న విచిత్ర సంఘటనలు గుర్తుకొస్తున్నాయి. ఆడమనిషి విషయం

తలుచుకున్నప్పుడు నాపై నాకే అసహ్యంవేసింది. 'ఏమిటి నా జీవితం? నే నెందుకు పుట్టినట్లు? ఏం చేస్తున్నాను? బాధల్లే కుండా బ్రతుకు గడిచిపోవడానికి మార్గమేదో నేను తెలుసుకో లేకుండా ఉన్నాను. నేను చీమంత పని తలపెడితే అది చెట్టం తయి కూర్చుంటున్నది. ప్రపంచమనే న్యాయస్థానంలో నాకు చాల అన్యాయం జరుగుతోంది. రెండు మూడు నెలలనుంచీ నా జీవితం మరీ కష్టాల పాలయింది. రెండుపూటలు సరికదా, రెండురోజుల కొకసారైనా తిండి తినడంలేదు. ఎక్కడ కాలు పెట్టబోయినా ఏదో ముల్లు గుచ్చుకుంటూనే ఉంది. ఆఖరుకు ఒకఅరుగుమీద కూర్చోవాలన్నా ఏదో ఆటంకం అప్పటికప్పుడు పుట్టుకొస్తోంది. ఎంత అసమర్థుణ్ని అయిపోయాను? 'విఘ్నేశ్వ రుడి పెళ్ళికి అన్నీ విఘ్నాలే'అన్నట్లు నేను రచన చేయాలన్నా తలప్రాణం తోకకు వస్తోంది. కాగితం కరువు. పెన్సలుండదు. కూర్చోడానికి జాగా దొరకదు. ఇవన్నీ కుదిరితే మనస్సు స్థిమితంలేక వచ్చే ఆలోచనలు వెనక్కుపోతాయి. ఇంతా ఏడిస్తే రచన అచ్చుకాదు. అయిదురూపాయలు రావు - ఎవరితో చెప్పుకోను? విధి అనేది నన్నిలా వేధిస్తోందా? నా మీద దేవుడికి దయ తప్పిందా? కాలికింద మన్ను, నెత్తి మీద మిన్ను, గదిలో గాలి, పంపులో నీళ్లూ, అన్నీకూడా నా పంచ ప్రాణాలను పట్టి బాధిస్తున్నాయి. నన్ను తరుముతూ జడిపిస్తున్నాయి. నేను అలిసిపోతున్నాను. ఈ పరుగుకు అంతూ పంతూ లేదేం? దీనికి ఎవరు కారణం? పరిస్థితులా? వీటి నెవరు సృష్టించారు. మూడంతస్థుల మేడలో ముఖమల్ పరుపుమీద పడుకున్న మహారాజుకు ముల్లుగుచ్చుకున్నంత బాధకూడా రాదేం? సృష్టికర్త తన చపలచిత్తానికి గుర్తుగా నన్ను సృష్టిం

చూడా? లేక ప్రపంచం పేదవాళ్ల ప్రతినిధిగా నన్ను ఎన్ను కుందా? పోనీ పుస్తకాలమ్మేవాడిగానో, గస్తీతిరిగేవాడిగానో నన్ను నిలబెట్టకూడదూ?'

ఇలా ఆలోచించుకుంటున్నకొద్దీ హృదయంలో ఆవేదన ఎక్కువైంది. అందరు చేసే పాపాలకూ నేనే కారణమేమో అనిపించింది. అంచేత వాటి ఫలితం నేనే అనుభవించాల్సి ఉంది.

పార్కులోకి పోయి నా మామూలుచోట కూర్చు న్నాను. కథ మొదలు పెట్టలేదు. నా కష్టాలగురించే నెమరు వేస్తూ కూర్చున్నాను. మరీ కార్తీక మాసంనుంచీ అంటే సెప్టెంబరునుంచీ నాకు గడ్డురోజులారంభమైనాయి. రోజుకురోజు ఎక్కువేకాని తగ్గడంలేదు. వీటిని భరించడానికిగాని, బ్రతుకు సాగించడానికిగాని సాధ్యంకాకుండా ఉంది. ఎక్కడికి వెళ్లాలో తోచడంలేదు. కనిపించని విషపురుగులేవో నాలో ప్రవేశిం చాయి. దేహాన్ని, ప్రాణాన్ని తూట్లుపడేలా పొడిచాయి. అవి గుంపులు గుంపులుగా ప్రవేశించి నా నరనరాల్లో రంధ్రాలు తొలిచి చివరకు నన్ను పనికిరాని గుల్లగా తయారు చేసి పారేశాయి. నేను జీవచ్ఛవాన్ని! సర్వశక్తి సంపన్నుడైన సృష్టికర్త కావాలనే నన్నిలా సర్వనాశనం చేస్తున్నాడా?

నేను బెంచీమీదనుంచి లేచి అక్కడే అటూ ఇటూ పచారుచేయడం మొదలుపెట్టాను. నా వంట్లో విపరీతమైన బాధకలిగింది. ఆక్షణంలో నన్నెవరో తీవ్రంగా చిత్రహింస చేస్తున్నట్లనిపించింది. చేతుల్లో చెప్పలేనంత బాధ పుట్టేది. కాళ్లు లాగుతున్నాయి. సత్తువలేక తేలిపోతున్నాయి. వేళ్లు కొంగరలు పోసాగాయి. చివరసారి నేను తిన్నరొట్టెకూడా

పోయి నివ్వలేదు. నాకడుపులో తిప్పుతోంది. కొంచెంసేపు అలాగే తిరిగాను. కాని ఇన్ని బాధలుండి నేనెలా బ్రతికి ఉన్నానో అర్థంకాలేదు.

పార్కులోకి వచ్చినజనం నాచుట్టూ తిరిగి నన్నొక విచిత్రవస్తువును చూచినట్లు చూచారు. చివరకు బెంచీమీద ఎవరో ఇద్దరు పెద్దమనుషులొచ్చి కూర్చున్నారు. చుట్టలు కాలుస్తూ గట్టిగా మాట్లాడసాగారు. మధ్య మధ్య పెద్దగా నవ్వుతున్నారు. వాళ్ల చేష్టలుచూచి నాకు చాల కోపం వచ్చింది. కాని ఏమనడానికీ ధైర్యం లేకపోయింది. ఆకోపాన్ని నామీదనే చూపించుకుంటూ పార్కులో మరోవైపుకు వెళ్లి అక్కడ ఖాళీగా ఉన్న బెంచీమీద కూర్చున్నాను.

రచనమీద బుద్ధిపోవడంలేదు. ఇంకా దేవుణ్ణి గురించే ఆలోచిస్తున్నాను. ఏదో జీవనాధారంకోసం నేను ప్రయత్ని స్తుంటాను. హఠాత్తుగా దేవుడొచ్చి నా పనుల్లో జోక్యం కలి గించుకుంటాడు. అడ్డుపుల్లలు వేస్తాడు. నా పనంతా పాడై ఊరుకుంటుంది. జరగటానికి సిద్ధంగాఉన్న పనైనాసరే తారు మారై పోతుంది. ఈ దేవుడికి నా గొడవల్తో ఏం పని? అతని కెందుకు ఇందులో జోక్యం! ఇలా జరుగుతున్నందువల్ల పట్టెడు మెతుకులకోసం 'దేవుడా నీ దయ తప్పిందని' రోజల్లా ప్రార్థిస్తూ కూర్చోవాల్సి వస్తోంది.

అలా అక్కడ కూర్చొని చాలసేపు ఈ విషయాలన్నీ పర్యాలోచనచేశాను. అంతంలేని బాధలు కల్గిస్తున్నందుకు భగ వంతుణ్ని తిట్టిపోశాను. ఒకవేళ భగవంతుడు నా మేలుకోసం, నన్ను బాగుపర్చడంకోసం, నన్ను తనంతవాణ్ణిగా చేయడం

కోసం, తనకు సన్నిహితుణ్ణిగా మార్చడంకోసం, ఇలా చేశా డేమో? అదే అతని ఉద్దేశ్యమైతే ఇందులో అతనొక చిన్న పొరపాటుచేశాడని గట్టిగా చెప్పగలను. అదేమిటంటే —

'ప్రభూ! నేనొక అభాగ్యుణ్ణి. అన్నంతేనివాణ్ణి. సంపా దించుకునేమార్గం ఎరుగనివాణ్ణి, నీ భక్తుణ్ణికూడా. కనుక నే నెప్పుడూ నీ దయమీద ఆధారపడవలసినవాణ్ణే. అంచేత నన్ను నీ పరీక్షలతో బాధించి వేధించకు.' అని అనేకసార్లు ఆకాశం వైపుచూస్తూ దేవుణ్ణి మనస్సులో ప్రార్థించుకున్నాను. అలాం టప్పుడు అతను నన్ను కనికరించడానికిమారుగా కష్టపెట్టడం దేనికి? ఈ శల్యపరీక్షలకు నేను తట్టుకోలేనని తెలుసునే, తెలిసి కూడా ఇలా చేయడంలో దేవుడిది తప్పుకాక మరేమవుతుంది?

చిన్నతనంలో చెప్పుకున్న పాఠాలు జ్ఞాపకం వచ్చాయి. రాగతాళాలతో హృదయాన్ని రంజింపజేసే వాల్మీకిరామాయ ణంలోని శ్లోకాలు నా చెవుల్లో గింగురుమంటున్నాయి. మౌనంగా తలొంచుకుని వాటిని మననం చేసుకున్నాను.

'నేను తినేది తాగేది అన్నం, నీళ్ళేనా? పురుగులు కూడా ముట్టని ఆహారం నా పాలబడుతోందే! నేను మనిషి జన్మ ఎత్తలేదూ? పక్షులుతినే పదార్థాలనైనా పరమేశ్వరుడు నాకు ప్రసాదించకూడదూ? అతను కనీసం తన సేవకుడిమీద చూపించే ప్రేమనైనా నాపట్ల చూపించరాదూ?'

ఒక మాంసంముద్ద, ఒక నరాలగూడు, ఒక దారపు బంతిలాంటి నామెదడును భగవంతుడు తన వ్రేలితో పొడి చాడు. ఆ పొడవడంకూడా తమాషాగా, నాజూగ్గా పొడి చాడు. అంచేతపైకి చూడడానికి బాగా కనపడ్డా - లోపల దారాలవంటి నా నరాలు తమ తమ స్థానాలు తప్పిపోయి

నాయి. పట్టుతప్పి తప్పుడు మడతల్లోపడ్డాయి. కొన్నిచోట్ల దారాలు చిక్కుపడ్డాయి. అతను వేలుపెట్టి పొడిచినచోట ఒక పెద్ద రంధ్రం ఏర్పడింది. అది పూడిపోకుండా పెద్ద గాయం అయింది. ఈపుండు అహర్నిశలు నామెదడులో పురుగులా తొలుస్తోంది. దేవుడి చేతివేలిమీద నాగాయం గుర్తుకూడా పడింది. ఆగుర్తు ఇంకా అలాగే ఉంది.

పోనీ ఏదో రూపంలో దేవుడు నన్ను ముట్టుకున్నాడు. అంతటితో వదిలిపెట్టకూడదూ. మరి నాకే కష్టాలు రాకుండా చూడకూడదూ? పుండుతో భాధపడుతూ ఏదో ఒకమూల పడుండి హాయిగా కాలం వెళ్లబుచ్చేవాణ్ణే! పరమేశ్వరుడి కర స్పర్శచే పవిత్రుణ్ణి అయినప్పటికీ నాకు కష్టాలు తప్పలేదేమిటి?

.....................................

పార్కు పక్కనున్న హైస్కూల్లో గంట కొట్టారు. గొల్లుమని బయటికొస్తూన్న పిల్లలగోల వినిపించింది. కనుక రెండు గంటలు కావస్తోందనుకున్నాను. కాగితం, పెన్సలు తీసి కథ రాద్దామని ప్రయత్నించాను. జేబులోంచి కాగితం తీస్తోంటే దాంతోపాటు క్షవరం చేసుకునే బ్లేడొకటి క్రిందపడింది. తీసి చూచాను. కొత్తబ్లేడే. ఎప్పుడో జేబులో పడేసి ఉంటాను. దేవుడి దయవల్ల ఇంకా నాలుగుసార్లు గడ్డం గీచుకోవచ్చు. అంటే దాదాపు పదిహేను రోజులవరకూ గడ్డంకాస్త శుభ్రంగానే ఉంచుకోవచ్చు. ఫరవాలేదు. అణాఖరీదుచేసే బ్లేడును ఒకపెద్ద ఆస్తిలాగా భావించి దాన్ని భద్రంగా జేబులో దాచుకున్నాను.

రెండు మూడు పంక్తులు వ్రాశాను. అంతే. అక్షరం దొర్లలేదు. నామనస్సు పరిపరివిధాల పరిగెడుతోంది. అయినా

కాస్త స్థిమిత పరుచుకొని మళ్లీ వ్రాయడం మొదలుపెట్టాను. నేను తలపెట్టిన కార్యం ఎప్పుడైనా అంత సులభంగా నెరవేరుతుందా? ఈగలువచ్చి కాగితంమీద వాలడం మొదలుపెట్టాయి. నా ముఖంచుట్టూ దోమలు ముసురుతున్నాయి. చేతుల్తో విసురుతూ వాటిని రిమెయ్యాలని ప్రయత్నించాను. అవి పోయినట్లేపోయి మళ్లీ గుంపుగావచ్చి వాలుతున్నాయి. అవి నేనున్న జాగా వదిలిపెట్టి పోవడంలేదు. ఏదో తిందామని ఆ ఈగలు కాగితంమీద అటూ ఇటూ తిరుగుతున్నాయి. కొన్ని 'కామా', 'పులుస్టాపు' పెట్టినచోట్ల కదలకుండా కూర్చున్నాయి. మరి కొన్ని వాటిష్టంవచ్చినంతసేపు కాగితంమీద షికారు చేసి లేచి పోతున్నాయి. ఇటు దోమలు సంగీతం పాడుతూ మధ్య మధ్య నా నోట్లోకి, ముక్కుల్లోకి తొంగిచూసి చక్కా పోతున్నాయి.

వాటితో నే నెంతసేపని పోట్లాడనూ? వాటినిచూస్తూ చాలాసేపు అలాగే కూర్చున్నా. ఇంతలో ఏదో సినిమా ఎడ్వర్టైజ్మెంట్లు పెద్ద పెద్ద బొమ్మలతో ఊరేగించుకుంటూ వెడుతున్నాయి. బ్యాండుమేళం, బాకాలు ఊదుకుంటూపోతు న్నారు. అదివినగానే నాదృష్టి మరోవైపు మళ్ళింది. ఇక కథ వ్రాయడం కుదరదని కాగితం మడిచి జేబులో పెట్టుకున్నాను. కాళ్లు వేలాడేసి బెంచీకి చేరగిలబడ్డాను. చేతులు ముడిచి తలొంచుకుని కూర్చున్నాను. ఇలా కూర్చున్నప్పుడు నే నొకటి స్పష్టంగా గమనించ గలిగాను. నా కాళ్ళల్లో నరాలు వేగంగా కొట్టుకుంటున్నాయి. చివుక్కున లాగుతున్నాయి. తల ఎత్తి కాళ్ళవైపు నిదానించి చూచాను. నాలో ఏదో విపరీతమైన బాధ కలిగింది. అలాంటి బాధ అంతకుముందు ఎప్పుడూ ఎరగను. నరాలకు పెద్ద 'షాక్' కొట్టినట్లనిపించింది. లోపల నిప్పు

రవ్వలు చెరుగుతున్నట్లుగా ఉంది. అలా నేను చూస్తూ ఉండగానే కాళ్లు వణకటం ప్రారంభించాయి. కాసేపు అలాగే కూర్చున్నాను. నాదృష్టి నేతొడుక్కున్న బూట్లమీదపడింది. నా బూట్లు బాగా చిరిగిపోయినాయి. విడవకుండా చాలాకాలంబట్టి వాడుతూ ఉండడంవల్ల వదులుకూడా అయినాయి. దుమ్ముకొట్టుకొని వాటి రూపమే మారిపోయింది. నాతోపాటు తిరిగి తిరిగి, అలిసి అరిగిపోయిన నా బూట్లు ఏదో బాధతో మూల్గుతున్నట్లు వినిపించింది. నా కాళ్లు మరీ వణకటం మొదలుపెట్టాయి. నా కళ్ల వెంట గిర్రున నీళ్లు తిరిగాయి. 'బలహీనత' అని అరిచాను పెద్దగా. నా మణికట్టు పట్టుకొని నాడిచూచుకున్నాను. మళ్ళీ 'బలహీనత ఏర్పడింది' అన్నాను పెద్దగా. నేను తెలివిగానే ఉన్నాను. తెలిసిఉండికూడా నేనిలా చేయడంవల్ల కొంచెం సిగ్గుపడ్డాను. కళ్లుగట్టిగా మూసుకున్నాను. కళ్ళ వెంట నీళ్లు కారిపోయినాయి.

అదివరకు నా బూట్లను అంతగా పరిశీలనచేసిచూడలేదు. వాటిస్థితి చూస్తోంటే నాకు జాలివేసింది. బాగా అరిగిపోయినాయి. ముడతలు పడ్డాయి. అతుకులువేసినచోట అక్కడక్కడ కుట్లు ఊడినాయి. ఈ లక్షణాలనుబట్టి నా బూట్లకు జోస్యం చెప్పవచ్చు. వాటి ముఖాన వివిధరకాల రేఖలుకూడా ఉండడంచేత సాముద్రికంకూడా చూచి వాటి జాతకం ఎలాంటిదో, వాటి జీవితం ఎలా గడిచిపోయిందో, సులభంగా గ్రహించవచ్చు. వాటిని చూస్తున్నకొద్దీ నాలో విచిత్రమైన భావాలు వస్తున్నాయి. బహుశా నా సాంగత్యంవల్ల వాటికికూడా నా స్వభావమే అబ్బినట్లుంది. అవి నా ఆత్మలో ఆత్మలాగా,

ప్రాణంలో ప్రాణంలాగా, ఆఖరుకు నా ప్రతిబింబంలాగా అగుపించాయి.

ఈవిధంగా నాలో నేను తమాషాలుచేసుకుంటూ చాల సేపు గడిపాను. బహుశా ఒకగంటసేపు అలా గడిపానేమో! ఒక ముసలాడు వచ్చి నా బెంచీమీద అవతలకొసన కూర్చు న్నాడు. అతను చాలాదూరం నడిచినట్లుంది. రొప్పుతున్నాడు. అలిసిపోయి ఆయాసపడుతున్నాడు. మధ్య మధ్య 'అవును, అవును; అక్షరాలా నిజం, అంటున్నాడు. ఇదేమాట దాదాపు అయిదారుసార్లకు తక్కువలేకుండా అన్నాడు. అతని మాటలు చెవినిపడగానే ఏదో లోకంలో విహరిస్తున్న నేను వెంటనే మామూలు మనిషినైపోయాను. అతని వ్యవహారం చూచి ఆశ్చర్యపడ్డాను. 'ఏమిటా మాటలు; ఎందుకతనలా అంటాడు?' నా అరిగిపోయిన బూట్లకు, నా ఆలోచనలకు స్వస్తిచెప్పి ఆ ముసలాణ్ణి పరిశీలించడం మొదలుపెట్టాను.

నాకీ ముసలాడు ఏవిధంగానైనా ఉపకరిస్తాడా? ఏ కొద్దిగానైనా సహాయపడతాడా? ఆలోచించాను. అతని చేతిలో ఒక పొట్లంఉంది. లోపల ఏముందో తెలియదుకాని పొట్లంమాత్రం ఒక పాత వార్తా పత్రికతో కట్టాడు. పేపరు చుట్టచుట్టి ఉండడంవల్ల పైపేజీలో కొంత భాగం మాత్రమే నాకు కనపడుతోంది. అందులో ఏవో ప్రకటనలు అడ్వర్‌టైజుమెంట్లు, ఉన్నాయి. ఆ పొట్లంలో ఏదో విశేషం ఉన్నట్లు నామనస్సుకు తట్టింది. ఈ పిచ్చి ఊహతట్టడంవల్ల నేను కూర్చున్నచోటునుండి ముందుకూ వెనక్కూ ఊగుతూ అతని చేతిలో పొట్లంవైపే చూడసాగాను.

ఈ పొట్లం చూడబోతే ఒక దస్తావేజుల కట్టలాగాఉంది.

కొంపతీసి ఇతను ఏవైనా ప్రమాదకరమైన పత్రాలు, మతల బులు, దస్తావేజులు, డాక్యుమెంట్లు పాతపెట్టెల్లోంచి దొంగిలించుక వచ్చాడా ఏం? మొత్తానికి ఇందులో ఏదో రహస్యం, రభస, ఇమిడిఉంది. ఇతను ఎవరిమీదో కుట్ర పన్నుతున్నాడు.'

అతను తిన్నగా కూర్చొని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. పొట్లంలో ఏమీ లేకపోతే అతడు దాన్ని అంతజాగ్రత్తగా పట్టుకుంటాడా? ఇందులో ఏదో మోసం ఉంది. అతను పొట్లం చేతిలోంచి తీసేలా కనపడడంలేదు. జేబులో పెట్టుకోడానికి కూడా అతనికిష్టం ఉన్నట్లులేదు. నేను ఘంటాపథంగా చెప్ప గలను; పందెంవేసి చెప్పగలను. ఆ పొట్లంలో ఏదోఉంది. ఏవుందో తెలుసుకోవాలనే కుతూహలం నాలో ఎక్కువైంది. అంచేత అతణ్ణెలాగైనా మాటల్లోకి దింపాలనిపించింది. అతనికే దైనా ఇద్దామని జేబులో చెయిపెట్టి వెదికాను. కాగితం బయటికితీసి మళ్లీ జేబులో పెట్టుకున్నాను. ఏదో సాహసం చేయాలనిపించింది. నాఖాళీ జేబులో చెయిపెట్టి ఏదో బయటికి తీయబోతున్నట్లు నటిస్తూ ఇలా అన్నాను.

'సిగరెట్టు కాలుస్తారా?' చటుక్కున అబద్ధమాడేశాను. నా దగ్గర ఏముందిగనుక ఇవ్వడానికి?

'అక్కర్లేదు. క్షమించండి. నేను సిగరెట్టు కాల్చను.' అన్నాడతను నావైపు ముఖంపెట్టి.

దేవుడు మేలుచేశాడు. ఆతను నిజంగా సిగరెట్టు కాలుస్తానన్నట్లయితే చచ్చిఊరుకునేవాణ్ణి.

అతనికి దృష్టి సరిగాలేనట్లు తోచింది. ఆతనికళ్లు మామూలుగాలేవు. బహుశా చూపు చెడిపోతున్నందువల్లనే అతను సిగరెట్టు కాల్చడం మానేశాడేమో? అతనికి కళ్ళజబ్బువచ్చి

చాలాకాలం అయిఉంటుందా? అలాగైతే అతను ఆ పత్రికను చదవలేదన్నమాట! పాపం ఎంతటి దుస్థితికలిగింది.! అతను మళ్ళీ నావైపు చూచాడు.

అతని కళ్లల్లో జబ్బున్నమాట వాస్తవమే. రెండు కళ్ళూ పొరలుకమ్మి పుసులుతోడుతున్నాయి. కొలుకుల్లోంచి కొద్దిగా నీరు కారుతోంది. అతన్ని చూస్తోంటే నాకు చీదరపుట్టింది.

'ఈ ఊరికి కొత్తగా వచ్చారా?' అతనడిగాడు నన్ను.

'అవును.' క్లుప్తంగా సమాధానం చెప్పాను.

అతను నన్ను అంతటితో వదల్లేదు. మళ్ళీ అడిగాడు.

'మీా రెక్కడుంటున్నారు?'

'బాబాజీపేట. చాలదూరం'

'అవును. నాకు తెలుసు. పన్నెండో నెంబరు బస్సెక్కాలి.' బాబాజీపేట అతను ఎరగనిదికాదు. ఆపేటలో ప్రతి సందూ, ప్రతిగొందీ, అతనికి తెలిసిందే. అక్కడొక చిన్న కోనేరుంది. లాంతరు స్తంభాలు, అక్కడక్కడ చెట్లు, ఇరుకు బజార్లు; అతనికి అన్నీ జ్ఞాపకం ఉన్నాయి.

'ఏవరింట్లో ఉంటున్నారు?' మళ్లీ అడిగాడతను.

ఇక సంభాషణ చాలించడం మంచిదని నాకుతోచింది. కాని అతను నన్ను వదిలిపెట్టేటట్లు లేదు.

బెంచీమీాదనుంచి లేచాను. అనవసరం మాటలతో విసికిస్తున్నందుకు నాకతనిమీాద కోపంవస్తోంది.

'కాని ఏమైనాసరే ఆపొట్లం ఏమిటో చూడాలి.' అదే నా ఆదుర్దా.

'మీారా ఇల్లు కనుక్కోలేరు. అయినా మీాకెందుకా శ్రమ? అన్నాను నేను. ఇక అంతటితోనైన అతను ఊరు

కుంటాడేమో అని. అతను నా ఉద్దేశ్యం గ్రహించినట్లు లేదు. తిరిగీ ఇలా అన్నాడు.

'బాబాజీపేటలో నేను పదేండ్లున్నాను. అక్కడ నాకు అందరూ తెలుసు. మీరుండే ఇంటివారి పేరేమిటి?'

ఏదో పేరుచెప్పేస్తే తీరిపోతుందనుకున్నాను. పేరు ఆలోచించడానికి నాకెంతో సేపుపట్టలేదు. 'త్రివిక్రమచక్రపాణి' అన్నాను నేను.

'త్రివిక్రమచక్రపాణి. అవును' అంటూ తలఊపాడతను.

లేనిపేరు, నోరుతిరక్క తికమకలుపెట్టేపేరు, నేను చెప్పి నప్పటికీ అతను దాన్ని ఒక పొల్లుగూడా పోకుండా తిరిగీ ఉచ్చ రించాడు. నే నాశ్చర్యపడుతూ అతనివైపు చూచాను. అతను నిండుగా నిబ్బరంగా కూర్చున్నాడు. నే చెప్పిన మనిషి అతనికి తెలియకపోయినప్పటికీ, తెలిసినట్లు నటించాడు. ఇంతలో చేతిలో పొట్లంతీసి బెంచీమీాద పెట్టాడు. నేను ఆదుర్దాగా దాని వైపు చూచాను. పత్రికమీాద అక్కడక్కడ చమురుమరక లున్నాయి. అందులో ఏవో తినుబండారాలున్నట్లు తోచింది. తినాలని ఆశపుట్టింది.

'అతనికి లారీలవ్యాపారం ఉందికదూ?'

అతను తిరిగీ ప్రశ్నించాడు.

నిజంగా ఆ పేటలోఉన్న ఒకపెద్దమనిషిపేరునే చెప్పి ఉన్నట్లయితే అతనికిన్ని అనుమానాలువచ్చేవికావు.

'లారీల వ్యాపారమా? కాదు. మీారు చెప్పేది మరె వరో. ఇతను టి. చక్రపాణి. బోక్రరు, మర్చంటు, కమీాషను ఏజంటు.' అన్నాను నేను.

దీంతో అతనిక మాట్లాడకుండా ఊరుకుంటాడను కున్నాను. కాని అతనేం సామాన్యుడా అంత సులభంగా వదలడానికి ?

'అవును. నేనూ విన్నాను. అతను పెద్ద వ్యాపారి. బాగా గడించాడు.'

'బాగాఏమిటి ? పదివేళ్లతో గడించాడు. పక్కా బిజి నెస్ మనిషి. వెండి, బంగారం మొదలుకొని వేరుశనగనూనె, వెన్నపూస డబ్బాలవరకు అతను అన్నీ బేరం చేస్తుంటాడు. అమెరికాలో సామాన్ల మొదలు ఆంధ్రలో తయారయ్యే వస్తు వులదాకా అన్నిటికీ ధరలుచెప్పి దళారి వ్యాపారం చేస్తుంటాడు.

'అవును. వాడొక రాక్షసుడు. రక్తం పీలుస్తాడు. ఇల్లాంటి దగాకోర్లు చాలమంది ఉన్నారీ నగరంలో. వీళ్లందర్నీ పట్టుకొని సెంట్రల్ జైలుకు పంపాలి.' అన్నాడతను చాల ఉద్రేకంతో.

ముసలాడికి వేడిపుడుతోంటే నాకు చూడవేడుకయింది. అతని పొట్లంలో ఏముందో తెలుసుకోవాలనే విషయం మరిచి పోయాను. అతన్ని ఇంకా కొంతసేపు ఇలా వాగిస్తే సరదాగా ఉంటుదనుకున్నాను. నేనబద్ధాలు చెపుతున్నకొద్దీ అతనవి నిజ మనుకోవడమేకాకుండా, తనకు తెలిసినట్లుకూడ నటిస్తున్నాడు. మళ్లీ నేనతనితో ఇలా అన్నాను.

'అతని భార్య లావుగా, దూది బేలులాగా ఉంటుంది. అతనికొక కూతురుంది. పేరు 'జలజ' ఎంత అందగా ఉంటుం దనుకున్నారు ? ఆమె కట్టుకునే బట్టలు రాజుల ఇళ్లల్లోకూడా ఉండవు. రాత్రీ పగలూ కారుమీద షికారు చేస్తుంటుంది.'

'అలాగా. నిజంగా అంత అందంగా ఉంటుందీ?' అన్నాడతను కళ్లు పెద్దవిచేసి.

'అందంగా కాదు. అప్సరసలా ఉంటుంది. బంగారు తీగలా, పట్టుకుచ్చులా, బాదం ఖీర్‌లా, పన్నీరుబుడ్డిలా ఉంటుంది. ఆమె నరాల్లో ప్రవహించే రక్తంకూడా మనం చూడవచ్చు. ఎంత సుకుమారమైన శరీరమో చూచారా! ఆమె నిలుచున్న చోటునుండి అరఫర్లాంగువరకూ అత్తరు వాసనలు చిమ్ముతుంటాయి' ప్రబంధాల్లో నాయకిని వర్ణించినట్లుగా చెప్పాను.

ఆ ముసలాడు పెదిమలు తడుపుకున్నాడు.

'అవును. అయిఉండవచ్చు'. అన్నాడతను తడబడుతూ.

ఇంతసేపటిబట్టీ నేచేస్తున్న తమాషాలు, చెబుతున్న అబద్ధాలు, ఆ ముసలాడి బుర్రకు అర్థంకాలేదు. ఆ పొట్లం కోసమని నేనతన్ని బోర్లపడేస్తున్నాను. పాపం ఆపండి పోయిన తల ఈ విషయం గ్రహించలేదు. నాకు నవ్వొచ్చింది. ఆపుకోలేక పోయాను. పెద్దగా నవ్వడం మొదలుపెట్టే సరికి అతనికి కష్టం కలిగినట్లుంది. లేవాలని ప్రయత్నించాడు. ఒళ్లు విరుస్తూ తిరిగీ ఇలా అన్నాడు. 'ఆ చక్రపాణి కోట్లు గడించి ఉంటాడు. ఏదీ! అతని పూర్తిపేరు మరొకసారి చెప్పండి.'

నాకింకా నవ్వొస్తూనేఉంది. 'ఏదోపేరు చెపితే ఈ ముసలాడెంత బాగా నమ్మాడు. వట్టి మూఢుడులా ఉన్నాడు. నే చెప్పిందల్లా తెలిసినట్లు నటించడందేనికి? అంతవయస్సు వచ్చికూడా బుద్ధి ఉండక్కర్లా? దరిద్రపుగొట్టు పెద్దమ్మ.' నాకతనిమీద కోపంవచ్చింది.

'కోట్లు గడించాడో, కొట్లు కట్టించాడో నాకు తెలి

యదు. పేరు త్రి-వి-క్ర-మ-చ-క్ర-పా-ణి. అసలు ఆపేరుగల మనిషి ఉన్నాడో లేదోకూడా నాకు తెలియదు. కావలిస్తే వెళ్ళివిచారించు' పెద్దగా కసురుకున్నాను.

'అందుక్కాదు. ఈ పట్నంలో చాలకాలం ఉన్నాను కాని ఆపేరు ఎప్పుడూ వినలేదు. అంచేత సందేహంవచ్చి అడిగాను.' అన్నాడతను మళ్లీ సింపాదిగా... నాకు కోపం మరీ ఎక్కువైంది.

'ఏం ? మొదట్లో నేచెప్పినవన్నీ తెలిసినట్లు నటించావే ? ఎందుకా నటన ? అనుమానం ఎందుకు ? ఇంకా తెలిసినట్లే నటిస్తే పోయేదిగా ! నేనబద్ధాలు చెప్పాననా నీ ఉద్దేశ్యం ? నే నెవరో, నాతత్వం ఏమిటో పట్టిచూడాలని నీవిలా ప్రవర్తించావు కదూ ? నేను దరిద్రుణ్ణనీ, దమ్మిడీ లేనివాణ్ణనీ, త్రాగడానికి సిగరెట్టుకూడాలేక పార్కులో, బజార్లో తిరుగుతున్నాననీ చులకన చేయాలని వచ్చావు. అంతేనా ? ఛీ. ఈ నగరంలో ఇంతే. పక్కవాణ్ణి అనవసరంగా పట్టిచూస్తారు. నా టైమంతా పాడుచేశావు. పో. ఇక్కణ్ణుంచి వెళ్లిపో' వళ్లు తెలియకుండా అరిచాను.

అతను హడలి పోయాడు. నోరు తెరిచి ఆశ్చర్యంగా చూచాడు. వెంటనే బెంచీమీద ఉన్న పొట్లం తీసుకొని అక్కణ్ణుంచి పరిగెత్తాడు. అతనికాళ్ళు అడ్డదిడ్డంగా పడుతున్నాయి. పరిగెత్త లేక మధ్య మధ్య అలుపు తీర్చుకుంటున్నాడు. ఎలాగైతేనేం అతను వెళ్ళి పోయాడు. అప్పటికి ప్రొద్దు వాట వాలింది. నేను బెంచీమీద చేరగిల బడ్డాను. ముసలాడితో జరిగిన సంభాషణంతా తలపుకు వచ్చింది. ఆలోచిస్తూ కూర్చున్నాను. రోజులతరబడి అన్నం లేక తిరుగుతూ అస్తమానం

ఆలోచిస్తూ ఉండడంవల్ల నామనస్సు చెడిపోయింది. ఊరికనే ఉద్రేక పడడం, ఉన్నట్లుండి దిగజారిపోవడం, ఈ రెండు దుర్గుణాలూ ఏర్పడ్డాయి. ఆ ముసలాడిమీద నాకు జాలివేసింది. "అతన్ని అనవసరంగా తిట్టాను. అతనేం చేశాడు? నేనే అతన్ని అన్యాయంగా అనరాని మాటలన్నాను. అతని మనస్సు ఎంత నొచ్చుకుందో? భగవంతుడా, నన్నెందుకు ఇంత పాపాత్ముణ్ణిగా తయారు చేశావు.''

ఆలోచిస్తూన్నకొద్దీ నా గుండెలు బరువెక్కాయి. కడుపులో గుబ గుబ మంటున్నది. బాగా అలిసి పోయాను. కళ్ళు మూతలు పడ్డాయి. కునుకు పట్టింది. ఇంతలో పార్కుకాపలా వాడొచ్చి నన్ను తట్టి లేపాడు.

'ఏయ్. ఇక్కడ నిద్రపోవడానికా బెంచీలు వేసింది? ఇది ఇల్లుకాదు. పార్కు. తెలిసిందా?'

'లేదు. నిద్రపోవడం లేదు.'

నేనులేచి సరిగా కూర్చున్నాను, 'ఏదో ఒకటి చేయాలి. తప్పనిసరి. ఈ రోజైనా రచనలు పూర్తిచేయక పోతే ఇంకా నాలుగు రోజులు పస్తుండాల్సి వస్తుంది.'

కాగితం, పెన్సలు తీసుకొని వ్రాయడానికి పూనుకున్నాను. ముందు తారీఖు వేశాను...1949. దీన్నే కాగితము నాలుగు మూలల్లో వేశాను. అనేకసార్లు అనేకరకాలుగా వేశాను. చెదురుగా బుర్రలోకి ఆలోచనలు వస్తున్నవేకాని వాటిని శ్రద్ధగా ఒకచోట కేంద్రీకరించలేక పోయాను. అదే సంవత్సరాన్ని అనేకమార్లు అనేక రూపాల్లో వేస్తూకూర్చున్నాను. కాగితం చుట్టూ పూజపెట్టినట్లుగా, పూలూ లతలూ

డ్రాయింగులాగా వేశాను. పెన్సులును వేరు వేరు విధాలుగా పట్టుకుని పెయింటింగు చేశాను.

పొద్దుకూకుతోంది. పక్షులు గోలచేస్తూ నాలుగు వైపులనుండీ గుంపుగావచ్చి పార్కులో చెట్లమీద చేరుతున్నాయి. గడ్డిమీద వచ్చని పురుగులు కాళ్లుచాచి మీసాలు కదిలిస్తూ నడవలేక నడుస్తున్నాయి. ఉండీ ఉండీ హఠాత్తుగా గడ్డిపరకలను చుట్టుకొని కడుపులు పైకెత్తి గాలిలో ఆడుతున్నాయి. కాలిక్రింద నలిగిపోయే పురుగుల ప్రపంచం యావత్తూ ఇక కొద్దిసేపట్లో నిద్రపోతుంది. నేనూకూడా ఒక అగాధం అంచుననే ప్రాకుతూపోతూన్న పురుగునేమో, అనిపించింది. పగలల్లా ఆహారంకోసం పోట్లాడి పోట్లాడి అలిసిపోయాను. నిద్రమత్తుగా ఉంది. వెళ్లిపోదామని బెంచీమీదనుంచి లేచాను. కాళ్లు గజ గజ వణికాయి. 'వీల్లేదు. ప్రతిపనీ వాయిదా పడుతోంది. ఈ ఆలస్యానికి ఒక అంతూ పొంతూ ఉండాలి' రెండు చేతులూ గట్టిగాపట్టుకొని పెద్దగా అరిచాను.

మళ్లీ బెంచీమీద కూర్చున్నాను. ఇంటి అద్దె, ఇవ్వాల్సిన బాకీలు, కడుపులో ఆకలి, నాకళ్లల్లోకి· సూటిగా చూచాయి. ఎలాగైనా రచన పూర్తిచేయాలనే పట్టుదలతో, దృఢసంకల్పంతో పెన్సులు పట్టుకున్నాను.

క్రమక్రమంగా భావాల్ని కూడగట్టుకున్నాను. బుద్ధినంతా, కేంద్రీకరించి రెండు పేజీలు వ్రాశాను.

ఒక గుమాస్తా వచ్చేజీతం చాలక భార్యాబిడ్డల్ని పోషించుకోలేక బాధపడుతుంటాడు. కథ అంతవరకూ బాగానే నడిచింది. ఇక దృశ్యం మార్చాలి. మళ్లీ నా ఆలోచన ఆగిపోయింది. ఆ తరువాత ఘట్టం మనస్సుకు తట్టడంలేదు.

'మళ్లీ నా అసమర్థత, పనికిమాలిన జీవితం, జ్ఞాపకం వచ్చాయి. చేతిలో పెన్సిలు వణకటం మొదలుపెట్టింది. అప్రయత్నంగా నా కళ్ల వెంట నీళ్లు కారాయి.

'పరమేశ్వరా, ఏమిటీబాధ' అని పదేపదే వాపోయాను.

చలిగాలి వీస్తోంది. స్వెట్టరుకూడా లేదు. చొక్కాగుండీ సరిగా పెట్టుకున్నాను. ఇక లాభంలేదని కాగితం మడిచి జేబులో పెట్టుకొని అక్కణ్ణుంచి బయలుదేరాను. పార్కుగేటు దగ్గరికి వచ్చేసరికి నేను పోట్లాడి వెళ్లగొట్టిన ముసలాడు కనిపించాడు. పొట్లం విప్పుకొని పెరుగన్నం, ఏవో రకరకాల కూరలు తింటున్నాడు. నన్ను కలవరపెట్టిన పత్రికకూడా అక్కడే పడేసిఉంది. వెంటనే అతన్ని క్షమాపణ వేడుకుందామనుకున్నాను. కాని అతను అన్నంతినే వైఖరిచూచి నాకు అసహ్యం వేసింది. అతను పదార్థాలన్నీ చేత్తో కెలుకుతున్నాడు. అతని అయిదువ్రేళ్లు మాంసాన్ని చీలుస్తున్న గద్ద గోళ్లలా ఉన్నాయి. నా కడుపులో తిప్పి డోకు వచ్చింది. అతన్ని పలకరించకుండా వెళ్లిపోయాను. అతనూ నావైపు రెప్పవాల్చకుండా చూచాడు. కాని నన్ను గుర్తుపట్టినట్లు లేదు.

దోవలో అలవాటు ప్రకారము పత్రికా ఆఫీసుముందు ఆగాను. బయటబోర్డును అంటించి ఉన్న వార్తాపత్రిక చదువుతూ నిలుచున్నాను. నేను చదివేవి ఏ ముంటాయి? వార్తలతో నాకేంపని? 'ఉద్యోగులు కావలెను.'

(Wanted, Situation Vacant) అనే హెడ్డింగు మాత్రమే చూస్తూంటాను.

ఒక బట్టలకొట్టువారు చేసిన ప్రకటన కనపడింది. ప్రతి ఆదివారం రెండుగంటలసేపు అక్కౌంట్లు చూడడానికి మనిషి కావాలి. జీతం ఎంతకావాలో తెల్పుతూ దరఖాస్తు చేయండి అని ఉంది. ఆబట్టలకొట్టు అడ్రసు కాగితంమీద వ్రాసుకొని ఒక సారి మనస్సులో భగవంతుణ్ణి ప్రార్థించుకొన్నాను.

'ఒకరూపాయి అడుగుతాను. అదేమంత పెద్ద మొత్తం? రెండుగటల పనికి ఆమాత్రం ఇవ్వకపోతాడా?

నేను నాగదికి చేరేసరికి బాగా చీకటి పడింది. గదిలో బల్లమీద ఒకచీటి ఉంది. దాన్ని తీసుకొని అవతల లాంతరు స్తంభం వెల్తుర్లోకి వెళ్ళిచదివాను. ఇంటియజమానురాలు నాగుమణి వ్రాయించిన చీటి అది 'వెంటనే నాకివ్వాల్సిన అద్దె లెక్కచూచిఇస్తూ మరికొంత అడ్వాన్సుగా సొమ్ము ఇస్తేనే కాని గదిలో ఉండటానికి వీల్లేదు.

ఆమె అలా వ్రాసినందుకు నేనేమీ బాధపడలేదు. అద్దెఇవ్వకపోతే ఎంతకాలంఊరుకుంటుంది? అది ఆమె కర్తవ్యం. అదే ఆమె బ్రతుకుతెరువు.

కాగితం తీసుకుని బట్టలకొట్టు యజమానికి దరఖాస్తు వ్రాశాను. నా విద్య, అర్హతలు తెలుపుతూ చాలవినయంగా వ్రాశాను. డ్రాయర్లో వెతగ్గా ఒక కవరు కనబడింది. అప్లి కేషన్ కవర్లోపెట్టి దగ్గరలోఉన్న పోస్టుబాక్సులోవేసివచ్చాను.

పడకకుర్చీలో ఆలోచిస్తూ పడుకున్నాను. ఆలోచించి ఆలోచించి అలాగే నిద్రపోయాను.

మరుసటిరోజు చీకటితోటే లేచాను. నాకు మెలకువ వచ్చిన కొంచెంసేపటికే క్రిందఉన్న గడియారం నాలుగుగంటలు కొట్టింది. ఆలోచిస్తూ అలాగేపడుకొని ఉన్నాను. నా బుర్ర

లోకి పుట్టెడు ఆలోచనలు వచ్చాయి. నేను వ్రాయదలచు కొన్న కథలోకి కావాల్సిన అనేక దృశ్యాలు కళ్లకు కట్టినట్లు కనిపించాయి. చక్కని సన్నివేశాలు, సంఘటనలు ఒకదాని తరువాత ఒకటి మనసులో సమకూర్చుకున్నాను. చక్కని కథ నా బుర్రలో తయారైపోయింది.

లేచికూర్చొని ఆ దృశ్యాలన్నీ మనసులో గుర్తుపెట్టు కొన్నాను. నోట్లోకివస్తున్న మంచి మంచి మాటలు, చక్కటి వాక్యాలు మరిచిపోకుండా ఉండగలందులకై పదే పదే మననం చేసుకున్నాను.

నా మనస్సు నిర్మలంగా ఉంది. ఇప్పుడుతప్పితే మళ్ళీ వ్రాయలేను. ఎలాగా వ్రాయడం ? ఇంకా తెల్లవారలేదు. నా గదంతా చీకటిగా ఉంది.

కొవ్వొత్తి ఉందేమోఅని లేచి టేబుల్ దగ్గరికి వెళ్లాను. డ్రాయర్లో చేయిపెట్టి వెతికాను. ఊహు. లేదు. కొవ్వొత్తి అయిపోయి చాలారోజులైంది. 'భగవంతుడా ఏం చేయాలి ? ఎప్పుడూ ఏదోఒకటి తెచ్చిపెడుతూనే ఉంటావు. ఇంటావిడ నాగమణి కొంచెం దీపం ఇస్తుందేమో అడిగితే? అమ్మో ! వీల్లేదు. అద్దె ఇవ్వలేదని ఆవిడకసలే నామీద కోపంగాఉంది. పైగా వాళ్లంతా లోపల ఎక్కడోపడుకొని నిద్రపోతున్నారు.'

టేబిల్ మీదఉన్న కాగితాలు, పెన్నులు తీసుకొని తిన్నగా మేడదిగి వీధిలోకి వెళ్ళాను. వీధిలో దీపాలు చాల వరకు ఆరిపోయినాయి. ఆ దాపులో ఒక లాంతరు స్తంభం మాత్రం గుడ్డిగా వెలుగుతోంది. లాంతరు స్తంభాన్ని ఆనుకొని కూర్చొని ఆ గుడ్డి వెల్తుర్లోనే కథవ్రాయడం మొదలుపెట్టాను.

కథా స్వరూపం యావత్తూ మనస్సులోనే ఉండడంవల్ల కథ చక చక నడిచింది. సజీవమైన పాత్రలు, చక్కటి సంభాషణాలు, వాక్యాలు, వర్ణనలు ఒకదాని తరువాత ఒకటి ముచ్చటగా పడిపోతున్నాయి. అలా మోకాళ్ళమీద కూర్చొని ఒక క్షణం కూడా ఆగకుండా పదిహేను పేజీలు వ్రాశాను.

భళ్లున తెల్లవారింది. అక్కడక్కడ జనంకూడా తిరుగుతున్నారు. కాగితాలు మడిచి తిన్నగా గదిలోకి వెళ్ళాను.

వెంటనే చిత్తుగా ఉన్న ఆపదిహేను పేజీల కథ 'ఫెయిర్ కాపీ' తయారుచేయడం మొదలుపెట్టాను. కథసాపు తయారు చేసేటప్పుడు ప్రతివాక్యం శ్రద్ధగా పరిశీలించాను. కథయావత్తూ చాలబాగా వచ్చింది. హాస్యం, వ్యంగ్యం, శృంగారం, దుఃఖం అన్నీ సమపాళ్లల్లో పడ్డాయి. నేను వ్రాసిన ప్రతిమాటలో ప్రాణం ఉన్నట్లనిపించింది. ప్రతి వాక్యంలోనూ ప్రతిభ కనబడుతోంది. నాకు గట్టి నమ్మకం కలిగింది. అంతకుముందు ఆమాత్రం కథ నేనెన్నడూ వ్రాయలేదు. గర్వంతో ఉబ్బిపోయాను.

ఫెయిర్ కాపీ తయారుకాగానే కాగితాలు చేతిలో పట్టుకుని 'ఈకథ ఎంతఖరీదు చేస్తుందని' తూకంవేసుకొని లెక్క కట్టుకున్నాను. 'ఎవరైనా అయిదు రూపాయిలిచ్చి నా కథ కళ్లకద్దుకొని తీసుకుంటారు. అసలిటువంటి కథకు మరో రచయిత అయితే పదిరూపాయలకు తక్కువ పుచ్చుకోడు. నేను అయిదు రూపాయలకు ఒప్పుకుంటున్నానూ అంటే కథ చౌకగా దొరికిందని చెప్పాలి.'

ఎలాగైనా కథకు అయిదురూపాయలు తప్పకుండా వస్తాయని నిశ్చయించుకున్నాను. అప్పటికి ఏడుగంటలవుతుందేమో! లేచి కిటికీ దగ్గరకు వెళ్లాను. ఎదురుగా వీధిగోడమీద

రకరకాల ప్రకటనలూ, అడ్వర్‌టైజ్‌మెంట్లు, మామూలు పరికారం దర్శనమిచ్చాయి. వీధిలో వరుసగాఉన్న కొట్లు, వాటి పక్క పెద్ద ఖాళీజాగా, అక్కడ కుప్పగాపోసిన చెత్త, చెదారం అన్నీ మామూలుగానే ఉన్నాయి. మంచుపడుతోంది. మబ్బు పట్టి చల్లనిగాలివేస్తోంది.

కిటికీ దగ్గరనుంచి ఇవతలకొచ్చి గది నాలుగుమూలలూ కలయ చూచాను. నిజం చెప్పాల్సివస్తే ఆ గది నాకు తగినది కాదు. కవులకూ, రచయితలకూ కావాల్సిన వాతావరణంలేక పోగా అందులో కూర్చుంటే వచ్చే భావాలుకూడా వెనక్కు పోతాయి. ఉమ్ములు, తుమ్ములు, ఉప్పిరిసినగోడలు, గోడల కెక్కడచూచినా మేకులు; ఒకమూల నా పడకకుర్చీ ముఖం చిన్నబుచ్చుకొని కూర్చుని ఉంటుంది. బలంలేక ఊగులాడుతూ ఉంటుంది. అది అసలే చిన్నది. అందులో కాస్తలావుపాటి మనిషి కూర్చోడానికే వీల్లేదు. బలంగా కూర్చుంటే పట్‌మని విరిగిపోతుంది. ఊరికే తమాషాకోసం దాన్ని అటూ ఇటూ కదిలించినా ఏదోకాలు విరిగిఊరుకుంటుంది. వీలైనంత త్వరలో గది ఖాళీచేయాలనిఉంది. ఇష్టంలేకపోయినా ప్రాణాలు బిగ పట్టుకొని ఇంతకాలం ఈ గుహలో గడిపాను.

నాగమణి అద్దెబకాయిచెల్లించమని హెచ్చరిక చేసింది. వెడుతూవెడుతూ మాట్లాడి వెళితే మర్యాదగా ఉంటుందేమో? అయినా ఎందుకు? డబ్బు చేతులోకి వచ్చింతర్వాత ఆమె ఎదుట బడడం మంచిది. ఆమె పంపిన చీటికి మళ్ళీ వ్రాతమూలకంగానే సమాధానం చెప్పడం సబబని తోచింది. ఇస్తానని వాగ్దానం చేసికూడా వారంరోజులైంది. ఇవ్వలేక పోయాను. అయినా ఆమెసొమ్ము ఎక్కడికీ పోదు.

డబ్బు చేతులోకి వచ్చిన మరుక్షణం ఆమెకివ్వాల్సిందే కాకుండా మరో రెండు రూపాయలు అదనంగా ముట్టచెపుతాను. డబ్బురావాలే కాని ఆమె నన్నడగాలా? నేనే వాకిట్లోకి వెళ్ళి పిలిచి మరీ చేతుల్లో పెట్టనూ? తనఇంట్లో ఉంటున్న మనిషి మర్యాదస్తుడనీ, నీతితక్కువవాడు కాదనీ, రుజువు చేస్తాను. చీటిరాసి బల్లమీద పెట్టాను.

కథ మరోసారి చదువుకొని సంతృప్తి పడ్డాను. నాది పాతగుడ్డల మూటొకటుంది. తలగడఎత్తు చాలదని దాన్నికూడా తలక్రింద పెట్టుకుంటాను. గుడ్డలమూట బయటికితీసి విప్పి చూచాను. రెండు చిరిగిన పాత ధోవతులు, బొత్తిగా పనికిరాని పైజమా, నాలుగు మూడు పాత పత్రికలు, ఒకపాత కోటు–ఇవీ అందులోఉన్న సామాన్లు. పాతకోటు బయటికి తీస్తోంటే దాంతోపాటు ఒక జేబురుమాలుకూడా కనిపించింది. ఎప్పుడో కొన్న జేబుగుడ్డ. తెల్లని గుడ్డమీద ఎర్రటి చుక్కలున్నాయి. కోటుబాగా పాతబడిపోయింది. ఒకటిరెండు అతుకులున్నప్పటికీ చేతులు, జేబులు బాగానే ఉన్నాయి. చాకలి ఉతకడంలోకాబోలు గుండీలు సగంసగం పగిలిపోయినాయి. స్వెట్టరుకూడా లేదు. కోటు అయితే చలికి కొంచెం ఆగుతుంది. కోటు విదిలించి బల్లమీద పడేశాను. ముడతలు పోవాలని అక్కడక్కడ సరిచేశాను. కోటు తొడుక్కుని ఫెయిర్‌కాపీ చేసినకథ, మరికొన్ని తెల్లకాగితాలు, పెన్సులు, కోటు జేబులో పెట్టుకున్నాను. కర్చీఫు పాంటుజేబులో తురిమాను. పక్కలో ఉన్న దుప్పటి (హనుమంతరావుది) తీసి మడతపెట్టి చంకలో పెట్టుకున్నాను. 'ఇంకేమీ మరిచిపోలేదు కదా!' అని మరోసారి గదంతా కలయ వెదికాను.

గది తలుపులు దగ్గరికివేస్తూ భగవంతుణ్ణి మరోసారి మనసులో ప్రార్థించుకున్నాను. అతను సహాయపడకపోతే ఆ ఉదయం నా రచన పూర్తి అయ్యేదా! దేవుణ్ణి పదేపదే ధ్యానించి నాకృతజ్ఞత తెల్పాను.

'అవును. పరమేశ్వరుడు నాకు సహాయపడ్డాడు! క్రిందటి రోజుల్లో నేనువడ్డ బాధలకూ, కార్చిన కన్నీళ్లకూ అతను కరిగి పోయి నాపై కరుణచూపాడు.'

తెల్లవారుఝామున ఎప్పుడో కొద్దిపాటి వర్షంపడి నట్లుంది. వీధులు అక్కడక్కడ తడిగాఉండి తళతళ మెరుస్తు న్నాయి. బాగా మబ్బుపట్టి ఉండడంవల్ల ఎండపొడ కనిపించ డంలేదు. ఆ రోజు ఎలాగడుస్తోందని ఆలోచించుకుంటూ 'టౌన్ హాల్' ముందుగా నడుస్తున్నాను. అక్కడికి పత్రికాఆఫీసు దాపులోనే ఉంది. కాని సంపాదకుడు పది పదకొండుగంటలు కానిదే ఆఫీసుకురాడు. కనుక ఇప్పుడువెళ్ళి ప్రయోజనంలేదు. అప్పటిదాకా అనవసరంగా తిరిగేబదులు ఏదో కాస్త టిఫిన్ కడుపులోపడేమార్గం ఆలోచించాలి. ఆ రోజుకూడా పస్తు పడుకోడానికి నేను భయపడటంలేదు. భగవంతుడి దయవల్ల అలా భయపడేరోజులు ఎప్పుడో గతించాయి. ఆ పీడకలలు ఇదివరకేవచ్చి వెళ్ళిపోయినాయి. ఇప్పుడు నేను ఆకలికి అల వాటుపడిపోయిన మనిషిని!

చంకలో దుప్పటొకటి నాకు బరువుగా ఉంది. నడి బజార్లో జనమంతా చూస్తుండగా నా కా పాతదుప్పటి మోసు కొనిపోవడం సిగ్గనిపించింది. ఎవరేమి అనుకుంటారో అని చిన్న తనంగా ఉంది. దాన్ని ఎక్కడపడేద్దామన్నా వీలుపడలేదు.

దోవలోనే 'శంభు' పాతపుస్తకాలషాపు ఉంది. అతను

నాకు తెలుసు. నాదగ్గరున్న నవలలు, నాటకాలు, కథలు, కావ్యాలు అనేకం; చాలమంచివి; చాల తక్కువ ఖరీదుకు అతనికమ్మేశాను. అంచేతనే ఎప్పుడైనా చదువుకుందామన్నా నాదగ్గర ఒక్కపుస్తకం కూడా లేదు. శంభు దగ్గరికి వెళ్ళి దుప్పటిని పేపర్లో పెట్టి పార్శిల్ కట్టిస్తే బాగుంటుంది. ఇక దాన్ని పట్టుకొని ఎక్కడ తిరిగినా ఫరవాలేదు. చూచేవాళ్ళకు కొంచెం శుభ్రంగా కనవడుతుంది.

షాపులోకి వెళ్ళాను. శంభులేదు కొట్లో కుర్రాణ్ణి పిలిచి 'దుప్పటి కాస్త కాగితంలో కట్టిఇవ్వ' మని అడిగాను. అతను దుప్పటివైపు చూచి ఆ తరువాత నాముఖంకేసి అదోమాదిరిగా చూచాడు. భుజాలు ఎగరేసుకుంటూ కొంచెం తిరస్కారంగా నాచేతిలో దుప్పటి తీసుకొన్నాడు. ఆ కాస్తపనిచేసి పెట్టడానికి అతనికి నామర్దా అయింది కాబోలు! అతను విసుక్కుంటున్నట్లు కనిపించడంవల్ల నా మనస్సుకు కష్టం కలిగింది.

'ఏయ్, మిష్టర్! ఏమిటా నిర్లక్ష్యం? అందులో రెండు గాజు వస్తువులున్నాయి. కాస్త జాగ్రత్తగా కట్టియ్యి. దాన్ని పొరుగూరికి పంపించాలి' అన్నాను నేను.

నేనిలా అనడంవల్ల అతను దారిలోకి వచ్చాడు. నిజంగా ఆ దుప్పట్లో ఏదో సామాన్లు పెట్టాననుకున్నాడు. కాగితంచుట్టి జాగ్రత్తగాకట్టి చేతికందించాడు. నేనుమళ్ళీ రోడ్డుమీద జనంలో పడ్డాను. గుంపులుగుంపులు జనం. అందరి ముఖాల్లో ఏదో ఆదుర్దా, ఆశ, తాపత్రియం, తహతహ; గుప్పెడు మెతుకులకోసమేగా ఇదంతా!

మార్కెటు దగ్గరికి వచ్చాను. ఒక ఆడమనిషి బుట్టలో గులాబీపూలు పోసుకొని అమ్ముతోంది. ఎర్రి గులాబీలు;

కెంపుల్లా మెరిసిపోతున్నాయి. చల్లటి వాతావరణం. మనస్సు ఉల్లాసంగా ఉంది. అలాంటి సమయంలో గులాబీపూలు వాసన చూస్తోంటే ఎంత కులాసాగా ఉంటుంది! పూలు తీసుకోవాలని బుద్ధి పుట్టింది. పాపమో, పుణ్యమో తర్వాత సంగతి. ముందొకపువ్వు గబుక్కున లాక్కొని పరిగెడితే!...... కనీసం దగ్గరికెళ్లి వాసన చూస్తే తృప్తి కలుగుతుందనుకున్నాను. ఆ పూల మనిషి దగ్గరికి వెళ్లి పూలు పట్టుకొని చూస్తూ ధర విచారించాను.

నా దగ్గర ఏమాత్రం డబ్బున్నా ఒక్కపూవైనా కొనుక్కునేవాణ్ణి. ఏం చేయను? నా జీవితంలో ఎన్ని కోర్కెలను కోసేసుకోలేదు.

పదిగంటలైంది. పత్రికాఆఫీసుకు వెళ్లాను. 'సాధన' చాలాకాలంనుంచీ నడుస్తున్న సాహిత్య పత్రిక. అప్పటికింకా 'ఎడిటర్' రాలేదు. ఆఫీసులో ఒకర్ని పిలిచి నే వచ్చినపని చెప్పాను. నా కథ కాపీ అతనిచేతిలో పెడుతూ అది చాల ముఖ్యమైనదనీ, ఎడిటర్ రాగానే ఏమాత్రం ఆలస్యంచేయకుండా స్వయంగా అతనిచేతి కివ్వవలసిందనీ, చెప్పాను.

'నేను మళ్ళీవచ్చి వారిని కలుసుకుంటానులెండి'

'సరే' అంటూ అతను తలఊపి తన కాగితాలపనిలో నిమగ్నుడై నాడు.

ఇప్పటికి కొంత పనైంది. కథ అచ్చయితేగదా!

మళ్ళీ నడక ప్రారంభించాను. వర్షంవచ్చేలాఉంది. గాలి వేయడంలేదు. తుకతుక ఉడికిపోతుంది. చాలమందిచేతుల్లో గొడుగులున్నాయి. మళ్ళీ మార్కెట్టు దగ్గరకొచ్చి రకరకాల

వండ్లూ పూలూ చూసుకుంటూ నడుస్తున్నాను. ఎవరో వెనుక నుంచిభుజంమీద చెయ్యివేశారు. తిరిగిచూస్తే మోహనరావు.

'గుడ్‌మార్నింగ్'

'గుడ్‌మార్నింగ్' అన్నాను నేను అంతపెద్ద పట్టించు కోకుండా. మోహనరావుమీద నాకు మంచి అభిప్రాయంలేదు. అతను నా చంకలో ఉన్న పార్శిలును పరీక్షగా చూచాడు.

'ఆ చంకలోదేమిటి?'

'ఓ! అదా! సూటు కుట్టిద్దామని గుడ్డ కొన్నాను.' నిర్లక్ష్యంగా సమాధానం చెప్పాను.

అతను కొంచెం చకితుడై నావంక చూచాడు.

'అన్నట్లు నీకెలా గడుస్తోంది?' నెమ్మదిగా అడిగాడతను.

'ఓ బ్రహ్మాండంగా జరిగిపోతోంది.'

'అయితే పైసా ఉందన్నమాట జల్సాచేయడానికి.'

'జల్సా' అన్నాను నేను ఆశ్చర్యంతో. 'పుస్తకాల షాపులో పనిచేస్తున్నప్పుడు ఆమాత్రం ఉండదూ?'

'ఓ! అలాగా?' అంటూ కొంచెం జారాడతను.

'గుడ్. దైవసాక్షిగా చెపుతున్నాను, నీవు బాగుపడితే చూచి సంతోషించేవాళ్లల్లో మొట్టమొదటివాణ్ణి నేను. కాని నీవు సంపాదించిందికాస్తా ఇతర్ల సొదరకోసం తగలెయ్యకుండా ఉన్నప్పుడే నాకు బాగుంటుంది. మరి వస్తానూ? గుడ్‌బై'

రెండడుగులువేసి మోహనరావు మళ్లీ వెనక్కు వచ్చాడు. 'ఆ! నాటైలర్ ఉన్నాడు 'ఇస్మాయిల్.' నీవు సూటు కుట్టించదలచుకుంటే అతనిదగ్గర కుట్టించు. చాలబాగా కుడతాడు. కావాలంటే నేనూ వస్తాను. ఖరీదైనగుడ్డ పాడు

చేస్తావేమో అని చెప్పాను. అంతే. తరువాత నీ ఇష్టం' అన్నా డతను నా చంకలోఉన్న పార్శిల్‌ను వ్రేలుపెట్టి చూపిస్తూ-

ఏడ్చేవాణ్ణిచూ స్తే ఇంకా ఏడిపించ బుద్ధయిందట. అలావుంది మోహన్‌రావుగాడివరస. నిజానికిది అధిక ప్రసంగం కాదూ? నా విషయాల్లో వాడికెందుకు జోక్యం? అనవసరంగా ఇతర్ల వ్యవహారాల్లో తలదూర్చే వెధవ. నేను ఏ టైలర్ దగ్గర కుట్టించుకుంటే వాడికేం? వట్టి పోజుగాడు. బుర్రలేని బ్రూట్. ప్రొద్దునలేస్తే ఎవడినెత్తిని చేతులుపెట్టి బ్రతుకుదామా అని ఆలోచిస్తుంటాడు. అదే వాడి బ్రతుకు తెరువు. నా దగ్గర పది రూపాయలు బదులు తీసుకొని ఎంతకాలమైంది. ఇంతవరకు ఇచ్చిన పాపాన పోలేదు. ప్రతిపూట తిండిలేక, జేబులో కాని లేక నే నవస్థపడుతూంటే వీడేదో నామీద దయగలవాడిలా మాట్లాడతాడు. దమ్మిడీ లేకపోయినా డాబుతో, దౌర్జన్యంతో, మోసంతో, ముఖంముందు పొగిడి బ్రతుకుతుంటాడు. వాడి ప్రవర్తనచూచి నాకు పట్టరానంత కోపం వచ్చింది. ఆ పది రూపాయలు ఎప్పుడిస్తావని గట్టిగా అడిగేశాను. కాని అతను సమాధానం చెప్పకముందే అలా ఎందుకడిగానా అని బాధ పడ్డాను. తిరిగీ నేనే అతనితో 'తర్వాత ఇద్దువుగానీలే' అని సర్ది చెప్పాను. నాలో ఉన్న దౌర్బల్యం అలా చేయించింది. నాకు సిగ్గేసింది. అతని ముఖం చూడలేకపోయాను. అంతలో ఒక ఆడమనిషి మా ఇద్దరి మధ్యగుండా వస్తోంది. ఆ అవకాశం చూచి దూరంగా తొలిగాను. అలా తప్పుకొని అతన్ని చూడ కుండా త్వరత్వరగా వెళ్లిపోయాను.

ప్రొద్దెక్కుతూన్న కొద్దీ, నాకు ఆకలి ఎక్కువాతోంది.

ఖాళీ జేబుల్తోటి హోటల్లోకి ఎలాపోను? ఏమీ తోచడంలేదు. పిచ్చి పుట్టినట్లుంది. యూనివర్సిటీ భవనందగ్గర కొంచెంసేపు నిలుచున్నాను. అక్కణ్ణుంచి సంత బజార్లోకి వెళ్ళి చాలసేపు అటూ ఇటూ తిరిగాను. కాళ్ళు పీకుతున్నాయి. మనస్సు స్వాధీనంలోలేదు. ఎక్కడికి వెళ్లాలి? ఏం చేయాలి? దినపత్రిక కార్యాలయం దగ్గరికి వెళ్లాను. పత్రికలు బయటిబోర్డు కంటించి ఉన్నాయి. వార్తలు చదువుతూ కొద్దినిమిషాలు గడిపాను. అక్కణ్ణుంచి హాస్పిటల్ రోడ్డున చాలదూరం నడిచాను. ఆ దాపులోనే అన్నపూర్ణగుడి ఉంది. గుడిముందున్న మంటపం మీద కూర్చున్నాను. అక్కడ ఒకరిద్దరు సాధువులుతప్ప మరె వ్వరూలేరు. నగరానికి దూరంగా ఉండటంవల్ల నిశ్శబ్దంగాఉంది. విశాలమైన ఆ విజనప్రదేశంలో విశ్రాంతి తీసుకున్నాను. మంటపంమీద పడుకుంటే చల్లగాలికి నిద్రపట్టింది.

నిద్రలేచేసరికి టైమెంతయిందీ తెలియలేదు. చాలసేపు నిద్రపోయాను. 'ఈపాటికి నాకథసంగతి తేలిపోయి ఉంటుంది. దేవుడిదయవల్ల అక్కడక్కడ తప్పులుపడలేదుకదా? కథ బాగుంటేమాత్రం అంగీకరిస్తారని నమ్మకమేమిటి? ఈ రోజుల్లో రచనలు అచ్చుకావాలంటే పత్రికలవాళ్ళకు రచయితలను గురించి గొప్పగాచెప్పే మరో పెద్దమనిషి మధ్యనఉండాలి. లేక పోతే బుట్టదాఖలే. ఈపాటికి నా కథకూడా బుట్టదాఖలా అయ్యేఉంటుంది. చెప్పేవాళ్లెవరైనా ఉంటే చెత్తరచనైనా అచ్చవుతుంది. నన్ను గురించి ఎవరు చెపుతారు?

కథను గురించి అనుమానం వచ్చేసరికి నా కాళ్ళు వణుకు పుట్టాయి. తలక్రింద పెట్టుకొని పార్శిల్ తీసుకొని మళ్ళీ నడక ప్రారంభించాను. ఒకఇంట్లోకితొంగిచూసాను. ఒంటిగంట

కావస్తోంది. నాలుగు గంటలు కాందే ఎడిటర్ దగ్గరికి వెళ్ళి లాభంలేదు.

ఆలోచిస్తున్న కొలదీ కథ అంగీకరిస్తారో లేదో అనే అనుమానం నాలో ఎక్కువౌతోంది. 'నిలకడ లేనిమనస్సుతో, నిద్రమత్తులో నిమిషాలమీద కథ పూర్తిచేశాను. నిరుపయోగమైన చెత్తవ్రాశాను. బ్రహ్మాండమైన పనిచేసేనని భ్రమపడ్డాను. అయిదు రూపాయలొస్తాయనే ఆశతో ప్రొద్దుటినుంచీ గడిపాను...... నిరుపయోగం... నిరుపయోగం... అంతా నిరుపయోగమై పోయింది.

త్వరత్వరగా నడుస్తూ నగరపొలిమేరల్లోకి చేరుకున్నాను. గ్రామకంఠం భూములు, ఖాళీజాగాలు, వరిపొలాలు చుట్టూ కనపడుతున్నాయి. అక్కణ్ణుంచి ఆరోడ్డు పరిసర గ్రామాలకు పోతుంది. ఇక అక్కణ్ణుంచి వెనక్కు మళ్ళు దామనుకున్నాను. నడిచీ నడిచీ అలిసి పోవడంచేత అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్నాను. రెండు గడ్డిబండ్లు ఎదురు పడ్డాయి. బండ్లవాళ్ళు తొట్లోకాళ్ళు బారచాపి పల్లె పదాలు పాడుకుంటూ పోతున్నారు. వాళ్ళకు తలగుడ్డలు కూడాలేవు. వాళ్ళ వైఖరిచూస్తే ప్రపంచమేమై పోయినా వాళ్ళకేం పట్టనట్లుంది. నన్ను తప్పకుండా పలకరించి ఏదో తమాషా చేస్తారనీ, నాబస్తీ వాలకం చూచి పరిహాసంచేస్తారనీ అనుకున్నాను. అనుకున్నట్లే జరిగింది. నేను దగ్గరికి రాగానే వాళ్ళలో ఒకడు నన్ను పిలిచి ఇలా అన్నాడు.

'నీ చంకలోదేంటి ?'

'దుప్పటి' వినయంగా సమాధానం చెప్పాను. వెంటనే అతను నవ్వాడు.

'ఇప్పుడెన్ని గంటలు కొట్టింది' మళ్లీ అడిగాడతను.

'నాకు సరిగా తెలీదు. బహుశా మూడు గంటలై యుంటుందేమో!' సుమారుగా టైంచెప్పాను. వెంటనే వాళ్లిద్దరూ పకపక నవ్వుకుంటూ బండ్లు తోలుకపోయారు. అలా వాళ్లు నా పక్కగుండా రివ్వున బండ్లు తోలుకపోయేటప్పుడు వాళ్ల చేతులోఉన్న చెరకోల నా చెవులకు తగిలిందికూడా. మొత్తానికి వాళ్లు నన్నుకాస్త పట్టిచూడండే వెళ్లలేదు.

అన్నపూర్ణ గుడిదగ్గర నాకో మనిషి ఎదురుపడ్డాడు. అతని చేతికి గడియారం ఉంది. టైమెంతయిందని అడగ్గా నాలుగు దాటిందని చెప్పాడు. 'నాలుగు దాటిందా? అప్పుడే నాలుగు దాటిందా?' నా గుండెలు దడ దడ కొట్టుకున్నాయి. వళ్ళంతా వణికింది. పరిగెత్తడం మొదలుపెట్టాను.

'నాలుగుగంటలు కాగానే ఎడిటర్ వెళ్లిపోయిఉంటాడు. ఉదయం పదిగంటలనుండీ పనిచేసినవాడు నాలుగు దాటింతర్వాత ఆఫీసులో ఎందుకుంటాడు? కాగితాలు చూచి చూచి బుర్ర వేడెక్కిఉంటుంది. ఇది షికారుకు వెళ్లే టైము. గాలి పీల్చుకుందామని బీచికిపోయిఉంటాడు. ఇక నా కథసంగతి ఏమైందీ తెల్సుకోడానికి వీల్లేదు. ఇవాల్టికి నా పని వట్టిదే. మళ్ళీ రేపురావాలి' రేపటిదాకా ఆకలితో అలమటించాల్సిందే.

నేను పరుగుతీస్తున్నాను. ఒకటే పరుగు. నడుస్తూన్న జనాన్ని తోసుకుంటూ, అడ్డంవచ్చినవాళ్ళను అవతలికినెడుతూ ఉరుకుతున్నాను. సమయం మించిపోయిందనీ, 'సాధన' ఆఫీసుకు సాధ్యమైనంత త్వరలోనే చేరాలనీ, వెళ్ళగలిగినంత వేగంతో వెడుతున్నాను. ఊపిరికూడా పీల్చడంలేదు. నేనలా ఉరుకుతోంటే మధ్య మధ్య కాళ్లు మడతపడుతున్నాయి. పరు

లుగా ఉన్న నా బూట్లు జారిపోతున్నాయి. చంకలో ఉన్న దుప్పటి జారిపోకుండా అదిమిపట్టుకున్నాను. కార్లు, బండ్లు, బస్సులు అడ్డంవస్తున్నాయి. వాటికింద పడతానేమో అని భయపడడంలేదు. చేయ్యెత్తి 'ఆగండి, ఆగండి' అని అరుస్తూ పరుగుతీస్తున్నాను. గుఱ్ఱంబండ్లకంటె కూడా ముందుపోతు న్నాను. పోలీసుల ఈలలూ, పోకూడని దోవలు, ప్రభుత్వం రూల్సు, పెడస్ట్రియిన్సు, నేను వేటినీ పాటించడంలేదు. నే నాపదలో ఉన్నానని, నాకు ఘోరవిపత్తు సంభవించిందనీ, ఆ జనానికేం తెలుసు? నన్నొక పిచ్చివాడికింద జమకట్టి వింత్రంగా చూస్తున్నారు. పకపకనవ్వుతున్నారు. నా కళ్ళకు ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లు కన్పిస్తోంది.

ఆఫీసు తలుపులు తోసుకొని నాలుగు అంగల్లో మెట్లు ఎక్కేసి మేడమీద కెళ్లాను. ఆఫీసు గదితలుపు తట్టాను. జవాబులేదు. 'అతను వెళ్లిపోయాడు. ఎడిటర్ వెళ్లిపోయాడు' అనుకున్నాను. మరోసారి కొంచెం బలంగా తలుపు తోశాను. తలుపు తీసేఉంది. గబగబ లోపలికి వెళ్లాను. 'సాధన' ఎడిటర్ కుర్చీలో కూర్చొని ఉన్నాడు. కలం చేతులోఉంది. ఏదో ఆలోచిస్తున్నాడు. నావైపు తిరిగి తేరిపారచూచాడు. తల ఊపుతూ.

'ఓ! మీరా! మీకథ ఇంకా చదవలేదు' అన్నాడతను.

నా వంట్లోకి ప్రాణంవచ్చినట్లయింది. 'అమ్మయ్యా. ఫర వాలేదు, నా రచన పనికిరాదని అనలేదు. ఇంకా వ్యవధిఉంది. నాకథ అంగీకరిస్తారనే ఆశఉంది'

'ఓ! దానికేంసార్! మీరు తొందర పనిలో ఉన్నారు.

నాకర్థమైంది. మీకు తీరుబడి అయినప్పుడే నిదానంగా చదవండి. మరేం ఫరవాలేదు'. అన్నాను నేను వినయంగా.

'అవును. తప్పక చూస్తాను. మీ అడ్రెస్ ఇచ్చారుగా తెలియపరుస్తాను' అన్నాడతను.

నాకు స్వంత అడ్రెసంటూ ఏమీలేదని చెప్పడం మరిచి పోయాను. ఎడిటర్ తన పనిలో నిమగ్నుడైనాడు. నేను మేడ దిగి వీధిలోకి వచ్చేశాను. తిరిగీ ఆలోచనలో పడ్డాను.

చల్లారిపోయిన ఆశ తిరిగీ నాలో జ్వలించడం ప్రారంభించింది. నా కథ తప్పకుండా అచ్చవుతుంది. అయిదు రూపాయలొస్తాయి. అనుమానంలేదు. ఈ పోట్లాటలో నేనే గెలుస్తాను. అవును. విజయంనాదే.' నా మనస్సు స్వర్గానికి నిచ్చెనలు వేసి దేవేంద్ర సభలో నాట్యం చేసింది.

ఈ రాత్రి తలదాచుకోడానికి నా కెక్కడైనా చోటుందా? ఈ ప్రశ్నకు సమాధానం దొరక్క రోడ్డు మధ్యలో ఆగాను. నే నెక్కడున్నదీ మరిచాను. సముద్రమధ్యంలో ఒక చట్రాతిమీద ఏకాంతగా నిలుచున్నాను. ప్రమాదాన్ని గుర్తింపజేసే దీపంలా ఉన్నాను. అలలపై అలలు అరుస్తూవచ్చి నన్ను ఢీ కొంటున్నాయి.

పత్రికలమ్మే కుర్రాడు అరుస్తూపోతూ నాదగ్గరికొచ్చి ఆగాడు. 'పేపరు కొంటారాసార్! తాజా వార్తలున్నాయి' అన్నాడు పత్రికచేత్తో పుచ్చుకొని. ఒక్కక్షణం పత్రికవైపు చూచి అక్కణ్నుంచి కదిలాను. నేను మళ్లీ 'శంభు' పుస్తకాల షాపు సమీపంలో ఉన్నాను. చంకలోఉన్న పార్శిల్ తీసి చేత్తో పట్టుకొని రోడ్డు మలుపు తిరిగాను.

సంతబజార్లోగుండా వెడుతూంటే ఆడమనిషి సంగతి

జ్ఞాపకం వచ్చింది. ఆమె మళ్ళీ కన్పిస్తుందేమోనని త్వరత్వరగా నడవడం ప్రారంభించాను. సినిమాహాలు దాటి పెద్ద పోస్టాఫీసు ముందునుంచీ పోతున్నాను. 'పరమేశ్వరా! ఈ రాత్రి ఎక్కడ గడపాలి? పడుకోడానికి కాస్త జాగా దొరికితే బాగుండును! కాళ్లు తేలిపోతున్నాయి. తేలిపోవూ మరి? ఎడిటర్ కోసం పరిగెత్తేటప్పుడు తెలియలేదుగాని ఇప్పుడది తలుచుకుంటే గుండె గుభేలుమంటోంది. ఎంత వేగంగా పరిగెత్తాను! రెండు రోజుల నుంచీ అన్నం తినకపోయినా నావంట్లోకి అంతసత్తువ ఎక్కణ్ణుంచి వచ్చిందో!'

బీచివైపు వెడుతున్నాను. ఫోర్టు దాపులో ఫుట్‌పాత్ ప్రక్కగా రకరకాల పూల మొక్కలువేసి ఉన్నాయి. అక్కడ కూర్చున్నాను. కొంచెం కులాసాగా ఉన్నట్లనిపించింది. సాయంత్రం అవటంచేత చల్లని సముద్రపుగాలి వీస్తోంది. తిరిగీ ఆలోచనలోపడ్డాను. 'ప్రొద్దటివరకూ ప్రొద్దుపుచ్చేమార్గం ఏమిటి? పోనీ గదికి వెడితే? ఊహు. ప్రయోజనంలేదు. వళ్లు విరగొట్టినట్లుంది. కాళ్లుపీకుతున్నాయి. అంతదూరంనడిచే ఓపిక లేదు. ఈ రాత్రికి గదికి వెళ్లేమాట ఉత్తది. ఇక్కడే ఎక్కడో కాస్త వసతి చూచుకోవాలి. గదికి వెళ్లాలనుకుంటేమాత్రం వెళ్లడం నా చేతుల్లోఉందా? మధ్యలో నామనస్సు ఎటు మారుతుందో?'

ఆలోచిస్తూ కూర్చునే సరికి వెనుకటి విషయాలు జ్ఞాపకానికి వచ్చాయి. అంతకుముందు నేనొక హోటల్లో గది అద్దెకుపుచ్చుకున్నాను. అక్కడున్న కొద్దిరోజులు చాలహాయిగా గడిపాను. విశాలమైన గది వేళకు వేడి వేడి అన్నం. కావలసినప్పుడు బోయ్ కాఫీ టిఫిన్ తెచ్చిపెట్టేవాడు. కాగితాలు బల్ల

మీద వేసుకొని వ్రాసుకుంటూ కూర్చునే వాణ్ణి. ఏవో కల ల్లాగా, కళ్ళల్లో అలల్లాగా జ్ఞాపకం వస్తున్నాయి! అన్నంమాట అనుకునే సరికల్లా నా కావులింతలొచ్చాయి. అవును మరి. నా కలా అలవాటై పోయింది. తిండి విషయం జ్ఞాపకం రాగానే కడుపులో త్రిప్పుతోంది. గంటెడు గంజైనా ఇప్పుడు నా కడు పుకు సరిపడేట్లు లేదు. అన్న ద్వేషం పుట్టినవారు ఆట్టె కాలం బ్రతకడంటారు! ఏమిటో మరి. నాకు బొత్తిగాఅన్న హితవు తప్పి పోయింది. నా ప్రకృతి విచిత్రంగా, విడ్డూరంగా మారిపోయింది!

చీకటిపడ్డ తరవాత ఎక్కడో. కాస్త చోటు దొరక్క పోతుందా? ఇప్పుడప్పుడే తొందరేంలేదు. ఇంకా చాల టైముంది. అంతకూ కాకపోతే ఏ అడవిలాంటి ప్రదేశంలోనైనా తలదాచుకోగలను. మరేం భయంలేదు. నగరం నాలుగు పొలి మేరలు నా అధీనంలోనే ఉన్నాయి.

ప్రక్కనఉన్న సముద్రం నిద్రమత్తులో ఊగుతోంది. ఓడలు నీటిమీద నెమ్మదిగా దున్నుకుంటూ పోతున్నాయి. మధ్య మధ్య హార్బరులో బయలుదేరుతున్న స్టీమరుకూత విన పిస్తోంది. పొద్దు తల్లికడుపులోకిపోయింది. చల్లని సాయంత్రం. చలికూడా ప్రారంభమైంది. నేను కూర్చున్నచోటు తడిగా ఉంది. బాగాఅలిసిపోయిఉండడంవల్ల నాకు కునికిపాట్లు ప్రారంభ మైనాయి. అక్కడే తలవాల్చాను. కళ్లు మూతలుపడ్డాయి....

లేచేసరికి నా చుట్టూ బాగా చీకటయింది. మంచుపడ డంచేత నా బట్టలు చల్లగా ఉన్నాయి. పార్శిల్ తీసుకొని నడక ప్రారంభించాను. వేగంగా నడిస్తే కొంచెం చలి తగ్గు తుందని త్వరత్వరగా నడుస్తున్నాను. సెక్రెటేరియేట్ భవనం దగ్గరికి వచ్చాను. అక్కడ పోలీసు నిలుచునిఉన్నాడు. అవతలి

వైపు ముఖంపెట్టి నిలబడి ఉన్నాడు. అతనితో మాట్లాడాలని నాకెందుకో బుద్ధిపుట్టింది. నాలుగడుగులు ముందుకువేసి అతనికి చేరువగా వెళ్లాను. అతనిచేతిలో తుపాకిఉంది. భుజంమీద ఎత్తి పట్టుకొని సాల్యూట్ చేస్తున్నట్లుగా నిలుచునిఉన్నాడు. ఒక్క క్షణం నిలబడి అతన్ని తేరిపారచూచాను. నావళ్లు కంపించింది. అసలే పోలీసు. అందులో తుపాకిపట్టుకొని కావలా కాస్తు న్నాడు. తుపాకి కొన సూటిగా నాకు గురిపెట్టినట్లుగా ఉండ డంచేత నాకు విపరీతమైన భయంవేసింది. మాట్లాడలేక పోయాను. మెల్లగా వెనక్కు నడిచాను. అతను చూస్తాడేమో అని ముఖానికి చెయ్యి అడ్డంపెట్టుకొని త్వరత్వరగా అక్కణ్ణుంచి వెళ్లిపోయాను.

టవర్ క్లాక్ లో టైంచూస్తే తొమ్మిదిగంటలయింది. బాగా ప్రొద్దు పోయింది. నేను చాలసేపు నిద్రపోయానన్న మాట.

భవనాలు, బజార్లు, అంగళ్లు, అడ్డరోడ్లు అన్నీదాటి త్వరత్వరగా నడుస్తున్నాను. టిప్లికేన్ వెళ్ళేసరికి నా కో స్నేహి తుని మాట జ్ఞాపకం వచ్చింది. అవును. టిప్లికేన్‌లో నాకు తెలిసిన ఆర్టిస్టు ఒకతను ఉన్నాడు.

అతను బొమ్మలు గీస్తుంటాడు. అతనితో నాకు బాగా పరిచయముండింది. ఈ రాత్రి అతనితో ఉండిపోతే బాగుంటుందను కొన్నాను. తెల్లవారేవరకు అతని గదిలో గడపవచ్చు. ఒక్క రాత్రి పడుకోడానికి జాగా ఇవ్వకపోతాడా ?

స్నేహితుడి గదికివెళ్ళాను. తలుపుమూసి ఉంది. తలుపు మీద అతని పేరుంది. ... ఆర్టిస్టు అదే అతనిగది. నేనేం పొర

పాటు పడలేదు. ప్రొద్దు పోయిందికదూ! పడుకొని నిద్రపోతుంటాడు. తలుపు తట్టాను. అతను తలుపు ఓరవాకిలిగాతీసి తొంగి చూసాడు. ఓ! అతను తాగినట్లున్నాడు. ముఖంబయటికి పెట్టగానే గుప్పున వాసన కొట్టింది. బ్రాందీ వాసన.

'గుడ్ ఈవినింగ్' అన్నాను నేను.

'గుడ్ ఈవినింగ్'. ఓ! నీవా? ఈ వరటప్పుడొచ్చావేం? చీకట్లో చిత్రంబాగా కనపడదు చిత్రం పూర్తియి పోయింది. కొన్ని మార్పులు కూడా చేశాను. చెరువు, ప్రక్కనే చెట్లు, గడ్డివాములు; చాలాబాగా తయారైంది. కలర్‌లో ప్రింటు చేయాలి. గ్రాండ్‌గా ఉంటుంది. నీవుదాన్ని లైటు వెల్తుర్లో చూస్తే లాభంలేదు.

'రేపు వగలు చూద్దువుగాని.' అన్నాడతను.

అవును. అతను డోసేసుకొని ఉన్నాడు. అంచేత నేనెవర్ననుకున్నాడోఏమో! ఏదో తానుగీస్తున్నబొమ్మనుగురించి చెప్పాడు.

'పోనీ ఊరిక ఒకసారి చూస్తాను' అన్నాను నేను. ఆ పిక్చరు విషయం ఏమీ తెలియకపోయినా.

'ఊహు. ఎంతమాత్రం వీల్లేదు. ఇప్పుడు చూస్తే బావుండదు. పైగా ఉంకోవిషయం' అంటూ అతను ఇవతలికొచ్చాడు. నా భుజంమీద చెయ్యివేసి నాలుగడుగులు అవతలికి తీసికెళ్లాడు.

'ఏమిటంటే, లోపల ఒక అమ్మాయి ఉంది. ఫైన్‌గరల్. ఈ సాయంత్రమే సరదాగా తీసుకొచ్చి గదిలో పెట్టాను' అన్నాడతను రహస్యంగా.

నాకతని వ్యవహారం అర్థమైంది. అంతా అర్థమైంది.

అవును మరి. ఏం చేస్తాడు! ఆర్టిస్టు, అందులో కుర్రాడు. కాస్త మనశ్శాంతికోసం, చిక్కుల్ని మరిచిపోవడంకోసం – ఓ చుక్క వేసుకున్నాడు. పక్క చూసుకున్నాడు.

'ఓ! అలాగా! అయితేసరే – ఇప్పుడేం అక్కర్లేదులే. నే వెడతాను' అన్నాను నేను రెండడుగులు ముందుకువేసి.

'శాం, రా' అన్నాడతను గదితలుపు వేసుకుంటూ.

మళ్లీ రోడ్డున పడ్డాను. 'కనుక ఇక్కడకూడా పనికా లేదు. ఇక ఎక్కడికెళ్లాలి? ఊరిబయట శ్మశానంలాంటి ప్రదేశంలోతప్ప మరెక్కడా నాకు జాగా దొరికేటట్లు లేదు.'

హోటలుదగ్గర ఒక్కక్షణం నిలబడ్డాను. మూసివేయబోతున్నట్లుంది. సామాన్లన్నీ సర్దివేస్తున్నారు. మిగిలిపోయిన ఫలహారాలు అక్కడేపడేసి ఉన్నాయి. వాటిపక్క తెల్లని పెంపుడుపిల్లి కాబోలు పడుకొని ఉంది. అలాగేచూస్తూ కిటికీ దగ్గర కొంచెంసేపు నిలుచున్నాను. వంటగదిలో ఉండిపోయిన అన్నం, కూరలు పనివాళ్లు వళ్ళెల్లో పట్టుకపోతున్నారు. నా దగ్గరడబ్బుంటే దర్జాగా వెళ్లి భోంచెయ్యనూ? కళ్లతో చూచి కడుపునింపుకున్నాను.

నడవలేక నడుస్తున్నాను. నగరం వెలుపలికి చేరుకునే సరికి ఎంతోసేపు పట్టింది. అర్ధరాత్రి అయిఉంటుంది. ఎక్కడా జనసంచారంలేదు. ఎగుడుదిగుడు ప్రదేశాలు, ఇటుకలుకాల్చే బట్టీలు, ఇసుక దిబ్బలు, కయ్యలు గతుకులు ఉన్నప్రదేశం అది. ఆ విశాలమైన ప్రదేశంలో నిలబడి ఎక్కడ పడుకుందామా అని నాలుగువైపులా చూచాను. ఒక ఇసుకతిన్నె దాపులో కాస్త పొడిగాఉంది. పార్శిల్ విప్పతీశాను. దుప్పటితీసి విదిలించి క్రిందపరుచుకున్నాను. పడుకున్నానేకాని పక్క కుదరలేదు.

చాలసార్లు అటూ ఇటూ పొర్లాను. నాచెవి కొంచెం నొప్పిగా ఉంది. ఆ బండివాడి కొరడా రాచుకపోయి కొంచెం వాచిన ట్లుంది. అప్పుడేమీా అనిపించలేదుగాని ఇప్పుడు చెవి నొప్పి వేస్తోంది. అంచేత అటుప్రక్క ఒత్తిగిలి పడుకోలేకపోయాను. నాబూట్లు ఊడతీసి దుప్పటికట్టిన కాగితంలోచుట్టి తలక్రిందపెట్టు కున్నాను. నా చుట్టూ అంధకారం అలుముకొని ఉంది. నేనా నిర్జన ప్రదేశంలో శవంలా పడిఉన్నాను. నిశాదేవి తన నల్లటి ముసుగులోకి నన్ను తీసుకొని నిశ్శబ్దంగా ముద్దుపెట్టుకుంటోంది. అంతా నిశ్శబ్దం... చరాచర సృష్టియావత్తు చలనం ఆగిపో యింది. సమస్త ప్రాణికోటి తమస్సులో మునిగిపోయింది. కాని, అనంతమైన ఆకాశం, అగాధమైన సముద్రం శాశ్వత మైన శ్లోకాలు పఠిస్తున్నాయి. అనురాగ రాగాలు ఆలాపిస్తు న్నాయి. అఖండ సంగీతం వినిపిస్తున్నాయి. గాలి నాదంలేని నాగస్వరాన్ని ఊదుతోంది. చూపులకందని దూరంనుంచి ఝుం, ఝుం అను ధ్వనులు వినిపిస్తున్నాయి. నిత్యమైనవి సత్య మైనవి ఇవిమాత్రం నిశ్శబ్దాన్ని చీలుస్తున్నాయి. చల్లని మెల్లని ఈ సంగీతం చాలసేపు విన్నాను. అవును. ఆ సంగీతం ఒక స్వర మేళనం. ఘూర్ణిల్లుతున్న గోళాల స్వరసమ్మేళనం......... అది కోటి నక్షత్రాల నాట్యం; శతకోటి నక్షత్రాల జంత్ర వాద్యం.............................

"కాదు. అదిసృష్టి సంగీతంకాదు. పాడుపడ్డ గుళ్ళల్లో గుడ్లగూబల అరుపులు. నేను నరకంలో వడ్డాను" అంటూ వికృతంగా నవ్వాను. నా మనస్సు స్థిమితంగా లేదు. ఏదో చీకాకు కలవరం.

నేను మళ్ళీలేచి నిలబడ్డాను. నాకేమీా తోచడంలేదు.

అవయవాలు నా స్వాధీనంలో లేవు. అక్కడే ఆ చీకట్లో చాల సేపు అటూ ఇటూ తిరిగాను నామీద నాకే కోపం వచ్చింది. నన్ను చూచి నాకే భయంవేసింది. నా మీదనేను పోట్లాడాను. ఇలా తెల్లవారు ఝామునదాకా నన్ను నేను కొట్టుకుంటూ తిట్టుకుంటూ గడిపాను. అప్పటికి అలిసిపోయి పడుకొన్నాను. చివరకు గాఢంగా నిద్రపట్టింది.

నేను లేచేసరికి చాల పొద్దెక్కింది. మధ్యాహ్నం దాటివుంటుందనుకొన్నాను. ఇవాళకూడా మబ్బుపట్టి ఉండడం వల్ల సూర్యుడు అస్పష్టంగా కనిపిస్తున్నాడు. దుప్పటి మడతపెట్టి కాగితంలోచుట్టి పొట్లం కట్టాను. వేడిచేయడంవలనో ఏమో నా కళ్ల వెంట నీరుకారుతోంది. నా కాళ్లు తిమ్మిరెక్కాయి. బూట్లు తొడుక్కొని మళ్ళీ పట్నంలోకి బయలుదేరాను.

అప్పటికి మూడుగంటలైంది. నా ఆకలికావడం మొదలు పెట్టింది. కడుపులో విపరీతంగా మండుతోంది. చాల నీరసంగా, నిస్త్రాణంగా ఉన్నాను. నడవడానికికూడా ఓపికలేదు. అన్నం మాట జ్ఞాపకంవచ్చేసరికి డోకువస్తుందేమో అనుకున్నాను.

'అన్నపూర్ణ విలాస్' కు వెళ్లాను. అది మంచిహోటలు. చౌకగా భోజనంపెడతారు. హోటల్లో రేట్ల పట్టిక చదువుతూ నిలుచున్నాను. ఇడ్లీ, దోసె, గారె, కారంబూంది, ఉప్మా, ఉర్లగడ్డకూర పలహారాలన్నీ చౌక. రేట్ల వివరాలు చూస్తూ రెండునిముషాలసేపు నిలబడ్డాను. నోరు చప్పరిస్తూ చంకలెగ రేశాను. ఏరిని ఏగానిలేదు. ఏంచేయను? అక్కణ్ణుంచి రైల్వే స్టేషనుకు వెళ్లాను.

నేను పూర్తిగా అలిసి పోయాను. అన్నం తినాలనే ఆ కాంక్ష. కడుపులో ఆరాటం ఎక్కువైంది. కాళ్ళు కుప్పగా

కూలిపోతున్నాయి. తూలి పడబోయాను. ఎలాగైనా ఆకలి బాధను నిగ్రహించుకోవాలని ప్రయత్నించాను. ఊహు. ప్రయోజనం కల్గలేదు. నిముష నిముషానికి నా పరిస్థితి మారి పోతోంది, చివరకు ఆ స్టేషనులో ఒకమూల కూలబడ్డాను.

నా మనస్సు విచిత్రంగా మారి పోతోంది. హఠాత్తుగా నా అవయవాలన్నీ వణకడం మొదలు బెట్టాయి. ఏదో చెప్ప లేనిబాధ. పంచప్రాణాలు పైకిలేచి పోతోంటే, సమస్త అవయ వాలు తమ తమ స్థానాలు తప్పిపోతోంటే, ఎట్లా ఉంటుందో, అట్లా ఉంది ఆ బాధ.

నేను స్పృహతోటే ఉన్నాను. స్టేషన్‌లో జనంగోల నా చెవిని పడుతూనే ఉంది. నాకు పరిచయస్థుడొకతను నాముందు నుంచీ వెడుతున్నాడు. లేచి నిలబడి 'గుడ్ మార్నింగ్' అన్నాను. అతనూ 'గుడ్‌మార్నింగ్' అంటూవెళ్లి పోయాడు. మరణబాధ అనుభవిస్తున్నా నాకు మనుష్యజ్ఞానం ఉంది. ఏమిటో ఈ వింతప్రకృతి అర్థంకాదు.

ఊరిబయట ఉడికిపోయిన శ్మశానాలవంటి ప్రదేశాల్లో పడుకుంటూ ఉండడంవల్ల నా ప్రకృతి ఇలా మారిపోయిందా? లేక రోజులతరబడి అన్నంలేకుండా రోడ్లవెంట తిరుగుతూ ఉండ డంవల్ల ఈ విధంగా అయిపోయానా? న్యాయం ఆలోచిస్తే నే నీ రకంగా జీవించడంలో చీమంతైనా అర్థంలేదు. అసలు నే నెందుకు బ్రతికుండాలి? భగవంతుడుపెడుతున్న ఈ బాధలు— కాదు వీటిని నేనే సృష్టించుకున్నానేమో? లోకంలో నేనొ కణ్ణే ఈ హీనస్థితికీ, విచిత్ర హింసకూ తగినవాణ్ణిలాగుంది. నేనే దేవుణ్ణి వరమడిగి దీన్ని తీసుకున్నానా? పుట్టుకతోటే పుట్టెడు దుఃఖాన్ని వెంటమోసుకొని తెచ్చుకున్నానా? నాకై

నేనే ఈ కష్టాల్ని నా చుట్టూ కట్టుకున్నానా? ఏమో! ఏదీ తెలుసుకోలేకుండా ఉన్నాను.

హఠాత్తుగా నాకో ఆలోచన తట్టింది. 'అమాంతంగా దుర్మార్గంలోకి దిగితే ఏం? ఈ దుప్పటి పట్టుకెళ్ళి తాకట్టుపెడితే రెండురూపాయలైనా వస్తాయి. రెండురోజులు కమ్మగాభోజనం చెయ్యవచ్చు. అయితే ఈ దుప్పటి నాదికాదు. హనుమంత రావుది. అతన్ని మోసంచేసినవాణ్ణి అవుతాను. అతను నాకు స్నేహితుడు, అయితే ఏం? ఆ మాటకొస్తే నన్నెంతమంది మోసంచేశారు? స్నేహితులు, బంధువులు, ఒకరేమిటి జగత్తే నన్ను మోసంచేసింది.

తాకట్టువ్యాపారి షాపుదగ్గరికి వెళ్లేసరికి నా గుండెల్లో దడ ప్రారంభమైంది. మేడమీదికి వెళ్లలేదు. షాపుకు ఎదురుగా వీధిలోనే నిలబడ్డాను. లోపలికి వెడదామా? వద్దా? మదనపడుతున్నాను. లోపల అనుమానం, భయం, బాధ, పిరికితనం—అవును. ఇంకా నాలో చైతన్యం నశించలేదు. ప్రపంచమనే బురదనీటి సముద్రంలో నా జీవితనౌక కొట్టుకపోతోంది. తుఫానుల్లో, సుడిగుండాల్లో చిక్కుకొని తుత్తునియలు కాబోతోంది. అయినా ఇంకా ఆ ఓడలో మంచి, మర్యాద, నీతి, న్యాయం, పరువు ప్రతిష్ట అనే దీపాలు ఆరిపోకుండా వెలుగుతూనే ఉన్నాయి.

పట్టెడు మెతుకుల కోసం పరాయివాణ్ణి వంచించడం నీచంకాదూ? ఇతర్ల సొమ్ము అపహరించి తన పొట్టనింపుకోవడం కంటే పాపం ఏముంటుంది? ఊహు. వీల్లేదు. నా అంతరాత్మ అంగీకరించడంలేదు. అలాంటి పని నా జీవితంలో ఎప్పుడూ చెయ్యలేదు. ఈ తుచ్ఛమైన పనిచేస్తే మర్యాదకు ఒకమచ్చ

ఏర్పడుతుంది. నా మనస్సులో ఒక మానవిపుండు బయలు దేరు తుంది. ఇలా చేయడంవల్ల నన్ను నేనే మోసంచేసుకున్న వాణ్ణి అవుతాను. వీల్లేదు. ఎంతమాత్రం వీల్లేదు. నా మనస్సం గీకరించనిపని నే నెన్నడూ చేయను. చేయలేను. నా దగ్గర డబ్బున్నప్పుడు హనుమంతరావుకు చాలసార్లు అడక్కుండానే ఇచ్చాను. అతని దుప్పటి వాడుకున్నందుకు ఒక అయిదురూపా యలైనా ముట్టచెప్పాలి. దుప్పటి అతనికి తిరిగి ఇచ్చేయాలి. అసలు పరాయివాడి వస్తువు స్వంతంలాగా చేతులో పట్టుకొని తిరగటమే నాకు సిగ్గుగా ఉంది. తల కొట్టేసినట్లుంది. దానికి తోడు ఇలాంటి నీచానికి పాల్పడతానా ?

తప్పకుండా మంచిరోజులొస్తాయి. టైం బాగుంటే ఏదో ఓదారి కన్పించకపోదు. ఏదోరకంగా సహాయం లభించక పోదు. నేను పనికోసం దరఖాస్తుపెట్టిన బట్టలకొట్టు దాపులోనే ఉంది. అప్లికేషన్ పెట్టేతర్వాత అతని దగ్గరికి నేను వెళ్లలే దుగా ? నాదరఖాస్తు ఏమైందని గంటగంటకు అతన్ని నేను తొందర పెట్టానా ? గొంతుమీద కూర్చున్నట్లు తొందర పడ్డానా ? అట్లా అని ఆలస్యంచేసానా ? అప్లికేషన్ పోస్టులో పంపకుండా స్వయంగా వెళ్లిమాట్లాడితే ఏ సంగతీ తేలిపోయేదే!

ఈసారైనా నా కార్యం గట్టెక్కవచ్చు. నా అదృష్టం కలిసిరావచ్చు. అదృష్టం ఒక్కొక్కప్పుడు అనుకోకుండా, ఆల స్యంగా, అడ్డదారిన వస్తూంటుంది.

అంతా అయిపోయి అంతిమక్షణాల్లోఉన్నా, నాలో ఏదో ఆశ పీడిస్తూనే ఉంటుంది. ఆ ఆశతోటే కాళ్ళీడ్చుకుంటూ బట్టలకొట్టుదగ్గరకు బయలుదేరాను.

యజమానితో ఎలా మాట్లాడితే బాగుంటుంది? ఏమని

చెప్పను? బహుశా అతను మంచివాడై ఉండొచ్చు. అతని మనస్సు పొర్లిందీఅంటే నే నడక్కుండానే ఒక రూపాయి అడ్వాన్సు యిచ్చి నన్ను పనిలో చేరమంటాడు. వర్తకుల్లో చాలామంది తమ తప్పుడు వ్యవహారాలు సర్దుబాటుచేసుకో వడంకోసం తరచు ఇలా చేస్తుంటారు.

షాపు దగ్గరికి వెళ్లాను. నా పొజిజరు దుమ్ముకొట్టుకొని మరీ అసహ్యంగా ఉంది. అక్కడక్కడ ఉమ్మితో తడిచేసి దులుపుకున్నాను. అలా చేయడంవల్ల కొంచెం శుభ్రంగా కన బడుతుందని ఆశ. కొట్లో అడుగుపెట్టాను. మొదట్లోనే ఉన్న ఒక బట్టలబీరువా చాటున నా చేతిలో ఉన్న పార్శిల్ దాచి పెట్టాను. పెద్దమనుషుల దగ్గరికి వెళుతున్నాను. - అందులో ఉద్యోగంకోసం. కొంచెం మర్యాదగా ఉంటుందని అలా చేసాను. నేను లోపలికి వెళ్లేసరికి ఒక ఆయన కాగితాలతో సంచులు తయారుచేస్తున్నాడు.

'కన్నయ్యచెట్టిగారున్నారా?' అన్నాను నేను అతన్ని చూచి.

'నేనే కన్నయ్యచెట్టిని.' తేరిపారచూస్తూ సమాధానం చెప్పాడతను.

'ఓ! అలాగా! నేను పలానా మనిషిని. (పేరుచెప్పాను.) ఉద్యోగంకోసం దరఖాస్తుపెట్టాను. ఏమైందో తెలుసుకుందామని'

నా పేరు రెండునార్లు ఉచ్చరిస్తూ అతను పెద్దగా నవ్వడం మొదలుపెట్టాడు.

'ఇదిగో చూడు.' అంటూ అతను తన జేబులో ఉన్న నా అప్లికేషన్ బయటికి తీసాడు. 'ఏమయ్యా, నీకు తారీకులు

వెయ్యడంకూడా చేతకానట్లుందే! దరఖాస్తులో 1848 అని వేశావు. నా మాట అబద్ధమేమో చూడు.' అంటూ అతను మళ్ళీ పెద్దగా నవ్వాడు.

'అవును సార్. అదేదో పొరపాటైంది.' అన్నాను నేను తడబడే గొంతుకతో. నా మనస్సు బెదరిపోయింది. వళ్ళంతా చెమటపట్టింది. తారీకు అలా ఎందుకు వేశానో తెలియకపోయినా చేసిన తప్పు ఒప్పుకున్నాను.

'చూడు. నాకు క్షుణ్ణంగా లెక్క-తెలిసిన మనిషి కావాలి. ఇలా అంకెలు తప్పువేస్తే నా అక్కౌంట్లు ఏం రాసి పెడతావ్?—నీ దస్తూరి ముత్యాల్లాగా ఉంది. అంకెలుకూడా ముచ్చటగానే ఉన్నాయి. కాని—' ఆ తరువాత అతనేమీ చెప్పకుండా తిరిగీ కాగితపు సంచులు కట్టుకోవడం ప్రారంభించాడు. నే నొక్కక్షణం ఆగి ఇలా అన్నాను.

'అవును క్షమించండి. ఏదో పొరపాటు జరిగింది. ఇక ముందలా ఎప్పుడూ జరగదు. ఏదో చిన్నతప్పు చేశాను. దాని వల్ల అక్కౌంట్లు వ్రాయడానికి పనికిరానంటే ఎట్లా చెప్పండి.'

'లేదు. నేనలా అనడంలేదు. అడ్వర్టైజ్‌మెంటు ఇచ్చాను. నా కత్యవసరమైన నీ దరఖాస్తు రాకముందే మరొక మనిషిని కుదుర్చుకున్నాను. అంతే.' అన్నాడతను నింపాదిగా.

'కనుక ఇప్పుడు ఉద్యోగం ఖాళీలేదంటారు. అంతేనా!'

'అవును.'

'హాఁ. సరే. అయితే ఇక నేను చెప్పేదేమీ లేదులెండి' అంటూ నిట్టూర్పు విడిచాను.

'మరేమీ అనుకోకండి. మళ్ళీ ఏదైనా —'

'సెలవు — నమస్కారం' అన్నాను నేను.

నాకు చెప్పలేనంత కోపం వచ్చింది. ఏదో వెర్రిఆవేశం నన్నావరించింది. పళ్లు కొరుకుతూ నా పార్సిల్ తీసుకున్నాను. ఫుట్‌పాత్ మీద నడుస్తున్న జనాన్ని తోసుకుంటూపోతున్నాను. నాలో ఏదో పశుబలం ప్రవేశించింది. వచ్చే పోయే జనాన్ని గమనించడంలేదు. నా ఇష్టంవచ్చినట్లు వాళ్ళమీద పడుతూ నడుస్తున్నాను. ఈ నా పిచ్చిప్రవర్తనచూచి ఒకతను నన్నాపు చేశాడు. నేను అతనివైపుతిర్గి 'ఏవో అర్థంలేనిమాటలతో వెర్రి కేకలేసాను. కోపాన్ని ఆపుకోలేకపోయాను. పిడికిలి బిగించి అతని మూతిమీద గట్టిగా అదిమిపట్టి తోసేశాను.

వెంటనే అతను పోలీసువాణ్ణి కేకవేశాడు. అప్పుడు నేను రెండడుగులు వెనక్కు వేసి చేతులుదించుకొని మామూలు మనిషిలా నిలబడ్డాను. పోలీసు రాలేదు. అతనొక్కక్షణం నా వైపు చూస్తూ నిలబడి ఆ తరువాత తనదోవన తాను వెళ్ళి పోయాడు.

ఏమిటి నే చేస్తున్న పిచ్చిచేష్టలు? తమ ప్రయత్నాలు విఫలమైన ప్రతివాడు ఇలా చేస్తూ ఉంటాడా? నేను తారీకు అలా ఎందుకు వేశాను? 1848. పాడు సంవత్సరం. ఆ పిశాచి సంవత్సరానికీ నాకూ సంబంధం ఏమిటి? నే నీ విధంగా వస్తు లతో ఎంతకాలం గడపాలి? నా కడుపులో ప్రేగులు పురుగు ల్లాగా అటూఇటూ తిరుగుతూ అరుస్తున్నాయి. నాజాతకంలో ఒక్క మంచిరోజైనా వస్తుందని తోచడంలేదు.

నేను రోజుకు రోజు శారీరకంగా, మానసికంగా కృంగి పోతున్నాను. రానురాను. నా మంచితనం, మర్యాద అడుగంటి పోతున్నాయి. అనేక దుర్బుద్ధులు పుడుతున్నాయి. అద్దె ఇవ్వ కుండా, అప్పులు తీర్చకుండా అనేకమందిని పీడిస్తున్నాను. ఇతర్ల

వస్తువులు అరువు తెచ్చుకొని వాడుకోనడమే కాకుండా, వాటిని అమ్మివేయడానికి కూడా సిద్ధపడుతున్నాను. సిగ్గు, బిడియం, అభిమానం, ఆత్మగౌరవం అన్నీ పోతున్నాయి. కనికరం కూడా నశించి నామనస్సు కఠిన శిలగా మారిపోతోంది. నేను పతనమై పోతున్నాను.

నా అంతఃకరణలో మాలిన్యం ప్రోగవుతోంది. చెడు తలంపులు జాస్తి అవుతున్నాయి. పైన భగవంతుడు ప్రతిక్షణం నన్ను కనిపెడుతూ ఉన్నాడు. కళాస్వరూపుడైన ఈశ్వరుడు తనసృష్టి సూత్రాలప్రకారం క్రమబద్ధంగా నేను నాశనం అవుతున్నానో లేదో అనిచాల జాగ్రత్తగా ఒకకంట నిఘాఉంచి చూస్తున్నాడు. నా వినాశనానికి మధ్యలో విఘ్నం రాకుండా వేయివిధాల ప్రయత్నిస్తున్నాడు.

ఇలా జరుగుతూఉన్నప్పటికీ నరకంలో యమకింకరులకు నాపై కోపంగా ఉంది. వాళ్లు కోరలు తెరచుకొని భయంకరంగా నావైపు చూస్తున్నారు. నన్ను పట్టి చీల్చి భక్షించాలని గుటకలు మింగుతున్నారు. అసలు ఆ యమకింకరులకు నామీద ఇంత క్రోధం ఎందుకో తెలుసా? నేను త్వరగా నాశనం కాలేదని. నేనొక నాలుగుగంటల్లో నాశనమైపోయినట్లయితే వాళ్లకు సంతోషంగా ఉండేది! అలా కాకుండా నేను పూర్తిగా నశించిపోవడానికి ఏళ్ళతరబడి పడుతోంది. పాపం వాళ్లు ఎంత కాలమని నా కోసం కనిపెట్టుకొని ఉంటారు? అందుచేతనే వాళ్ళకు నా మీద పట్టరాని కోపం, ద్వేషం. మరి దానికి నే నేం చెయ్యను. చావుమాత్రం అంత సులభంగా వస్తుందా? చచ్చేంత తప్పు చెయ్యాలి. ఘోరమైన పాపం, క్షమించరాని పాపం చెయ్యాలి. అట్లాంటి మహాపాపంచేసిన మరుక్షణంలోనే భగ

వంతుడు తన న్యాయంప్రకారం నన్నీలోకంలోంచి వెళ్లగొడ తాడు. నేను పాతాళంలో పడిపోతాను ... ... ...

నేను కాలు వడిచేసి త్వరత్వరగా పోతున్నాను. అలా వెడుతూ వెడుతూ అనుకోకుండా హఠాత్తుగా ఎడమవైపు తిరి గాను. వీధిలో మొదటి ఇల్లు నన్నాకర్షించింది. అందమైన మేడ. వాకిలిముందు పందిరివేశారు. రంగురంగుల లైట్లు వెలుగుతున్నాయి. రకరకాల అలంకారాలు చేశారు. నాకేదో ఆవేశం, ఆగ్రహం కలిగాయి. నే నెక్కడా ఆగలేదు. ఒక్క క్షణంకూడా ఆలోచించలేదు. ఆ దేవిడీముందు పరచిన తివాచీలు, ద్వారానికి చేసిన శృంగారాలు నా మన స్సులో మెరుపుల్లా మెరిశాయి. మాట్లాడకుండా గబ గబ మెట్లెక్కి పైకెళ్లిపోయాను. సరీగ్గా రెండో అంతస్తులోకివెళ్లి ఆగాను. అక్కడి తలుపు లోపలగడియవేసిఉంది. గోడకుఉన్న 'కాలింగ్ బెల్' గట్టిగా నొక్కాను. అలా నేనా ఇంట్లోవాళ్ళను ఎందుకు పిలిచానో అర్థంకాదు.

వెంటనే ఒక అందమైన యువతి తలుపు తీసింది. తెల్ల చీర కట్టుకొని ఉంది. ఆమె ఒక నిమిషం నావైపు ఆశ్చర్యంగా చూచింది. ఆ తరవాత తల ఊపుతూ ఇలా అంది.

'అంతా అయిపోయింది. ఏమీ మిగల్లేదు' అలా అంటూనే ఆమె తలుపువేసుకోబోయింది.

నేనొక పశువులాగా రొప్పుకుంటూ పైకి వెళ్ళాను. ఇలా ప్రవర్తించడానికి నన్నెవరు ప్రేరేపించారు? పైగా ఆమె నేనొక బిచ్చగాణ్ణని అనుకుంది. అందుకనే మరేమీ గడబిడ చేయకుండా వెళ్ళి పొమ్మన్నది.

తక్షణమే నాకు తెలివొచ్చింది. చేసినపని తప్పని తెలుసు

కున్నాను. వెంటనే తలవొంచి వినయంగా ఆమెతో ఇలా అన్నాను.

'క్షమించండమ్మా. గంట గట్టిగా మ్రోగించాను. అది నాకు తెలియదు. కొత్త. మరేమీ అనుకోకండి— ఒక ఆఫీసరు గారు. ఆయనకిద్దరు బిడ్డలు. వాళ్ళను రోజూ బడికి తీసుక వెళ్ళడానికి ఒక బంట్రోతు కావాలన్నారు. వారుండే ఇల్లు ఇదే నాండీ?'

నేనబద్ధమాడాను. నే చెప్పిన కల్పనా కథ ఆమె కర్థం కాలేదు. ఇదేమిటా అని ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రావడం కోసం ఆమె కొంచెంసేపు అలాగే నిలుచుంది. చివరకామె ఇలాఅంది.

'లేదు. ఇక్కడెవరూ ఆఫీసరు లేరు '

'లేరూ?ఆయన కిద్దరు పిల్లలున్నారు. రోజూ రెండుగంటలపని. అర్థరూపాయి ఇస్తానన్నారు.' అన్నాను నేను.

'లేదు. ఇక్కడెవరికీ పిల్లల్లేరు' అన్నదామె తిరిగీ.

'ఓ! అలాగా! అయితే పొరపాటుపడ్డాను. క్షమించండి. బహుశా క్రిందిభాగంలో ఉన్నారేమో? నాకు తెలిసిన మనిషి ఒకతనున్నాడు. అతన్ని ఆ పనిలో కుదుర్చుదామని వచ్చాను. నాపేరు... మరి వస్తాను. శెలవు.

ఆమె చిరునవ్వు నవ్వింది. ఆమె బుగ్గలు కెంపుల్లాగా ఎర్రబారాయి. నేను మెట్లుదిగి క్రిందికివెళ్లిపోయేంతవరకూ నన్ను తేరిపారచూస్తూ ఆమె అక్కడనే నిలుచొని ఉంది.

నాకు మళ్ళీ మామూలు జ్ఞానంవచ్చింది. మనస్సు నిర్మలంగా ఉంది. జరిగిన విషయం తలుచుకుంటూ నడుస్తున్నాను. 'ఇవాళ ఏమీ మిగల్లేదు పో'అని ఆమె అన్నమాటలు

నా గుండెల్లో ఈటెల్లాగా పొడుస్తున్నాయి. ఆ మాటలనుకుంటే నా తలమీద రాళ్ళవాన కురుస్తున్నట్లుంది. చివరకు నా బ్రతుకు కెందాకా పోయిందీ! ఇకనన్నువరైనా 'అడుగో బిచ్చగాడు పోతున్నాడు పిలవండి' అనవచ్చు. నన్ను దొడ్డివాకిట్లో నిలబెట్టి వాళ్లు తిన్న విస్తళ్లు నా ముఖాన పారెయ్యవచ్చు.

మొదలియార్ వీధిలో హోటల్ ముందు నిలబడ్డాను. పలహారాలు, అప్పుడే తయారైన భోజనపదార్థాలు మంచి సువాసనకొడుతున్నాయి. కొంచెంసేపు నిలుచున్నాను. హోటల్లోకి వెళ్లబోయాను. నాలుగడుగులు వేసింతర్వాత నాకు మతి తెలిసింది. వట్టిచేతుల్తోవెళ్ళి ఏంచెయ్యాలి? వెంటనే వెనక్కు మళ్లి రోడ్డుమీదికొచ్చేశాను.

మార్కెట్టుప్రాంతంలో చాలసేపు తిరిగాను. కూర్చుందామన్నా ఎక్కడ జాగాదొరకలేదు. ఎక్కడచూచినా జనం. ఎటువెళదామన్నా వీలుచిక్కలేదు. చివరకు మార్కెట్టుకు ఎదురుగాఉన్న సత్రంముందు కాస్త సర్దుకొని కూలబడ్డాను. కూర్చున్నానేకాని కునికిపాట్లు వస్తున్నాయి. ఎట్లా పడుకోను? ఎక్కడ పడుకోను? అక్కణ్ణుంచిలేచి మళ్ళీ తిరగడం మొదలు పెట్టాను. బజారు పంపులో కాసిని నీళ్లు త్రాగాను. కాళ్ళీడ్చుకుంటూ ప్రతి గడపముందు ప్రతి అంగడి దగ్గర నిలబడుతూ పోతున్నాను. వచ్చే పోయే ప్రతి మనిషిని, అటూ ఇటూ తిరుగుతూన్న ప్రతి బండిని పరీక్షగా చూస్తున్నాను. ఉండీఉండీ నా తలంతా పగులగొట్టుకపోతున్నట్లనిపించింది. తల్లో ఏదో దహించుకపోతున్నట్లుగాఉంది. నా కణతలు కటకటలాడుతూ కొట్టుకుంటున్నాయి. నేను త్రాగిన నీళ్లు ఇమడవేమోనని భయంవేసింది. డోకు వస్తున్నట్లనిపించింది. అలా నడుస్తూ

మధ్యలో ఒకటి రెండుసార్లు కక్కున్నాను. నడిబజార్లో ఇలా డోక్కుంటూ ఉంటే ఎవరైనా చూస్తారేమో అని భయం వేసింది. బలవంతంగా డోకును ఆపుకుంటూ మధ్య మధ్య ఆగుతూ నడుస్తున్నాను.

చర్చి దగ్గర జనమెవ్వరూలేరు. అక్కడ కూర్చున్నాను. నా తల రెండుచేతుల్తో పట్టుకొని మోకాళ్ళమీద వంచుకొని కూర్చున్నాను. అలాకూర్చున్నప్పుడు నా గుండెల్లోమంట కొంచెం తగ్గినట్లనిపించింది. నాకు కొంచెం దాపులో చెప్పులు కుట్టే అతను కూర్చుని ఉన్నాడు. కొంచెం వయస్సుమళ్ళిన మనిషి. అతన్ని నేనెప్పుడో చూచినట్లుంది. "బహుశా అతను నన్నెరుగు నేమో? అతన్ని పలకరించి నా స్థితంతా చెపితే? యమయాతనలు అనుభవిస్తున్నానని, బ్రతకడమే కష్టంగాఉం దనీ, అతనితో చెపితే నాకు కాస్త మనశ్శాంతి కలుగుతుం దేమో? ఛీ. సిగ్గులేకుండా అతన్నేమని పలకరించను? అత నెవరో నేనెవరో? అసలు నన్నతను ఎరుగునో లేదో!"

హఠాత్తుగా నా దగ్గరున్న 'బ్లేడు' మాట జ్ఞాపకం వచ్చింది. చొక్కా జేబులో చెయ్యిపెట్టి వెతికాను. కనిపించ లేదు. గుండెలు కొట్టుకున్నాయి. నింపాదిగా కోటుజేబులో చూచాను. బ్లేడు; బ్లేడుతోపాటు కొన్ని పోస్టుస్టాంపులు చేతిలో కొచ్చాయి. వాటివైపు పరీక్షగా చూచాను. అవును. నా బ్లేడు ఉంది. మరికొన్ని తపాలాబిళ్ళలుకూడా దొరికాయి. ఎక్కడవీ స్టాంపులు? లెక్కపెట్టాను. నాలుగు బిళ్ళలు. అన్నీ మూడుకాన్ల బిళ్ళలే. మొత్తం మూడణాల ఖరీదు. బుక్ పోస్టులో రచనలు పంపడంకోసం ఎప్పుడో కొనిఉంటాను. కోటుజేబులో పడేశాను. ఆ స్టాంపుల్ని అన్నివైపులకూ

తిప్పుతూ. అనేకసార్లు లెక్కపెట్టుకొన్నాను! మూడణాల స్టాంపులు, అణా బ్లేడు. మొత్తం నాలుగణాలు. పావలాఖరీదు చేసే నా వస్తువుల్ని ఒక పెద్ద ఆస్తిలాగా చూచుకొన్నాను. వీటి నెవరికైనా ఇస్తే డబ్బివ్వరూ? నాకు తెలిసినతను బ్యాంకులో పనిచేస్తున్నాడు. 'అతనికిస్తే తప్పకుండా పావలా వస్తుంది. బేడా టిఫిను, బేడా కాఫీ. అతను బ్యాంకునుంచి ఆరుగంటల కొస్తాడు. అతని భోజనం 'రామవిలాస్' హోటల్లో. రాత్రికి అతన్ని అక్కడ కల్సుకుంటాను.'

ఇలా ఆలోచించుకుంటూ చాలసేపు కూర్చున్నాను. చర్చి ప్రక్కనఉన్న చెట్లనుంచి బలంగా గాలి వస్తోంది. ప్రొద్దు కూకుతోంది.

కోటుగుండీలు సవరించుకొని పెట్టుకొన్నాను. నా బూట్లు ఒకసారి విప్పతీసి మళ్ళీతొడుక్కున్నాను. 'రామవిలాస్' హోటల్‌వైపు నడవడం మొదలుపెట్టాను. నేను తిన్నగా రామవిలాస్ హోటల్ చేరుకునేసరికి ఏడుగంటలు దాటింది. హోటల్ బయట నిలబడి వచ్చే పోయే మనుషుల్ని చూస్తున్నాను. చాలసేపు అలా గడిపాను. ఎనిమిదిగంటలైంది. బ్యాంకు గుమాస్తా కనిపించాడు. గొంతెత్తి పెద్దగా పిలిచాను. అతను దగ్గరికి రాగానే చేతులోఉన్న పోస్టుస్టాంపులు, షేవింగ్ బ్లేడు అతనికిచ్చాను.

'చాల బాధల్లో ఉన్నాను బ్రదర్. కాస్త సహాయం చేద్దూ? నా దగ్గరున్న యావదాస్తి ఇదే. ఇవి నీవు తీసుకొని ఓ అర్ధరూపాయి ఉంటే ఇవ్వు. నీకు కావాలంటే, తిరిగి రెండు మూడు రోజుల్లో ఇచ్చేస్తాను.' అన్నాను నేను.

'I am sorry Brother, నా దగ్గర చిల్లిగవ్వ లేదు. జీతం రాలేదు. అన్నిచోట్ల బాకీలుచేశాను. నా మాట అబద్ధమేమో చూడు' అంటూ అతను జేబులోంచి పర్సుతీసి నా కిచ్చాడు.

పర్సులో ఏముంది? అతని గది తాళంచెవి, ఒక భోజనం టికెట్టు. నిజమే. అతనీ చిన్న విషయానికి అబద్ధమాడాడని అనుకోను. 'సరే. పోనీలే ఏంచేస్తాం? ఇబ్బందిగా ఉంది. ఒక పావలా అయినా సర్దుతావేమో అని అడిగాను' అంటూ నేను వెనక్కు తిరిగి 'వెళ్ళిపోబొయ్యాను. అతను నన్ను పిలిచాడు. 'ఇదిగో. ఇవి నా కెందుకు? తీసుకెళ్లు' అంటూ స్టాంపులు, బ్లేడు నాకివ్వబోయాడు. 'అక్కర్లేదులే. నీ దగ్గరే ఉంచుకో. అవి నేనేం చేసుకుంటాను? ప్రస్తుతం నా యావదాస్థి అదే. అదెవరి దగ్గరున్నా ఫరవాలేదు' అంటూ నేనక్కణ్ణుంచి వెళ్ళిపోయాను.

నా కళ్ళవెంట నీళ్లు కారుతున్నాయి. వెక్కివెక్కి ఏడుస్తున్నాను. దుఃఖాన్ని ఆపుకోలేక పోతున్నాను. జేబుగుడ్డతీసి నోట్లో తురుముకున్నాను. నాలో నేను ఏడుస్తూ ఆ బజారులోనే అటూఇటూ రెండుమూడుసార్లు తిరిగాను. నా మీద నాకే జాలివేసింది. నన్ను చూచుకొని నాకే ఆశ్చర్యంవేసింది. 'పరమేశ్వరుడా! నేనొక దౌర్భాగ్యుణ్ణి; ప్రభూ! నన్నెందుకు పుట్టించావు? ప్రభూ? నన్నెందుకు పుట్టించావు?' అని పెద్దగా అరిచాను.

కాలం నడవడంలేదు. ఎంతో కష్టంమీద ఒక గంట గడిపాను. మార్కెట్టుప్రాంతంలోకి వచ్చాను. మెట్లమీద, గట్లమీద కూర్చుని చాలసేపు ప్రొద్దుపుచ్చాను.

'నాకిక తిరగటానికి శక్తిలేదు. ఎక్కడో పడుకోవాలి.

ప్రొద్దుపోతోంది. చలికూడా ఎక్కువౌతోంది' లేచి మళ్ళీ చర్చివైపు వెళ్ళాను. అక్కడ నిశ్శబ్దంగానే ఉంది. చర్చిముందు రోడ్డుమీద ఒక ప్రక్కగా పడుకున్నాను. నా ప్రాణాలు ఎక్కడో ఉన్నాయి. కళ్ళు తెరిచి ఉంచలేకపోయాను. క్రమ క్రమంగా వీధుల్లో అలజడి తగ్గుతోంది. అంగళ్లుమూసివేశారు. అందరూ ఎవరి ప్రదేశాలకు వాళ్ళు వెళ్ళిపోతున్నారు. నాకు కునుకుపట్టింది.

నన్నెవరో తట్టిలేపారు. కళ్లుతెరిచి చూచాను. అతను పోలీసు. నాకు భయంవేసింది. నోటివెంట మాటరాలేదు.

'నీ వెక్కడుంటున్నావ్?' అని అడిగాడతను.

ఒక్క క్షణం ఏం చెప్పాలో అని తడబడ్డాను. చివరకు నేనుండేగది చెప్పాను. అతనొక్క నిముషంసేపు అలాగే నా వైపు చూచాడు.

'నే నేమన్నా తప్పుజేశానా?' నేనే అడిగాను.

'అవును. నీవిక్కడపడుకోకూడదు. రోడ్డుమీద పడుకో డానికి రూల్సు ఒప్పుకోదు. అయినా ఏమంత కష్టం? గది ఉందని చెప్పావుగా! వెళ్ళిపో. ఇప్పటికే చాలప్రొద్దుపోయింది. చలిగాకూడ ఉంది' అన్నాడతను.

నేను లేచి బట్టలుదులుపుకొని అక్కణ్ణుంచి బయలు దేరాను. నాగది చేరుకునేసరికి ఎంత టైం పట్టిందో చెప్పలేను.

నేను గదికి చేరుకున్నా. మామూలుగా వీధివాకిలి దగ్గ రిగా వేసిఉంది. నెమ్మదిగా లోపలికి ప్రవేశించాను. నాగుమణి ఇంట్లో అందరూ నిద్రపోతున్నట్లుంది. లోపల గడియారం మాత్రం టిక్, టిక్ మని ధ్వనిచేస్తోంది. నా బూట్లువిప్పి చేతిలో పట్టుకున్నాను. శబ్దం చేయకుండా నెమ్మదిగా మేడ ఎక్కాను.

నాగది యథావిధిగా ఉంది. బల్లమీద తెల్లని కాగితం కనపడింది. నేను నాగుమణికి వ్రాసిన చీటి అలాగేపడి ఉన్న ట్లుంది. ఆమెవచ్చి చూచుకోలేదు కాబోలు. అయినా నాకు అనుమానం వేసింది.

వణుకుతున్న చేతుల్తో ఆ కాగితం తీసుకున్నాను. నాకా శ్చర్యం కల్గింది. అది కాగితం కాదు. కవరు పోస్టుకవరు. కిటికీ దగ్గరకు వచ్చి గుడ్డివెల్తుర్లో ఆ ఉత్తరాన్ని పరీక్షగా చూచాను. దానిమీదనాపేరు వ్రాసుంది. నాపేరే. పొరపాటేమీలేదు. స్పష్టంగా రాసి ఉంది.

నాకు ఉత్తరం ఎవరు వ్రాస్తారు. నాగుమణే వ్రాయించి ఉంటుంది. అద్దె ఇవ్వకుండా గదిలో ప్రవేశిస్తే జరపవలసిన చర్య జరిపి తీరుతానని సమధానం వ్రాసి ఉంటుంది. భగవంతుడా! ఏంచేయను ?

నెమ్మదిగా మేడదిగాను. ఒకచేత్తోబూట్లు, మరొక చేతులో ఉత్తరం, చంకలో పార్శిల్ అలాగే ఉంది. పళ్ళు బిగబట్టి బలవంతాన కాళ్ళు ఎత్తివేస్తూ మేడదిగాను. క్రిందికి వచ్చి బూట్లు తొడుక్కున్నాను. తలుపు తీసుకొని వీధిలోకి వెళ్ళి పోయాను.

వీధిలో లాంతరు స్థంభాని కానుకొని కూలబడ్డాను. పార్శిల్ వెనుక ఆనుడుగా పెట్టుకున్నాను. కవరుచించి చదివాను. నాకాశ్చర్యంవేసింది. నా కళ్ళను నేను నమ్మలేకపోయాను. ఆ జాబు'సాధన' ఎడిటర్ దగ్గర్నుంచి వచ్చింది. నా వళ్ళంతా ఒక్క సారి ఉప్పొంగి పోయింది. అంధకారమైన నా హృదయంలో ఏవో మెరుపులు మెరిశాయి. నా కథ అంగీకరించాడు. అచ్చవు తోంది. ఎడిటర్ స్వదస్తూరితో వ్రాశాడు.

"......ఒకచోట చిన్నమార్పు చేశాను. వ్రాతలో రెండు మూడు తప్పులు దొర్లాయి. కథ చాల బాగుంది. రచయిత ప్రతిభ కనపడుతోంది. ... కష్టపడి వ్రాశావు. పది రూపాయలు ... పదిరూపాయలు పారితోషికం పంపుతాము...."

పట్టరాని సంతోషంతో పరవళ్లు తొక్కాను. పెద్దగా నవ్వాను. కేకలు పెడుతూ గంతులు వేశాను. తొడచరుచుకుంటూ ఆ బజారంతా తిరిగాను.

ఆ రాత్రంతా తెల్లవారే వరకూ అలా తిరుగుతూనే ఉన్నాను.

"కథచాల బాగుంది. రచయిత ప్రతిభ కనపడుతోంది ... కష్టపడి వ్రాశావు... పదిరూపాయలు పారితోషికం పంపుతాము. బహుశా ఆ కథ నా రచనల్లో ఉత్తమ కళాఖండం కావచ్చు"

పదే పదే ఇలా అనుకుంటూ రాత్రంతా గడిపాను.



# రెండో అధ్యాయం

కొద్ది వారాలు గడిచాయి. ఒకరోజు సాయంత్రం మామూలుగా నేను బయటికివెళ్ళాను.

పార్కులో కూర్చొని వార్తాపత్రిక కోసం వ్యాసం వ్రాస్తున్నాను. అలా నేను రచనలో నిమగ్నుడనైయుండగానే చీకటిపడింది. పార్కునుంచి బయలుదేరాను.

నా కాకలిగా ఉంది. బాగా ఆకలివేస్తోంది. కథవల్ల సంపాదించిన పదిరూపాయలతో ఇన్నాళ్ళూ కాలక్షేపంచేశాను. మళ్ళీ మామూలు మనిషినయ్యాను. దగ్గర దమ్మిడీలేదు. నే నన్నంతిని రెండుమూడు రోజులైంది. చాల నీరసంగాఉన్నాను. పెన్సులుపట్టుకొని వ్రాయడానికూడా శక్తిలేదు. జేబులో చిన్నచాకు, తాళపుచెవులగుత్తి ఉందిగాని చిల్లికానీకూడాలేదు.

సరాసరి ఇంటికి వెళ్ళాలనే సంకల్పం కలగలేదు. గది విషయం తలుచుకుంటే సహజంగా నాకు భయంవేస్తుంది. అది రేకులషెడ్డుకంటె అధ్వాన్నం. చీకటిగుహ. పాడుపడ్డ బీడు. గొడ్రాలైన స్త్రీ.

అయినా గదికేవెళ్ళాలని నియమమేముంది? ఎక్కడి కెళ్ళినా ఒకటే! హార్బరువైపు బయలుదేరాను.

బాధల్ని జ్ఞాపకం తెచ్చుకోకుండా సముద్రంవైపే చూస్తూ కూర్చున్నాను. చీకట్లో సముద్రం ప్రశాంతంగా నిద్రపోతోంది. వ్రాసింది చదువుకోవడం నాకో అలవాటు గనుక, కొంతవరకు వ్రాసిన అవ్యాసాన్ని చదవాలనిపించింది.

జేబులోంచి కాగితాలు తీశాను. కళ్లకుదగ్గరిగా పెట్టుకొన్నాను. ఒక్కొక్క వాక్యాన్ని చదవడానికి ప్రయత్నించాను. చీకట్లో అక్షరాలు జిలుగ్గా కనపడుతున్నాయి. చివరకు విసుగుపుట్టి కాగితాలు మడిచి జేబులో పెట్టుకున్నాను. అంతా నిశ్శబ్దంగా ఉంది. సముద్రం ముత్యాలు ఆరబోసినట్లుగా తళతళ మెరుస్తోంది. చిన్నచిన్న పక్షులు నామీదుగా అటూ ఇటూ తిరుగుతున్నాయి.

దూరంగా పోలీసు కావలా తిరుగుతున్నాడు. అంతకు మినహా ఆచుట్టుప్రక్కల మరెవ్వరూలేరు. హార్బరంతా నిశ్శబ్దంగా నిద్రపోతోంది.

మళ్లీ ఒకసారి నాదగ్గరున్న వస్తువులు లెక్కచూచుకున్నాను. కాగితాలు, పెన్సలు, చాకు, తాళపుచెవుల గుత్తి. ఇన్నీ ఉన్నాయికాని ఒక్క కాపరుకూడా లేదు.

మళ్లీ జేబులోకి చెయ్యిపోనిచ్చి కాగితాలు బయటికి తీశాను. నాచేయి జేబులోపలికి వెలుపలికి పరిగెడుతోంది. యంత్రంలా పనిచేస్తోంది. ఏమిటీ పిచ్చిపని? ఏదో అవ్యక్తస్థితి.

ఏమీ వ్రాయకుండాఉన్న ఒక తెల్ల కాగితాన్ని ఇవతలికి తీశాను. దాన్ని అరచేతుల మధ్య ఉంచుకొని చుట్టచుట్టాను. అది పొడుగ్గా ఊదే బూరలాగా తయారైంది. మళ్లీ దాన్ని పొట్లంలాగా మడతపెట్టి రోడ్డుమీద విసిరిపారేశాను. దాన్నెవరైనాచూస్తే అందులో ఏదో ఉందనుకుంటారు.

నాకిలాంటి చిలిపిపని చేయాలని ఎందుకు బుద్ధి పుట్టిందో ఆ భగ వంతుడికే తెలియాలి.

రోడ్డుమీద ఆకాగితం ఒక్క-క్షణం గాలికి అటూ ఇటూ కదిలాడింది. నేను దానివైపే చూస్తూ కూర్చున్నాను. అలా చూడగా చూడగా ఆ పొట్లంలో నిజంగా ఏదో ఉన్నట్లు నాకు తోచింది.

"ఆపొట్లంలో డబ్బుంది ఎవరో పొరపాటున దోవలో పారేసుకొని పోయారు. అందులో సుమారు ఎంతడబ్బుంటుంది? ఎంతోకొంత. ఎంతైనాసరే. నేననుకున్నప్రకారం అందులో డబ్బుంటేమాత్రం అదినాదేఅయి యుండాలి. అందులోనోట్లు, పావలాలు, అణాలు, పైసలు, చిల్లర డబ్బులు ఉన్నాయి."

ఇలా ఎంతగానో ఊహించుకున్నాను. కళ్లు పెద్దవిచేసి చాలసేపు ఆపొట్లంవైపు చూచాను. చివరకు ఆడబ్బు అపహ రించాలనే ఆశకూడా నాకు కలిగింది. లేచి వెళ్లబోయాను.

ఇంతలో కానిస్టేబుల్ ఖళ్లుఖళ్లుమని దగ్గాడు. ఎందు వల్లనో తెలియదుకాని నేనుకూడా దగ్గాలని, అతన్ని ఎగతాళి చేయాలని అనుకున్నాను. లేచి నిలబడి అతను వినేటట్లుగా మూడుసార్లు దగ్గాను. అతనిమాదిరిగానే ఖళ్లుఖళ్లుమని దగ్గాను. 'అతను తప్పకుండా ఇక్క-డికివస్తాడు. ఆపొట్లాన్నిచూచి తీసుకో బోతాడు.'

తిరిగీ కూర్చున్నాను. నేవన్నిన ఈ కపటోపాయానికి నవ్వొచ్చింది. పెద్దగా నవ్వాను. నేజేసినపనికి ఎంతో సంతోష మైంది. చేతులు నలిపాను.

'అతనాపొట్లంలో ఏదో ఉందని ఆశపడతాడు. ఏమీ లేదని తెలుసుకున్న తర్వాత ఒక్క-సారిగా క్రుంగిపోతాడు.

పిచ్చాడు. ఆట ఆడిస్తాను. ఎంతమంచి ట్రిక్ చేశాను. ఈ దెబ్బతో ఆపోలీసువాడు చిత్తయిపోతాడు. అహా.హా. హా..."

ఉపవాసాలు చేసి ఉన్ననాకు వళ్లు తెలియడంలేదు. ఆకలి అధికమై నాకేదో మైకం కమ్ముతోంది. తాగినవాడికి మల్లే తూలుడు వస్తోంది.

"ఇక కొంచెం సేపట్లో ఆ పోలీసువాడొస్తాడు. టకటక మని బూట్లుచప్పుడు చేసుకుంటూ, రోడ్డు నాలుగుప్రక్కల కలయచూస్తూ వస్తాడు. రాత్రింతా అతను తిరుగుతూనే ఉంటాడాయె. అంచేత తొందరేముంది? అలా నడుస్తూ తిన్నగా కాగితం పొట్లందగ్గరికి వస్తాడు. దాన్ని చూస్తాడు. ఏదోపొట్లం నడిరోడ్డుమీద పడేసి ఉందేమిటా అని పరీక్షగా చూస్తాడు. అతనికి ఆశకలుగుతుంది. బహుశా అందులో ఏదో విలువైన వస్తువులుంటాయని తలుస్తాడు. నోట్లు ఉండవచ్చునని భావిస్తాడు. ఎవరూ చూడకుండా మెల్లగా దాన్ని తీసుకుంటాడు... అది తేలిగ్గా ఉంటుంది. చాల తేలిగ్గా ఉంటుంది. బహుశా కొద్ది డబ్బు ఉందేమో?........................."

అతను జాగ్రత్తగా దాన్ని విప్పితీసి చూచాడు. నేను నవ్వాను. వెర్రిగా నవ్వాను. తొడలు చరచుకుంటూ విపరీతంగా నవ్వాను. చివరకు నాకళ్ల వెంట భాష్పాలుకుండా రాలాయి.

పోలీసు కొంచెం దూరంలో ఆప్రాంతంలోనే అటూ ఇటూ పరీక్షగాచూస్తూ తిరుగుతున్నాడు. నేను అతిగా నవ్వడంవల్ల ఎక్కిళ్లు వస్తున్నాయి. నేనా సంతోషంలో సర్వం

మరిచిపోయాను. వెంటవెంట ఎక్కిళ్లురావడంవల్ల నాకూపి రాడడంలేదు.

కాగితంబూర ఎంతపని చేసిందా అని నాలోనేను ఆలోచించుకుంటున్నాను. పోలీసువాణ్ణి ఎలాగైనా బుట్టలో పడేయగలిగానని పరమానందాన్ని పొందాను. పాపం అతను కాగితాన్ని అవతలపారేస్తూ మళ్లీ ఖళ్లు, ఖళ్లుమని దగ్గాడు.

'ఏమిటి నే చేసినపని. ప్రొద్దుపోక చేసినపని. పిచ్చిపని.' ఇలా వెర్రిమొర్రిచేష్టలుచేయడంవల్ల నాబుర్ర వేడెక్కిపోయింది. అర్థంలేని ఆలోచనలవల్ల నా హృదయం భగ్గుమంటోంది. నేను బాగా అలసిపోయాను. బడలికవల్ల నా వళ్ళంతా విరగగొట్టి నట్లుంది. బాధకు తట్టుకోలేకపోయాను. అక్కడే పడుకున్నాను.

ఆకాశంవైపు చూచాను. నే నెక్కడో పాతాళంలో పడిఉన్నట్లనిపించింది. పైన వినీలాకాశం వెర్రిదానిలా నావైపు చూచి బావురుమని ఏడుస్తోంది. అంధకారం దయ్యంలా జడలు విరియబోసుకొని నా చుట్టూ నృత్యంచేస్తోంది. నక్షత్రాలు నా కళ్లల్లో వ్రేళ్లుపెట్టి పొడుస్తున్నాయి.

నా కిప్పుడు ఆకలిలేదు. కడుపులో ఎలాంటిబాధ తెలియడంలేదు. కళ్లుతెరచి చూస్తూ పడుకున్నాను. కాని నాలో ప్రాణంఉన్నట్లు తోచదు. చలనంలేదు. స్పృహలేదు. శవంలా పడున్నాను. యావత్ప్రపంచాన్ని చీకటి తన చేతుల్లోకి తీసుకొని దాచుకుంది. నా కళ్లకేమీ కనిపించడంలేదు. ఏదో మైకంలో ఉన్నాను. నిద్ర. మబ్బుతెరలవంటి నిద్ర. ఏదో భావుకతలో ప్రయాణంచేస్తున్నాను. కలలు...అలల్లా నామీద నుంచి పోతున్నాయి... ... ...

"దివ్యసుందరమూర్తులైన ఇద్దరు దేవకన్యలు కనిపిం

చారు. నన్ను తమచేతుల్లోకి తీసుకొని విమానంలో కూర్చో పెట్టుకున్నారు. అది కొత్తరకమైన విమానం. నవరత్నాలు పొదిగి ఉన్నాయి. రకరకాల పుష్పమాలలు నాలుగువైపుల వేలాడుతున్నాయి. నేను మధ్యలో కూర్చున్నాను. నా కిరు పక్కల శ్రీదేవి, భూదేవికిమల్లే ఆ దేవకన్యలు కూర్చున్నారు. విమానం ఆకాశమార్గాన పోతోంది. పల్లెలు, పట్నాలు, భవంతులు, పాలరాతిగోపురాలు, నదులు, సముద్రాలు అన్నీ దాటాం. పర్వతాలు, పచ్చికబయళ్లు, కనులపండుగగా కనిపిస్తున్నాయి. చివరకా విమానం హిమవత్పర్వతంమీదికి పోతోంది. మహోన్నత శిఖరాలు, పర్వత పంక్తులు, మంచుకొండలు, లోయలు, సెలయేళ్లు దాటింది. అలా వియత్‌పథంలో ప్రయాణంచేసి చివరికది మానససరోవరం దగ్గర ఆగింది. ఎంత మనోహరమైన దృశ్యం! దాపున కాంచనగంగ గలగల ధ్వనులతో ప్రవహిస్తోంది. సరోవరంలో రాజహంసలు రాగతాళయుక్తంగా నృత్యంచేస్తున్నాయి. గంధర్వకన్యలు సరస్సుచుట్టూ వలయాకారంగా నృత్యభంగిమలో నిలబడి ఉన్నారు. పారిజాత మాలలు పట్టుకొని ఎదురు చూస్తున్నారు. సరస్సు మధ్య సర్వాంగ సుందరంగా వికసించిన సహస్రదళ పద్మం ప్రకాశిస్తూ ఉంది. దానియందు పరమేశ్వరి సౌందర్యాన్ని ధిక్కరిస్తూ ఒక పద్మదళాయతాక్షి కూర్చొని ఉంది. ఎంతచక్కని కన్య! గంధర్వకన్యా? దేవకన్యా? లేక అమరావతినుండి అరుదెంచిన అప్సరసయా? ఆమె లావణ్యం నన్ను మూర్ఛితుణ్ణిగా చేసింది. ఆమె ధరించిన వివిధాలంకారాలు, జాతిరత్నాలతో పొదిగిన పతకాలు, పచ్చలహారాలు, కెంపుల గాజులు, రవ్వలుచెక్కిన కావిముర్వలు! ... ...

మందహాసంతో నన్ను ఆహ్వానించి తన సరసనకూర్చో బెట్టుకొంది. ఏవో వింత వాయిద్యాలు మ్రోగాయి. నామీద పుష్పవృష్టి కురిసింది. నాశరీరం పులకరించింది. ఆమె నన్ను తన బాహువల్లరిలో బిగించి బలంగా ముద్దుపెట్టుకొంది. 'జలజా' అని పెద్దగా అరిచాను! ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు నా ముఖానపోసిన చెమట బిందువులు ఆరిపోయేలాగా విసన కర్రికుమల్లే విసురుతున్నాయి. 'జలజా'! మరొకసారి ముద్దు పెట్టుకో... ఇంకా... ఇంకా... బాగా... బలంగా..."

నేను బిగ్గరగా అరవడం, పోలీసువాడు నన్ను తట్టి లేపడం రెండూ ఇంచుమించు ఒకేసారి జరిగాయి. నాకు మెలు కువ వచ్చింది. లేచికూర్చున్నాను. మళ్లీ నేను మామూలు ప్రపంచంలోకి వచ్చానని తెలుసుకున్నాను. ఈ పాడు ప్రపం చాన్ని తిరిగి చూడాల్సి వచ్చినందుకు తిట్టుకున్నాను. ఆమధుర స్వప్నం ఇంకా నామనసులో లీలగా కనపడుతోంది.

మంచుపడడంవల్ల నాబట్టలు చల్లగా ఉన్నాయి. ఎటు చూచినా చీకటి. గాడాంధకారం. కన్నుపొడుచుకున్నా కన్పిం చడం లేదు. ఎంతో కష్టంమీద ఆపోలీసువాణ్ణి పోల్చుకో గలిగాను.

'సరే-ఇక ఇక్కణ్ణుంచిలే' అన్నాడతను.

వెంటనే లేచి నిలబడ్డాను. అతను నన్ను లేపకుండా ఉంటే అలాగే హాయిగా పడుకొనేవాణ్ణి. ఆకల్ని మరిచిపోయే వాణ్ణి. నేను వెళ్లిపోబోతుంటే అతను మళ్లీ నన్ను అడ్డగిం చాడు.

'ఎవరునీవు?' గద్దించాడతను.

'మే-మే-మే' ఏదో మూలిగాను భయంవేసి.

'మాట్లాడవేం? ఇక్కడెందుకు పడుకొన్నావు?'

'ఏదో - పొర - పొరపాటైపోయింది' నీళ్లు నములుతూ జవాబు చెప్పాను. నాకు వణుకుపుట్టింది.

'తక్షణం ఇక్కణ్ణుంచి వెళ్లిపో. లేకపోతే ... ముష్టివెధవలు. అర్ధరాత్రిళ్లు రోడ్లమీద పడుకోవడం ఒక అలవాటై పోయింది' అన్నాడతను.

నేను మెల్లగా నడకప్రారంభించాను. ఆకలి విపరీతంగా ఉంది. కడుపు దహించుకపోతోంది. ఒక్కముద్దయినా అన్నంతిని మజ్జిగత్రాగితే ఎంత బాగుండును! నా శరీరాన్ని శ్మశానంలో తగలబెడుతున్నట్లనిపించింది నాకు. నాకళ్ల వెంట ధారాపాతంగా నీళ్లు కారుతున్నాయి.

ఎంతకాలం పోయినా నాబాధలకు అంతులేదు. చాల దూరంవచ్చి హఠాత్తుగా రోడ్డుమీద ఒకచోట ఆగాను. పెద్దగా తిట్టడం మొదలుపెట్టాను. ''ఆపోలీసువాడు నన్నేమ న్నాడు? ముష్టివెధవ... నేను ముష్టి వెదవనా? ఇప్పుడే వాడి పని చెప్తాను. నేను పేదవాణ్ణో, ప్రభువునో చూపిస్తాను.'' వెనక్కిమళ్లీ గబగబ పరిగెత్తడం మొదలుపెట్టాను. నాకు వళ్లు తెలియని కోపంవచ్చింది. కళ్లు చింతనిప్పుల్లాగా అయినాయి. ఆపోలీసువాణ్ణి పట్టుకొని మింగేయాలనిపించింది. అలావెనక్కి చాలదూరం పరిగెత్తాను. కాని మధ్యలో నాకాళ్లు మడత పడ్డాయి. కళ్లు తిరిగి క్రిందపడ్డాను. అయినా లక్ష్యపెట్టలేదు. లేచి మళ్లీ పరుగు లంకించుకున్నాను. కాని కాస్తదూరం పరి గెత్తేసరికి నాకాళ్లు చచ్చుపడ్డాయి. ఆయాసం వచ్చింది. అడుగు ముందుకు వేయలేకపోయాను. పైగా నాకోపంకూడా చల్లారి పోయింది. ఒక్కక్షణం కూలబడి ఊపిరి పీల్చుకున్నాను. 'అవును.

అతనన్నమాటలో తప్పేముంది? ముష్టివెధవనన్నాడు. నాబ్రతుకు ముష్టివాళ్లకంటె, ముండమోపులకంటె అన్యాయం. ఎందుకు రోషపడడం? రోసిపోయిన నాబ్రతుకు... రోడ్డుమీద పడుకున్నందుకు రూల్సు ప్రకారం మాట్లాడాడు' ఇలా నాలో నేను సమాధానం చెప్పుకుని సంతృప్తిపడ్డాను.

తిరిగీ ముందుకు నడకసాగించాను. పరమేశ్వరుడా నన్నెందుకు పరీక్షిస్తున్నావు? అర్ధరాత్రి దయ్యంలా ఒంటరిగా రోడ్ల మీద తిరగడమేమిటి?

నాకడుపులో ఆకలిబాధ ఎంతగా ఉందో చెప్పలేను. మాటలతో వర్ణించలేను. ఆబాధవల్ల ఒకరెప్పపాటు కాలం కూడా నామనస్సుకు విశ్రాంతిలేకుండా ఉంది. పదేపదే నోట్లో ఊరుతున్న నీళ్లు మ్రింగడం మొదలుపెట్టాను. అలాగైనా ఆ బాధ కొంత ఉపశమనం అవుతుందేమో అని నా ఆశ.

వారాలతరబడి నేను అన్నంలేకుండా తిరుగుతూఉండడం వల్ల నా ఆరోగ్యం చెడిపోయింది. నా బలం క్రమక్రమంగా క్షీణించిపోతోంది. ఎప్పుడో అదృష్టవశాత్తు ఓ అయిదు రూపాయలొస్తే ఒక నాలుగైదురోజులు హాయిగా గడుపుతున్నాను. ఆ తరువాత మళ్ళీ విడువకుండా కొన్నిరోజులపాటు పస్తులుంటున్నాను. ఇలా పదే పదే జరుగుతూన్నందువల్ల బలాన్ని కూడబెట్టుకోడానికి వీలులేకుండాపోయింది. గుండెల్లో ఎప్పుడూ దడగా ఉంటోంది. అప్పుడప్పుడు దగ్గుకూడా వస్తోంది. వెన్నుపూసలో ఎప్పుడూ పోటు. కాళ్లూ, చేతులూ చచ్చుపడ్డట్టుగా ఉంటున్నాయి. నడుము వంచలేకుండా ఉన్నాను. రాను రాను నా బ్రతుకింత దుర్భరంకావడానికి కారణమేమిటి? నేను అందరిలాంటివాణ్ణికాదూ? అందరిలాగే ప్రపంచంలో బ్రతికే

హక్కు నాకు లేదూ? మాటవరసకు పుస్తకాలషాపు శంభు, వక్కపొడిషాపులో శాస్త్రి, నాకంటే బాగా బ్రతకడంలేదూ? పనిచేయడానికి నాకూ భగవంతుడు రెండుచేతులిచ్చాడుగదా!. నిజం ఆలోచిస్తే మట్టితట్టలుమోసుకొని రోజూ కూలి డబ్బులు తెచ్చుకోడానికైనా పనికిరానూ? నేను పనిచేయని సోమరి పోతునా? నేను మాత్రం పనికోసం ప్రయత్నించలేదూ?ఉద్యోగాలకోసం ఊరంతా తిరగలేదూ? ఖాళీలువస్తే ధరఖాస్తులు పెట్టలేదూ? రాత్రింబగళ్లు కూర్చొని కథలు, వ్యాసాలు, వ్రాయలేదూ? నే నేం తిండిబోతునా? దుబారాచేస్తున్నానా? విలాసాలకోసం డబ్బు వెచ్చిస్తున్నానా? డబ్బున్నప్పుడైనా మట్టుగా నే వాడుకున్నానుకాని, ఉన్నదికదా అని అంతా ఒక్క రోజే వృధాఖర్చుచేయలేదే? నేను బంగళాల్లో, భవంతుల్లో, మేడల్లో,మిద్దెల్లో అద్దెకుంటున్నానా? హోటళ్లల్లో బసచేశానా? ఊరికి ఆరుమైళ్ళదూరాన పనికిమాలిన పాతకొంపలో గడుపుతున్నానే? క్రిందటి వర్షాకాలంలో కురుస్తూన్నందువల్ల ఎవరూ ఉండక ఆ యిల్లు వదిలిపెట్టిపోయారే? దయ్యాలుకూడా ఉండలేని ఆ యింట్లో నే నెందుకుంటున్నాను? కనుక వీటన్నిటికీ కారణమేమిటో నాకు అర్థంకావటంలేదు. కొంచెమైనా తెలుసుకోలేకుండా ఉన్నాను.

ఇలా ఆలోచించుకుంటూ పోతున్నాను. ఒక కొట్టు దగ్గర ఆగాను. కిటికీలోంచి లోపలికి తొంగిచూచాను. ఏవో డబ్బాలు వరుసగాపెట్టిఉన్నాయి. ఆ డబ్బాలమీద ఏం రాసి ఉందో తెలుసుకుందామని ప్రయత్నించాను. కాని చీకటిగా ఉన్నందువల్ల నాకేమీ కనిపించలేదు. నాకు పుట్టిన ఈ కొత్త ఆలోచనతో మళ్ళీ ఆవేశం వచ్చింది. ఆ డబ్బాలో ఏముందో

తెలుసుకోలేకపోయినందున కోపంకూడా వచ్చింది. గట్టిగా రెండుసార్లు ఆ కిటికీమీద గుద్ది అక్కణ్ణుంచి వెళ్ళిపోయాను.

ఆ తరువాత కొంతదూరం పోగానే నాకు మరొక పోలీసు ఎదురు పడ్డాడు. నేనతనికి చేరువగా వెళ్ళి కొంచెం తీవ్రంగా ఇలా అన్నాను 'ఇప్పుడు పదిగంటలైంది కదూ!'

'కాదు. రెండు గంటలైంది' అన్నాడతను కొంచెం విస్మయంతో.

'కాదు పది. ఇప్పుడు పదిగంటలే అయింది.' అన్నాను నేను గట్టిగా వత్తి పలుకుతూ. నాకు కోపం వచ్చింది. గ్రుడ్లు రిమి చూచాను. రెండడుగులు ముందుకువేసి అతని మీదికి వెళ్ళాను. పిడికిలి బిగించాను.

'ఏం? చెప్పవేం? ఇప్పుడు పదిగంటలు కాదూ అయింది?' అంటూ అతన్ని కొట్టబోయాను.

అతను నిర్ఘాంత పోయాడు. ఒక్క క్షణం నన్ను ఎగాదిగా చూచాడు: నేనిలా ఎందుకంటున్నానో అతని కేమీ అర్థం కాలేదు. చివరకు నేనొక మతిచెడిన మనిషినని నిర్ధారణ చేసు కొన్నాడు. చాల శాంతంతో ఇలా అన్నాడు.

'ఎలాగైనా నీవిప్పుడు ఇంటికి వెళ్ళలేవు. చాల ప్రొద్దు పోయింది. పోనీ నీకుతోడుగా కొంచెందూరం నేను రానా?' నా బుజంమీద తటుతూ అన్నాడీమాటలు.

నా కోపం చల్లారి పోయింది. అయిస్‌లా అయి పోయాను. ఆ పోలీసతను నామీద అంతప్రేమ చూపిస్తు న్నాడూ? నేనతని పట్ల ఎంత అసహ్యంగా ప్రవర్తించానూ? మళ్ళీ నాకళ్ళ వెంట నీళ్ళుకారాయి. సమాధానం చెప్పడం కోసం తొందర పడ్డాను.

'థ్యాంక్సు, అక్కర్లేదు. హోటల్లో కాస్త ఆలస్యమైంది. అంతే. మీ సహాయానికి సర్వదా కృతజ్ఞుణ్ణి' అన్నాను నేను.

అతను నాకు సాల్యూట్ చేసి వెళ్ళి పోయాడు. ఆ కానిస్టేబుల్ ఎంత మంచివాడు! నా దెంత పాడుజన్మ. అతని మనస్సు అనవసరంగా నొప్పించాను. కోతిలా ప్రవర్తించాను. నాకు చాల విచారం వేసింది. పెద్దగా ఏడ్చాను. అతనికివ్వడానికి ఒక పావలా అయినా నా దగ్గరలేకపోయెనే, అని ఏడ్చాను. అతను వెళ్ళిపోతున్నాడు. అతన్ని రెప్పవాల్చకుండా చూస్తూ అక్కడే నిలబడ్డాను. చేత్తో నొసట కొట్టుకున్నాను. కనుచూపు దాటిపోయేంతవరకు అతన్ని చూచి ఆ తరువాత మరీ బిగ్గరగా ఏడ్చాను.

అనేక పేర్లతో నన్ను నేనే తిట్టుకున్నాను. నా దరిద్రానికి నన్నే నిందించుకున్నాను. ఎన్నిరకాల తిట్లున్నాయో అన్నీ ఉపయోగించాను. అ తిట్లుకూడా ఎంతో ఘనంగా, కవిత్వంలాగా, గానంవలె నా నోటినుండి దొర్లి పొర్లిపోయినాయి. దాదాపు ఇంటికివచ్చేవరకు ఇలా తిట్లుతోనే గడిపాను.

నా గది దగ్గరికి వచ్చేసరికి వర్షం ప్రారంభమైంది. క్రింది భాగం అంతా చీకటిగా ఉంది. పైన నాగది, కిటికీ, తలుపులు, లీలగా కనిపిస్తున్నాయి. జేబులో చెయ్యిపెట్టి తాళపుచెవులు బయటికి తీశాను. కాని నాకు గదిలోకి వెళ్లాలనిపించలేదు. కాటిలో శవంలాగా నేనా గదిలో పడుకోకపోతే ఇప్పుడేం కొంపలు మునుగుతాయి? అసలీ తాళపుచెవులు ఎక్కడైనా పడేసి మరిచిపోగూడదూ! వీటితో నాకేం పని?'

వర్షం ఎక్కువౌతోంది. నేను తడిసిపోతున్నాను. నా ముఖంమీదనుంచి భుజాలమీదికి నీళ్లుకారుతున్నాయి. నేను మళ్ళీ వెనక్కుమళ్లాను. అలా వర్షంలో తడుచుకుంటూ చాలా దూరం నడిచాను. తాలూకా కచేరి దగ్గరికి వచ్చేసరికి నా తల తిరగడం ప్రారంభించింది. ముందుకు అడుగు వేయలేకపోయాను. తాలూకాఆఫీసు అరుగుమీదనే తలవాల్చాను. నా కళ్లు మూతలుపడ్డాయి ... ... ... ... ... ... ...... ...

.........................................................

'నీ పేరేమిటి?' అని అడిగాడు ఇన్‌స్పెక్టరు.

'......' పేరు చెప్పాను. ఏదో పేరు. నోటికివచ్చిన పేరు చెప్పేశాను. అసలు నేనక్కడ ఎందుకు పండుకోవాలి? అంచేతే ఇప్పుడీ అవస్థపట్టింది. అవును. అడుగుతారు. అధికార్లు. అనేక ప్రశ్నలువేస్తారు, అన్నిటికీ సమాధానంచెప్పాలి. ఎవరికోసం?

'వృత్తి ఏమిటి? మళ్ళీ ఇన్‌స్పెక్టరు ప్రశ్న. ఈ ప్రశ్న నన్ను కొంచెం కలవరపరచింది. ఏమి వృత్తని చెప్పను? నే నేం పనిచేస్తున్నానుగనుక? కూలిపనిచేసుకుంటున్నానని చెపుదామనుకున్నాను. కాని కుదరలేదు. ఎంతచెడ్డా నేను కోటు, పాంటు వేసుకొని ఉన్నానాయె. పైగా జేబులో పేపర్లు, పెన్నలు; పెద్దవ్రాతగాణ్ణి. పైగా నేనుచెప్పినపేరుకూడా శాస్త్ర, చదువూ, సంస్కారం ఉన్నమనిషిలా సూచిస్తోంది. అంచేత కూలివాణ్ణని చెప్ప సాహసించలేకపోయాను. చివరకు ఇన్‌స్పెక్టరుకు కొంచెం దగ్గరిగావెళ్ళి ఇలా అన్నాను.

'నేను పత్రికా రచయితను' –

వ్రాసుకోబోయేముందు ఇన్‌స్పెక్టరునన్ను ఒక్కక్షణం పరికించి చూచాడు.

'ఓ! జర్నలిస్టువన్నమాట' — ✓

అతని మాటలు ఆశ్చర్యాన్ని సూచిస్తున్నాయి. అతను నన్నొకక్షణం అనుమానంగా చూడ్డంలో అంతరార్థం నాకు బోధపడకపోలేదు. జర్నలిస్టుకేమిటీ ఇలాంటి గతిపట్టిందని అతని ఉద్దేశ్యం. కాదూమరి. ఇంతపెద్ద దేశంలో, పేరుపడ్డ ప్రభుత్వంలో ఒకపత్రికారచయిత వస్తులుంటూ బ్రతుకుతున్నాడనీ, పడుకోడానికి జాగాలేక బజార్లవెంటపడ్డాడనీ,— అంటే నామర్దాకాదూ! ఆశ్చర్యమైన విషయంకాదా? దీనికి కారణం ప్రధానమంత్రి నడగాలా? లేక పేదవాళ్లకోసం ఇళ్లు కట్టించడానికి నియమించబడ్డ ప్రత్యేకమంత్రి నడగాలో, పార్లమెంటులో ప్రశ్నించాలో తెలియదు. పాపం ఇన్‌స్పెక్టరు కొంచెం గాభరాపడ్డాడు. ✓

'మిస్టర్... ఏ పేపర్లో పనిచేస్తున్నావ్?'

'రాష్ట్రవార్తలు' అన్నాను నేను తడుముకోకుండా. 'ఇవాళ ఆఫీసునుండి ఇంటికివెళ్ళడం ఆలస్యమైంది. అంచేత...' అన్నాను తిరిగీ.

అతనేమీ సమాధానం చెప్పలేదు. చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

'ఏయ్ 126'. కానిస్టేబుల్‌ను పిలిచాడు.

'ఇతన్ని తీసుకెళ్ళి ఆ స్పెషల్‌రూంలో ఉంచు తెల్లవారేదాకా.' ఆర్డరుచేసి వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టరు.

గుహలాగాఉన్న చిన్న గదిలోకి పోలీసు నన్ను తీసుకెళ్లాడు.

'దీపం ఇంకో పదినిముషాలసేపు ఉంటుంది' అన్నాడు పోలీసుజవాను తలుపువేసి వెళ్ళిపోతూ.

'ఆ తర్వాత ఆరిపోతుందా?'

'అవును. ఆతర్వాత దీపం ఉండదు!'

నేను మంచంమీద కూర్చున్నాను. కానిస్టేబుల్ గదికి బయట తాళంవేయడం నాకు వినపడుతూనే ఉంది. ఆ గది నాకు బాగానే ఉంది. నా గదికంటె వెయ్యిరెట్లు మెరుగు. బయట వర్షంపడుతోంది. నాకు నిద్రరావడంలేదు. కూర్చొని జరిగిందంతా తలంపుకు తెచ్చుకున్నాను.

'నాపేరు...జర్నలిస్టును... 'రాష్ట్రవార్తల్లో' పనిచేస్తున్నాను...ఏయ్ 126...ఇతన్ని ఆ స్పెషల్‌రూంలో తెల్లవారేదాకా ఉంచు'...ఈసారి నేను బాగా ట్రిక్ చేశాను. ఈ పనిలో దేవుడుకూడా నాకు అనుకూలించాడు.

దీపం ఆరిపోయింది. నేను చీకట్లో మంచంమీద పడుకొని ఉన్నాను. నాకేమీ కనిపించడంలేదు. ఆఖరుకు సున్నం వేసిన తెల్లటిగోడలుగూడా మసకమసగ్గా ఉన్నాయి. నలువైపులా గాడాంధకారం నన్ను చుట్టుముట్టి నులిమివేస్తున్నట్లు అనిపించింది. అటువంటి చీకటి అంతకుముందు నే నెప్పుడూ చూడలేదు. ఆ చీకట్లో నా మనస్సు పరిపరివిధాల పరిగెడుతోంది. అమాంతంగా నోరుతెరచి చీకటి నన్ను మింగేసింది. తన గర్భంలో దాచుకుంది. నేనలా కళ్లుతెరచి మంచంమీద ఎక్కువసేపు పడుకోలేకపోయాను.

నాలో ఆకలి, ఆవేదన, బాధ, బలహీనం. అవ్యక్తస్థితి. చాలసేపు పెనగులాడాను. క్షణక్షణానికి నామనస్సు మార్పు చెందుతోంది. లేచికూర్చున్నాను. నాలోనేను చాలసార్లు

నవ్వుకున్నాను. తమాషాలు చేసుకున్నాను. ల ల లా, ల ల్ల ల్లా, ననా, నన్న న్నా; కూనరాగాలుపాడాను. ఏవేవో జ్ఞాపకంవస్తు న్నాయి. చీకట్లో అలా ఒంటరిగా కూర్చున్నందువల్ల నాకు భయంవేసింది. విపరీతమైనభయం. భయంవల్ల నా వళ్ళంతా చెమటపట్టింది. కోటు, చొక్కా విప్పతీసి మంచంమీదపెట్టాను.

అలా భయంతో గది నాలుగువైపులూచూస్తూ కూర్చు న్నాను. మంచానికి ప్రక్కగా నాతలగడవైపు గోడకు ఒక రంధ్రం కనిపించింది. చేత్తో తడిమిచూచాను. పెద్దరంధ్రం. బహుశా అది మేకులు దిగకొట్టడంవల్ల ఏర్పడిన బెజ్జం అయి ఉంటుంది. ఆ రంధ్రం చూస్తున్నకొద్దీ నాభయం మరీ ఎక్కు వైంది. అదొక రహస్యద్వారమేమో అనిపించింది నాకు. నా కోటుజేబులో ఉన్న చాకు తీశాను. ఆరంధ్రంలో పెట్టి పొడి చాను. ఆ బెజ్జం ఎంతలోతుఉందో తెలుసుకోవాలని నా ఆలో చన. ఆ రంధ్రం ప్రక్కగదిలోకిగాని, వీధిలోకిగాని లేదుకదా! అది నిర్ధారణ చేసుకోవాలనే నేను అలా చాకుతో దాన్ని కొలవడం మొదలుపెట్టాను.

తిరిగీ మంచంమీదపడుకొని నిద్రపోవాలని ప్రయత్నిం చాను. కాని కన్నుమూత పడడంలేదు. కొత్తస్థలం. చీకటి, పైగా భయం ఇక నిద్ర ఎలా పడుతుంది? బయటవర్షం. ఆగి పోయింది. రోడ్డుమీద మనుషులు నడుస్తున్న చప్పుడు చాల సేపు నాకు వినిపించింది.

నా మనస్సు చాల చికాకుగా ఉంది. ఏ మాత్రం విశ్రాంతి లేదు. అలా కొంతసేపు గడిచింది. తిరిగీ రోడ్డుమీద మనిషినడుస్తున్న సవ్వడి వినిపించింది. టక టకమని బూట్లు

చప్పుడవుతున్నాయి. ధ్వనిని బట్టి అతనొక కాన్‌స్టేబిల్ అయి ఉంటాడని ఊహించాను.

హఠాత్తుగా నా చేతి వ్రేళ్లు విరిచాను. మెటికలువిరుస్తూ పెద్దగా నవ్వాను. 'హ! హ! హ! అద్భుతం. అత్యద్భుతం!' నా మనస్సులోకి మంచి మాటవచ్చింది. మంచంమీదనుంచిలేచి పెద్దగా ఇలా అన్నాను. 'నేనొక మంచిమాటను కనిపెట్టాను. అదింతవరకు తెలుగు, సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు మరే భాషల్లోనూలేదు. నేనే ఇప్పుడామాటను సృష్టించాను. "కుబావో." ఒకమాటకుండవలసిన అక్షరాలు ఇందులోనూ ఉన్నాయి. ఇది అద్భుతమైనమాట. అందరూ అర్థంచేసుకోలేని మాట. భగవదంశచేత భూమియందు జన్మించిన ఓ మానవుడా! నీవీ మాటను కనిపెట్టావు...'కుబావో' ... విచిత్రమైనమాట. మణిలాంటిమాట. ఇందులో మనుషులకు తెలియని మహిమ, ధ్వని, ఉన్నాయి.'

లేచి కూర్చున్నాను. కళ్లు పెద్దవిచేసి చూడసాగాను. నేను బ్రహ్మాండమైన పరిశోధనచేశాననే వెర్రిఆవేశంతో బిగ్గరగా నవ్వాను. ఆ తరువాత నాలోనేను రహస్యంగామాట్లాడుకోవడం మొదలుపెట్టాను. ఎవరో నా రహస్యాన్ని కనిపెడుతున్నట్లుగా తోచింది. అందుచేత నా పరిశోధన పరులకంటబడకుండా కాపలా కాయాలని సంకల్పించాను. నాకు ఆకలిబాధ గాని, బలహీనంగాని ఏమి తెలియడంలేదు. నేనేదో శూన్యంలోకిచూస్తు కూర్చున్నాను. నా మనస్సు నా స్వాధీనంతప్పిపోయి దాని ఇష్టంవచ్చినట్లు పరిపరివిధాల పరిగెడుతోంది.

నా చుట్టూ నిశ్శబ్దం నిండిఉంది. ఆ నిశ్శబ్దంలో అనేక విషయాలు తలపోస్తూ కూర్చున్నాను. విచిత్రమైన వివిధరకాల

ఆలోచనలువస్తున్నాయి. అర్థంకాని భావతరంగాలమధ్య అటూ ఇటూ ఊగుతున్నాను. నేను కనిపెట్టిన ఆ కొత్తమాటకు అర్థం చెప్పాలనుకున్నాను. నేను కనిపెట్టిన ఆ కొత్తమాటకు బ్రహ్మదేవుడేకాదు, త్రిమూర్తులుకూడా అర్థం చెప్పలేరు.

ఎవరో నామీద నిఘాఉంచి నేను సృష్టించినమాటను కనిపెట్టినట్లు నాకు తోచింది. నాకు విపరీతమైన భయంకలిగింది. ఆ దొంగ హఠాత్తుగా దాని అర్థాన్నికూడా బట్టబయలుచేసినట్లనిపించింది. అంతలోనే నాకు పట్టరాని కోపంవచ్చింది. పళ్లు కొరుకుతూ పిడికిలిబిగించాను. "ఎవడువాడు? దొంగవెధవ. నా రహస్యాన్ని కనిపెట్టేశాడు. 'కుబావో' అంటే గొర్రెలమంద అని అర్థంచెప్పాడు. ఆ మాటకు అర్థం అదేనని ఎవడుచెప్పాడు? ఏమిటి రుజువు? వాడికేం తెలుసు? నేను సృష్టించిన పదానికి నేనే వ్యాఖ్యానం చెప్పాలి. చెప్తాను. నిదానంగా దానిఅర్థాన్ని విశదీకరిస్తాను. 'కుబావో' అంటే కుళ్ళిపోయిన ప్రపంచం కావచ్చు. లేక కూటికోసం కొట్లాడే జనం అని అర్థం చెప్పవచ్చు. ఇంకా ఆలోచిస్తాను. మానవహృదయంలోని అంతరాంతరాల పరిశోధన, పరిణామం, యావత్తూ ఆ మాటలో ఇమిడి ఉన్నాయి."

తిరిగి మంచమీద పడుకొన్నాను. మరొకసారి వికృతంగా నవ్వాను. కాని నోరువిప్పలేదు. కొద్ది క్షణాలు అలా గడిచాయి. ఉండిఉండి హఠాత్తుగా నాకు ఉద్రేకం కలిగింది. ఆ కొత్తమాటను మరిచి పోలేకుండా ఉన్నాను. అది పదేపదే నా మనస్సులోకి వస్తోంది. నా హృదయానికి శాంతిలేకుండా చేసి సన్నొకక ఉన్మత్తుణ్ణిగా మారుస్తోంది. ఆ మాటకు అర్థం ఫలానా అని నిర్ధారణ చేయలేకుండా ఉన్నాను. పోనీ ఆ మాట

కేమీ అర్థంలేదని మనస్సు కుదుర్చుకున్నా బాగుండేది. అలా కూడా చేయలేక పోతున్నాను. 'ఆ మాటకు అనేక అర్థాలు చెప్పవచ్చు. చెప్పేవారి శక్తీ, చాకచక్యాన్ని బట్టి ఆ మాట విలువను ఎంతగానో పెంచవచ్చు.' ఇలా నాలోనేను అనుకొన్నాను. 'ఎలాగైతేనేం ఈశ్వరుని కృపవల్ల నేనొక కొత్త పదాన్ని సృష్టించాను. అందుకు సంతోషించాల్సి ఉంది.

నా బుర్ర ఆలోచనలతో నిండి ఉండడం చేత నాకు నిద్ర రాకుండాఉంది. మళ్ళీ మంచంమీద కూర్చున్నాను. రెండు చేతుల్తో తలపట్టుకున్నాను. 'లేదు. ఆమాటకు మరొక రకమైన అర్థం చెప్పడానికి వీల్లేదు. ఆ మాటకు ఆత్మసంబధమైన అర్థమే చెప్పాలి. ఒక విధమైన మానసిక ప్రవృత్తిని ఆ మాట సూచిస్తుంది.' ఇంతలో ఎవరో నా వాదాన్ని ఖండిస్తున్నట్లనిపించిది. నేను కోపంతో ఇలాఅన్నాను.

'ఏయ్ మిస్టర్! నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నావ్; ముందు క్షమాపణ చెప్పు. అసలు నీకేం తెలుసు? నీకు బుర్ర లేదు. బుద్ధిమాంద్యంవల్ల నీవా మాటకు సరియైన అర్థంచెప్ప లేకపోయావు. ఆ మాటకర్థం అల్లికదారమా? ఎవడు చెప్పాడు? నీవొక పిచ్చివాడివి, నీతో నాకేం పని? పో, పో!'

అవును. ఆ మాటను కనిపెట్టింది నేను. దానికి అర్థం 'ఫలానా' అని నా యిష్టంవచ్చినరీతిగా నిర్ణయిస్తాను. అందుకు నాకే హక్కుంది ... ... ... ... .... ....

... ... ... ... .... .... .... ....

నా మనస్సుకు బాగా చికాకుగలిగింది. చివరకు మంచి నీళ్లున్నాయేమో అని లేచి గది నాలుగుమూలలు వెతికాను. ఆ చీకట్లో నాకేం కనబడుతుంది? గదిలో కూజాగాని, ఆఖరుకు

మంచినీళ్లు కుండకూడా లేదు. నాకు పెద్దగా దాహంవేయడం లేదుగాని గుండెల్లో దడగా ఉంది. వంట్లోంచి శగలు, పొగలు వెళుతున్నాయి. జ్వరం వచ్చినట్లుగా ఉంది. గభాలున మంచం మీద పడుకున్నాను. నిద్ర రాకపోయినా బలవంతాన కళ్లు మూసుకున్నాను. అలాగైనా నిద్ర పడుతుందేమో అని నాఆశ. అలా కదలకుండా కొంతసేపు పడుకున్నాను. నావళ్లంతా చెమట పోసింది. నా నరాల్లో రక్తం దూకుతూ వేగంగా ప్రవహిస్తు న్నట్లనిపించింది. హఠాత్తుగా హార్బరు దగ్గర పోలీసు జ్ఞాపకం వచ్చాడు. నేను రోడ్డుమీద విసరేసిన కాగితంబూర... 'పాపం ఆపోలీసు అందులో డబ్బుందనుకున్నాడు... ఇంకా అతను అక్కడే తిరుగుతున్నాడేమో! నేను కూర్చున్నచోటనే కూర్చుని ఉండవచ్చు... తళతళలాడే సముద్రం... దయ్యా ల్లాంటి ఓడలు...

కళ్లు తెరిచాను. నిద్రపోకుండా అలా కళ్ళు ఎంతసేపని మూసుకొని ఉండగలను? మళ్ళీ నాకళ్ళముందు చీకటి సాక్షా త్కరించింది. అదే చీకటి. అగాధమైన చీకటి. అంతుదొరకని చీకటి. ఆ చీకటిని వర్ణించాలంటే చీకటికంటె చీకటిగా ఉండే భయంకరమైన మాటలు కావాలి. అలాంటి మాటలే గనుక నా నోటివెంట వస్తే నా పెదవులు కూడా చీకటిగా మారిపో తాయి. 'భగవంతుడా! ఎంత చీకటిగా ఉంది!' సముద్రం జ్ఞాపకం వచ్చింది. రాక్షసులు నన్ను సముద్రంలో పడేసి లాక్కొని పోతున్నట్లు తోచింది. నన్ను బలాత్కారంగా పాతా ళంలోకి ఈడ్చుకొని పోతున్నారు. గుహలవంటి అనేక చీకటి

లోకాలు, దాటిపోతున్నాను. అలాంటి లోకాల్ని ఎవ్వరూ ఎన్నడూ చూసి ఉండరు.....

భయంపుట్టి పెద్దగా అరిచాను. గట్టిగా మంచాన్ని కౌగలించుకున్నాను. భయంకరమైన ఆ ప్రయాణంలో నాకూపిరి ఆడడంలేదు. కాల ప్రవాహంలో బంతిలా దొర్లుకుంటూ పోతున్నాను. మంచాన్ని కరుచుకున్నంత మాత్రాన మరణించకుండా ఉంటానా? "పిచ్చి. నేనిలా చావవల్సిఉంది. అంతే. నీ విప్పుడు చచ్చిపోతావు. అన్నంలేని ఓ మనిషీ! నీ చావు ఇలా వ్రాసిపెట్టి ఉంది."

నేను చచ్చిపోయే స్థితిలో ఉన్నానని అనుకున్నాను. అయితే నాకు పూర్తిగా స్మృతి తప్పలేదు. తెలివిఉంది. కాని నా స్వాధీనంలో లేదు. ఏదో పిచ్చిగా ఉంది. 'బలహీనం వల్ల నా మతి చెడింది. నిజంగా నేను పిచ్చివాణ్ణయ్యాను. అమ్మో చీకటి! భయం! భయం! వణుకు!' కంపరం పుట్టింది. గభాలున మంచంమీద నుంచి దూకాను. తలుపు తీయాలని ప్రయత్నించాను. రెండు మూడుసార్లు బలంగా తలుపును గుద్దాను. శక్తి కొద్దీ లాగి చూచాను. ఊహు. లాభంలేదు. తలగోడకేసి కొట్టుకున్నాను. కెవ్వుమని కేకపెట్టాను. వ్రేళ్లు కొరుక్కున్నాను. పదేపదే తిట్టుకున్నాను. బావురుమని ఏడ్చాను...

అంతా నిశ్శబ్దం. నా కేకలు గది నాలుగుగోడలమధ్య ప్రతిధ్వనించాయి. కాళ్లు, చేతులు స్వాధీనం తప్పిపోయినాయి. క్రిందపడ్డాను....కొద్దిక్షణాలు నాకు స్పృహలేదు. ఆ తర్వాత క్రిమక్రమంగా నా అవయవాలు స్వాధీనంలోకి వచ్చాయి. కొంచెం కోలుకున్నాను. కళ్లుతెరచి చూచాను. ఎదురుగా గోడమీద ఏదోకొద్దిగా వెలుతురు కనబడింది. 'ఏమిటూ వెలు

తురు! బహుశా తెల్లవారిందేమో! తెల్లవారిందని అనుకో గానే నా నరాల్లోకి సత్తువ వచ్చింది. పెద్దబరువు దించుకున్న ట్లుగా అయింది. ఉత్సాహంతో లేచి వాకిలివైపు వెళ్లాను. తలుపును ముద్దుపెట్టుకున్నాను. పిచ్చివాడిలా ప్రవర్తించాను. కాని నే నేం చేస్తున్నదీ నాకు తెలుస్తూనే ఉంది. తిరిగివచ్చి మంచం మీాద కూర్చున్నాను. నా కిప్పుడంతగా బాధలేదు. భయం కూడా తగ్గింది. మోకాళ్లచుట్టూ చేతులుకట్టుకొని, గోడమీాద వెలుతురువైపే చూస్తూ కూర్చున్నాను. అంతకంతకూ ఆ వెలుతురు పెద్దదౌతున్నట్లు కనబడింది. "అమ్మయ్య ఇక ఫరవా లేదు. తెల్లవారుతున్నట్లోంది. భగవంతుడా! భయంకరమైన ఈ చీకటిగుహనుండి బయటపడతాను. ఇక ఫరవాలేదు. ఇది జైలు. బలవంతులు తమ అధికారానికి చిహ్నంగా దీన్ని సృష్టించారు. తరతరాలుగా ఎందరో అభాగ్యమానవులు ఈ నాలుగుగోడలమధ్య బందీలయినారు. ఎందరి అనాధ చేతులకో, సంకెళ్లు తగిలించిన ఈ న్యాయస్థానం. ఇది ప్రపంచంలోని కాని సత్యానికి చిహ్నం. ఇలాంటి స్థానంలో నాకు చావు తప్పింది. పైగా ఇది స్పెషల్ వార్డని ఇన్స్పెక్టరు చెప్పాడు. బాగుంది. ఇదే ఇంత అధ్వాన్నంగాఉందే, ఇక లోపల అసలు జైలు ఎలా ఉంటుందో ఆ ఈశ్వరుడికే తెలియాలి. ఓహో, జైళ్ళ మంత్రిల్లారా చిరంజీవులై వర్థిల్లండి!.'

తెల్లవారుతున్నదనే సంతోషం నా మనస్సుకు ప్రశాంతి నిచ్చింది. రాత్రంతా యమయాతనపడ్డ నాకు కళ్లుమూతలు వడ్డాయి.

గది తలుపు రెండు మూాడుసార్లు తట్టగానే నేను ఉలిక్కి పడి లేచాను. గబగబ నాకోటు తీసుకున్నాను. 'ఆఫీసులోకెళ్ళి

అయ్యగార్ని కలుసుకో' అన్నాడు కానిస్టేబుల్. 'ఇంకాఇలాంటి ఆచారాలు ఎన్ని ఉన్నాయో! ఇంకా ఎన్నో వ్యవహారాలు నడిపితేనేగాని నే నిక్కణ్ణుంచి బయటపడను కాబోలు' భయ పడుతూ నాలోనేను అనుకున్నాను.

ఆఫీసుగది చాల విశాలంగా ఉంది. నేను వెళ్ళేసరికి అక్కడ ముప్పైఏనలభైమంది వరసగా నిలబడి ఉన్నారు. వాళ్ళంతా నాబోటివాళ్ళే. ఇల్లూ, వాకిలి లేకుండా వీధుల్లో తిరిగేవాళ్ళు. గుమాస్తా, టేబుల్‌దగ్గర నిలబడి కాగితాలు చూస్తున్నాడు. వరుసగా పేర్లవారీగా ఒక్కొక్కర్ని పిలుస్తు న్నాడు. ఎదురుగా కుర్చీమీద ఇన్‌స్పెక్టరు కూర్చుని ఉన్నాడు. 'వాళ్ళందరికీ టిక్కెట్లిస్తున్నావా? మరిచిపోకుండా అందరికీ ఒక్కొక్క టిక్కెట్టు ఇవ్వు' అన్నాడు. ఇన్‌స్పెక్టరు గుమా స్తాతో. నే నటువైపు పరికించి చూచాను. ప్రతివాడిదగ్గర ఒక్కొక్కటిక్కెట్టు ఉంది.

'............జర్నలిస్టు'. నాపేరు పిలవగానే దగ్గరకు వెళ్ళి వంగి శాల్యూట్‌చేశాను.

'నీవెందుకొచ్చావ్ మిస్టర్ ఇక్కడికి?' అన్నాడు ఇన్ స్పెక్టరు నన్ను పరకాయించి చూస్తూ.

నేను విషయమంతా చెప్పాను. క్రిందటిరాత్రి చెప్పిన కథే మళ్ళీ వల్లించాను 'జర్నలిస్టును ...... పత్రికలో పని చేస్తున్నాను...... దురదృష్టవశాత్తు గదికివెళ్ళలేకపోయాను ...ప్రొద్దుపోయింది...గది తాళాలు పోగొట్టుకున్నాను...'

'అవును పాపం' అన్నారు ఇన్‌స్పెక్టరు జాలిగా.

'రాత్రి బాగా నిద్రపట్టిందా?' మళ్ళీ ప్రశ్న.

'ఓ! బ్రహ్మాండంగా. జైళ్ళమంత్రికిమల్లే చీకూ చింతా లేకుండా నిద్రపోయాను'

'గుడ్' అన్నాడతను కుర్చీనుండిలేస్తూ.

'గుడ్‌మార్నింగ్' అన్నాను నేను వినయంగా.

'టిక్కెట్టు. నాకు కూడా ఒక పావలా టిక్కెట్టు దొరికింది. మూడురోజులనుంచీ అన్నం ముట్టలేదు. నా ముఖం చూచి ఎవడైనా జాలిపడ్డాడా? రెండిడ్లీ, అరకప్పు కాఫీ, ఫరవాలేదు.' ఇలా ఆలోచించుకోగానే ఇక అక్కడుండటానికి అనుమానం వేసింది. కొంపతీసి ఏ పోలీసువాడో నన్ను ఆరా తీయడం మొదలుపెడితే? నా అంతు కనుక్కుంటారు. నేను తప్పుడు స్టేటుమెంటు ఇచ్చానని, నన్ను అరెస్టుచేయవచ్చు. భయంవేసింది. ఇక అక్కడొక క్షణంకూడా ఉండకుండా రోడ్డుమీదకు పరుగెత్తాను.

బాగా ఎండకాస్తోంది. దాదాపు పదిగంటలు కావస్తోంది. మార్కెటు దగ్గరికి వచ్చాను. రోడ్లు చాలా సందడిగా ఉన్నాయి. 'నేనిప్పుడెటు వెళ్లాలి?' నా రచనకోసం జేబులు తడుముకున్నాను. రచన కాగితాలు జేబులోనే ఉన్నాయి. పదకొండు గంటలకు ఎలాగైనా 'ఎడిటర్'ను కలుసుకోవాలి. బాగా ఆకలివేస్తోంది. కాస్త కడుపులో పడితేనేగాని కాళ్లు సాగేటట్లులేవు. హఠాత్తుగా టిక్కెట్టుమాట జ్ఞాపకం వచ్చింది. చూచుకుంటే టిక్కెట్టులేదు. జేబుల్లో వెతికాను. ఊహూ. కనిపించలేదు. నా వళ్ళంతా చెమట పట్టింది. కాళ్లు వణకసాగాయి. ఏదో పరధ్యాన్నంగా నడుస్తూ పావలా టిక్కెట్టు పోగొట్టుకున్నాను. వెనక్కువెళ్ళి రోడ్డుమీద వెతకాలనే ఆలోచన తట్టింది. పరుగు లంకించుకున్నాను. అడ్డంవస్తున్న జనాన్ని

అవతలికి తోసుకుంటూ ఫుట్‌పాత్‌మీద పరిగెత్తడం మొదలు పెట్టాను. దోవలో కనిపించిన కాగితంముక్కల్లా పరిశీలించాను.

నాకు పూర్తిగా అలుపు వచ్చింది. నడవడం అసాధ్య మైంది. తల గిర్రున తిరిగిపోతోంది. 'భగవంతుడా! నన్నెందుకు పరీక్షిస్తున్నావు? నా ప్రాణాలు పోకుండా ఉన్నాయి. నా నోటి దగ్గరకు ఏమీరానీయ కుండా చేస్తున్నావు. చేతిలోకి వచ్చిన దాన్ని కూడా చెడగొడుతున్నావు.'

నాకు తెలియకుండానే గదివైపు నడవడం మొదలు పెట్టాను. నాకడుపులో ఏదో చెప్పలేని బాధగా ఉంది. అలా వెళుతూంటే రోడ్డుమీద ఒకచిన్న బెండుముక్క కనపడింది. గభాలునతీసి నోట్లో వేసుకున్నాను. పశువులాగా ఆ బెండు ముక్క నమలడం మొదలు పెట్టాను. దాన్ని నిమ్మతోనలాగా చప్పరిస్తూ నీళ్లు మింగుతున్నాను. ఏమిటీ పిచ్చిపని? పిచ్చా డికి మల్లే......

గదిలోకి వెడుతోంటే మెట్లమీద నారాయణ ఎదురు పడ్డాడు. నారాయణ కుర్రాడు. ప్రక్కనే ఉన్న కాఫీహో టల్లో పనిచేస్తున్నాడు. అప్పుడప్పుడు నా దగ్గరకు వస్తూఉంటాడు. అతని కొకసారి ఇబ్బందిలో ఉన్నానంటే రెండు రూపాయలు అప్పుకూడా ఇచ్చాను. నారాయణ నా కోసమే మేడమీదకు వెళ్ళి వస్తున్నట్లూంది. నన్ను చూడగానే నమస్కారం చేశాడు.

'ఏం బాగున్నావా?' అడిగాను నేను.

తలఊపుతూ అతనేదో చెప్పడానికి సందేహించాడు. నేను నా గదితలుపు తీసి లోపలకెళ్ళాను.

'ఏం లేదుసార్. ఓ అయిదు రూపాయలు అప్పు పెడ తారేమోనని వచ్చాను. నాగుమణికివ్వాలి. ప్రాణం తీసేస్తోంది.

ప్రొద్దుటినుంచీ పదిసార్లు కబురు చేసింది. మళ్ళీ రెండు మూడు రోజుల్లో ఇచ్చేస్తాను. లోగడకూడా నాకు మీరు సహాయం చేశారు. మీమేలు ఎన్నటికీ మరిచిపోలేను సార్.' ఎంతో దీనంగా అడిగాడు నారాయణ.

'లేదోయ్. నిజానికి నాదగ్గరిప్పుడు చిల్లి కానీ కూడా లేదు. ఏం చేయను మరి?'

నేనతని కలా సమాధానం చెప్పానే కాని వెంటనే నా మనస్సులో జాలి, అభిమానం, పుట్టుకొచ్చాయి. అతనలాగే కొయ్యబొమ్మలా నా వైపు దీనంగా చూస్తూ నిలుచున్నాడు.

'ఇప్పుడు లేదు.— వీలైతే సాయంత్రం కనపడు. ఏదైనా సర్దుతాను.' అంటూ గభాలున నా నులక మంచంమీద కూలబడ్డాను. ✓

పెద్దగా నవ్వాను నా అదృష్టం బాగుంది. ముందుగా అతనే డబ్బడిగాడు. లేకపోతే నేనే అతన్ని ఏదైనా అప్పు అడుగుదామనుకొన్నాను. నిజంగా నేనలా చేసినట్లయితే నాప్రాణం చచ్చిపోయేది. ఈసారెందుకో భగవంతుడు నాకు సహాయ పడ్డాడు. నామర్యాదను నిలబెట్టాడు. అయిదు రూపాయలు! భలేవాడివోయ్! మైసూరు మహారాజా ఎస్టేటులో మనహక్కు అయిదోవంతు అడిగావుకావు. లేదా నైజాంనవాబు నాకు రాసిచ్చిన నాల్గుకోట్ల రూపాయల ఆస్తీ అడిగినాబాగుండేది. కింగ్‌కోటీలో కింగ్‌లా బ్రతికేవాళ్లం.

బిగ్గరగా నవ్వడం మొదలుపెట్టాను. నారాయణ అడిగిన అయిదురూపాయలు నా బుర్రలో నాట్యంచేయసాగాయి. "ఓ! అయిదు రూపాయలు...... అహా! హా! హా!."... ... మంచివాసనవస్తోంది. ఎవరో పిండివంటలు, భోజనపదార్థాలు

మజాగా తయారుచేస్తున్నారు. 'గుప్పు'మని వాసన ముక్కులు పగులగొడుతోంది. కిటికీతలుపు తెరిచాను. "ఓ! ఘుమాఘుం. ఏయ్ బోయ్-ఒక ప్లేటు పూరీ పట్టుకురా! అర్జంటు. నాకవతల పనుంది. ఇవాళపార్లమెంటులో మాట్లాడాలి. పార్టీలు కని పెట్టుకొని ఉన్నారు. ఏమిటీ? నీ వెవడివో కొత్తాడివిలా ఉన్నావ్. ఏయ్ వెయిటర్ ఇతన్ని అవతలికి పంపేయి. మన మెప్పుడూ కాఫీ(తాగమని నీకు తెలీదూ! ఓవల్టీన్ - ఓవల్టీన్ పట్టుకురా! హాఁ..."

నాబల్లమీద మోచేతులానించి నిలబడ్డాను. నా ఆలోచనలన్నీ నన్ను తిరిగీ అవేశపూరితుణ్ణిగా చేశాయి. మరొక సారి ఉన్మాదస్థితిలోకి వెళ్ళిపోయాను. మైమరచి మంచంమీద పడుకొన్నాను.

"రావచ్చు. యస్. కమిన్. కూర్చో. ఏం? మరీ నల్ల పూసవై పోయినావు? అవును. నాకు రావడానికి తీరుబడిలేదు. నీవే రావాలి. అదికాదు జలజా! అంతా డబ్బులోనే ఉందనుకో......నీ కోసం ఈ రవ్వలజోడు కొన్నాను...అబ్బ. నీ వెంతబాగా ఊపిరి పీలుస్తావ్! నేను ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నాను. ఏదీ! ఒక్కసారి ... ఒక్క ముద్దు...ముద్దులుగొలిపే ముద్దు ... మురిపెమైన ముద్దు ... ముచ్చటైన ముద్దు ... ఇంకా ... బలంగా ... నీ చేయి చంద్రవంకలా నన్ను చుట్టుకొని ఉంది. నీ ముఖంలో మెరుపులు మెరుస్తున్నాయి. ఏమిటి నీ పెదిమలమీద ఆ సిగ్గు? ... ఏయ్ వెయిటర్ నీకుకాదు చెప్పేది ... త్వరగా ఓవల్టీన్ పట్టుకరా ..."

కిటికీలోంచి నా గదిలోకి ఎండ పడుతోంది. బజారున పోతోన్న బండ్ల చప్పుడు వినపడుతోంది. లేచికూర్చున్నాను.

నా నోట్లో బెండుముక్క- ఇంకా అలాగే ఉంది. పసిపిల్లాడు పాలు తాగుతూ చప్పరించినట్లుగా దాన్ని మరొకసారి చప్పరించాను. గదిలో కొంచెంసేపు అటూ ఇటూ తిరిగాను. ప్రతిదీ ఎంత పాడుగాఉంది! నేలమీాదదుమ్ము పేరుకొనిఉంది. కూర్చోడానికి అనుకూలమైన కుర్చీ కూడ లేదు. బల్లమీాద పాతపేపర్లు, కొన్ని కాగితాలు పడేసిఉన్నాయి. కాగితాలన్నీ దుమ్ముకొట్టుకొని ఉన్నాయి. హనుమంతరావు దుప్పటి మంచంమీాదపడేసి ఉంది. హనుమంతరావు! చటుక్కున చేతిమీాద కొట్టుకున్నాను. 'అవును. హనుమంతరావు. ఈ సమయంలో అతను తప్పక ఏదైనా సహాయం చేస్తాడు. నే నతన్ని కలుసుకొని ఇలాంటి స్థితిలో ఉన్నానని చెప్పలేదని, నా మీాదతనికి కోపంకూడా వస్తుంది.' జేబులో నా రచన కాగితాలు ఉన్నదీ లేనిదీ చూచుకొన్నాను. గబగబ మెట్లుదిగి బయటికి వెళ్ళిపోయాను. నారాయణజ్ఞాపకం వచ్చాడు. నాలో నేను ఇలా అనుకున్నాను. 'ఇదిగో నారాయణా! మళ్ళీ చెపుతున్నాను. మధ్యాహ్నం నీకు తప్పక డబ్బుతెచ్చి ఇస్తాను. మరేం భయపడకు.'

మార్కెట్టు దగ్గరికివచ్చి గడియారంవైపు చూచాను. పన్నెండు గంటలు దాటుతోంది. అరె. 'చాలా ఆలస్యమైంది. పత్రికా ఆఫీసుకువెళ్లి ఎడిటర్‌ను చూడాలి'

ఆఫీసు మేడమీాదకు వెళ్లేముందు బయట నిలబడి మరొకసారి నారచన చూచుకున్నాను. పేజీ నెంబర్లు సరిగా వేసిందీలేందీ చూచుకొని మడిచి జేబులో పెట్టుకున్నాను. మామూాలుగా ఆఫీసులోకి వెళ్లి ఎడిటర్‌నుగురించి అడిగాను. ఎవ్వరూ జవాబివ్వలేదు. ప్రక్కగదిలో ఒకాయన కూర్చుని

ఉన్నాడు. బల్లమీద పత్రికలు పడేసుకొని పరీక్షగా తిరగవేస్తు న్నాడు. అతని దాపుకువెళ్లి మళ్లీ అడిగాను.

'ఎడిటర్‌గారున్నారా?'

'లేరు. ఇంకా రాలేదు.' తల ఎత్తకుండా ముక్తసరిగా జవాబు చెప్పాడతను.

'ఎప్పుడొస్తారు?' మళ్లీ నాప్రశ్న.

'చెప్పలేం. ఎప్పుడొస్తారో తెలీదు'.

'ఆఫీసు ఎన్ని గంటలదాకా ఉంటుంది?'

ఈ నా ప్రశ్నకు సమాధానం రాలేదు. ఇక అక్కడు న్నందువల్ల ప్రయోజనం లేదు. అంచేత విధిలేక వెళ్లిపోయాను.

'ఎడిటర్‌ను కలుసుకుంటే బాగుండేది. ఇంతకుముందు నాకథ తీసుకొని డబ్బిచ్చాడు. నన్ను సులభంగా గుర్తుపడ తాడు. ఇతనెవరో కొత్త. తలబిరుసు మనిషిలా ఉన్నాడు. ఎడిటరేగనుక ఉన్నట్లయితే నన్ను ఆప్యాయతతో పిలిచికూర్చో మని కులాసాగా మాట్లాడేవాడు ........................ హనుమంతరావు రూంవైపు నడవడం మొదలుపెట్టాను.

హనుమంతురావు ఐశ్వర్యంగల ఇంట్లో పుట్టాడు. తండ్రి ఇంకా రెండుచేతులా ఆర్జిస్తున్నాడు. అరవై ఎకరాల భూమి. అడపా దడపా అరవై వేలైన రొఖం ఉంటుంది. హనుమంతరా విక్కడ ఆనర్సుకోర్సు చదువుతున్నాడు. ముచ్చటైన మేడ, మూడో అంతస్తులో ఉంటున్నాడు. అతని దగ్గర డబ్బుండాలే కాని దాచుకునే రకంకాదు. ఈ కష్ట సమయంలో హనుమంత రావు ఆదుకుంటాడనే ఆశ నాకు బాగా కలిగింది.

హనుమంతరావుండే మేడ మీదకు వెళ్ళాను. అతని గది నాకు తెలును. కాని నాకక్కడెవ్వరూ కనిపించ లేదు.

నేనింకా లోపలికి వెళ్ళబోతున్నాను. ఇంతలో ఆ ప్రక్క భాగం లోంచి ఒక అమ్మాయి బయిటికి వచ్చింది.

'ఎవరి కోసం?' ఆ అమ్మాయి అడిగింది.

'హనుమంతరావు. స్టూడెంటు.'

ఇప్పుడికక్కళ్ళేరు. గది ఖాళీచేసి వెళ్ళి పోయినారు.

నేను మేడదిగబోతోంటే ఆ అమ్మాయి నన్ను పిలిచింది.

'మీకు ఆయనతో పనుందా?' అవునన్నట్లు నేనామె వైపు చూచాను. వెంటనే ఆ అమ్మాయి లోపలికి వెళ్ళి ఒక్క క్షణంలో తిరిగి వచ్చేసింది.

'ఇవిగోండి. ఆయనకు రెండుత్తరాలున్నాయి. మర్చి పోకుండా ఇవ్వండి. ఉత్తరాలొస్తే ఆయన అడ్రసుకు పంప మన్నారు'

ఆ అమ్మాయి ఆ రెండు ఉత్తరాలు నా చేతికిచ్చింది. హనుమంతరావు ప్రస్తుతం ఉంటున్న అడ్రసుకూడా చెప్పింది.

మళ్ళీ నేను దారి పట్టాను. నాకింకా పూర్తి నమ్మకం ఉంది. ఇది చివరి ప్రయత్నం. హనుమంతరావును కల్సుకుం టేనేగాని ఈ ఆపద గట్టెక్కేట్లులేదు. నేనలా వెళ్తోంటే దోవలో కొత్తగా కడుతున్న ఒకబంగళా కనపడింది. ఇద్దరు పెద్ద మనుషులు నిలబడి పనివాళ్ళతో ప్లాను చెపుతున్నారు. అక్కడే చిత్రికపట్టిన చెక్కపేళ్లు కుప్పగాపోసి ఉన్నాయి. నే నలా పోతూ పోతూ రెండు చెక్కపేళ్లు తీసుకున్నాను. ఒకటి నోట్లో వేసుకున్నాను. మరొకటి జేబులో వేసుకున్నాను.

నా కాకలి అధికంగా ఉంది. కడుపులో మెలివేస్తోంది. ఆయాసం వస్తోంది. నడవలేక పోతున్నాను. చివరికెలా అయితే

నేం ఆ అమ్మాయిచెప్పిన ప్రకారం హనుమంతరావు అడ్రసు కనుక్కోగలిగాను... ...వీధి ... నెం... ... రెండో అంతస్థులో మొదటి గది ...

మేడఎక్కుతూ జేబులోంచి ఉత్తరాలుతీసి చేతిలోపట్టుకున్నాను. హనుమంతరావు కనపడగానే ఆ ఉత్తరాలు అతనికిద్దామని అలాచేశాను. నా కతను తప్పకుండా సహాయంచేస్తాడు. అతని హృదయమే వేరు. అతని సంగతి నాకు బాగా తెలుసు.

గదితాళం వేసిఉంది. తలుపుమీద అతని పేరుఉంది. 'పి. హనుమంతరావు. బి. ఎ. ఆనర్సు' 'ఎక్కడికివెళ్లి ఉంటాడు చెప్మా? కాలేజీనుంచి ఇంకా రాలేదా?' నా కేమీ అర్థంకాక ఆందోళనతో అటూ ఇటూచూస్తూ ఒక్కక్షణం అక్కడ నిలుచున్నాను. ఇంతలో మేడమెట్లు ఎవరో ఎక్కుతున్నట్లు చప్పుడైంది. హనుమంతరావే అయిఉంటాడని ఆదుర్దాగా అటువైపు చూచాను. కాదు. నాకర్మ కాలిపోయింది. హనుమంతరావుకాదు. ఎవరో ముసలమ్మ.

'హనుమంతరావుకోసం వచ్చారా? ఆ అబ్బాయి లేదు. సెలవుల్లో ఇంటికి వెళ్లాడు. కాలేజీ తెరవగానే వస్తాడు. ఏమైనా చెప్పాల్సిఉంటే నాకు చెప్పండి.'

నేను కుప్పగా కూలిపోయాను. ముసలమ్మ మాటలు నా చెవులకు పిడుగుల్లా వినిపించాయి. నాకాళ్లు భూమిమీద ఆనడంలేదు. నోట్లోంచి మాట పెగిలిరాలేదు. ఆరెండు ఉత్తరాలు ఆమె చేతికివ్వబోయాను కాని నాచేతులు వణుకుతూండడంవల్ల అవి క్రిందబడ్డాయి. ఆమె ఒక్కక్షణం నావైపు ఎగాదిగాచూచి ఆ ఉత్తరాలు తీసుకొని లోపలికి వెళ్లిపోయింది.

నేనలా హనుమంతరావు గదిముందు వదినిముషాలు శవంలా కదలకుండా నిలుచున్నాను. రెప్పవాల్చకుండా తలుపు పై పేచూస్తున్నాను. తెల్లటి అక్షరాలు. 'పి. హనుమంతరావు. బి. ఎ. ఆనర్సు' నా కళ్ళవెంట నీళ్లు రాలేదు. నా కాళ్ళక్రింద మన్ను మాత్రం తొలుచుకపోతున్నట్లుగా తోచింది. 'పోనీలే. అతని ఉత్తరాలైనా భద్రంగా అప్పజెప్పాను. అందులో ఎవైనా అవసరమైన సంగతులుండవచ్చు. రాగానే చూచుకుంటాడు'.

బయిటికి వచ్చి రోడ్డుమీద నిలబడ్డాను. రెండు చేతులు పైకెత్తాను. పిడికిళ్లు బిగించి ఇలా బిగ్గరగా అరిచాను. 'ఓ దేవుడా! నిజంగా నీకు బుద్ధిలేదు. ముమ్మాటికీ బుద్ధిలేదు. నీకు బుద్ధి ఉందని ఎవడైనా అంటే నా పీకకోయించుకుంటాను....'

తల ఊపాను. ఆకాశంవైపు చూస్తూ పదే పదే అరిచాను. అక్కణ్ణుంచి నాలుగడుగులు నడిచి మళ్ళీ ఆగిపోయాను. హఠాత్తుగా నా మనస్సు మారి పోయింది. రెండుచేతుల్తో నా తల పట్టుకొన్నాను. నా కళ్ళవెంట నీళ్లు కారుతున్నాయి. గద్గద స్వరంతో ఇలా అన్నాను. 'భగవంతుడా! నిన్నెన్నిసార్లు ప్రార్థించాను? ఎన్నిసార్లు వేడుకొన్నాను. కాని నా మీద నీకు దయ కలగలేదు. నా ఏడుపు నీకు వినిపించలేదు.'

'ప్రపంచం ఎంత పెద్దదో, అంతపెద్దగా నేను ఎడ్చాను. అవును. అతడు మోసగాడు, వంచకుడు. ఓ మూర్ఖుడా! ముందు నీకు బుద్ధిలేదు. లేకపోతే అతన్ని ఎందుకు వేడుకోవడం? అతను గారడీవాడు. కపట నాటకం ఆ దేవాడు. అతన్ని నమ్ముకొనే నీవు చెడి పోయినావు.'

కడుపుమీద కొట్టుకున్నాను. నా కళ్లు తిరుగుతున్నాయి. ఏదో మూర్ఛ వస్తోన్నట్లుగా ఉంది. అలా నడిరోడ్డుమీద

నే నెన్నివిధాల నాట్యంచేశానో చెప్పలేను. వచ్చేపోయే జనం నన్ను విచిత్రంగా చూస్తున్నారు. కొందరు విరగబడి నవ్వుతున్నారు.

నా నోట్లోఉన్న చెక్కపేడు ఎడతెగకుండా నములుతున్నాను. చర్చిదగ్గరకు వచ్చిచూస్తే రెండుగంటలు కావస్తోంది. అక్కడొక్కక్షణం నిలబడ్డాను.

నాలుగు బజార్ల కూడలిలో జనసమ్మర్దం ఎక్కువగా ఉంది. గభాలున అక్కడికి పరిగెత్తాలనిపించింది. వెళ్లి ఒకవైపు ఫుట్‌పాత్ మీాద కూర్చున్నాను. కార్లు, ట్రాములూ, టాక్సీలు, అటూ ఇటూ పరిగెడుతున్నాయి. కొంతసేపు అలా చూస్తూ కూర్చున్నాను. ఏడెనిమిది సంవత్సరాల అమ్మాయి వేరుశెనక్కాయలు అమ్ముతూ నాదగ్గరికి వచ్చింది.

అతుకులువేసి కుట్టిన పరికిణీ, అక్కడక్కడ చిరిగిన చొక్కా అమాయకంగా ఉంది.

'వేరుశెనక్కాయలు. వేడిగా ఉన్నాయి. అర్ధణా!' విచిత్రంగాచూస్తూ అడిగింది.

నేను గభాలున లేచి నిలబడ్డాను. అర్థణా బయటికి తీయడం కోసం, నా కోటుజేబులు, పాంటు జేబులు వెదుకుతున్నాను. కొద్దిక్షణాలు అలా గడిచాయి. ఎంతకూ నేను డబ్బు బయటికి తీయనందు వల్ల చివరకా అమ్మాయి అర్థం చేసుకొంది. నా దగ్గర డబ్బులేదనీ, నేను కొనేవాణ్ణి కాదనీ, తనను ఎగతాళి పట్టించడం కోసం, తమాషా కోసం, అలా ప్రవర్తిస్తున్నాననీ, ఆ పిల్ల భావించింది. ముఖం చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయింది.

ఆ పిల్ల చూపులు నన్ను విపరీతంగా బాధించాయి.

నోటితోటి తిడితే ఎంతో బాగుండేది. ఎంతగానో సంతోషించే వాణ్ణి. అలా కాకుండా చూపుల్తో నన్ను పొడిచింది. నాశరీరం నెయ్యి బల్లాలతో పొడిచినట్లుగా ఉంది.

'అవును. పసిబిడ్డకు కూడా నా మీద నమ్మకంలేదు. అసలు ప్రపంచానికే నా మీద నమ్మకం లేదు. నేనెందుకు అలా ప్రవర్తించాను? నా దగ్గర అర్థణా ఎక్కడుంది? అరపైసా కూడా లేదు. అనవసరంగా కొనే వాడికిమల్లే ఆ అమ్మాయికి ఆశ పెట్టాను.' నా కాపిల్లమీద జాలివేసింది.

'ఏయ్ అమ్మాయి. ఇలారా!' ఆ పోయేపిల్లను పిలిచాను. దగ్గరికి వచ్చింది. నా స్వెట్టరుతీసి ఇవ్వబోయాను. నాకు స్వెట్ట రెక్కడుంది? దాన్ని బ్రోకరాఫీసులో అమ్మేశానుగా! ఇంతలో నా చుట్టూ జనం పోగయ్యారు. నేనేదో తమాషా చేస్తున్నాని జనమంతా నన్ను చూడడం మొదలు పెట్టారు. ఒక కాన్‌స్టేబుల్ ఆ జనం మధ్యలోంచి తోసుకొని నా ముందు కొచ్చాడు.

'ఏయ్ మిస్టర్! ఎమిటిది?'

నా నాలిక మడతపడింది. ఎదో చెప్పబోయి గొణిగాను.

'ఆ అమ్మాయికి నా స్వెట్టరిద్దామని పిలిచాను. కాదు. స్వెట్టరు కాదు. ...కోటు....పాపం వాళ్ళనాన్న చలితో బాధ పడుతున్నాడు....'

నాచుట్టూ ఉన్న జనం గొల్లుమని నవ్వారు. నేను మళ్ళీ కోపంతో ఇలా అన్నాను.

'ఎందుకు? ఎందుకలా విరగబడి నవ్వుతారు? ఏముందనీ? నేనా అమ్మాయికి నా కోటు ఇద్దామనుకున్నాను. ఇందులో విచిత్రమేముంది?'

'ఏయ్ మిస్టర్. రోడ్డుమీద ఏమిటీ న్యూసెన్సు, ముంది క్కణ్ణుంచి వెళ్ళిపో- ఊ— లాఠీ కర్రతో నా బుజంమీద పొడిచాడు కానిస్టేబుల్. నేను వెళుతోంటే కానిస్టేబుల్ నన్ను మళ్ళీ కేకవేశాడు.

'ఆ కాగితాలు నీవేనా?'

'ఓ మరిచిపోయాను. నావే-పత్రికకు పంపాలి. చాల ముఖ్యమైన కాగితాలు.' అంటూ ఆ కాగితాలబొత్తి తీసుకొని అతనివైపు చూడకుండా వెళ్ళిపోయాను.

నేను తిరిగే పత్రికా ఆఫీసుకు వెళ్ళేసరికి నాలుగుగంటలు దాటింది. ఆఫీసు మూసివుంది. మేడదిగి గుమ్మం ప్రక్కగా గోడకాను కుని నిలబడ్డాను. 'ఇప్పుడేం చేయాలి?' నన్ను నేను ప్రశ్నించు కున్నాను. దొంగలాగా ఒదిగి నిలబడి ఉన్నాను. తప్పు చేసినవాడికిమల్లే తలవొంచుకుని నేలమీద రాళ్లు పరీక్షిస్తున్నాను. రాళ్లమధ్య ఒక పిన్నీసు తళతళమెరుస్తూ నాకంట బడింది. వంగి ఆపిన్నీసు తీసుకున్నాను. 'దీంతో నాకోటు గుండీలు ఊడదీసి అమ్మితే ఎంత డబ్బొస్తుంది? రెండు గుండీలు పగిలిపోయినాయి. మిగతావి బాగానే ఉన్నాయి. కనీసం ఒక అణాకు ఎవరైనా కొంటారు. పాతబడిపోయినాయి కాని లేక పోతే ఇంకా ఎక్కువవచ్చును. మంచి ఊహతట్టింది.

ఆ పిన్నీసుతో కుటుతూ ఒక్కొక్కగుండీ ఊడదీయడం మొదలుపెట్టాను. అవి ఊడదీస్తూ నాలోనేను ఇలా అనుకు న్నాను.

''ఫరవాలేదు. ఏంభయంలేదు. గుండీలు లేకపోయినంత మాత్రాన ఏంకొంపలు మునుగుతాయి? అవును. గుండీలులేని కోటు తొడుక్కోవడం నా అలవాటు. నేనీవేషంతోటే ఎన్ని

చోట్లైనా తిరగ్గలను. ఎంతమందితోనైనా మాట్లాడగలను... ఏ పోలీసువాడైనా పసికట్టి ఈగుండీలు నేను దొంగిలించాడను కుంటాడేమో?...... ఎవరేమనుకున్నా నేను లక్ష్యపెట్టను... నాకిప్పుడు డబ్బుకావాలి.''

ఇంతలో పైకి ఎవరో వెడుతున్నట్లు గమనించాను. అతన్ని ఆపి ఎడిటర్‌గారెక్కడికి వెళ్లారని అడిగాను.

'ఆయనలేడని నీకెన్నోసార్లు చెప్పాను. నీకు చెవుడొచ్చిందా ఏమిటి?'

'అబద్ధం. ఆయన ఆఫీసులోనేఉంటాడు. నాకు అత్యవసరమైన పనుంది. నేనొక శాసన సభ్యుడికి సంబంధించిన మనిషిని. సెక్రెటరియేట్‌నుంచి వస్తున్నాను.' ధైర్యంగా అతని ముందుకొచ్చి మాట్లాడాను.

'అయితే ఆపనేమిటో నాతోచెప్పండి.' అతను కొంచెం తగ్గి మాట్లాడాడు.

'మీతోనా?' అంటూనే ఆయన్ను ఎగాదిగా పరీక్షించి చూచాను.

నా ప్లాను బాగా పనిచేసింది. దీంతో అతను చిత్తయిపోయినాడు. మారు మాట్లాడకుండా నన్ను మేడమీదకు తీసుకెళ్లాడు. ఒకవైపు ప్రత్యేకంగాఉన్న గది తలుపు తీశాడు. అది ఎడిటర్ ప్రైవేయిట్ రూం. నా వంట్లోకి ఎంతోసత్తువ వచ్చింది. ధైర్యంగా లోపలికి వెళ్ళాను.

'...గుడ్‌మార్నింగ్...ఓ! నీవా? ఎవరో అనుకున్నాను ...కూర్చోండి' మామూలు ధోరణిలో మర్యాదచేశాడు ఎడిటర్—

'క్షమించండి. మీరు పనిలో ఉన్నట్లున్నారు.' నేను కొంచెం భయపడుతూ సమాధానం చెప్పాను.

'ఫరవాలేదు. ముందు కూర్చోండి.'

ఎడిటర్‌కు ఎదురుగా కూర్చొని నే వచ్చిన పనినిగురించి చెప్పాను. వ్యాసం చాల కష్టపడి వ్రాశానని, ఎలాగైనాదాన్ని పత్రికలో ప్రకటించి పారితోషికం ఇప్పించవలసిందనీ, వినయంగా వేడుకున్నాను.

'నేను తప్పకుండా చదువుతాను.' అంటూ నా రచన తీసుకున్నాడు.

'మీరు బాగా వ్రాస్తారు. మీ రచన ఉత్తమంగా ఉంటుంది. సందేహంలేదు. కాని మీరు చాలా ఆవేశంగల మనిషిలా తోస్తుంది. అలాకాకుండా కొంచెం శాంతంగా, గంభీరంగా రచన చేయండి. మీ మనస్సులోఉన్న అశాంతి, అలజడి, నిరాశ,నిస్పృహ, మీ రచనలో స్పష్టంగా కనబడతాయి. అయినా నేను తప్పక చదువుతాను.' అంటూ అతను మళ్ళీ తన పనిలో నిమగ్నుడైనాడు.

నేను కూర్చొనే ఉన్నాను. 'ప్రస్తుతం ఒకరూపాయి అడిగితే ఏం? నా రచనల్లో నిరాశఉందా? ఉంటే ఏమిటో విశదపర్చమని అడుగుతాను.'

ఇలా అనుకున్నానేకాని నాకు ధైర్యం చాలలేదు. రూపాయి అడగటానికూడా ఏదో సిగ్గనిపించింది. ఏదో అభిమానం, అధైర్యం, నన్నావరించాయి. లేచి నిలబడ్డాను.

'ఇంకేమైనా పనుందా?' మళ్ళీ అడిగాడతను.

'ఒక రూపాయి ఉంటే ఇస్తారేమోనని; మనస్సులో

మాట నోటిదాకా వచ్చింది. కాని పెదవుల దగ్గరే ఆగి పోయింది. బయటికి అనలేకపోయాను.

'ఏంలేదు. మళ్ళీ ఎప్పుడు కల్సుకోమంటారు?'

'మీఇష్టం. ఒకటి రెండురోజుల్లో ఎప్పుడైనా సరే అలా వెళ్ళేటప్పుడు ఎప్పుడో ఒకసారి కనపడండి.' 'థ్యాంక్సు.'

రోడ్డు మీదికి వచ్చాను. మెట్లుదిగానో లేదో కడుపులో ఆకలి దహిస్తోంది. మరి ఏంచేసినట్లు! ఎడిటర్‌ను కల్సుకున్నానుగా! ఆకలితో చస్తున్నా అర్ధరూపాయి డబ్బులు అడగడానికి అభి మాన పడ్డాను. జేబులోంచి చెక్కపేడుతీసి నోట్లోవేసు కున్నాను. మళ్ళీ నాలో ఒక్కసారి విచిత్రమైన బాధ విజృం భించింది.

'......నీవు వట్టి అసమర్థుడివి. దద్దమ్మవు. నీవు ప్రపం చంలో ఎందుకూ పనికిరావు. నీకు స్థిరమైన చిత్తంలేదు. నీ వొక విచిత్రమైన మనిషివి. కారెడు పరిగెడతావు. మూరెడు కుంగుతావు. అంతలో ఆవేశం. అంతలో చల్లారి పోతావు. ప్రొద్దుటనుంచీ పత్రికా సంపాదకుడి కోసం పలవరించావు. తీరా అతను కనిపించింతర్వాత నీ ఆపద చెప్పి డబ్బు అడగ లేక పోయినావ్... నీవు వట్టి అసమర్థుడివి.' పెద్దగా రోడ్డుమీద అరిచాను. 'భగవంతుడా! నన్నెందుకు పుట్టించావ్? చెప్పవేం? చెప్పవేం?' నా అసమర్థతకు నేనే కారణ మనిపించింది. నేను చేస్తున్న పిచ్చిపనులకు నన్ను నేనే శిక్షించు కోవాలని తోచింది. బజార్ల వెంట పరిగెత్తడం మొదలు పెట్టాను. కుక్కలాగా పరుగు తీస్తున్నాను. 'ఇంకా....ఇంకా త్వరగా...వేగంగా'...

నన్ను నేనే హింసించుకోవాలనే ఉద్దేశంతో వళ్లు తెలియ కుండా పరిగెత్తాను. చాలా వీధులు దాటాను. రోజుతూ

రొప్పుతూ ఉన్నాను. నావళ్లు మెలికలు తిరుగుతోంది. మధ్య మధ్య ఒక్కక్షణం ఆగుతూ మాట్లుతున్నాను. చివరకొక వీధి మూలతిరుగుళ్లోకి వచ్చి నిలబడ్డాను. వళ్ళంతా వణుకుతోంది. ఏడుపు వస్తోంది. ఒక ఇంటిముందు అరుగుమీద కూలబడ్డాను.

'వీల్లేదు. ఆగడానికి వీల్లేదు. నీకీశాస్తి జరగాల్సిందే.' బలవంతాన లేచి నిలుచున్నాను. కాళ్లు తేలిపోతున్నాయనీ, కనీసం రెండడుగులు కూడ వేయలేనని, నాకు తెలుసు. ప్రయత్నంతో నిలబడ్డానేకాని ప్రాణం విలవిల తన్నుకుంటోంది. ఒక్క క్షణం తర్వాత నాలోనేను సమాధానపడ్డాను. తల వంకించి కూర్చోడానికి నిశ్చయించుకున్నాను. ఆ అరుగుమీద కూర్చుంటే బాగుండి పోయేది. అలా చేయలేదు. ఆ ప్రక్కనే ఒక పెద్ద దుకాణం మూసివేసి ఉంది. నాలుగడుగులు ముందుకువేసి ఆకొట్టు ముందు మెట్లమీద కూర్చున్నాను. కూర్చున్నా సుఖంగా లేదు. కూర్చోడానికి నేనెటువంటి స్థలాన్ని ఏరుకున్నాను?

ముఖంమీదనుంచి కారే చెమట తుడుచుకున్నాను. నెమ్మదిగా ఊపిరితీస్తున్నాను. 'అవకాశం రానప్పుడు రాలేదని ఏడుస్తున్నాను. అదను, అవకాశం దొరికినప్పుడుకూడా నా అవసరాల్ని తీర్చుకోలేని అసమర్థుణ్ణి అయిపోయాను. అంచేత నేనలా బాధపడవలసిందే. చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ! నాది నే ననుభవించవలసిందే' ...... క్షణ క్షణానికి నాలో నీరసం ఎక్కువౌతోంది. నా నరాల్లో రక్తంకాదు ప్రవహించేది. నీళ్లు...నీళ్లైన నీళ్లు. సముద్రమంత దుఃఖం నన్నావరించింది. ఏడుస్తున్నాను. కాని అది కనిపించని ఏడుపు. ఎవ్వరూ

కనుక్కోలేని ఏడ్పు. కళ్ళవెంట ఒక్క చుక్కకూడా నీళ్లురాని ఏడ్పు...ఏడ్పు... ఏడుసముద్రాలంత ఏడ్పు......

అలా దాదాపు ఒక అరగంటసేపు అక్కడే కూర్చున్నాను. జనం వెడుతున్నారు. వస్తున్నారు. కాని నన్నెవ్వరూ పట్టించుకోలేదు. కొందరు పిల్లలు నా చుట్టూచేరి ఆడుకుంటున్నారు. ఎవడో బిచ్చగాడు పాటపాడుతూ వీధిన పోతున్నాడు.

ఒక పోలీసు నా దగ్గరకు వచ్చాడు.

'ఏయ్! నీ వెందుకిక్కడ కూర్చున్నావ్?'

'నేనెందుకిక్కడ కూర్చున్నాను.' తమాషాగా అదే మాట సమాధానం చెప్పాను.

'అరగంటబట్టీ నీ వ్యవహారం కనిపెడుతున్నాను. ఏదో ప్లాను వేస్తున్నట్లున్నావ్? ఏమిటి నీఉద్దేశ్యం?' మళ్లీ అడిగాడతను.

'అంతేనా? ఇంకేమైనా అడగాల్సి ఉందా?'

నిర్లక్ష్యంగా సమాధానం చెపుతూ అక్కణ్ణుంచిలేచి వెళ్లిపోయాను.

మార్కెట్టు దగ్గరికి వచ్చానేకాని, నా అలసట ఆయాసం ఏమీ తగ్గలేదు. నాకంఠస్వరంకూడా మారిపోతూంది. ఉన్నట్లుండి నాకో ఆలోచన తట్టింది. నాకు కొంచెం తెలిసిన అతను ప్రసాదు జ్ఞాపకంవచ్చాడు. రేడియో ఇంజనీరు. అతని అడ్రెసు కూడాతలంపుకువచ్చింది. దగ్గరే-ఏమైనా సహాయంచేస్తాడేమో?

''ఎందుకు మళ్లీ తటపటాయిస్తావ్? ఆలోచనలకిది అదనుకాదు. ఆచరణ. ఆచరణకావాలి. నీ కర్మ ఇంతే. ఎందర్ని ఆశ్రయించందే నీ బ్రతుకు తెల్లవారుతుందా? అభిమానం చంపుకొని అయినవాళ్లచుట్టూ కానివాళ్లచుట్టూ కాలికి బలపంకట్టుకుని తిరగాలి. ఓ మూర్ఖుడా! నీకు లౌకికం

తెలీదు. అంచేత నీవు ప్రపంచంలో బ్రతకలేవు. నటించాలి. మాటలు చెప్పాలి. తలవొంచి తిరగాలి. బ్రతకడం నేర్చుకో వాలి. లేకపోతే నీ ఆకలి చల్లారేమార్గం లేదు. ఒక్కడుగు కూడా ముందుకు వెయ్యలేవు. వింటున్నావా నేచెప్పేది? మాటల్ని పాటలుగామార్చి అందరిదగ్గరా పాడు. పొగడ్తల పొగడమాలలు అందరికివెయ్యి. అన్నిటికన్నా ప్రపంచంలో బలమైంది అవసరం. తెలుసా? ఇప్పటి నీ అవసరం ఆకలి. అనవసరంగా దేవుణ్ణి నిందిస్తే ఏంప్రయోజనం? నీవింకా పూర్తిగా నిరాశ చెందలేదు. ఆశ. ఆశా స్త పోగొట్టుకోకు. నీకు మిగిలిఉన్న ఆస్థిఅదే - నమ్మకం - బ్రతుకుమీద నమ్మకం - భవి ష్యత్తుమీద నమ్మకం. ఈ అంధకారంనుంచి నీవు బయటపడే మార్గం అదే. ఊ! వెళ్లు_వెళ్లు......"

నా అంతరాత్మ ప్రబోధించింది. రేడియో ఇంజనీరు ప్రసాద్ ఇంటికి వెళ్లాను. అతని ఆఫీసుగది తాళంవేసిఉంది. పనిచేయు కాలం 10 గం॥ మొదలు 5 గం॥ వరకు అని బోర్డు మీద వ్రాసిఉంది. పరవాలేదు. ఏం భయపడనక్కరల్లేదు. ఇలా జరగటం మామూలే. ఇంట్లోకివెళ్ళి ప్రసాద్‌ను గురించి అడిగాను. పనిమనిషి కనపడింది.

'బజారు కెళ్లారు. ఏం పని?'

'ఏంలేదు - ఏంలేదు. మళ్ళీవస్తాను.'

సమాధానం చెపుతూ వీధిలోకొచ్చి నిలబడ్డాను. చీటీ రాసి ఇంట్లో ఇద్దామనుకున్నాను. కాని వెంటనే అలాచేయడం అనవసరమనితోచింది. ఒకగంట ముందుగావస్తే ప్రసాదు నాకు కనిపించేవాడు. నేను గంట ఆలస్యంచేశాను. ఈ గంటకాలం నన్ను కాటువేసింది. నడుస్తున్నానేకాని నాకు ప్రపంచం తెలి

యడంలేదు. చేతులు, కాళ్లు చచ్చుతీపులు పుటుతున్నాయి. రోడ్డుమీద అరటిపండుతొక్క కనపడితే తీసుకొన్నాను. నోట్లో వేసుకొని కొంచెంసేపు నమిలేసరికి కడుపులో తిప్పడం మొదలు పెట్టింది. డోకు వచ్చేలా అనిపించింది.

'నే నెందుకు బ్రతకడం? ఏం చేయడంకోసం? ఇలా ఎంత కాలం ఓర్చుకోగలను?' ఒక్కక్షణం నా మనస్సులోకి ఏ ఆలోచనా రాలేదు.

కొద్దిసేపటికి నేను చచ్చిపోవడానికి సిద్ధంగా ఉన్నట్లు తోచింది. అంత్యక్షణాలు ఆరంభమైనాయనిపించింది. మళ్ళీ నాలో నేను ఇలా అనుకున్నాను. 'ఓ మూర్ఖుడా! నీ చావు చాలాకాలంక్రిందనే ప్రారంభమైంది.'

గదికివెళ్ళి పడుకుంటే బాగుంటుందనుకున్నాను. 'అవును. ఆ నులక మంచంమీద హనుమంతరావు దుప్పటి పరుస్తాను. మెత్తగా ఉంటుంది. హాయిగా నిద్రపడుతుందేమో!'

హనుమంతరావు దుప్పటిమాట జ్ఞాపకం రాగా నే నాకో కొత్త ఊహ తట్టింది. ఆ దుప్పటి తాకట్టుపెడితే డబ్బొస్తుంది. ఆ తర్వాత సంగతి చూచుకోవచ్చు.

ఈ ఆలోచనతో నా గదివైపు గబగబ నడవడం మొదలు పెట్టాను. నే నెవర్ని చూడలేదు. ఎవరి విషయం పట్టించుకో లేదు. సరాసరి గదికివెళ్ళి మడతపెట్టివున్న హనుమంతరావు దుప్పటి చంకలోపెట్టుకుని బయటికి వచ్చేశాను.

సంతవీధిలో 5 నెంబరుగదికి వెళ్లాను అంతకుముందు నే నక్కడకు వెళ్ళలేదు కాని, అక్కడ ఉండేది వస్తువుల తాకట్టు వ్యాపారి అనిమాత్రం తెలుసు. తలుపు కొట్టిన కొంచెంసేపటికి

ఒకతను ప్రక్కగదిలోంచి బయటికొచ్చాడు. అన్నం తింటు న్నట్లుంది. మూతి తుడుచుకుంటున్నాడు.

'నాకళ్ళజోడు తాకట్టు పెట్టుకుని ఒక అర్థరూపాయి ఇస్తారా? రెండు మూడురోజుల్లో డబ్బిచ్చి వాటిని వదిలించు కుంటాను.'

'అక్కర్లేదు. అవెందుకూ పనికిరావు. అదినికెల్ ఫ్రేంకదూ?'

'అవును.'

'అందుకనే అవి పనికిరావు.' గట్టిగా అదేమాటన్నా డతను.

'అవును. మీరలా అంటారని నాకుముందే తెలుసు. ఏదో తమాషాగా అన్నాను కాని, నేనసలు కళ్ళద్దాలకోసం రాలేదు. ఇదిగో దుప్పటి. మంచిదుప్పటి. దీన్ని ఉంచుకొని ఏదైనా ఇప్పించండి.' దుప్పటి చూపిస్తూ అన్నానీమాటలు.

'బాగానే ఉంది. కాని నాగదంతా సామానుతో నిండి పోయింది. అంగుళం కూడా జాగాలేదు.'

అంటూ అతను లోపలికి వెళ్ళబోయాడు.

'ఎలాగైనా మీరిది తీసుకొని మీకుతోచింది ఇవ్వండి- ఇదిచాలా ఖరీదైన దుప్పటి.' అంటూ దుప్పటి మడత విప్పితీసి చూపించ బోయాను.

'చెప్పాను కదయ్యా వద్దనీ. కొట్లో ఉన్నసరుకే వదిలిం చుకోలేక చస్తున్నాను. పైగా మరొకటెందుకు తద్దినం; మరొక చోటుకువెళ్లు. ఇప్పుడున్న వ్యాపారపరిస్థితిలో ఆదుప్పటి ఉంచుకొని ఒక అణాకూడా నీకు ఇచ్చేవాడుండడు.'

'పోనీయండి. మీకంతగా నచ్చకపోతే ఏంచేస్తాం? దీని

దుంప తెగ! ఇంత పెద్ద దుప్పటి పావలా అయినా చెయ్యదంటారా? దయచేసి దీన్ని తీసుకుని ఒక పావలా ఇప్పించండి.' అన్నాను నేను అతిదీనంగా.

'అబ్బబ్బా! వద్దు బాబూ. వద్దు. నాకది అసలక్కర్లేదు. పావలా కాదు అణాకూడ ఇవ్వను. తెలిసిందా?' కసురుకొని మాట్లాడాడతను.

ఇక నేనక్కడ నిలబడకుండా త్వరత్వరగా మళ్ళీ నా గదికి వెళ్ళాను. దుప్పటి తీసి మంచంమీద పరిచాను మడతలు పోవడంకోసం చేతుల్తో సరిచేశాను. పడుకునేముందు అప్పు డప్పుడు అలా చెయ్యడం నా కలవాటు. కొంతసేపు మంచం మీద పడుకున్నాను. గడిచిందంతా మరిచి పోవడం కోసం ప్రయత్నించాను. ఏమీ ఒడుదుడుకులు లేకుండా సుఖంగా, జీవితం గడుస్తున్న వాడికి మల్లేఉండాలని నటించాను. మనస్సు లోకి ఏ ఆలోచన రానీయకుండా మంచంమీద పడుకున్నాను. నిద్రపడితే బాగుండును. కడుపులో మండుతోంటే నిద్రఎలా పడుతుంది? చీకటిగదిలో ఉండడం కంటె ఏ చెట్టుకిందనో గడ పడం మంచిదని తోచింది.

తిరిగీ నగరంలోకి వచ్చిపడ్డాను. జనసమ్మర్దంలో కొంత సేపు తిరిగాను. చివరకు చర్చి దగ్గరికివచ్చి కూలబడ్డాను. తల క్రిందికి వ్రేలాడవేసి కూర్చున్నాను. నేలమీద గుండ్రనిరాయి ఒకటి కనపడింది. చేతులోకి తీసుకున్నాను. చిన్నరాయి. నున్నగా ఉంది. తెల్లగా స్ఫటికంమాదిరిగా ఉంది. దాన్ని నాకోటుమీద తుడిచి నోట్లో వేసుకున్నాను. ఏంచేయను? ఆరాయిని అలా చప్పరించడం మొదలుపెట్టాను. కొద్ది క్షణాలు

గడిచాయి. వచ్చేజనం, పోయేజనం, విరామంలేకుండా ఉంది. కార్లు, బస్సులూ, ట్రాములు; అన్నీ రణగొణధ్వనులు. చెవులు గింగురుమంటున్నాయి. తిరిగీ నాకోటు గుండీలు అమ్మడానికి ప్రయత్నించలేదు. ఇక అలాంటి ప్రయత్నాలవల్ల లాభంలేదని పించింది... ఇంకా తిరిగితే ఎవరైనా కనిపిస్తారేమో! ఏదైనా తిండితినేమార్గం దొరుకుతుందేమో అని మళ్లీ ఆశ కలిగింది.

మళ్లీ నడక ప్రారంభించాను. దోవలో పెద్ద హోటలు కనపడింది. చాల సందడిగా ఉంది. ఒక్క-క్షణం హోటలు ముందు నిలబడ్డాను. లోపలికివెళ్లి ఏమైనా పెట్టమని అడిగితే! ...నాపిచ్చి ఊహకాని అలా ఎన్నడూ అడగలేదు. అడిగితే బాగుండునని ఊహించడమేకాని అలా అడిగేశక్తి నాకులేదు. మళ్లీ రోడ్డుపట్టాను.

ఆ వీధిలో కొంచెం సందడి తక్కు-వగా ఉంది. ఒక యింటిముందు ఒక యువతి, యువకుడు పకపక నవ్వుకుంటూ మాట్లాడుకుంటున్నారు. ఇంకా కొంతదూరం వెళ్ళేసరికి ఒక అమ్మాయి కిటికీ దగ్గర నిలుచొని బయటికి తొంగిచూస్తోంది. ఆ వాలకం చూస్తే పడుపుగత్తెలా తోచింది. నేను మెల్లగా ఆ యింటిముందునుంచి నడుస్తున్నాను. ఇంతలో ఆ పిల్ల బయటికి వచ్చింది. గబగబ నా దాపుకు వచ్చింది. నేను నిలబడిపోయాను. ఒక్క- క్షణం నావంక ఎగా దిగా చూచింది. ఏదో భయపడ్డట్టు ఉలిక్కి-పడి పారిపోయింది. 'ఏం? ఆ పిల్ల ఎందుకలా చేసింది? 'ఓ మూర్ఖుడా! నీ ముఖంచూచి ఆ అమ్మాయి బెదిరిపోయింది. నీవు భయంకరంగా మారిపోయినావు. నీవు జబ్బు మనిషివి. నయంకాని రోగంతో నరాలు పీక్కు-ంటున్నావు. అందుచేత నీవు పడుపుగత్తెకుకూడా పనికిరాలేదు' ఆ పిల్ల

నన్ను గురించి ఇలా అనుకున్నట్లు నాకు తోచింది. నా చెక్కిళ్లు మీద చెయ్యిపెట్టి చూచుకొన్నాను. పల్చగా ఉన్నాయి. మామూలుగా నా చెంపలు పల్చగానే ఉంటాయి...ఇప్పుడవి పూర్తిగా గుంటలుపడి లోపలికి పీక్కుపోయున్నాయి. నా కళ్లు కణతల వరకు లాగాయి. రోజుల తరబడి అన్నం నీళ్లు లేక తిరుగు తోంటే ఏమవుతుందిమరి?'భగవంతుడా! నేనేం పాపంచేశాను...'

మళ్లీ పట్టరాని ఉద్రేకం వచ్చింది. పటపటమని పళ్లు కొరుక్కున్నాను. బలహీనుడికి కోపంవస్తే ఎలా ఉంటుంది? ఆకోపంలోనే నాకు ఏడ్పుకూడా వస్తోంది."మళ్లీ ఒకసారి నన్ను నేను హింసించుకోవడం ప్రారంభించాను. నాలిక కొరుక్కున్నాను. వచ్చేపోయే జనాన్నిగాని, మరొకటిగాని నేను గమనించడం లేదు. ఆ దూకుడులో నాతల రెండు మూడుసార్లు లాంతరు స్తంభాలకు కొట్టుకుంది. హింస పడుతూన్న కొద్దీ నాకు కసి, ఎక్కువాతోంది. నాచేతులు ముఖానికివేసి కొట్టుకున్నాను. నా పొడుగాంటిగోళ్లు అరచేతిల్లోకి గుచ్చుకున్నాను. వెక్కివెక్కి ఏడుస్తున్నాను......నేనేంచెయ్యను? నేనేంచెయ్యగలను?..." పెద్దగా ఈమాటలన్నాను. అప్పుడే నూటువేసుకున్న పెద్ద మనిషి నాముందునుంచి పోతూ ఓ చిరునవ్వు నవ్వాడు. 'ఏంచేస్తావా? జైల్లో పెట్టమని అడుగు' అంటూ వెళ్లిపోయాడు. నేనతన్ని పరికించి చూచాను. నాకు తెలిసినవాడే. డాక్టరు. అతనూ నేను అనేకసార్లు కలిసి కాఫీ తాగాం. కార్లో బీచ్‌కి వెళ్లాం. అతనితో నేనెన్నిసార్లు కరస్పర్శ చేశానో! నన్ను విచారించకుండా, గుర్తించకుండా, నాస్థితిని గమనించకుండా అవహేళన చేసిపోయాడు. 'అవును. నేను పిచ్చివాణ్ణి, బిచ్చగాణ్ణి; నన్ను జైల్లో పెట్టారు.'

జైలుమాట జ్ఞాపకం రాగానే నామనస్సు మళ్లీ చలించింది. విపరీతమైన భయం కలిగింది. 'వీల్లేదు. నన్ను జైల్లో పెట్టడానికి వీల్లేదు. ఆపోలీసులు, ఆ చీకటి గదులు నేను చూడలేను.

ఇంటింటికీ తిరిగైనా సరే ఎక్కడో ఇంతకూడు సంపాయించుకోవాల్సిందే. ప్రయత్నం మానుకోవడానికి వీల్లేదు. 'శీతారాం అండ్ కంపెనీ' గడియారాలషాపు నాకు తెలుసు. ప్రొప్రయిటర్ శీతారాంతో నాకు బాగాపరిచయం ఉంది. నేను బాగా బ్రతికిన రోజుల్లో అతని దగ్గర చాలగడియారాలు కొన్నాను. రిస్టువాచీల సెలక్షన్‌లో నాస్నేహితులందరూ నాకు రివార్డు ఇచ్చారు. ఎవరికి ఏ రకం గడియారం కావాలన్నా నేను స్వయంగా వెళ్లి సెలెక్టుచేసి పెట్టేవాణ్ణి. ఇప్పుడతనేమైనా నాకు సహాయంచేయకపోతాడా?''

గడియారాల షాపుకు వెళ్ళేసరికి 'శీతారాం' సిల్కు-లాల్చి, పైజామా వేసుకొని సిగరెట్టు కాలుస్తూ కూర్చుని ఉన్నాడు. పోగానే నమస్కారం చేశాను. వచ్చిన పనినిగురించి చెప్పాను. చాల ఇబ్బందుల్లో ఉన్నానని, కొద్దిగా డబ్బు సహాయంచేయమని ప్రాధేయపడుతూ అడిగాను.

శీతారాం సిగరెట్టుపొగ వదుల్తూ నా వంక ఎగాదిగా చూచాడు. తల అడ్డంగా ఊపుతూ పెదవి విరిచాడు. 'ఊహు. ఏంలేదు. ఏంలేదు.'

నా కాళ్లు వణికాయి. షో కేసును ఆధారంగా పట్టుకొని నిలబడ్డాను. 'మీరు తప్పక దయతలుస్తారని అంతదూరంనుంచి వచ్చాను. నా కథ ఇంకా అచ్చుకాలేదు. డబ్బురాగానే మీకు

తెచ్చి ఇస్తాను. ప్రస్తుతం భోంచెయ్యాలి. వీలైనంత ఇవ్వండి. పరవాలేదు.' మళ్ళీ నేను కళ్ళనీళ్ళపర్యంతంగా అడిగాను.

'మిస్టర్. ఎందుకు నన్నడుగుతావ్! నీవెవరో నాకు తెలీదు. నీకు తెలిసినవాళ్ళను పోయిఅడుగు.'

నా తల నరికేసినట్లయింది. అక్కడ నిలుచోలేక పోయాను. బయటికి వచ్చాను. హృదయంలో ఉప్పెన వచ్చి నట్లుంది. ఒక పోలీసు ఎదురుపడ్డాడు. అతన్ని తప్పుకొని నడ వడం ప్రారంభించాను.

అదొక బట్టలకొట్టు. అంతకుముందెప్పుడూ నేనక్కడకు వెళ్ళలేదు. బేరగాళ్లు బయటికి వెళ్ళేంతవరకు అక్కడే నిలబడ్డాను. ఒక ఆడకూతురు పెద్దపొట్లం చంకలో పెట్టుకొని బయటికి వచ్చింది. చీరెలు కాబోలు కొనుక్కొని పోతోంది. ఎంత అందంగా ఉంది?

అందరూ వెళ్ళింతర్వాత మెల్లగా షాపులోకి అడుగు పెట్టాను. చీరెలు బీరువాల్లోకి సర్దుతున్నాడొకాయన. నన్ను చూచాడు.

'మీకేంకావాలి?' అడిగాడు.

'షావుకారున్నారా?'

లేరు. బెంగుళూరు వెళ్లారు. వారితో ఏంపని?

'ఏంలేదు. ఒక పావలా డబ్బులకోసం. అంతే. చాల ఆకలిగా ఉంది. చేతిలో చిల్లి కానీలేదు.'

'ఓ అదా సంగతి? అందుకేనా దర్జాగా లోపలికొ చ్చావ్?' అంటూ అతను బట్టలు సర్దుకుంటున్నాడు.

'మరేమీ అనుకోకండి! మరణావస్థలో వున్నాను. అయిదారురోజులనుంచీ ఒకముద్ద అన్నం తినలేదు.'

అతను సమాధానం చెప్పకుండా తన పని చూచుకుంటున్నాడు.

'ఒక అణా అయినా ఇవ్వండి. రొట్టె కొనుక్కుంటాను. రెండురోజుల్లో తిరిగీ మీ అణా మీకు తెచ్చి ఇస్తాను. నేనూ బాగా బ్రతికినవాణ్ణే'.

'ఓహోహో! నీకు కాదూ చెప్పేది? జబరదస్తీకూడానా? పొద్దుటినుండీ నీబోటివాళ్లు లక్షమంది అయినారు. ఎంతమంది కని ఇస్తాం. మే మేం వ్యాపారంచేయాలనుకున్నావా? దివాళా తీయాలనుకున్నావా? పో పో! అందరికీ ఇదొక అలవాటై పోయింది. ముష్టి వెధవలు.'

అవమానం నన్ను దహిస్తోంది. గుప్పెడు మెతుకుల కోసం నేను కుక్కలా మారిపోయాను. ఎంత నీచంగా మాట్లాడాడు. చాలా రోజులు, కష్టాలతోనే గడిపాను. కాని ఇలాంటి క్షణం ముందెప్పుడూ చూడలేదు. నా తపనావస్థలో ఇది చిట్టచివరిది.

అప్పటికే ప్రొద్దుపోయింది. త్వరగా గదికి చేరుకోవడం మంచిది. ఏ పేవ్‌మెంటుమీదనో పడుకుంటే మళ్ళీ పోలీసులు లాకప్‌లో పెడతారు. లేనిబలాన్ని తెచ్చుకొని నడక సాగించాను. నాకు దప్పిక కావడం మొదలుపెట్టింది. ప్రొద్దుటనుంచీ గుక్కెడు నీళ్లు త్రాగలేదు. ఆ రోజుకల్లా దప్పిక అవడం అదే మొదటిసారి. నీళ్ళపంపు కనిపిస్తుం,దేమో అని చూస్తున్నాను. అప్పటికే నేను చాలాదూరం వచ్చాను- ఏ ఇంటిముందుకో పోయి నీళ్లుపోయమని అడగలేను. రోడ్డుప్రక్కన పంపు కనిపించింది. నీళ్లు నోట్లో పోసుకోగానే డోకు వచ్చింది. త్రాగలేక పోయాను. కొంచెం నీళ్లుతీసుకొని ముఖంమీద కొట్టుకున్నాను.

కొంచెం అలసట తీరినట్లనిపించింది. కొంతదూరం అలా నడిచాను. ఆ ప్రదేశం నిర్మానుష్యంగా ఉంది. అక్కడక్కడ దీపాలు మాత్రం ఉన్నాయి. దాపులో ఒక కిళ్లీకొట్టు కనిపించింది. నేనా దుకాణం ముందుకు వెళ్లాను. జేబులోంచి కోటు గుండీలు తీశాను.

'ఇవి తీసుకొని ఒక అణాఇవ్వు.' అతన్నడిగాను. పావం అతనికేమీ అర్థంకాలేదు. ఆశ్చర్యంగా నావైపు చూడసాగాడు. వెంటనే నేను నా కళ్ళజోడు తీసి అతని కివ్వబోతూ ఇలా అన్నాను.

'ఇవి తీసుకో - జోడు. కళ్ళజోడు. కానీ ఇవ్వు. చాలు. ఊ - చూస్తావేం!'

చివరకతను అర్థంచేసుకున్నాడు. నేను పిచ్చివాణ్ణని నిర్ణయించుకొన్నాడు. పెద్దగా నవ్వటం మొదలుపెట్టాడు. అలా నన్ను చూస్తూ చాలసేపు నవ్వాడు. ఆ తరువాత సిగరెట్టు పెట్టెలోంచి ఒక చార్‌మినార్ సిగరెట్టు తీశాడు.

'ఇదిగో - ఈ సిగరెట్టు కాల్చుకో - నీ గుండీలువద్దు, కళ్ళజోడువద్దు.'

అప్పటికి నాకు తెలిసింది, నేను పిచ్చిపనులు చేస్తున్నానని. ఒక చేత్తో కళ్ళజోడూ, మరొక చేతులో గుండీలు తీసుకొని పరుగెత్తసాగాను.

''అవును. నవ్వండి. అందరూ నన్ను చూచి నవ్వండి. నేనూ బాగా బ్రతికినవాణ్ణే. నా గడియారం సినిమా నటుడు కామేశ్వర్రావ్ కొన్నాడు. నేను అమ్ముకొన్న పుస్తకాలు పెద్ద పెద్ద ప్రొఫెసర్ల చేతుల్లోఉంటే చూచాను. నా పెర్వాణీ ఒక ప్రఖ్యాత ఫొటో స్టుడియో అతను తగిలించుకొని తిరుగు

తున్నాడు. వీటన్నిటివల్ల నేను గర్వపడుతున్నాను. ఎందుకు నన్నుచూచి నవ్వడం.''

కళ్ళజోడుతీసి నడుస్తోన్నందువల్ల ఎటువెడుతున్నదీ తెలియడంలేదు. అలా పరుగుతీస్తుండగా రోడ్డుమలుపు తిరుగుళ్లో ఒక మనిషిని తగిలాను. హఠాత్తుగా ఆగిపోయాను. అతనూ ఒక్కక్షణం ఆగి నన్ను పరకాయించి చూచాడు. తొందరలో తగిలానని క్షమాపణ చెప్పాను.

'ఓ!నీవా?ఎవరోఅనుకున్నాను'అన్నాడతను హఠాత్తుగా.

అతను నా దగ్గరికి వచ్చాడు. నే నతన్ని గుర్తుపట్టాను. జల్సామనిషి చంద్రం. పగలూ రాత్రీ అనకుండా తిరుగుతూ ఉంటాడు. పడక, పానం, జూదం, వాదం, అన్నిటిలో ఆరితేరిన మనిషి. డబ్బును నీళ్ళలా ఖర్చుపెడతాడు. పచ్చనోట్లను పైసాలకిౖంద చూస్తాడు. ఆ డబ్బెక్కణ్ణుంచి వస్తుందో ఆ ఈశ్వరుడికే ఎరుక.

'ఏమిటి ఇలా అయిపోయినావ్? ఏమిటి హడావుడిగా వెడుతున్నావ్?' మళ్ళీ నన్ను ప్రశ్నించాడు.

'పనిమీద పోతున్నాను. మీరు కులాసాగా ఉన్నారా?'

'ఓ! దర్జాగా ఉంది? నీ కెలా గడుస్తోంది?'

నా కాళ్లు వణికాయి. మాట్లాడలేకపోయాను. అతను నా పరిస్థితి కనిపెట్టాడు. నా చేతులోఉన్న గుండీలు, కళ్ళజోడు చూచాడు.

'పిచ్చాడా! ఇలా చేస్తే ఏమొస్తుంది? రా చెప్తాను. పెద్ద ప్లానుంది.' నా భుజంమీద చెయ్యివేశాడు. నే నేమీ జవాబు చెప్పలేదు. నా కళ్ళవెంట నీళ్లు కారుతున్నాయి.

'ఎందుకు? ఏంభయంలేదు. మన దగ్గర డబ్బుంది, కావల్సినంత. తిను. తాగు. నీ ఇష్టం.'

నన్ను తన చేత్తో పట్టుకొని తీసుకవెళుతున్నాడు. నాలు గడుగులు వేసింతర్వాత నేనిలా అన్నాను.

'8 గంటలకు ఒకతన్ని కలుస్తానని చెప్పాను. నేను వెళ్తాను.'

అతను నవ్వాడు.

'ఎనిమిది గంటలా? ఇప్పుడెంతైయిందో తెలుసా? తొమ్మిది దాటింది. నీ సంగతి నాకు తెలుసు. వట్టి అసమర్థుడివి. తిండికోసం తిప్పలుపడుతూ నా దగ్గర దాచిపెడుతున్నావ్! నా వెంట రా. హాయిగా గడుపుదాం.' నన్ను బలవంతాన లాక్కెళ్లాడు. నేను అతనితో కలిసి ఆ పెద్దమేడలోకి వెళ్లాను...



# మూడో అధ్యాయం

ఒక వారం హాయిగా, ఆనందంగా గడిచింది. ఆవారం రోజులు నా జీవితంలో వసంతఋతువు. కడుపునిండా భోజనం, కంటినిండా నిద్ర; నా వంట్లోకి కావాల్సినంత సత్తువవచ్చింది. గుండెల్లో ధైర్యంకూడా కూడుకుంది. మళ్ళీ కొంతకాలం అన్నంలేకపోయినా బ్రతకగలను. మరణవేదన అనుభవించ గలను.

'ఎక్కడున్నావే గొంగళీ అంటే, వేసిన చోటనే ఉన్నాను సంగడీ' అన్నట్లు వారంరోజులతర్వాత యథాప్రకారం తయారయ్యాను. నా దగ్గర కొద్దిగా చిల్లరడబ్బులున్నాయి. అంతే. మళ్ళీ రోజులు గడిచేదెలాగా? రచనలమీద దృష్టి కేంద్రీక రించాను. రెండుమూడు కథలు, ఒకటిరెండు వ్యాసాలు వ్రాస్తున్నాను. పగలంతా గదిలోనే కూర్చొని రచనలు సాగి స్తున్నాను. ఎంతో ఆశపెట్టుకుని పూర్తిచేసిన ఒక వ్యాసం పత్రికవాళ్ళదగ్గరనుంచి తిరిగివచ్చింది. కోపంపట్టలేక ఆ వ్యా సాన్ని మరొకసారి సరిచూచుకోకుండానే చింపివేశాను.

రాసీరాసీ నా చేతులు కాయలుకాశాయి. వ్రేళ్లు పచ్చి పుండ్లులాగా తయారై విపరీతంగా బాధపెడుతున్నాయి.

పెన్సులు పట్టుకోనివ్వడంలేదు. వ్రేళ్ళకు గుడ్డపీలికలు చుట్టి రాయడం ప్రారంభించాను. నోట్సునుబట్టి ముందు చిత్తు వ్రాస్తున్నాను. ఆ తరువాత నాకువస్తున్న క్రొత్తక్రొత్త భావాలను చేర్చి ఫెయిర్ కాపీలను తయారుచేస్తున్నాను. మధ్య మధ్య పేలవంగా, అతికించినట్లుగా ఉన్న మాటలకు, వాక్యాలకు పుష్టి, పరిపూర్ణత, ఉక్తి, ఉత్కృష్టత కలిగేలాగా మార్పులు చేస్తున్నాను. రచనలు అత్యుత్తమంగా తయారుకావాలనే ఉద్దేశ్యంతో నానా తంటాలుపడుతున్నాను. నా నులకమంచం, పాతటేబులు రచనలతో, కాగితాలతో నిండిపోయింది.

ఒకరోజు మధ్యాహ్నం అలా శ్రమపడి పూర్తిచేసిన రచన జేబులో పెట్టుకుని 'కాలచక్రం' పత్రికా ఆఫీసుకు బయలుదేరాను.

ఆఫీసు చాల చిన్నది. 'కాలచక్రం' ఎడిటర్ కుర్చీలో కూర్చొని ఏదో వ్రాసుకుంటున్నాడు. ఒకమూల న్యూస్‌ప్రింటు బొత్తులుగా పెట్టిఉంది. గోడలకు రకరకాల బొమ్మలున్నాయి. ప్రూఫులుదిద్దిన పేపర్లు, కత్తిరించిన కాగితాలు గదిలో ఎక్కడచూచినా కనపడుతున్నాయి. ఎడిటర్ వ్రాసుకుంటున్న బల్లక్రింద ఒక బ్రహ్మాండమైన పేపరు బాస్కెట్టుంది. హఠాత్తుగా అది నా దృష్టి నాకర్షించింది. పెద్ద బుట్ట. దయ్యంలా నోరు తెరచుకొని ఉంది. నా గుండెల్లో గుబులు బయలుదేరింది. ఆ బుట్ట అమాంతంగా ఒక మనిషిని మింగేయగలదు. ఎముకలుకూడా మిగలకుండా కొరికి తినేస్తుంది. దాన్నిండా కాగితాలు పడేసిఉన్నాయి. అనేకమంది రచయితల, ఆర్టిస్టుల, ఉత్తమకళాసృష్టినంతా ఆ బుట్ట తన నోట్లో ఇరికించుకొని నమిలివేస్తోంది.

ఆరి భగవంతుడా! ఎంతమంది కళాకారుల రక్తాన్ని ఆ బాస్కెట్టు పీల్చి ఉంటుంది! ఇంకా అది నోరువిప్పుకొని సిద్ధంగా కూర్చొని ఉందేమిటి!

'ఇవాళ గార్కెంత?' ఎడిటర్ తలఎత్తకుండా ప్రశ్నించాడు.

'28.' అతని నౌఖరులాగా నేను సమాధానంచెప్పాను.

'ఇరవై ఎనిమిదా.' అంటూ అతను వ్రాసుకుంటూనే ఉన్నాడు.

చివర కతను రెండు పోస్టు కవర్లుతీసి అందులో ఉత్తరాలుపెట్టి అంటించాడు. ఒకటి రెండు కాగితాలు నలిపి బుట్టలో పడేశాడు. ఆ తరవాత చేతిలో కలం బల్లమీదపెట్టి తల ఎత్తి చూచాడు. ఎదురుగా నేను కనపడ్డాను. ఒక్క-క్షణం నా వైపు సీరియస్‌గా చూచాడు. వెంటనే అతని ముఖంలో మందహాసం కనపడింది. ఎదురుగాఉన్న కుర్చీని చూపిస్తూ కూర్చోమని సైగ చేశాడు. నా కోటుకు గుండీలులేనందువల్ల ఒకప్రక్కకుమళ్ళీ జేబులోంచి కాగితాలు తీశాను.

'ఒక చిన్నపాత్రను తీసుకొని 'స్కెచ్'తయారుచేశాను. ఇది మీకు కొత్తరకంగా కనపడుతుందేమోకాని, ఇది వ్రాయడంలో నా శక్తినంతా ధారపోశాను...'

ఎడిటర్ నా చేతులోంచి కాగితాలు తీసుకొని చూడడం ప్రారంభించాడు. పేజీతరవాత పేజీ తిరగేస్తున్నాడు. మధ్యమధ్య ముక్కు నలుపుకుంటున్నాడు. అది అతని అలవాటు కాబోలు.

ఎడిటర్ ఏం సమాధానం చెపుతాడో అని నేను కొండంత ఆశతో ఎదురుచూస్తూ నిలబడ్డాను. అదేమిటో ఖర్మ! నా పాపిష్టి కలం ఎక్కడపెడితే అక్కడ మచ్చ పడుతుంది. ఎంతకష్టపడి వ్రాసినా ప్రతిఫలంరాదు. అది నా దురదృష్టం

అనుకోవాలి. లేదా నా అసమర్థత అన్నా కావాలి. రచన నిరాకరిస్తాడేమో అని భయం కలిగింది. నా కపకారం చేయ వద్దనీ, కనికరించి నా రచన తీసుకోవాల్సిందనీ చెపుదామను కున్నాను. నా కళ్ళవెంట నీళ్లు తిరిగాయి. మాట్లాడ లేక పోయాను.

అతను కాగితాలు మడిచి బల్లమీద పెట్టాడు. నా రచన అతన్ని కదిలించలేదని నా కర్థమైంది.

'ఆ రచన మీ పత్రికకు పనికిరాదా?' అతను నిరాకరిస్తే తిరిగి తీసుకోడానికి సిద్ధంగా ఉన్నట్లడిగాను.

'మా పాఠకులు మీకు తెలిసే ఉండొచ్చు. మా పత్రి కది అదొక రకమైన ధోరణి. ఇలాంటి రచనలు వాళ్ళర్థం చేసుకోలేరు. సరదాగా చదువుకొనేట్లుండాలి. సామాన్యమైన సన్నివేశాన్ని తీసుకొని చక్కలిగింతలు పెట్టేలాగా వ్రాస్తే బాగుండేది. ఇలాంటి సాహిత్యం సామాన్య ప్రజానీకం అర్థం చేసుకోడం కష్టం.'

అతను చాల నిబ్బరంగా మాట్లాడాడు. నా రచన నిరా కరించినట్లు పూర్తిగా అర్థమైంది.

'మీరు చెప్పింది నిజమే. థ్యాంక్సు వస్తాను.' రచన తీసు కొని బయలుదేరాను. నేను తలుపుదాకా వచ్చేసరికి అతను మళ్ళీ ఇలా అన్నాడు.

'కొద్దిరోజుల్లో మరొక మంచి కథ రాసి పట్టుకరండి. తప్పక తీసుకుంటాను. మీరింతకన్నా బాగా వ్రాయగలరని నా నమ్మకం.'

నేనింకా బాగా రాయగలనని ఎడిటర్ సర్టిఫికెట్టు

ఇచ్చాడు. అతని స్తుతిపాఠం నన్ను బాధపెట్టింది. అవమానం పొందినట్లుగా బాధపడ్డాను.

'నో. థ్యాంక్స్.' అంటూ ఇవతలికొచ్చేశాను.

'అవును. అతన్ని అనవలసిన పనిలేదు. నే నింకా ప్రియత్నంచేయ్యాలి. ఇంకా కష్టపడాలి.' మరోక మంచిరచన తయారుచేస్తేనేకాని అతని ముఖం మళ్ళీ చూడగూడదని నిశ్చయించుకున్నాను. 'ఈసారి నా రచన చూడగానే అతను మారు పలక్కుండా పదిరూపాయలు నా చేతుల్లో పెట్టాలి.'

గదికెళ్లి తిరిగీ రచనల్లో నిమగ్నుడనయ్యాను .... ...

పగలల్లా రాసీరాసీ కాస్త ఊపిరి పీల్చుకుందామని బయటికి వచ్చాను. సరీగ్గా నా గదికి ఎదురుగాఉన్న లాంతరు స్తంభం దగ్గర ఒక ఆడమనిషి నిలబడి ఉంది. నేను వెడుతోంటే ఆమె తన ముఖం నా వైపు తిప్పి అదోలా చూచింది. అలా కొద్ది క్షణాలు ఆమె తన కళ్ళతో నన్ను వెంటాడింది. ఆమెను చూడడం నాకిది మొదటిసారికాదు. గత మూడు నాలుగు రోజులబట్టీ ఆమె ఇదేవిధంగా చేస్తోంది. నల్లటి చిలుక్కచీరె, తలమీద ముసుగు, చేతిలో చిన్నగొడుగు, రోజూ అవే దుస్తులతో అక్కడే ప్రత్యక్షమౌతోంది. అదే లాంతరు స్తంభం దగ్గర; రోజూ అదే సమయంలో; అయిదారు గంటలవేళ — ఇలా జరగడం ఇది నాలుగోసారి.

నేను కొంతదూరం నడిచేసరికి ఆవిడకూడా నా వెంటనే వచ్చి గబగబ నన్ను దాటేసి వెళ్ళి పోతోంది. వెంటనే నా పిచ్చిబుర్రలోకి విచిత్రమైన ఆలోచన వచ్చింది. అలా ఆమె రోజూ అక్కడికి రావడం నా కోసమేనని అను కున్నాను.

నిత్యం ఆవిడ నిరీక్షణకు నేనే కారణ మనిపించింది. చివరకు నా ఆలోచన ఆమెదగ్గరకి వెళ్ళి పలకరిద్దామనేంతవరకూ వెళ్ళింది.

"అవును. ఆవిడ ఎవరికోసం నిరీక్షిస్తోందో అడుగుతాను ఆమెకు నా సహాయం అవసరమేమో! ఏదోవిధంగా నేనామెకు ఉపయోగపడ వచ్చు. కనీసం వాళ్ళ ఇంటిదాకా తోడు రమ్మంటుందేమో? కాని ఆమె దగ్గరికి వెళ్ళడం ఎలాగా? నా బట్టలు మరీపాడుగా ఉన్నాయే. నా చిరిగిపోయిన గుడ్డలు, రేగిపోయిన జుట్టూచూచి ఆమె నన్నొక బికారిగా భావిస్తుందేమో! నా ఈ అసహ్యమైన ముఖం ఆవిడకు చూపించడం ఎలాగా తీరావెళ్ళి మాట్లాడింతర్వాత మర్యాద కోసం ఆమెను హోటలుకు తీసుకెళ్లాలి. మంచికాఫీ ఇప్పించాలి. మరి నా దగ్గర డబ్బులేవీ? జేబులు ఖాళీగా ఉన్నాయి." ✓

సందేహంతో, సిగ్గుతో ఆమెదగ్గరికి వెళ్ళలేక పోయాను. నా ముఖం ఆమెకు కనపడకుండా చీకట్లోకి తప్పుకుంటూ నడుస్తున్నాను. మళ్ళీ నా కడుపులో ఆకలి తొలవడం ప్రారంభించింది. క్రిందటి సాయంత్రంనుంచీ నేనేమీ తినలేదు. నిజానికి నా కదొక లెక్కలోది కాదు. ఎన్నిరోజులు నేనిలా ఏమీ తినకుండా ఉండలేదు? కాని ఇవాళ నాకీ ఒక్కరోజు ఉపవాసానికే కళ్లుతిరుగుతున్నాయి. నడుస్తోంటే ఆయాసం వస్తోంది. నీళ్లు తాగుదామన్నా డోకనిపిస్తోంది. తిండిలేకపోవడం, దీనికితోడు రాత్రి, పగలు అర్థంలేని తిరుగుడు. ఇక నా ఆరోగ్యం ఎలా బాగుపడుతుంది? శీతాకాలంలో మంచుపడుతోంటే, చిరిగిన బట్టలతో నేను చెమ్మలో తిరుగుతున్నాను. చలికి నావళ్లు కొయ్యబారిపోతోంది. విపరీతంగా జలుబుచేసింది. వదలని రొంప. ముక్కులవెంట ధారాపాతంగా నీరుకారుతోంది. తల

భారం. రాత్రిళ్లు నిద్రపోయేటప్పుడు నా అవయవాలు బిగుసుక పోతున్నాయి. పాడుపడ్డగదిలో నా ప్రాణం పోకుండా ఉంది.

భగవంతుడా! మళ్ళీ నేను రచన పూర్తిచేసేదాకా బ్రతకడమెలాగా? నా గదిలో దీపం ఉన్నట్లయితే రాత్రిళ్లు కూడా కూర్చొని వ్రాసేవాణ్ణి. ఏంచేయను? కొవ్వొత్తి కొను క్కుందామన్నా కానీలేదు.

ఆ వీధిమలుపు తిరిగి వెడుతున్నాను. 'కార్నర్ కేఫ్'లో నాకు తెలిసిన కుర్రాడు పనిచేస్తున్నాడు. అతన్ని అడిగితే ఒక అర్ధణా ఇస్తాడేమో? కొవ్వొత్తి కొనుక్కుని ఈరాత్రి రచన పూర్తిచేస్తాను. రేపు 'కాలచక్రం' ఎడిటర్‌ను కలుసుకోవచ్చు.

'కార్నర్ కేఫ్' లోకి వెళ్ళాను. అన్నిగదుల్లోకివెళ్ళి ఆ కుర్రాడికోసం విచారించాను. డజన్లకొద్దీ కుర్చీలు, బల్లలు పరి శీలిస్తూ చూచాను. జనం తింటున్నారు, త్రాగుతున్నారు; సిగ రెట్లు కాలుస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆఖరుకు హోటలు వెనకభాగంలోకి వెళ్ళి వంటగదులుకూడా పరిశీలించాను. ఊహూ. నాక్కావల్సినకుర్రాడు కనిపించలేదు. విసుకుపుట్టి వీధిలోకివచ్చాను. పెద్దపెద్దభవనాలముందుగానడిచిపోతున్నాను.

నా కష్టాలకు అంతూపొంతూ లేకుండా ఉంది. గత ఏడెనిమిది మాసాలనుంచీ నేను కంట తడిబెట్టని గంటలేదు. అడ్డదిడ్డంగా పెద్దపెద్ద అంగలువేసుకుంటూ నడుస్తున్నాను. నా కోటుకాలర్లు పైకి ఎత్తి చెవులమీదికి వేసుకున్నాను. రెండు ప్రక్కల చిరిగినజేబుల్లో రెండుచేతులుంచుకున్నాను. గూని వాడికిమల్లే కునికిపాట్లుపడుతూ పోతున్నాను. నా దురదృష్టాన్ని ఎన్నివిధాలనో తిట్టుకున్నాను. నా మీద నాకే అసహ్యం వేసింది. కోపంవచ్చింది. కాండ్రించి తుపుక్కున ఉమ్మేశాను.

నడిరోడ్డుమీద, ఎవరేమైనా అనుకుంటారనికూడా లేకుండా అల్లంతదూరాన వడేలా ఉమ్మేశాను. 'ఛీ. వెధవ బ్రతుకు. ఎంగిలిబ్రతుకు.' విధినవ్వింది. అహ,హ,హ! వికృతంగానవ్వింది.

✓ 'నాకు పాపం పుణ్యాం, మంచీ,చెడూ ఏమీలేవు. తప్పొప్పుల విచారణ అనవసరం. ఆత్మాభిమానం, పాపభీతి పనికిరాదు. దేనికైనా తెగిస్తాను. ఏపనైనా చేస్తాను. పిచ్చివాణ్ణి. హనుమంతరావు దుప్పటిఅమ్మడానికి సంకోచించాను. అన్యాయమని భావించాను. ఈలోకంలో ఏది న్యాయం? ఏది అన్యాయం? ఒకరిన్యాయం మరొకరికి అన్యాయమవుతుంది. ఎవరుచేసింది వారికి న్యాయం. అంతే. అదే సరియైన సిద్ధాంతం. బళ్ళోకి వెళ్ళే పసిపిల్లలజేబుల్లో డబ్బులాక్కుంటాను. అనాధచేతుల్లో ఉండే అణాకాసు కొట్టేస్తాను. డబ్బు ఎక్కడకనపడ్డా ధైర్యంగా, సాహసంతో దొంగిలిస్తాను. దొంగతనం...మహాపాపం...... కాదుకాదు...మహాపుణ్యాం.....'

ఆ పెద్ద పెద్ద భవనాలచుట్టూ అయిదారుసార్లు తిరిగాను. అప్పటికి పదిగంటలు దాటింది. జనసమ్మర్దం చాలా ఎక్కువగా ఉంది. బండ్లచక్రాల మర్మరధ్వనులు, బూట్లచప్పుళ్లు, గుర్రం పందాలలో డబ్బులుపోగొట్టుకున్న ముఖాలు, బరువైన గుండెలు, త్రాణలుకోల్పోయిన ప్రాణాలు, మరణావస్థల తుది శ్వాసలు, 'కాపిటల్ హోటల్' ముందు 'అమ్మా' అని బిచ్చగాడి అరుపు ... ... ... ... ........ ..... ..... .....

నా జేబులో డబ్బులున్నట్లుగా భ్రమించాను. నా చేతికి డబ్బులు తగులుతున్నాయి. ఏదో తెలియని ఉత్సాహం పుట్టుకొచ్చింది. ప్రతిమనిషినీ నిర్లక్ష్యంగాచూస్తూ సీటుగా నడుస్తు

న్నాను. మెర్క్యూరీలైట్లముందు నా దుస్తులు మెద మెదలాడుతూ మెరుస్తున్నాయి. గుసగుసలుచేస్తూ చెట్టాపట్టాలు పట్టుకొని నడుస్తున్న యువతీ యువకులు, లోపల ఎంత కుళ్లున్నా, పైకి ఇచ్ఛకంగా బూటకాలు పలుకుతూపోతోన్న పెద్దమనుషులు, శరీరం గగుర్పొడిచే చల్లని గాలి, గర్భవతిలాఉన్న రాత్రి .... ఒక ఇంటిముందు మూతులు నాక్కుంటూ నిలుచున్న పిల్లి కూనల జంట, ఒక పెంపుడుకుక్క బౌ, బౌ మని అరుపు.....

'నా జేబులో ఏమున్నాయి? చిల్లులున్నాయి. దమ్మిడీ కూడా నోచుకోలేదు. దరిద్రపు బ్రతుకు. పద్నాలుగు భువనాల్లో, పోల్చుకోడానికైనా నాలాంటి పరమ దరిద్రుడు దొరకడు. ఇది నా బ్రతుకులో ప్రత్యేకత. తీరని అవమానం, మాయని మచ్చ ... ... ...'

'బళ్లోకివెళ్లే కుర్రాడి దగ్గర పలకో, పుస్తకమో కొట్టేస్తాను. ఆడపిల్లల చేతిలో రుమాలైనా దొంగిలిస్తాను. బిచ్చగాడు కనపడ్డా బాగుండు. వాడి జోలె లాక్కుంటాను. అందులో పట్టెడన్నమైనా దొరక్కపోదు. ఆ జోలెను పాతగుడ్డగామార్చి అమ్మేస్తాను.'

కావాలనే రకరకాల పిచ్చిచేష్టలుచేస్తున్నాను. జనం నా వైపు విచిత్రంగా, హేళనగా చూస్తూపోతున్నారు. వాళ్ళమీద కసితీర్చుకుందామని పళ్లుబిగబట్టి భుజాలు ఎగరేస్తున్నాను.

'స్టూడెంట్లు, బ్యాంకు గుమాస్తాలు, వ్యాపారస్తులు, ఉద్యోగస్తులు, అంతా వెధవ జనం, వెకిలజనం; వీళ్ళందర్నీ నేనేం చేశాను? నన్నెందుకెగతాళి చేస్తారు? కాసీడబ్బు వస్తుందంటే చాలు. నానాగడ్డి తింటారు. దేనికైనా కక్కుర్తి పడతారు. అందరూ అంతే. మోసగాళ్లు, దగాకోర్లు. మనసులో

ఒకటీ పైకిమరొకటీ. చెప్పేదొకటీ చేసేదొకటీ. ఘరానాగా తిరిగే ఈ పెద్దమనుసులందరూ అంతే - అరపెగ్గు విస్కీకోసం, ఒకగ్లాసు బీరుకోసం వీళ్లు పడేపాట్లు ఇంతా అంతాకాదు. కనీసం అరకప్పు కాఫీనీళ్లు పోయిస్తేచాలు. అనేక అబద్ధాలాడతారు. అర్ధగంటసేపు పొగుడుతారు. ఛీ! ఛీ!'

మళ్ళీ కాండ్రించి ఉమ్మేశాను. అల్లంతదూరాన పడింది. ఎవరిమీదైనా పడుతుందని కూడా భయపడలేదు. జనంమీద నాకు అసహ్యం కలిగింది. ఉక్రోషం వచ్చింది. వాళ్ళంతా ఒకరితో ఒకరు ఎలా ప్రవర్తిస్తున్నదీ నా కళ్ళతో చూస్తున్నాను.

తలొంచుకుని పోతోంటే ఒకఅమ్మాయి ఎదురు పడింది. దగ్గరికి వచ్చింతర్వాత తలఎత్తి చూచాను. ఆ అమ్మాయి నా వైపు దృష్టిని నిలిపిచూచింది.

'గుడ్‌నైట్', అన్నాను నేను.

'గుడ్‌నైట్!' ఆ పిల్ల ఆగింది.

'అరె! ఎందుకీ అమ్మాయి ఒంటరిగా వెడుతోంది! అర్థరాత్రివూట వీధిలో ఏం పని?'

నిలవేసి నిష్కర్షగా అడిగేద్దామనుకున్నాను. ఇంతలో ఆ పిల్ల నా ముఖంలోకి విచిత్రంగా ఒకక్షణం చూచింది. గభాలున నా చెయ్యిపట్టుకుని లాగుతూ ఇలా అంది.

'వెడదాం రండి'

నేనా అమ్మాయితోపాటు వెళుతున్నాను. కాని కొద్ది దూరం వెళ్ళగానే తటాలున ఆగాను. ఆ పిల్ల చెయ్యి వదిలించుకొన్నాను.

'ఇదిగో అమ్మాయ్! నా దగ్గర దమ్మిడీకూడా లేదు. ముందే చెపుతున్నాను.'

మొదట్లో ఆ పిల్ల నా మాటలు నమ్మలేదు. ఆ తర వాత చేతులుపెట్టి నా జేబులన్నీ వెతికింది. పాపం ఆవిడకేమీ దొరకనందువల్ల ముఖం తేలవేసింది—

'వెడతాను మరి' అన్నాను నేను.

నాలుగడుగులువేసేసరికి ఆ పిల్ల మళ్ళీ నన్ను పిలిచింది.

'ఇదుగో ఒక్కమాట' అంటూ దగ్గరికి వచ్చింది.

'ఆకళ్ళజోడు రోల్డుగోల్డుదా?'అందుకూ ఆమె పిలిచింది.

'కాదు.' అంటూ నేను నడక సాగించాను.

కొద్ది నిమిషాల తర్వాత ఆ పిల్ల నా వెనకాలే పరిగెత్తు కుంటూవచ్చి మళ్ళీ నన్ను పిలిచింది.

'అయితే మా నేరు, నా వెంటరండి.'

ఆ పిల్ల అలా అనడం నా కెంతో కష్టం కలిగించింది.

బజారుముండ. సిగ్గూ, బిడియంలేని రంకుముండ.

'లేదు నేనురాను' అంటూ నడక సాగించాను. ఆమె నన్ను వెంటాడుతోంది.

'ఏం? నేను రమ్మంటున్నానుగా! నీకేం కష్టం?'

'నీతోరావడానికి నా కిష్టంలేదు. అంతే.'

'ఓ! అదాసంగతి. నీవు మరొకరి వెంటవెళుతున్నా వన్నమాట'

'లేదు. నేనెక్కడికీ వెళ్ళడంలేదు' నేను సమాధానం చెప్పాను.

కాని నా లోపల చాల బాధగా ఉంది. ఇలా పడుపు గత్తెవెంట బజార్లో తిరుగుతూ ఉండడం నాకు చెడ్డ అసహ్యం గాఉంది. ఎవరైనా చూస్తే ఎంత అవమానం? ఎవరికంటా

బడకుండా ఆ పిల్లను తప్పించుకొని వెళ్ళిపోవాలనుకున్నాను. కాని ఆ రంకుముండ నన్ను వదల్లేదు. చివరకు ఆ పిల్ల పేరడిగాను. 'సరోజ' అని చెప్పింది. ఆ తర్వాత నెమ్మదిగా నా ప్రవర్తనను గురించి చెప్పడం మొదలు పెట్టాను. క్లుప్తంగా నేను నడుపుతున్న జీవితాన్ని ఆమెకు ఎరుక పరిచాను. ఇలాంటి నీచవృత్తిని నేను ప్రోత్సహించే వాణ్ణి కాదని వినయంగా మనవి చేశాను. నేను చెప్పినవన్నీ ఆమె నమ్మిందో లేదో తెలియదుకాని, కుతూహలంగా వింటోంది. ఆపిల్లను నేనేమీ పల్లెత్తు మాట కూడా అనలేదనీ, నా హృదయంలో లవలేశంకూడా నీచపు తలంపు లేదనీ, నాకు తెలుసు. ఆ పిల్ల, నేనుకూడా చాలమంది కి మల్లే తిరుగుబోతునని అనుకుందేమో కాని, నేను మాత్రం ఆమెపట్ల ఏ మాత్రం పొరపాటుగా ప్రవర్తించ లేదు. వీలైనంత వరకూ ఆవృత్తిని మానుకోమని ఆవిడకు హితబోధ చేశాను. చివరకు నా పేరుకూడా చెప్పాను. '...... ఫలనా ... రచయితను. వస్తాను. మరి సెలవు.'

కొద్ది క్షణాలు ఆ పిల్ల వెళ్ళిపోయేదాకా నిలుచుని ఆ తర్వాత మరొక మార్గాన నా నడక సాగించాను.

సంతోషంతో చేతులు నలుపుకున్నాను. 'అమ్మయ్యా' ఎంతో బరువు తగ్గినట్లు నిట్టూర్చాను. ఆనందంపట్టలేక పెద్దగా ఇలా అన్నాను.

"అవును. నా జీవితంలో ఒక్క మంచిపనైనా చేయగలిగాను. అధఃపతనమైపోయిన ఆ స్త్రీ ఇంతటనైనా పైకిరావచ్చు. ఆ పిల్ల జీవితం ఇంతటనైనా మారవచ్చు. ఘోరమైన నరకం నుంచి, పురుగుల సముద్రంనుంచి, బయటపడవచ్చు. అప్పుడైనా నన్నా అమ్మాయి జ్ఞాపకం తెచ్చుకోకపోదు. కనీసం అంత్యదశ

లోనైనా నన్నామె తప్పక స్మరించుకుంటుంది. మరిచిపోకుండా జ్ఞాపకం ఉంచుకుంటుంది. ఆమెకు జ్ఞానోదయమైతే నేను ధన్యుణ్ణి."

నా మనస్సు సంతోషంతో బుస్సుమని పొంగింది. ఏ పనైనా చేయడానికీ, ఎంతటి శ్రమనైనా సహించడానికీ నాలో శక్తి వచ్చింది! ఒక కొవ్వొత్తి దొరికితే ఆరాత్రి నా రచన పూర్తిచేయగలను. నా తాళపుచెవులగుత్తి గలగలలాడిస్తూ గదివైపు దారితీశాను. కొవ్వొత్తి సంపాదించేమార్గం ఏమిటా అని పరిపరివిధాల ఆలోచించాను. ప్లానులువేశాను. కాని సానుకూలమయ్యే దారికనపడలేదు.

గదితలుపుతీసి చీకట్లోనే కాగితాలకోసం వెదికాను. కొంతసేపుశ్రమపడి వాటిని పోగుచేయగలిగాను. తిరిగీ గదికి తాళంవేసి వీధిలోకి వచ్చాను. లాంతరుస్తంభాన్ని ఆనుకుని నిలబడ్డాను. అంతా నిశ్శబ్దంగా ఉంది. కొంచెం దాపులో 'కాన్‌స్టేబిల్' బూట్లచప్పుడు వినిపించింది. ఎక్కడో దూరంగా కుక్క మొరిగిన అలికిడికూడా నా చెవినిపడింది. కోటుపైకెత్తి చెవులమీదిగా వ్రేలాడవేశాను. రచననుగూర్చి తీవ్రంగా ఆలోచించసాగాను.

కొంతవరకు వ్రాసిపెట్టిన కథ మళ్ళీ చదువుకున్నాను. ప్రతిపంక్తీ పట్టిపట్టి చదివాను. కాని ఎంత ప్రయత్నించినా, కథను క్లైమాక్సుకు తీసుకువెళ్ళే సన్నివేశాన్ని కల్పించలేక పోయాను. అలానేను, లాంతరు స్తంభానికానుకొని బాధపడుతూండగా 'కాన్‌స్టేబిల్' వచ్చి నా దగ్గరగానిలబడ్డాడు. నా ఆలోచనలకు అంతరాయంకలిగింది. అతనికి నా గొడవల్తో ఏం పని? నా రచనలతోటి అతనికేం సంబంధం? అనవసరంగా అక్కడ వచ్చి నిలుచుని కాపలా కాస్తున్నాడు. భగవంతుడా!

నేనెక్కడ తలదాచుకుందామన్నా వీలుకాకుండా ఉందేమిటి? నీళ్ళల్లో తలదూర్చినా నిప్పంటుకుంటూ ఉందేమిటి? ✓

కానిస్టేబుల్ వెళ్ళిపోయాడు. అలా ఆలోచిస్తూ నేనొక గంటసేపు నిలబడ్డాను. అంతకంతకూ చలి ఎక్కువౌతోంది. మంచుపడుతోంది. మళ్ళీ నా గదిలోకి వెళ్ళాను. బూట్లువిప్పి మంచం మీద పడుకున్నాను. గదిలో కూడా తేమగా ఉంది..........

మరుసటిరోజు ఉదయాన్నే మామూలుగా లేచాను. మరొకసారి కథ వ్రాయడానికి కూర్చున్నాను. అలా మధ్యాహ్నందాకా రచన సాగిస్తూనేఉన్నాను. అప్పటికి పది పదిహేను పేజీలు వ్రాశాను. కాని ఇంకా కథను పూర్తిచేయడం కుదరలేదు. లేచి బూట్లు తొడుక్కొని కొంతసేపు గదిలో అటూ ఇటూ పచారు చేశాను. ఏం చేయాడానికీ తోచడంలేదు. గోటితో గోడమట్టిని గిల్లాను. తలుపుకు తల ఆనించి బయటికి చూస్తూ కొంతసేపు నిలబడ్డాను. చూపుడు వ్రేలుతో తలుపు చెక్కమీద టక్ టక్ మని శబ్దంచేస్తూ దరువేశాను. తలుపు లోంచి చీలిన పల్చని చెక్కపేడు బయటికిలాగాను. దాన్ని నోట్లోవేసుకొని నమలడం మొదలు పెట్టాను.

ఆ తరవాత మరికొన్ని వాక్యాలు వ్రాయగలిగాను. కాని కథపూర్తి కాలేదు. ఇక వ్రాయడానికి తోచలేదు. నా బుర్ర ఖాళీ అయిపోయినట్లు తోచింది. చాలసేపు పూర్తిగాని ఆ కథను, సగంమాత్రం వ్రాసినపేజీని చూస్తూ కూర్చున్నాను.

కాలంగడిచింది. క్రిందభాగంలో పనివాళ్లు గేదల్ని కట్టేస్తున్న చప్పుడు వినిపించింది. నా గుండెల్లో పోటుగా ఉంది. ఆయాసం వస్తోంది. తిరిగీ ప్రక్కమీద పడుకున్నాను. నా తలలో

ఏదో బాధగా ఉంది. నా చేతి వ్రేళ్లు జుట్టులోకి పోనిచ్చి ముం దుకూ, వెనుకకూ, ప్రక్కలకూ లాగాను. నా చేతిలోకి వెంట్రు కలు ఊడివచ్చాయి. కొద్దిగా జుట్టు ప్రక్కమీద పడింది కూడా. అలా అయినందుకు నేనేమీ బాధపడలేదు. నా తల్లో ఊడాల్సిన జుట్టు ఇంకా చాలా ఉంది.

నా వంట్లో ఉన్న బరువు, బాధ, బడలిక పోవాలని పక్కమీద అటూ ఇటూ పొర్లాను. శరీరమంతా మెలికలు తిప్పాను. లేచి కూర్చొని మొద్దుబారి ఉన్న చేతుల్తో మోకా ళ్ళమీద కొట్టుకున్నాను. పెద్దగా నవ్వాను. నవ్వగలిగినంతగా నవ్వాను. నా గుండెల్లో పోటు ఎక్కువైంది. పక్కమీద పడి పోయాను.

'ప్రయోజనం లేదు. దిక్కులేకుండా చచ్చి పోతున్నాను. అంతే.' కళ్లు పెద్దవిచేసి కడ్డీలవైపు చూచాను. చివరకు నా చూపుడు వ్రేలు నోట్లో పెట్టుకొని చీకటం మొదలు పెట్టాను. ఏదో పిచ్చి పిచ్చి ఊహలు, అర్థంలేని ఆలోచనలు వస్తు న్నాయి. అవ్యక్తస్థితిలో పడి పోయాను.

నా వ్రేలు కొరుక్కుంటే ఎలా ఉంటుంది? ఒక్క క్షణం కూడా ఆలోచనకు వ్యవధి ఇవ్వకుండా గబుక్కున వ్రేలు కొరు కున్నాను.

నాకు తెలివొచ్చింది. లేచికూర్చున్నాను. నా వ్రేలి లోంచి బొట్లుబొట్లుగా నెత్తురు కారుతోంది. దాన్ని నాలికతో నాక్కున్నాను. పెద్దగా బాధ తెలియలేదు కాని చెయ్యి మాత్రం జలజల్లాడుతోంది. నెత్తురు కారేచోట చిమచిమమండుతోంది. లేచి కిటికీదగ్గరకు వెళ్లాను. అక్కడ చిన్న గుడ్డపీలిక కనపడింది. దాంతో గాయానికి కట్టుకట్టాను. ఇంతలో నాకు తెలియకుండానే

కళ్ళవెంట నీరుకారనారంభించింది. కొంతసేపు నాలో నేను ఏడ్చాను. ఆచిన్న వేలివైపు చూస్తోంటే నాకుజాలివేసింది.

చీకటి పడింది. మళ్ళీ నా మనస్సు రచన మీదికి పోయింది. 'ఎలాగైనా ఆ కథ పూర్తిచేయాలి. కొవ్వొత్తి సంపాదించి రాత్రంతాకూర్చొని వ్రాయాలి. అంతగా ఆకలి బాధలేదు. మర్రోజువరకూ అలాగే గడపగలను. మరేం ఫరవాలేదు. ప్రస్తుతం కొవ్వొత్తి సంపాదించే మార్గం మాత్రమేచూడాలి. చిల్లరకొట్లో ఒక కొవ్వొత్తి నాకు అప్పివ్వడూ? నా పరిస్థితిచెప్పి బ్రతిమాలుతాను. నే నీప్రాంతంలో అందరికీ పరిచయస్తుణ్ణే. అడపాదడపా, అందరూ నన్నెరుగుదురు. నేను బాగా బ్రతికినరోజుల్లో ప్రతికొట్లో ఎన్నెన్నో సామాన్లు కొన్నాను. నే నాపదలోఉంటే ఆ మాత్రం కృతజ్ఞత చూపించకపోతారా? ఊరిక ఇవ్వమంటున్నానా? అప్పు. అర్ధణా, లేక అణా. నా పేరుతో అర్ధణా కొవ్వొత్తి పుట్టించ లేకపోతానా? ప్రయత్నిస్తాను.'

బట్టలువేసుకొని బయటికి వెళ్లాను. నా తల చింపిరి చింపిరిగాఉంది. ఊడిన వెంట్రుకలు నా మెడలమీద, చొక్కా మీదపడి ఉన్నాయి. రోడ్డుమీద మళ్ళీ ఒక్కక్షణం నిలబడి ఆలోచించాను. 'పోనీ హోటల్లోకివెళ్ళి ఏదైనా తింటానికి అడిగితే? ఊహు. వద్దు. నా కిప్పుడాకలికావడంలేదు. తిండిమీద ఇష్టంతప్పింది. ముందు కథపూర్తిచేసి 'కాలచక్రం' ఆఫీసుకు వెళ్లాలి. కాలయాపనంచేయడానికి వీల్లేదు. ఎడిటర్ నన్ను మరిచి పోతాడు. ఏమైనా సరే కొవ్వొత్తి సంపాదించాలి.'

అదే నిశ్చయంతో నే నొక చిల్లరకొట్లోకి వెళ్లాను. ఒక ఆడమనిషి సామాన్లు కొంటోంది. రకరకాల వస్తువులు పొట్లాలు కట్టి పడేసి ఉన్నాయి, ఆ కొట్టు షావుకారు నన్ను బాగా ఎరుగు. అనేకసార్లు అక్కడ నేను వెన్న, రొట్టె, కొన్నాను. నన్ను చూడగానే అతను చేతిలోపని వదిలేసి ఒక రొట్టె పొట్లంకట్టి నాకందించబోయాడు.

'నో. థ్యాంక్సు. ఇవాళ నాకు రొట్టెక్కర్లేదు. ఒక కొవ్వొత్తి కావాలి.' చాల వినయంగా అడిగాను.

నా జవాబు అతన్ని కొంచెం కలవరపరిచింది. ఎంచేతంటే నే నతని కొట్లో ఎప్పుడూ రొట్టెమాత్రం కొనేవాణ్ణి.

'అయితే ఒక్కక్షణం ఆగండి' అన్నాడతను. తిరిగీ ఆ ఆడమనిషికి సామాన్లు పొట్లాలుకట్టడంప్రారంభించాడు.

ఆ ఆడకూతురు పొట్లాలన్నీ సంచిలో పెట్టుకుంది. షావుకారుకు కొంత డబ్బిచ్చింది. అతను తిరిగీ చిల్లరడబ్బులు ఆమె చేతిలో పెట్టాడు. ఆమె వెళ్ళిపోయింది. షావుకారు లోపలికి వెళ్లాడు. ఇకపోతే నేను,కొట్లో కుర్రాడుమాత్రం మిగిలిఉన్నాం;

'మీకు 'కాండిల్' కావాలికదూ!' అంటూ ఆ కుర్రాడు ఒక కాగితపుపెట్టెతీసి అందులోంచి ఒక కొవ్వొత్తి బయటికి తీశాడు. అతను నా వైపు చూచాడు. నేనూ అతనివైపు చూచాను. డబ్బు తర్వాత ఇస్తానని చెపుదామని నోటిదాకా వచ్చింది. కాని చెప్పలేకపోయాను.

'అవును. మీరు డబ్బిచ్చారుగా' అన్నాడా కుర్రాడు హఠాత్తుగా. నేను డబ్బిచ్చానని అతను స్పష్టంగా చెప్పాడు. నొక్కి చెప్పాడు. అతను చెప్పిన మాటల్లో ప్రతి అక్షరం నేను విన్నాను. పైగా అతను గల్లాపెట్టెలోంచి డబ్బుతీసి లెక్కపెడు

తున్నాడు. చిల్లరడబ్బులు తళతళ మెరుస్తున్నాయి. ఒక రూపాయి, కొంత చిల్లర ఆ కుర్రాడు నా చేతుల్లో పెట్టాడు.

'ఇమ్మగోండి. లెక్క చూచుకోండి.'

ఒక్కక్షణం నిలబడి ఆ డబ్బులవంకే చూచాను. ఇందులో ఏదో పొరపాటుఉందని నా మనసులో అనిపిస్తూనే ఉంది. ఎవరో ఎప్పుడో లెక్కలో పొరపాటుపడ్డారు. అయినా అతన్ని నే నేమీ అడగలేదు. అనాయాచితంగా వచ్చిన ఆ ద్రవ్యాన్ని తీసుకున్నాను. ఇవతలికొచ్చి కొట్టుముందరే నిలబడ్డాను. కొయ్యలాగా నిలబడ్డాను. గుండెల్లో దడగా ఉంది. ఏదో అర్థంలేని వెర్రిచూపు చూస్తున్నాను.

మళ్ళీ కొట్లోకి వెడదామని రెండడుగులు ముందుకు వేశాను. కాని వెంటనే తటపటాయించి ఆగిపోయను. నేనలా తచ్చాడుతూ ఉండడం ఆ కొట్లో కుర్రాడు చూచాడు. నేనేదో తీరుబడిగా ఉండి అక్కడ ఉండిపోయానని, అందుకే అక్కడ నిలబడ్డానని ఆ కుర్రాడు ఊహించినట్లుంది.

నాతో కబుర్లు ప్రారంభించాడు.

'ఏం సార్! ఏమిటి కబుర్లు?'

అతను పంచదార సమంగాతూచి పొట్లాలు కట్టుకుంటునాడు.

'ఆ, ఏమున్నాయి!' నేను సమాధానం చెప్పానేకాని మాటలు తడబడ్డాయి.

'ఇందిరామహాల్' ల్లోకి మంచి హిందీ పిక్చరొచ్చింది సార్. చూచారా? చాలా బాగుంది.'

'అవును. చాలా బాగుంది. అలాంటి పిక్చరింతకుముందెప్పుడూ రాలేదు.' నా నోట్లోంచి వచ్చిన ప్రతిమాటా నాకు

వినపడుతూనేఉంది. కాని ఆ మాటలు నేనుకాకుండా మరెవరో మాట్లాడుతున్నట్లనిపించింది నాకు.

చేతులోనిడబ్బులు జేబులోవేసుకుని గిరుక్కున మళ్ళీ వెళ్ళిపోయాను. ఆ కుర్రాడు 'గుడ్‌నైట్ సార్' అని అన్నట్లూ, నేనుకూడా తిరిగి 'గుడ్‌నైట్' అని సమాధానం చెప్పినట్లూ లీలగా జ్ఞాపకముంది.

కొంచెందూరం నడిచి తిరిగి చూచాను. ఇంకా ఆ దుకాణం తలుపులు నాకు కనిపిస్తూనేఉన్నాయి. ఆ కొట్లో కుర్రాడు నా వెనకాలే పరిగెత్తుకుంటూవస్తున్నాడు. కాని నే నేమీ చలించలేదు. నా ముఖంలో భయంగాని, అనుమానం గాని కనపరచకుండానిలబడ్డాను. జేబులోచేయిపెట్టి డబ్బు చేతిలోకితీసుకున్నాను. అతను అడిగినవెంటనే ఇవ్వడానికి సిద్ధంగాఉన్నాను.

'ఇందాసార్. కొవ్వొత్తి! అక్కడే పెట్టి మరిచిపోయారు!' కాగితంలో చుట్టచుట్టిన కాండిల్ నాచేతికందిస్తూ అన్నాడు.

'థ్యాంక్సు'. మామూలుగా కృతజ్ఞత తెల్పాను.

థ్యాంక్సు, థ్యాంక్సు;

కాండిల్ చేతిలో పట్టుకుని ఆవీధిదాటి వెళ్ళిపోయాను.

నా మొట్టమొదటి ఆలోచన ఆ డబ్బుమీదికేపోయింది. లాంతరుస్థంభందగ్గరికివెళ్ళి డబ్బు లెక్కచూచుకొన్నాను. చేయి ఎగరేస్తూ బరువు తూకంవేశాను. చిన్నగా నవ్వుకున్నాను.

ఎలాగైతేనేం ఇప్పటికి నామీద దేవుడికి దయగలిగింది. నాకాధారం చూపించాడు. అద్భుతంగా, అనాయాచితంగా, అధికంగా, అదృష్టం కలిసివచ్చింది. శ్రమపడకుండానే సొమ్ము లభించింది. తిరిగి డబ్బుజేబులోవేసుకుని నడకసాగించాను.

చిన్న ముస్లింహోటలు కనిపించింది. పిల్లిలా నిశ్శబ్దంగా లోపలికివెళ్లాను. ఒకమూలనున్న కుర్చీమీదకూర్చున్నాను. అక్కడదీపం వెలుతురు సరిగా పడడంలేదు. మసక మసక చీకటిగాఉంది. హోటల్లో సప్లయర్ ఒకడు నా వైపు అదోలా చూచాడు. ఆ చూపులో ఏదో అనుమానం తగిలింది.

'ఏం? నే డబ్బు కొట్టేశానని తెలుసుకున్నాడా? నే నేం దొంగతనం చేయలేదే! అతనే అనవసరంగా అడక్కుండా నే ఇచ్చాడు. దానికి నే నేం చేయను? అయినా మునిగిపోయిం దేముంది? మళ్ళీ ఆ కొట్లోకి వెళ్ళినప్పుడు అడిగి తెలుసుకుని అతనిడబ్బు అతనికిచ్చేస్తాను. ఇంతమాత్రానికే నేనుదొంగనై పోలేను. నాకు పాపంచుట్టుకున్నదనీ, నా జీవితం పతనమై పోయిందనీ, అనుకోవాల్సిన పనిలేదు ...... అసలందరికంటె నేను చాలనయం. ఎవడుపట్టినా మోసం, దగా... వాళ్ళకూ నాకూ పోటీ ఏమిటీ?.........

సప్లయర్ నాదగ్గరికొచ్చి 'ఏంకావాలని' అడిగాడు.

'చపాతీ, కూర్మా.' చటుక్కున అతను వెళ్ళిపోయాడు.

'ఏదోఒకరోజు ఈ డబ్బు పొరపాటున బయటపడక పోతుందా? ఆ కుర్రాడుగాని, షావుకారుగాని తర్వాత నిదానంగా లెక్కచూచుకోరూ? ఒకవేళ ఈడబ్బు ఆ సామాన్లు కొన్న ఆడకూతురుకు తిరిగి ఇవ్వాల్సి ఉందేమో? పొరపాటున మరిచిపోయి నాకిచ్చిఉంటాడు, ఇది ఎప్పుడో ఒకప్పుడు కనిపెట్టకపోరు. బహుశా ఈసారినేను ఆ కొట్టుదగ్గరికి వెళ్ళగానే దీనివిషయం అడుగుతారు. మంచిదే! బ్రతికానురాదేవుడా!'

'సాగ్! ఇక్కడ చీకటిగాఉంది. మరో బల్ల దగ్గరకు

వెళ్లకూడదూ?' చపాతీ, కూర్మా, ప్లేట్లు బల్లమీదపెడుతూ అన్నాడు సప్లయర్.

'ఫరవాలేదు. నా కిక్కడే బాగుంది.' అంటూ తినడం ప్రారంభించాను. ఆకలి కడుపు ఆశపోతులా ఆవురావురుమని తింటున్నాను. చపాతీ, మాంసం, నోటినిండా కూరుకుని నమలకుండా మింగేస్తున్నాను. ఒక్కొక్కసారి మాంసం ముక్కల్ని గొడ్డులాగా పళ్ళతో పీకుతున్నాను. నేను నరమాంసభక్షకుణ్ణా?

'టీ ఇవ్వమంటారా?' సప్లయర్ అడిగాడు.

'చాలు. మరేం అక్కర్లేదు.'

అతను బిల్లు పట్టుకొచ్చాడు. డబ్బు చెల్లించాను. మరి కొంత చిల్లరతీసి అతని చేతిలో పెట్టాను. అతని ముఖం చాటంతయింది. వంగి, వినయంగా శాల్యూట్ చేశాడు.

హోటలుగడప దాటానో లేదో, నా కడుపులో తిప్పటం ప్రారంభించింది. ఆ తిన్నది కాస్తా కడుపులో ఇమిడేటట్లులేదు.

'ఎప్పుడు ఏదితిన్నా వేవిళ్లుపుట్టిన ఆడవాళ్లకుమల్లే నాకు వాంతులవుతాయేమిటి? భగవంతుడా! నన్నెందుకు పుట్టించావ్? చిట్టెడు గంజి తాగినా జీర్ణించుకోలేని రోగిష్టిమారివాణ్ణయిపోయాను.'

దోవనపోతూ చాలసార్లు డోకున్నాను. లైట్ల వెలుతురు పడకుండా చీకట్లోకివెళ్లి కక్కుతున్నాను. రెండుచేతుల్తో కణతలు పట్టుకొని కడుపు ఖాళీఅయ్యేంతవరకూ కక్కున్నాను. కళ్ళవెంట నీళ్లువచ్చాయి. గొంతు మండుతోంది. వళ్ళంతా చెమటపట్టింది. ఆయాసంవల్ల శ్వాస అధికంగా పీలుస్తున్నాను. డోకు ఆపుకోవాలని ఎంతో ప్రయత్నించాను. కాని ఆగలేదు.

ఒకచోటతూలి పడబోయాను. ఇంటిగోడ పట్టుకొని నిలబడ్డాను. మళ్ళీ ఒకసారి బొళుక్కుమని కక్కాను. తాగిన నీళ్లుకూడా నిలవకుండా బయటికొచ్చాయి. భరించలేనిబాధ. తట్టుకోలేని బాధ. ఏడ్చాను. రోడ్డుమీద నడుస్తూనే వెక్కి వెక్కి ఏడ్చాను. ......నన్ను బాధిస్తున్న క్రూరశక్తుల్ని నిందించాను.

'నన్నెందుకిలా హింసించడం? ఎందుకీ యమయాతన? విధీ, నీ కెంతటిశక్తిఉంది? అవును. విధి బలవత్తరమైంది. ఎంతటి వారైనా దానికి వశ్యం కావల్సిందే.'

ఒక ఇంటిముందు ఒకతను నిలబడి ఉన్నాడు. గబగబ అతనిదగ్గరికి వెళ్ళి ఇలాఅడిగాను. 'చాలారోజులనుంచీ అన్నం లేదు. మనిషి చాలనీరసంగా ఉన్నాడు. చావుబ్రతుకులమధ్య పెనగులాడుతున్నాడు. పైగా మంచినీళ్ళుకూడా ఇమడటం లేదు. ఏంచెయ్యమంటారో సెలవిస్తారా? కాస్త సలహాచెప్పి పుణ్యంకట్టుకోండి.'

'పాలివ్వడం మంచిది. వేడిపాలు' అన్నాడతను కొంచెం ఆశ్చర్యంతో.

నేను వెళ్ళిపోతుంటే తిరిగీ అతను ఆదుర్దాగా అడిగాడు. 'ఎవరతను? ఎవరా బాధపడేమనిషి?'

'ఇప్పుడేవస్తాను. మళ్ళీవచ్చి చెప్తాను.' త్వరత్వరగా వెళ్ళిపోతూనే నేను సమాధానం చెప్పాను.

దాపులోనే మరోహోటలు కనిపించింది. వెళ్ళి వేడి పాలివ్వమని అడిగాను. సెయిటర్ మంచిపాలు తెచ్చిఇచ్చాడు. వేడిగా ఉన్నాయి. తాగాను. ఒక్కచుక్కగూడా మిగల్చకుండా తాగాను. తొందరతొందరగా తాగేశాను. బిల్లుకుడబ్బిచ్చి బయటికొచ్చేశాను.

నేను నా గది దగ్గరికి వెళ్ళేసరికి మరో విచిత్రంజరిగింది. రోడ్డుమీద ఎదురుగా లాంతరుస్తంభందగ్గర ఒక ఆడమనిషి నిలబడిఉంది. అవేదుస్తులు. నల్లటిచీరె...అదే ముసుగు. ఆమె అంతకుముందు అనేకసార్లుచూచిన ఆడకూతురే. మళ్ళీ వచ్చింది. ఇది ఐదోసారో, ఆరోసారో? ఆవిడ కదలకుండా, మెదలకుండా బొమ్మలా నిలబడిఉంది. అప్రయత్నంగా నాకాళ్లు ఆమెదగ్గరికి లాక్కుపోయాయి. నాకేదో వెర్రిఆవేశంవచ్చింది. ఏమీ ఆలోచించకుండానే ఆమెతో ఇలా మాట్లాడాను. 'నమస్తే' అన్నాను వంగి ఆమె ముఖంలోకి చూస్తూ.

'నమస్తే'. ఆమె తిరిగి అంది.

'ఆమె ఎవరికోసమైనా వేచిఉందా? మరేదైనా పని మీద వచ్చిందా? నేనుండేగదిప్రక్కన మరెవ్వరూలేరే? పక్కనే పాత్రలు బాగుచేసేవాళ్లు, మాట్లువేసి కళాయిచేసే ఒకటిరెండు చిన్న దుకాణాలున్నాయి. ఇక్కడ సంసార్లెవ్వరూ లేరుకదా? మరీవిడ ఎందుకొచ్చినట్లు చెప్మా?' కాసేపు నాలో నేను మథనపడి మళ్ళీ అడిగాను.

'ఎవరుకావాలి మీకు?'

'నాకెవరూ అక్కర్లేదు. నేనెవరికోసమూ రాలేదు. ఇక్కడ ఊరకనే నిలబడ్డాను. ఉట్టినే. సరదాగా. నేను ...' అలా అంటూ ఆమె మధ్యలో ఆగింది.

ఓహో! అంతేకాబోలు. ఆవిడ ఎవరికోసమూరాలేదు. ఊరకనే నిలబడింది. ఉబుసుపోక. సరదాకోసం! ఆమెచెప్పిన దాంట్లో కాసంతైనా అర్థంలేదు. ఒక్కక్షణం నిలబడి ఆలోచించాను. ఆలోచిస్తున్నకొద్దీ ఏదో ఆవేశంవస్తోంది. ఆమె సంగతేమిటో సిక్కచ్చిగా అడిగితెలుసుకోవాలని కుతూహలం

కలిగింది. ధైర్యం తెచ్చుకున్నాను. అడగడానికి నిశ్చయించుకున్నాను. జేబులో చెయ్యిపెట్టి డబ్బులు గలగలలాడించాను. 'హోటలుకు వెడదాంరండి. కాస్త టీ తీసుకుందురుగాని... చలిగాలికొడుతోంది. వేడి టీ తాగితే హుషారుగాఉంటుంది...' చనువుచేసుకుని అడిగాను.

'థ్యాంక్సు. ఇప్పుడక్కర్లేదు.' ఆవిడ ముక్తసరిగా జవాబుచెప్పింది.

'పోనీ మీరు ఒంటరిగా వెళ్ళలేరేమో! కాస్తదూరం నేను తోడురానా?'

ఆవిడ, నేనూ కలిసి వెడుతున్నాం. ఆవిడ నా కుడిపక్క నడుస్తోంది. నా మనస్సులో ఏదో మహదానందం. విచిత్రమైన ఊహాలువస్తున్నాయి. అవును. రావుమరి! పట్నంలో నేనూ ఒక అందమైన అమ్మాయిని వెంటవేసుకుని షికార్లు చేస్తున్నాను. అలానడిచేటప్పుడు ఆమెను నఖశిఖపర్యంతం పరీక్షగా చూస్తున్నాను. ఆవిడపూసుకున్న సెంటు గుమగుమ వాసనకొడుతోంది. ఆమె శరీరంలోంచి పరిమళద్రవ్యాల సుగంధం, చుట్టూవెదజల్లుతోంది. నన్ను ఉన్మత్తుణ్ణిగాచేస్తోంది. ఆవిడ మధ్య మధ్య నావైపు చూస్తోంది. అలాచూచినప్పుడు ఆవిడ తియ్యటి ఉచ్ఛ్వాసనిశ్వాసాలు జీర్ణించిన నా ఇంద్రియాలకు జీవంపోస్తున్నాయి. చైతన్యం కలిగిస్తున్నాయి. కోరికల్ని రేకెత్తిస్తున్నాయి. మధ్యమధ్య గాలికి ఆవిడముసుగు తొలుగుతోంది. పమిటపక్కకుపోతోంది. తెల్లటిముఖం. కొంచెం పాలిపోయినముఖం. తళతళ మెరుస్తోంది. ఎత్తైన ఆమె వక్షోజాలు

రెండు ఆర్చీలమాదిరిగా వంపులుతిరిగి ఉన్నాయి. ఆవిడకూ నాకూ ఏమిటి సంబంధం? ఆవిడ ఎవరో పూర్తిగా తెలియదే! అయినా ముసుగులో దాగివున్న ఆవిడసౌందర్యం అకారణంగా నన్నానందంలో ముంచేస్తోంది. నేను భరించలేకపోయాను. చమత్కారంగా నాచెయ్యి ఆమె భుజంమీద వేశాను.

'మీరెంత బాగున్నారు!' అన్నాను నేను బలహీనంగా నవ్వుతూ.

'నేనా? బాగున్నానా! ఏ విషయంలో' ఏ మాత్రం చలించకుండా ఆవిడ అడిగింది.

నేను తిరిగీ ఆలోచనలో పడ్డాను. ఏమీ పనిలేకుండా ప్రతి సాయంత్రం అక్కడికొచ్చి నిలుచోవడం దేనికి? సరదా కోసమా? ఏమిటి సరదా? ఏమో, ఎవరికి తెలుసు? తగిన కారణముందేమో! - కొంచెం తటపటాయిస్తూ తిరిగీ ఇలా అన్నాను.

'మీకు పెందలకాడే నిద్రరాదూ? రోజు ఇలా ప్రొద్దు పోయిందాకా ఎలా మేలుకొనిఉంటారు?'

'ఓ అదా! ప్రొద్దుకూకగానే నిద్రపోవడమంటే నాకు తగని అసహ్యం. నా జీవితంలో ప్రధానాశయం అర్ధరాత్రి వరకూ మేలుకొనిఉండడం.' ఆమె విచిత్రంగా జవాబుచెప్పింది. ఇప్పుడామెకు ముసుకులేదు. ఆవిణ్ణి గుర్తుపట్టాను. ఆ ముఖం నాకు పరిచయమైందే. ఆవిడ కంఠస్వరం నాకింకా జ్ఞాపకముంది.

'జలజా' అన్నాను పెద్దగా.

'క్షమించండి. నన్ను అపార్థంచేసుకోకండి.' ఆవిడ అన్నది తిరిగీ.

'అబ్బే ఏమీలేదు. మరేం భయంలేదు............
వివరంగా చెప్పు......'

ఆవిడ తన చరిత్ర క్లుప్తంగా చెప్పింది. అక్కడికి దగ్గరిలోనే వాళ్ళ ఇల్లు. ఉండే స్థలం చెప్పింది. వాళ్ళమ్మా తానూ కలిసి ఉంటున్నారట. తల్లి – కన్నతల్లి. వృద్ధురాలు. పైగా ఆ ముసలిదానికి తగని చెముడు. తలవగలగొట్టుకున్నా వినిపించదట..................

ఆమెనవ్వింది. ఆనవ్వులో విషాదం కనపడుతోంది.

'మీకొక చెల్లెలుందికదూ?'

'అవును. ఉంది. చెల్లెలుకాదు. మాఅక్క. నాకన్నా పెద్దదే.'

'ఇప్పుడామె ఎక్కడికి వెళ్ళింది?'

'ఊరికివెళ్ళింది.'

'ఎప్పుడు?'

'దాదాపు నెలరోజులు కావస్తోంది. అవును కాని, మాఅక్క మీకెలా తెలుసు?'

'అబ్బే. తెలిసికాదు. ఊరకనే అడిగాను.'

కొద్ది క్షణాలు మా ఇద్దరిమధ్య నిశ్శబ్దం. మాట్లాడకుండా నడుస్తున్నాం. మాముందునుంచి ఒకతను వెడుతున్నాడు. అతని చంకలో బూట్లున్నాయి. అంతకన్నా వీధిలో మరెవ్వరూ కనిపించలేదు. చాలాభాగం నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగా ఉంది. కొంచెందూరంగా ఒక మేడమీద రంగు రంగుల విద్యుద్దీపాలు వరుసగా వెలుగుతున్నాయి. ఆకాశం నిర్మలంగా ఉంది. 'మీకు చలివెయ్యడంలేదూ? స్వెట్టరైనా వేసుకోలేదే?' హఠాత్తుగాఆమెఅడిగిందినావైపు తేరిపారచూస్తూ.

'నా స్వేట్టరేమైందీ ఆమెకు తెలిస్తే ఒక్కసారిగా గుండెలు బాదుకుంటుంది. నేను గడుపుతున్న దౌర్భాగ్యపు జీవితం ఆమెకు తెలియజేయడమెందుకు? ఆవిడ మనస్సును కలవర పెట్టిన వాణ్ణవుతాను. ఆవిడతో నాకు కలిగిన పరిచయం ఇంత టితోనే పరిసమాప్త మవుతుంది. ఆవిడ స్నేహంవల్ల నాకేదో ఆనందం కలిగింది. ఆశాస్త్రా పోగొట్టుకున్న వాణ్ణవుతాను. ఆమె పక్కనఉంటే నాబాధలు మరిచిపోగలుగుతున్నాను.' అంచేత నా స్వేట్టరువిషయంఆమెకు తెలియజేయడానికిష్టపడలేదు.

'నాకంతగా చలివెయ్యడంలేదు. మీరుండే పేటలో ఏమిటి వింతలు, విశేషాలు? అక్కడ ఇళ్లు కొత్తగా కట్టారు కదూ?' ఆమె మనస్సును మరోవైపు మళ్ళిద్దామని అలా అడి గాను. సందర్భంలేని విషయాన్ని తీసుకొచ్చాను.

'అవును. అక్కడ చాలాభాగం యిటీవలనే ఇళ్లు ఏర్ప డ్డాయి. అయినా చెప్పదగ్గవింతలేమున్నాయి?' అన్నదామె.

'అవునవును. అన్నిపేటల్లాంటిదే అదీనూ.' అన్నాను నేను ఆదుర్దాగా.

"అవును. నాకు తెలియదూ; ఆమెదృష్టి మరోవిషయంమీదికి మళ్ళించాలని అడిగాను. అంతే. లేకపోతే ఆవిడ నా చిరిగిన దుస్తులు, గుండీలులేని బొంతకోటు, నా ఆకారం, ఇవన్నీ ఆలోచించడం మొదలుపెడితే ఇంకేముంది? నేనొక బికారి వెధవనని నిశ్చయించుకుంటుంది. నాకూ, 'జూ' లో వుండే జంతువుకూ తేడా ఏముంది? ప్రపంచమనే జంతుప్రదర్శన శాలలో నేనూ ఒక జంతువును. అయితే నేను అన్నిజంతువు ల్లాగా కాదు. నేనొక విచిత్రమైన జంతువును. భగవంతుడు నన్నీ జంతుప్రదర్శనశాలకు ప్రత్యేక బహుమానంగా పంపాడు.

అందుచేత నేను ఎవ్వరికీ సంబంధంలేని ఒక ప్రత్యేకస్థలంలో ప్రత్యేకమైనబోనులో బంధింపబడ్డాను. 'జూ' లోకి వచ్చేజనం నన్ను విచిత్రంగా ఆటవస్తువునుచూచినట్లుచూస్తున్నారు. సూదుల్లాంటి తమ చూపుల్తో గుచ్చుతున్నారు. నేనా బాధ భరించలేకుండా ఉన్నాను. తోటి జంతువులుకూడా నావైపు చురచుర చూస్తాయి ఎందుకో? ఏమో! చెప్పలేను. నాబ్రతుకొక అడివి, అర్థంలేని కావ్యం; అవ్యక్తమైన సంగీతం!.............."

"పాపం, ఈ అమాయకురాలు నాతోపరిచయమైనందుకు ఆనందిస్తోంది! నావెంట నడుస్తూ ఏదో సంతోషపడుతోంది! అష్టకష్టాలూ అనుభవిస్తున్న నిష్టదరిద్రుణ్ణని ఆవిడకు తెలియదు. తానొక నగ్నస్వరూపుడివెంట, 'నా' అని చెప్పకోదగ్గవాళ్లు లేని భిక్షాటకునివెంట నడుస్తున్నానని ఆవిడ ఊహించుకోలేక పోతోంది...... నాకు మాత్రం ఎందుకీఆనందం; ఏం చూచుకొని? నామటుకునేనే జోక్యంకలిగించుకుని ఈ సీతాకోకచిలుక వెంటపడ్డాను. కొంచెంసేపటికైనా ఆవిడనన్ను తెలుసుకుంటుంది. ఛీదరించుకొని అవతలికిపొమ్మంటుంది. వాళ్ళింటికి వెళ్ళింతర్వాతనైనా నా వ్యవహారం చెడి తీరుతుంది. వాళ్ళింట్లో లైట్లువెలుతురున నన్ను పరీక్షగా చూస్తుంది. నేనొక పిచ్చివాణ్ణని తప్పకుండా గ్రహిస్తుంది. వెంటనే నా కివ్వడానికి సిద్ధపరచిన పాలు, ఫలహారంకూడా ఇవ్వకుండా నన్ను ఇంట్లోనుంచి గెంటివేస్తుంది. నాకక్కడ అవమానం తప్పదు. తీరని అవమానం........"

నాకు పూర్తిగా మతిభ్రమించింది. ఇలా ఆలోచించినకొద్దీ భయం పుట్టింది. కలవరం బయలుదేరింది. నన్నావరించిన నిరాశా నిస్పృహలు లోపలఅణుచుకోలేక బయటపడ్డాను.

'నన్ను మీ వెంట రానివ్వకుండాఉంటే బాగుండే

పోయేవి. చూడూ నాఆకారం!బట్టలెంత అసహ్యంగాఉన్నాయి? నేను పరమ దరిద్రుణ్ణి. ప్రపంచ దృష్టిలో పనికిమాలినవాణ్ణి. లోకం నన్నొక బికారికింద జమకట్టింది. నిజంగా నా వెంట రావడం మీా కవమానం.' అన్నాను గద్గద స్వరంతో.

ఆవిడ నావైపు తేరిపారచూచింది. ఒక్క క్షణం మౌనంగాఉంది. తర్వాత ఇలా అంది.

'మరేం ఫరవాలేదు.'

అంతకన్నా ఆవిడ ఎక్కువ సమాధానం చెప్పలేదు.

'అంటే ఏమిటి మీా ఉద్దేశ్యం?' అన్నాను నేను మళ్ళీ ఊరుకోకుండా.

'అబ్బ! ఏమిటా ప్రశ్నలు ...... మనిద్దరం నడవటం మొదలుపెట్టి కాసేపైనా కాలేదే!' అంటూ ఆమె వేగంగా నడవడం మొదలుపెట్టింది.

అప్పటికి రోడ్డుమలుపు తిరిగాం. ఆవిడ ఉండేపేట అక్కడికి అట్టే దూరంలేదు. కొత్తగా ఇళ్లుకట్టినచోట ధగధగ మెరుస్తూ దీపాలు కనిపిస్తున్నాయి. మళ్లీ ఆమె మెల్లగా నడవడం మొదలు పెట్టింది.

'నేను మీామనస్సుకేమీా కష్టం కల్గించలేదుగదా? పోనీ మీాపేరు ఒకమాటుచెప్పి పుణ్యాం కట్టుకోరాదూ? ఏదీ, ఒక్క నిముషం ఆ ముసుకు తీసేసి నిలబడు. ముఖం కనవడుతుంది. కళ్లారాచూచి ఆనందిస్తాను.'

ఒక క్షణం నిశ్శబ్దం. ఆమె ఏంజవాబు చెపుతుందో అని ఎదురుచూస్తూ నడుస్తున్నాను.

'మీారింతకుముందు నన్ను చూచారు.' ఆమె జవాబు చెప్పింది.

'జలజా!' అన్నాను నేను తిరిగీ.

'క్షమించండి. ఒకసారి పట్టపగలు నేను బజారున వెడుతోంటే నావెంట వడ్డారు. అవునా? తాగిన వాడికిమల్లే తూలుతూ ఉన్నారు. ఎందుకలా చేశారు?'

తిరిగీ ఆమెనవ్వింది.

'అవును. మీరు చెప్పింది నిజమే. అది నాదురదృష్టం. వళ్లు తెలియకుండా ప్రవర్తించాను.'

'దారుణం. అదిమీకు తగినపనికాదు.' అన్నదామె. అతిదారుణంగా ప్రవర్తించానని ఒప్పుకుంటూ పశ్చాత్తాపం వెలిబుచ్చాను.

విశాలంగా ఉన్న ప్రదేశంలోకి చేరుకున్నాం. రోడ్డు ప్రక్క ఒకవైపు వరుసగాఇళ్లున్నాయి. అక్కడ నిలబడి చూచాం. రెండోఇల్లు. ఒకమేడ. కిటికీల్లోంచి లైట్ల వెలుతురు కనపడుతోంది.

'ఇక మీరు నావెంట రావద్దు. ఇప్పటికే చాలదూరం వచ్చారు. థ్యాంక్సు.' అన్నదామె.

'థ్యాంక్సు.' అన్నాను. అంతకన్నా ఏం మాట్లాడలేక పోయాను. ధైర్యం చాలలేదు. బొమ్మలా నిలబడ్డాను. ఒక్క క్షణంతర్వాత తటాలున ఆమె తనచేయి నాకందిస్తూ ఇలాఅంది.

'నేను వెళ్ళిపోతున్నానని చెప్పానుకదా, ఒకసారి మళ్లీ మీతోపాటు కొంచెందూరం నన్ను వెనక్కురమ్మని అడగరేం?' అన్నదామె చాల నెమ్మదిగా. ఆమె తలవంచుకొని నిలుచుంది. తను వేసుకున్న చెప్పులవైపుచూస్తూ కాలిబొటన వేళ్లు నేలకు రాస్తోంది.

'థ్యాంక్సు. అంతకన్నా కావాల్సిందేముంది? మీకేమీ

కష్టంలేకపోతే తప్పకుండారండి, కాస్తదూరం నడుద్దాం.' అన్నాను నేను.

తిరిగీ ఇద్దరం వెనక్కు తిరిగాం. ఆవిడ చేయి నా చేతిలో ఉంది. భయంతో నా వళ్లు వణుకుతోంది. నేను కాళ్ళమీద నడుస్తున్నానో తలమీద నడుస్తున్నానో తెలియడంలేదు. ఈ యువతి నన్ను ఊపిరిపీల్చుకోనివ్వకుండ చేస్తోంది. నా జీవితాన్ని తలక్రిందులుచేస్తోంది. నన్ను పూర్తిగా వశ్యంచేసుకుంది. నన్ను మంత్రముగ్ధుణ్ణిచేసి లాక్కొనిపోతోంది. నేను ప్రమాదంలోకి పోవడంలేదుకదా? నేను రమ్మన్నానా? ఆవిడ రమ్మనిపిలిచింది. ఖులాసాగా గడపాలని ఆవిడే కోరింది. నే నేమీ వాంఛించ లేదు. ఇద్దరం జంటగా నడుస్తున్నాం. మధ్య మధ్య నే నామెను పరిశీలించి చూస్తున్నాను. క్షణక్షణం ఆవిడ నాకు ఉత్సాహాన్ని అందిస్తోంది. మరిచిపోని మాటలుచెపుతోంది. చిత్రమైన చేష్టలుచేస్తూ నన్నాకర్షిస్తోంది. క్రమక్రమంగా నాలో ధైర్యం వచ్చింది. కొద్ది నిముషాలపాటు నన్ను నేను మరిచిపోయాను. నా బాధలు, వేధలు, ఆకలి, శోకం, అవమానం, దారిద్ర్యం అన్నీ మరిచిపోయాను. ఎండిపోయిన నా నరాల్లో కొత్తరక్తం ప్రవేశించింది ... నా రక్తంలో రాజహంస లీదుతున్నాయి. నా జీవకణాల్లో చిచ్ఛక్తులునర్తిస్తున్నాయి. నేను నవయువకుణ్ణి. నా కీ దౌర్భాగ్యస్థితి రాకముందు నేను యౌవ్వనం గడిపిన రోజులు ... నే నిప్పుడు మళ్ళీ నూనూగుమీసాల, పదహారు సంవత్సరాల బాలుణ్ణి ... ...

'అవునుగాని, ఆతడవ నేను వెంబడించింది నిన్నుకాదు. ఏ చెల్లెలు, అన్నాను నేను.'

'నా చెల్లెలా!' అన్నదామె ఆశ్చర్యంతో నా వైపు చూస్తూ. ఆమె నిలబడింది.

'అవును. అంటే ఆ వెడుతున్న ఇద్దరిలో చిన్నదాని వెంటనే నేను వెళ్ళాను.'

'చిన్నదా? హె, హె, హె, అహ,హా! హా!' అంటూ ఆమె పగలబడి నవ్వసాగింది.

"అమ్మో దొంగా! ఏమో అనుకున్నానుగాని నీదగ్గర చాలాచమత్కారం ఉంది. ఇంతకుముందేగా నన్ను ముసుకు తీయమని అడిగావు? నన్ను చూడాలని అనలేదూ; చూచావు కూడా! నన్నింతకుముందు ఎరగనట్లుగా నటించడం దేనికి? నన్ను మాయచేద్దామనా? ఇప్పుడు నిన్నేం చెయ్యాలి!" మళ్ళీ ఆమె పొట్టచక్కలయ్యేటట్లుగా నవ్వడం మొదలుపెట్టింది. నేనూ ఆపుకోలేక పెద్దగా నవ్వాను.

ఒకచోట కూర్చున్నాం. ఇద్దరం కొంతసేపు పరిహాసా లాడుకున్నాం. పగలబడినవ్వుకున్నాం. ఏవేవో కబుర్లు, ఎన్నెన్నో ముచ్చట్లు; ఒక్క నిముషంకూడా వృథాకాకుండా, తెరిపి లేకుండా, తెంపులేకుండా మాట్లాడుకున్నాం. ఆమె చెప్పే కబుర్లకు నేనేంసమాధానమిస్తున్నానో తెలియడంలేదుకాని, నాకు మాత్రం ఎంతో సంతోషంగా ఉంది. ప్రతిక్షణికం ఎంతో హాయిగా, తీయగా ఉంది. ఈపట్నంలోనే చాలాకాలంక్రిందట ఆవిడ నన్నొకమాటు సినిమాహాల్లో చూచిందట. నాచుట్టూ అనేకమంది స్నేహితులున్నారట. ఆదఫాకూడ నేను అంతమంది స్నేహితులమధ్య సినిమాహాల్లో పిచ్చివాడిలాగా ప్రవర్తించా

నట. అవును. సిగ్గుచేటు. అప్పుడుకూడా నేను వెర్రిమొర్రి చేష్టలుచేస్తూ ఉండేవాణ్ణి.

'అప్పుడెందుకూ సినిమాహాల్లో అదేపనిగా నవ్వుతూ వెకిలచేష్టలు చేశారు?' మళ్ళీ ఆమె నన్ను ప్రశ్న వేసింది. ఎప్పటిసంగతో జ్ఞాపకానికి తెస్తూ.

'అవును. ఆరోజుల్లో నేను విపరీతంగా నవ్వుతూ ఉండే వాణ్ణి. ఎంతో ఉత్సాహంగా, హుషారుగా, సరదాగా, జల్సాగా గడిపేవాణ్ణి.' అన్నాను నేను గడిచిన జీవితాన్ని స్మృతి పథం లోకి తెచ్చుకుంటూ.

'మరిప్పుడెక్కడికిపోయింది ఆ సంతోషమంతా?' 'ఓ! ఇప్పుడుమాత్రం. సంతోషాలకు, సరదాలకు కూడా మధ్యమధ్య కాస్త విరామంఇస్తూ ఉండాలి. లేకపోతే అందులో మజా పోతుంది.'

ఆమెలేచి నిలబడింది. నేనూ లేచి నిలబడ్డాను.

'ఇక వెడదాం' అన్నదామె.

నేను తల ఊపాను. ఇద్దరం బయలుదేరి మళ్లీ మామూలుచోటుకు వచ్చాం. కొత్తగా కట్టినఇళ్లు. వీధిలో రెండో ఇల్లుమేడ. అక్కడికిరాగానే నేనాగాను. నాకు తెలుసు ఆమె వెళ్లిపోతుందని. 'సరే. ఇక మీరు వెడతారుకదూ?' అన్నదామె నిలబడి.

'వెళ్లొద్దూ మరి. తప్పదుగా!' నా సమాధానం.

ఆమె తిన్నగా నడిచి రెండో ఇల్లు మేడదాపులోకి పోయింది. నేనూ ఆమె వెనకాలే అడుగులో అడుగువేసు కుంటూ అక్కడిదాకా వెళ్లాను. ఆమె వాకిలిదగ్గర నిలబడి వెనక్కుతిరిగి చూచింది. 'పొద్దుపోయింది. ఇంటికి వెళ్లండి.

ఇంకా ఎందుకు ఆలోచిస్తున్నారు?' నావైపుచూస్తూఅడిగిందామె.

'ఆ, ఏమీలేదు. వెళ్ళిపోతాను.'

సమాధానం చెప్పాను. కాని ఆమె, నేను ఆ మేడ ముందు నిలబడి ఉన్న క్షణంలోనే నాబ్రతుకు సర్వస్వం కళ్ళ ముందు గోచరించింది. నా దౌర్భాగ్యాన్ని నేను స్పష్టంగా ముఖాముఖీ చూడగలిగాను. 'ఎంతధైర్యం? చదువూ, సంస్కారం, అందం, అభిమానమూకల ఒకయువతిప్రక్కన పెద్దభవనం ముందు నిలబడ్డాను. ఛీ. అసహ్యామైన ఆకారం, చిరిగి పీలిక లైన బట్టలు, ఆకలివల్ల కృశించిన శరీరం; ఛీ! సిగ్గులేకుండా ఇంతసేపూ ఒక స్త్రీతో గడిపాను. నేను స్నానంచేసి ఎంతకాల మైంది? కనీసం ముఖమైనా తోముకోలేదే. మారురూపుపడి శవంలాగా మారిపోయిన నేను మందారంలాంటి పిల్లను వాంఛించాను. మహాపాతకాన్ని మూటకట్టుకోవడానికి ఇంతకన్నా ఏం కావాలి?'

ఒక్కసారి క్రుంగిపోయి తలవొంచుకున్నాను. అప్రయత్నంగా ఆమెతో ఇలాఅన్నాను. 'అయితే ఇక మనం మళ్ళీ కలుసుకునే అవకాశంలేదా?'

ఆమెను తిరిగీ చూచేభాగ్యం లేదని నాకు తెలుసు. కనీసం జ్ఞాపకం ఉంచుకోడానికైనా ఏమైనా చెపుతుందేమో అని అడిగాను.

'తప్పకుండా కలుసుకుందాం.' చాలా మృదువుగా రహస్యంగా అన్నదామె.

'ఎప్పుడు?'

'చెప్పలేను.'

ఒక్కక్షణం నిశ్శబ్దం...

'ఒకసారి ఆముసుకుతీయి. ఒక్క నిముషంకళ్లారాచూస్తాను. ఒక్కసారి, ఒక్కనిముషంచాలు. మళ్లీ నిన్ను చూడగలుగుతానో, లేదో!'

మరొక నిముషంసేపు నిశ్శబ్దం...

'మంగళవారం సాయంత్రం రాండి. ఇక్కడే. బయట నిలబడిఉండండి. నేనొచ్చి కలుసుకుంటాను. వస్తారుకదూ!'

'నీ వనుగ్రహించాలేకాని, రాకుండా ఉంటానా! తప్పకుండా వస్తాను.'

'రాత్రి 8 గంటలకు.'

'ఓ యస్.'

వణుకుతున్న నాచేతుల్తోమెల్లగా ఆమెతలమీదిముసుకు క్రిందికి లాగాను. నాచెయ్యి ఆమె శరీరానికి తగల్లేదు. కాని ఆవిడకు చాలా దగ్గరగా నిలబడి ఉన్నందువల్ల నా కెంతో హాయిగా ఉంది.

'నన్ను మీరేమాత్రం అపార్థం చేసుకోకూడదు'. అంటూ ఆమె మరోసారి నవ్వింది.

'నేనలా అనుకునేవాణ్ణికాదు.'

గభాలున ఆమె తన తలమీది ముసుకు తీసివేసింది. అలా ఒక్కక్షణం నిలబడి ముఖంలోముఖంపెట్టి ఒకర్నిఒకరం చూచుకున్నాం. 'జలజా' అన్నాను బిగ్గరగా.

గభాలున, మెరుపులాగా, ఆమె ఎగిరి తనరెండుచేతులు నామెడపైచుట్టి గట్టిగా కౌగలించుకుంది. అతివేగంగా, దిగ్భ్రాంతి చెందేలాగా నన్ను ముద్దుపెట్టుకుంది. ఒకే ఒకసారి బలంగా, బరువుగా ముద్దుపెట్టుకుంది. ఆమె ఉన్నత వక్షోజాలు నాగుండెలమీద బలంగా తగిలాయి. ఆవిడ అతి

వేగంగా శ్వాసపీలుస్తోంది. ఒక్కక్షణం; రెప్పపాటుకాలం... నన్ను వదిలించుకుని గిరుక్కునమళ్లీ ఇంట్లోకి పరిగెత్తింది. వెడుతూనే వినపడీ వినపడనట్లు 'గుడ్‌నైట్' అంది. బయటివాకిలి 'టపీ' మని మూసివేయడం, మేడమీదికి పరిగెత్తడం... అంతా ఒక్కక్షణంలో అయిపోయింది.

♦ ♦ ♦ ♦

మరునటిరోజు ఉదయం కొంచెం ఆలస్యంగా లేచాను. బాగామబ్బుపట్టిఉంది. సన్నగా వర్షంకూడా పడుతోంది. లేచింతర్వాత అలాగే పక్కమీద కొంచెంసేపు పడుకొని ఉన్నాను. నా హృదయంలో ఏదో విచిత్రమైన కలవరపాటు; బుర్రలోకి వింతవింత ఊహలు వస్తున్నాయి. క్రిందటిరాత్రి జరిగిన సంఘటన నన్ను తలక్రిందులు చేస్తోంది. మధురమైన సంఘటన; మరిచిపోలేని సంఘటన; ఎంతమంచిరాత్రి! కొంతసేపు నాపక్కన 'జలజ' కూర్చొని ఉన్నట్లుగా భ్రమించాను. రెండు చేతులూ చాచి నన్ను నేనే కౌగలించుకున్నాను. గాలిలో ముద్దు పెట్టుకున్నాను.

చివరికెలాగైతేనేం పక్కమీదినుంచిలేచాను. పాలవాడిదగ్గర ఒక పావుసేరు పాలుతీసుకొని త్రాగాను. నాకేమంత ఆకలిగాలేదు. కాని నరాలుమాత్రం బిర్రుగాబిగబట్టిఉన్నాయి. వళ్ళంతా వింటినారిలాగా బిగుసుకొని పోయింది.

బట్టలకొట్లవైపు బయలుదేరాను. స్వెట్టరొకటిచౌకలో వచ్చేదికొనుక్కోవాలని నా ఉద్దేశ్యం. పాతదైనాసరే ఫరవాలేదు. చలికాలం, వంటిమీద పడిఉంటుంది. వేలంపాటవేసే వాళ్ళదగ్గర చౌకగా దొరుకుతాయి. ఇలాంటివి ఎక్కడో కొట్టుకొచ్చి తక్కువకమ్మే దుకాణాలుకూడా ఉన్నాయి. ఒకచోట

నిలబడి స్వెట్టరు బేరం చేస్తున్నాను. ఆసమయంలో నాకు తెలిసిన ఒకతను కనిపించాడు. రమ్మని పిలిచాడు. చేతులో స్వెట్టర్ అక్కడేపడేసి అతనివెంట బయలుదేరాను. అతను ఇళ్ళప్లానులు గీస్తుంటాడు. ఆ దాపులోనే అతని ఆఫీసుగది.

'కాస్త కాఫీ తాగి వెళ్దువుగాని ...తొందరగా నడువు. మళ్ళీ నేను వెళ్ళిపోవాలి. టైంలేదు ... అవునుగాని, నిన్న సాయంకాలం నీవు వెంటబెట్టుకొనిపోతున్న ఆ పిల్ల ఎవరు?'

అతని మాటలు నా కసూయ కలిగించాయి. అర్థంలేని ప్రశ్న, అనవసరమైన సంభాషణ. ఆమెతో అతని కేంపని? అసలు నా స్వంత విషయంలో అతని కెందుకు జోక్యం.

'నాకు సంబంధించినమనిషే. నాతోనే ఉంటోంది' నేను సమాధానం చెప్పాను.

'ఆ! నీతో ఉంటోందా?'

'అవును. ఇద్దరంకలిసే ఉంటున్నాం. నిన్నసాయంత్రమే ఈ ఏర్పాటు జరిగింది.'

నేను చెప్పిన సమాధానం అతన్ని మళ్లీ తిరుగుజవాబు చెప్పటానికి వీల్లేకుండా చేసింది. నేను చెప్పింది అతను దృఢంగా నమ్మాడు. అతన్ని వదిలించుకోవాలని నేనలా యుక్తిగా అబద్ధమాడాను. ఇద్దరం కాఫీతాగి బయటికొచ్చాం.

'గుడ్‌బై వస్తా' అంటూ అతను రెండడుగులు వేసి మళ్లీ వెనక్కు వచ్చాడు.

'అవును. మరిచాను. నీకు నేను కొంతడబ్బివ్వాల్సి ఉంది. ఇంతకాలమైనా ఇవ్వలేకపోయినందుకు చాల బాధపడుతున్నాను. నీకు ముఖంచూపడానికి సిగ్గుగాఉంది. తప్పక రెండు

మూడు వారాల్లో సర్దుతాను. మరేమీ అనుకోకు.' అన్నాడ తను. 'యస్. థ్యాంక్సు'. అన్నాను నేను.

అతను నాడబ్బు తిరిగీ ఇవ్వడని నాకు తెలుసు. అతను ఇప్పించిన కాఫీ ఎందుకు తీసుకున్నానా అనుకున్నాను. వెంటనే నామనస్సు 'జలజ' మీదికి మళ్లింది. క్రిందటిసాయంత్రం నేను చేసిన సాహసం జ్ఞాపకానికివచ్చి నన్ను భయంలో ముంచి వేసింది. ఏదో తెలియని అవ్యక్తస్థితిలోకి వెళ్లిపోయాను.

బహుశా మంగళవారం నాడావిడ నన్ను కలుసుకోక పోతే! ఒకవేళ ఆవిడ నన్ను గురించి ఆలోచించడం మొదలు పెడితే! నామీద అనుమానం కలిగితే... ఏమని అనుమానం? ... అర్థంలేని ఆలోచనలు నన్ను కలవరపెట్టాయి. ఉండీఉండీ ఒక్కమాటు ఉలిక్కిపడ్డాను. మరుక్షణంలో నామనస్సు డబ్బు మీదికి పోయింది. కొట్లో కుర్రాడు నాకిచ్చినడబ్బు. భయం, భయం! భరించలేని భయం నన్ను చుట్టుముట్టింది. దొంగతనం, నేచేసిన దొంగతనం వివరాలతోసహా నాపై విరుచుకపడింది. ఆ చిల్లరకొట్టు నాకళ్లముందు కనిపించింది. దుకాణంలో నిల బడి ఉన్నాను. చేతినిండా డబ్బుతీసుకుని జేబులో వేసుకు న్నాను. గాభరా, వణుకుతున్న చేతులు, తత్తరపాటు, నావాలకం, అంతా కనిపెట్టారు. దొంగతనం బయటపడింది. పోలీసు నన్ను అరెస్టు చెయ్యడానికొచ్చాడు. నాచేతులకూ, కాళ్లకూ సంకెళ్లు. కాదు. నాచేతులకు మాత్రమే. బహుశా ఒకచేతికే వేశారు. కోర్టు. విచారణ. నేనుబోనులో నిలబడ్డాను. గుమస్తా సాక్ష్యం తీసుకుంటున్నాడు. అతని కలం గరగరమం టోంది. బహుశా ఆకలం కొత్తగా కొన్నదై ఉండవచ్చు. నావిచారణకోసే ఆకలం వ్రాత ప్రారంభమైంది – న్యాయాధి

పతి నా వంక తీక్షణంగా చూచాడు. నేరస్థుడు... శిక్ష... ఖైదు... గాఢాంధకారం. శాశ్వతమైన అంధకారం...

హా! రెండు చేతులూ గట్టిగా బిగబట్టి శ్వాసపీల్చాను. అలాగైనా ధైర్యం తెచ్చుకోడానికి ప్రయత్నించాను. గబగబ నడిచి మార్కెట్టు దగ్గరికి చేరుకున్నాను. ఒకచోట కూల బడ్డాను.

'ఇక వీల్లేదు. పసిపిల్లవాడిలా ప్రవర్తిస్తే ప్రయోజనం లేదు. ఇంతమంది జనంలో నేనే దొంగతనంచేశానని ఎవడు రుజువుచేయగలడు? అదీకాక ఆ అంగడి కుర్రాడు ఈ విషయం బయటపెట్టడానికి భయపడతాడు. అది అతనికే ముప్పు. ఎప్పుడో ఎవరికో డబ్బిచ్చానని చెపితే ఎవడు నమ్ముతాడు? కనుక ఏంభయంలేదు. ఏదీబయటపడదు. బ్రతికానురా దేవుడా!'

మొత్తంమీద జేబులోఉన్న పాపపుసొమ్ము నాకుశాంతి లేకుండా చేస్తోంది. ఆ చిల్లరడబ్బులు . నా జేబులో బరువుగా ఉన్నాయి. నన్ను నేను ప్రశ్నించుకున్నాను. ఈ పాడుడబ్బు రాకముందే నేను సుఖంగాఉన్నానుకాదూ? ఎన్నిబాధలుపడ్డా పరువుగానే బ్రతికాను. మంచినీళ్లు త్రాగకపోయినా మంచినీ, మర్యాదను నిలబెట్టుకొన్నాను. ఆ బాధల్లోనే నాకు ఆనంద ముంది. ఈ పాడుడబ్బు ఏమంటూవచ్చిందో, నా మనస్సు మరింత పాడైంది. మరి 'జలజ' సంగతేమిటి? నా పాపపు చేతుల్తో ముట్టుకొని ఆమెనుకూడా అపవిత్రం చేయలేదుగదా? ప్రభూ, ఓ ప్రభూ, దీనదయాళూ, జలజ! నా పాపంతో ఆమెనుకూడా భ్రష్టురాల్ని చేశానా?

గభాలునలేచి నిలబడ్డాను. కొంచెం దూరంలో చెట్టు క్రింద ఒక ముసలది కూర్చొనిఉంది. శనగలమ్ముకుంటోంది.

సరాసరి ఆగకుండా ఆ ముసలిదానిదగ్గరకి వెళ్లాను. నడుస్తూనే జేబులోఉన్న డబ్బుయావత్తూ చేతిలోకి తీసుకున్నాను. 'ఇప్పటికైనా నా మర్యాదను నిలబెట్టుకుంటాను. యావత్ప్రపంచానికీ నా నిజాయితీ చూపెడతాను. కొంచెం ఆలస్యమైంది. అంతే.' శనగలు కొనుక్కునేవాడికిమల్లే ఆ ముసలమ్మ దగ్గరికివెళ్లాను. ఏమీ అడక్కుండానే వంగి డబ్బామె చేతిలో పడేశాను. ఒక్కక్షణంకూడా ఆలోచించలేదు, ఆలస్యం చేయలేదు. ఆమెతో ఒకమాటకూడా మాట్లాడకుండా గిరక్కునమళ్లి వెళ్లిపోయాను.

చేతులో డబ్బు జారవిడుచుకున్నందుకు నేనేమీ బాధపడలేదు. ఆడబ్బవతలపారేసినందువల్ల నాకెంతో హాయిగా ఉంది. నిజంగా ఆలోచిస్తే పరువుగా బ్రతకడంలో ఎంతప్రశాంతత ఉంది! ఆకలితో బాధపడగలనుగాని అన్యాయంగావచ్చిన సొమ్ముతో తినలేను. తిన్నా జీర్ణించుకోలేను. దేవుడిదయవల్ల ఆ పాపపు సొమ్మునుంచి బయటపడ్డాను. పాపం ఆ ముసలిది శనగలమ్ముకొని జీవిస్తోంది. ఎన్ని అర్ధణాలు పోగుచేస్తే ఆమె కడుపు నిండుతుంది? ఈరాత్రి ఆ ముసలమ్మ బిడ్డలు ఆకలితో మాడకుండా కడుపునిండా తింటారు... తప్పో, ఒప్పో నాకు తోచిన పనిచేశాను. అంతే.

సంతృప్తివల్ల సంతోషం కలిగింది. ఆ సంతోషంలో సారాయి తాగినవాడికి మల్లే వళ్లు తెలియకుండా ఉన్నాను. మార్కెట్టుప్రాంతంలో జనసమ్మర్దం విపరీతంగాఉంది. ఆ ప్రదేశంలో అటూ ఇటూ వెర్రివాడికిమల్లే తిరిగాను. 'జలజ' ను కలుసుకుంటాను. నా గుణగణాలుచూచి ఆమె మెచ్చుకుంటుంది. ఆమెతో చెపుతాను. 'పరువుగా బ్రతికేవాణ్ణని ప్రతిజ్ఞ

చేసి చెప్తాను.' అంతకంతకూ నాలో ఉత్సాహం అధికమైంది. నా ప్రతిభతో పట్నంమొత్తాన్ని అల్లకల్లోలం చేయాలనిపించింది. ఖద్దరుటోపీ పెట్టుకొనివెళుతున్న ఒక పెద్దమనిషి ఎదురు వచ్చాడు. అతని దగ్గరికివెళ్లి చెయ్యిపట్టుకున్నాను. అతను ఆశ్చర్యంగా నావంకచూచాడు. అతనేమీ అడక్కుండానే నాపేరు, వయస్సు. అతనితో చెప్పాను. వెంటనే అతనిచెయ్యి విదిలించేసి గబగబ వెళ్లిపోయాను. నాముందువెనుకల జనం నన్నుచూచి పగలపడి నవ్వుతున్నారు. నాకు వినపడుతూనేఉంది. ఏమిటి నేనుచేసినపని!

రిక్షాస్టాండు కనిపించింది. చాలా రిక్షాలు వరుసగా ఉన్నాయి. రిక్షావాళ్లు ఒకరితో ఒకరు ముచ్చట్లాడుతూ నవ్వుకుంటున్నారు. గబగబ మొదటి రిక్షాదగ్గరికివెళ్ళి టపీమని ఎక్కికూర్చున్నాను. 'పోనీ' అన్నాను డాబుగా, దర్జాగా.

'ఎక్కడికి బాబయ్యా' అడిగాడు.

'చెప్తాలే. పోనీ'

రిక్షా పోతోంది. మధ్యమధ్య రిక్షావాడు నా వంకచూస్తూ లాగుతున్నాడు. చాలాసార్లు చూచాడు అదోరకంగా. వాడు కూడా నన్నునుమానిస్తున్నాడు. అవును. సందేహంలేదు. నా అసహ్యమైన ఆకారం, అతని మనసునుకూడా మార్చింది. ఏ రోడ్డున వెళ్ళాల్సిఉందో, దోవచూపుతున్నాను. ఆ ప్రకారం వాడు రిక్షావేగంగా లాగుతున్నాడు. అతని వంటిమీద చెమట కారుతోంది. అతని చిరిగిన బనీను ముద్దలా తడిసిపోయింది. రిక్షావాడితో ఇలా అన్నాను. 'అర్జంటుగా ఒకతన్ని కలుసుకోవాల్సిన పనుంది. అందుకని వెడుతున్నాను.' అతనేమీ మారు మాటాడలేదు. నేను, నిజంగా అవసరమైన పనిమీద వెడు

తున్నానని అతనికి తెలియగలందులకే అలా చెప్పాను. అలాగైనా అతనికి నా మీద నమ్మకంగల్గుతుందేమోఅని ఆశ.

ఒక చిన్నసందులోఉన్న ఇంటిముందుకుపోనిచ్చి రిక్షా ఆపాను. గభాలున రిక్షామీదినుంచి దుమికి సరాసరి ఆ మేడ మూడో అంతస్థులోకివెళ్ళాను. గోడకున్న 'కాలింగ్ బెల్' గట్టిగా నొక్కాను. వెంట వెంట అయిదారుసార్లు అలా నొక్కాను. ఒక ఆడమనిషివచ్చి తలుపు తీసింది. ఆమె, చెవులకు జూకాలుపెట్టుకొని నల్లటి జాకెట్టుతొడుక్కునిఉంది. తత్తరపాటుతో నావంక చూచింది.

'అబ్దుల్ గఫూర్' గారున్నారా? అడిగాను నేను.

ఆమె ఏమీసమాధానం చెప్పకుండా బిక్కముఖంవేసుకుని నిలబడిఉంది.

'అబ్దుల్ గఫూర్.' ఉన్నివ్యాపారం చేస్తాడు' మళ్ళీ అడిగాను నేను.

'ఇక్కడెవ్వరూ ఆ పేరుగలవారులేరు'ఆమె తలతిప్పుతూ సమాధానం చెప్పింది.

రెప్పవాల్చకుండా నావైపేచూస్తూ తలుపు మూయడానికి సిద్ధంగా ఉంది. నాకొక్కవాల్సిన మనిషి అక్కడున్నదీ లేనిదీ మరొకర్ని అడిగైనా తెలుసుకోవడంగాని, విచారించడంగాని ఏమీలేదు. కొయ్యబొమ్మలానిలుచుంది. పాపిష్టిముండ. సోమరిపోతుకాకపోతే మరేమిటి. ఆముఖం చూస్తేనే తెలుస్తోంది. ఆముండకు, గఫూర్ తెలుసు. కావాలనే చెప్పకుండా తప్పుకుంటోంది. నాకు విసుకెత్తింది. ఇక అక్కడ నిలబడడానికి మనస్కరించలేదు. ఒక్క పరుగులో మెట్లుదిగి బయటికొచ్చేశాను.

'అతనక్కడలేడు' అన్నాను రిక్షావాడితో.

'అతనక్కడలేడూ?' అన్నాడతను తిరిగీ.

'లేడు. మరొకచోటికి పోనీ చెప్తాను' అన్నాను రిక్షాలో కూర్చుంటూ.

నేను చాల ఉద్రేకంగా ఉన్నాను. నా ఆదుర్దా, హడావుడి చూచి రిక్షావాడుకూడా నేనేదో ప్రమాదస్థితిలో ఉన్నానని గమనించినట్లుంది. ఎదురు జవాబు చెప్పకుండా ఎకాఎకీ రిక్షాలాగడం మొదలుపెట్టాడు.

'ఆమనిషిపేరు ఏంటి చెప్పారుబాబూ?' వాడు రిక్షా లాగుతూ మళ్లీ అడిగాడు.

'అబ్దుల్ గఫూర్.'

ఒక్కక్షణం ఆగి రిక్షావాడు మళ్లీ ఇలా అన్నాడు.

'ఆయనెప్పుడూ కోటు తొడుక్కుని ఉంటారు కదండీ?'

'నీముఖం, కోటు చాలమందితొడుక్కుంటారు. అంతమాత్రాన అతనేనని నీకేంతెలుసు?'

రిక్షావాణ్ణి అనవసరంగా కసురుకున్నాను.

'గడ్డంఉంటుంది. నల్లటి తుర్కీటోపీ పెట్టుకుంటాడు' అన్నాడతను తిరిగీ.

'ఆ, ఆ!'

'ఆ అయ్యగారు నా బండ్లో రెండుమూడుసార్లెక్కారు.'

కావచ్చు. వాడుచెప్పినట్లే, తుర్కీటోపీ, గడ్డం, కోటు ... గఫూర్ నా కళ్ళముందు కనిపించాడు. ఈ రిక్షా అతను అనేకసార్లు ఎక్కిఉండవచ్చు. పాపం అనవసరంగా వాణ్ణి కసురుకున్నాను. నా ఉద్రేకం, ఉన్మత్తత అలాచేసింది.

అలా రెండు మూడు వీధులుదాటి వెళ్తున్నాను. ఒక

'కానిస్టేబుల్' ఎదురుపడ్డాడు. అంత అయోమయంలోకూడా నేను అన్నీ గమనిస్తూనే ఉన్నాను. ఆ కానిస్టేబుల్ నెంబరు 69. సరీగ్గా 69 – మనస్సులో సూదిలా గుచ్చుకుంది. దాన్ని మరిచిపోలేను ... ...

అది బాగా మెరకప్రదేశం. ఇళ్ళన్నీ ఎత్తుగాఉన్నాయి. రిక్షా వీధిలోఆపాను. నా మనస్సులో ఒక సరియైన నిర్ణయ మంటూలేదు. రిక్షా దిగి ఎత్తుప్రదేశంలోకి వెళ్ళాను. అక్కడ బంగళాలాంటి ఇల్లొకటి కనిపించింది. లోపలికి వెళ్లాను. తల బరువుగాఉంది. అవయవాలు నా స్వాధీనంలోలేవు. ఆ ఇంటికి పెద్ద గేటుకుంది. నడవలో కొంచెంసేపు నిలబడ్డాను. అక్కణ్ణుంచి ముందరగదిలోకివెళ్లాను. ఆ గదికి రెండు పెద్ద కిటికీలున్నాయి. గదిలోఒకవైపు రెండుపెట్టెలు ఒకదానిపై ఒకటిపెట్టిఉన్నాయి. మరొకమూల పూర్వకాలపు ఫక్కీలోచేసిన పందిరిమంచ ముంది. దానిమీద కంబళిపరిచిఉంది. ప్రక్కగదిలోంచి పసి పిల్లఏడుపు వినిపిస్తోంది. లోపల ఎక్కడో పాత్రసామాగ్రి క్రింద పడేసినచప్పుడైంది. ఆ గదిలోంచి సరాసరి లోపలికివెళ్లాను. ఎదురుగా వాకిలికనిపించింది. తలుపు తీశాను. ఆ వాకిలి అవ తల వీధిలోకిఉంది. రోడ్డుమీదికివచ్చి వెనక్కు తిరిగిచూచాను. నేను దాటివచ్చిన ఇంటివైపు పరీక్షగాచూచాను. దానిమీద 'టాప్రివెలర్సు బంగళా' అని వ్రాసిఉంది.

రిక్షావాణ్ణి మోసంచేసి తప్పించుకపోదామని నాఉద్దేశ్యం కాదు. కావాలని నేనలా చేయలేదు. అలానడుస్తున్నాను. నేనెవర్నయితే కలుసుకోవాలని ఇంతగందరగోళం చేశానో ఆ 'గఫూర్'కూడా నాకు మనస్సులో లేదు. మరిచిపోయాను. మాయలాగా, మంత్రంలాగా జరిగిందంతా మరిచిపోయాను.

నడుస్తున్నకొద్దీ నాకు వళ్లుతెలియడం ప్రారంభించింది. మధ్యలో వచ్చిన మైకం వీడిపోయింది. చాలా బడలిగ్గా, బాధగా ఉంది. బరువుగా కాళ్లీడ్చుకుంటూ పోతున్నాను.

చివరకు శీతారామస్వామి కోవెలదగ్గరికి చేరాను. కాస్త విశ్రాంతి తీసుకుందామని ఆ గుడిదగ్గర బయటకూర్చున్నాను. వచ్చేపోయే జనం నన్ను విచిత్రంగా చూస్తున్నారు. నేను తిరిగీ ఆలోచనలో పడ్డాను. 'భగవంతుడా, నాకెంత దురవస్థ పట్టింది! జీవితమంతా ఇలా గడపాల్సిందేనా? ఎంతకాలం ఈ బాధలుపడగలను! శక్తిలేదు. అలిసిపోయాను. ఈ అంధకారంలో ఇక జీవించలేను. ఈ యమయాతనలు అనుభవించలేను. ఎంతో ఓర్చుకున్నాను. ఎంతోకాలం భయంకరమైన యుద్ధం చేశాను. కాని లాభించలేదు. పరిస్థితులు... ప్రభావం... గెలుస్తున్నాయి. నన్ను లొంగదీసుకున్నాయి. నేనే ఓడిపోయాను... దుర్భరదారిద్ర్యం నన్నుపీల్చి పిప్పిసి చేసింది. నేనిప్పుడు మనిషిగాలేను. ఏదోనీడ. నీడలోంచి వచ్చిన నీడ... నా శరీరం యావత్తూ శుష్కించింది. రెక్కల్లో సత్తువ పూర్తిగాపోయింది. రెండుచేతులూ తోళ్లలాగా వ్రేలాడుతున్నాయి. నా ఎదురురొమ్ము ఎండిపోయి ముడుచుకొనిపోయింది. నేను నడిచేటప్పుడు గూనివాడి మాదిరిగా, ముసలివాడిలాగా వంగి పోతున్నాను. కొద్ది రోజులక్రితం ఒకనాటి మధ్యాహ్నం నాగదిలో కూర్చున్నప్పుడు శరీరాన్ని బాగా పరీక్ష చేశాను. అవయవాలన్నీ తడిమిచూచుకొని నాదార్భాగ్యస్థితి తలుచుకొని ఆక్రోశంతోఏడ్చాను. నేనీచొక్కాతొడుక్కొని ఎన్నిరోజులైంది! ఒకేఒకచొక్కా విడవకుండా వారాలతరబడి వాడడంవల్ల అది నా చెమటలో మునిగితేలి కంపుకొడుతోంది. వానలకుతడిసి,

ఎండకుఎండి, కొయ్యబారిపోయింది. అంచేత అదినావంటిమీద గరగరమని రాచుకుంటోంది. ముఖ్యంగా నా పొట్టమీద బొడ్డుకు దగ్గిరగా బాగా రాచుకొనిపోయి చిన్నపుండు పడింది కూడా. మెత్తని ప్రదేశం అవటంవల్ల నాకక్కడ మంటపుడు తోంది. 'ఏంచేయను ఈ బాధలన్నీ తీరేమార్గంఏది? ఏంచే యను? ఏం?...'

అలా ఆలోచిస్తూ పూర్తిగా దుఃఖంలో మునిగిపోయాను. నా అవయవాలన్నీ అసహ్యంగా కనపడుతున్నాయి. చిక్కి శల్యమై అస్థిపంజరంలాగా ఉన్న నా కళేబరాన్ని చూడలేక పోయాను. ఓ ప్రభూ! 'నాకిదేఅంత్యదశ అయినట్లయితే, నేను చనిపోవడానికి సిద్ధంగా ఉన్నాను. సంతోషంగాచచ్చిపోతాను! ఆనందంతో మృత్యువును ఆహ్వానిస్తాను!'

అలా బాధపడి, బరువెక్కి, విచారించి, విసుకుపుట్టి లేచి నిలబడ్డాను. అప్రయత్నంగా నా గదివైపు నడవసాగాను. నడుస్తూ మధ్యలో ఒక బోర్డుచూచాను 'సీనారేకుల డబ్బాలు అమ్మబడును.' అసిగ్రాసుంది. అవును. అది నా మామూలు తోవ. అలవాటుపడ్డమార్గం. త్వరలో నా గదికిచేరగలను. నా పాతలేబులు, పడకకుర్చీ, కిటికీలోంచి కనబడే అడ్వర్టైజు మెంట్లు, వాల్‌పోస్టర్లు అన్నీ జ్ఞాపకానికొస్తున్నాయి.

అలా నడుస్తూ చిల్లరకొట్టు దగ్గరికొచ్చాను. నాకు ప్రమాదం సంభవిస్తుందని తెలుసు. ఆ కొట్టువాళ్లు నన్ను నిల బెట్టి డబ్బివ్వమని అడుగుతారు. అయితే అందుకు నేను సిద్ధ పడే ఉన్నాను. నాకై నేనేవెళ్ళి చెప్పడానికి నిశ్చయించు కున్నాను. గబగబ దుకాణం దగ్గరికి వెళ్లాను. ఒకఅమ్మాయి గిన్నె చేత్తోపుచ్చుకొని కొట్లోంచి బయటికి వస్తోంది. ఆ పిల్లను

తప్పుకోవడంలో తూలి పడబోయాను. కాని తమాయించు కున్నాను. కొట్లో కుర్రాడు ఎదురుగా కనిపించాడు.

'ఏం సార్? బాగున్నారా?' అడిగాడా కుర్రోడు.

నే నేమీ మాట్లాడలేదు.

'కొత్తసినిమా వచ్చింది. చాలాబాగుంది సార్, మీరు చూచారా?' మళ్ళీ అదే గొడవ మామూలు ధోరణిలో అడిగాడతను.

'నేను సినిమాలను గురించి చర్చించడానికిక్కడికి రాలేదు.' అన్నాను నేను కోపంగా.

దాంతో ఆ కుర్రాడు గాభరా ఎత్తాడు. కాని డబ్బును గురించి నన్నేమీ అడగలేదు. నాకై నేనే బయటపడుతున్నా వాడిమట్టిబుర్రకు అసలు విషయం బోధపడలేదు. మోసంచేసి డబ్బుకొట్టేశానని ఆ మొద్దువెధవ కింతవరకూ తెలియలేదు.

'మొన్నొకనాడు నీకు బాగా టోపీవేశాను. జ్ఞాపకం లేదూ?' ఆ కుర్రాణ్ణి సూటిగా అడిగాను. అలా అడుగుతూ ఎంతో ఆవేశం తెచ్చుకున్నాను. ఎలాగైనావాణ్ణి రంగంలోకి దించి, అసలు విషయం తేల్చిచెప్పేసి, నానా హంగామా చేద్దామని నా ఆలోచన.

పాపం నా డబాయింపుకు వాడు మరీ బిత్తరపోయాడు. వెర్రిముఖంవేసుకొని చూస్తూ నిలబడ్డాడు. ఆరి భగవంతుడా! లోకంలో ఎంతవసికిమాలిన దద్దమ్మలున్నారూ!

జరిగిందంతా వాడితో పూసగుచ్చినట్లుచెప్పాను. ఆ డబ్బెలా నా చేతిలోకి వచ్చిందీ, దాన్ని నే నెలా గుప్పిట్లో దాచిందీ, అంతా వాడికి అర్థమయ్యేట్లు చెప్పాను.

వాడు ఏడుపుముఖం పెట్టాడు. వెనకూ ముందుకూ

రెండడుగులు వేశాడు. పక్కనున్న గదివైపు చూపిస్తూ పెద్దగా అరవొద్దని నన్ను సైగచేశాడు.

'ఇంత తెలిసినవారు మీరిట్లాంటివని చెయ్యొచ్చా సార్!' అన్నాడాకుర్రోడు చివరకు.

'ఇక అంతటితో ఆగవోయ్!' అరిచాను నేను మళ్ళీ పెద్దగా.

అది నా తప్పుకాదనీ, అలాంటి దగుల్బాజీ పనిచేయడం నా మర్యాదకు భంగమనీ, అట్లాంటి పాపప్రసామ్మును నేను ముట్టుకునేవాణ్ణికాదనీ, తలకాయలేక నీవే పొరపాటువడ్డావనీ వాడితో వివరంగా చెప్పాను.

'మరి ఆ డబ్బు ఏంచేసారు సార్?' వాడు కీచుగొంతు పెట్టి మెల్లగా అడిగాడు.

'ఒక ముసలిదానికిచ్చాను. కూటికిలేని ముసల్ది. కాటికి కాళ్లుచాచుకుని కటికిదరిద్రంతో కాలిపోతున్న ముసల్ది. చిల్లి గవ్వకూడా నా దగ్గరఉంచుకోకుండా మొత్తం ఆ ముసలిదానికిచ్చేశాను. పాపం ఆ పేద . . . . . .'

ఆ కుర్రాడొక్క క్షణం నిలబడి ఆలోచించాడు. నా గుణం ఎటువంటిదో, నేనెంత నీతీ, నిజాయితీగా ప్రవర్తించే మనిషినో, వాడు గ్రహించినట్లుంది. చివరకిలా అన్నాడు.

'పోనీ ఆ డబ్బు తిరిగి తీసుకొచ్చి ఇవ్వకపోయినారా?'

'ఇదిగో అబ్బాయ్, నే నొక్క విషయం చెప్తాను వింటావ్? నిన్ను అనవసరంగా ఇబ్బందుల్లో పెట్టడం నా కిష్టం లేదు. జరిగిందేదో జరిగింది. నాకై నేనే వచ్చి సంగతంతా చెప్పాను. తప్పు నీది. అలా జరగటానికి అసలు కారణం నీవు. 'అయ్యో ఇలాంటి అవకతవకల పనిచేశానే' అని సిగ్గుపడడం

పోయి, అడ్డదిడ్డమైన ప్రశ్నలువేస్తున్నావు. ఉన్న విషయం చెప్పాను. అనవసరంగా వచ్చిన పేచీ తెగదెంపులు చేసుకు న్నాను. చేతులు కడుక్కున్నాను. అంతే. ఇక నీకూ నాకూ రాంరాం. కాకపోతే నీవూ నీ వ్యాపారం,నీ షావుకారూఅంతా ఏ గంగలోనైనా కలవండి. నాకేం సంబంధంలేదు. వస్తాను.'

గదికి చేరుకున్నాను. మళ్లీ నా గది యమలోకం. నా ఆవేశం చల్లారిపోయింది. ఆ చిల్లరకొట్టుకుర్రాడిమీద విరు చుకు పడ్డందుకు విపరీతంగా బాధకలిగింది. పాపం అమాయ కుడు, వాడేం చేశాడు? 'ప్రమాదో ధీమతామపి.' ఎంతటి బుద్ధిశాలికైనా పొరపాటనేది వస్తుంది. వాణ్ణి కనికరించడం పోయి, నా తడాకా చూపించాను. నోటికి వచ్చినట్లు మాట్లా డాను. వాడి పొరపాటును అవకాశంగా తీసుకొని అనవసరంగా ఏడిపించాను. వాడు నాలాంటివాడే. కూటికి జరక్క ఆ కొట్లో చేరాడు. నేను మాట్లాడేటప్పుడు వాళ్ళయజమాని ఇంట్లోనే ఉన్నాడు. అతను ఇదంతా విన్నట్లయితే ఆ కుర్రాడిగతి ఏమవు తుంది? సొమ్ము దుబారా అయిందని వాడిమీద చెయ్యి చేసుకుంటాడేమో! కొట్లోంచి వెళ్ళగొడతాడేమో! అలా జరి గితే నేనే వాడి పొట్టమీద కొట్టినవాణ్ణవుతాను.

అలా ఆలోచించినకొద్దీ నా మనస్సు అయోమయమై పోయింది. వెర్రివాడిలా అయిపోయాను. గదిలో నా ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించాను. ఏవేవో పిచ్చిపిచ్చిపనులుచేశాను. నాగది ఒక పిచ్చాసుపత్రి. నేనొక పిచ్చివాణ్ణి. పిచ్చి ...

నేను పడుకొనిఉన్నాను. నా బట్టలు మంచుకు తడిసి చల్లగా ఉన్నాయి. కాళ్లు చచ్చుతీపులుపుడుతున్నాయి. పుట్టివూమరి. రోజంతా తిరుగుడేనాయె. పట్నంలో రోడ్లన్నీ

నా పాలేనాయె. ఎన్ని మైళ్లు నడిచుంటాను? మోకాళ్లు గజగజ వణుకుతున్నాయి. ఓ ఆకాశవాణీ! నా జీవితంలో ఒక్క-క్షణం సుఖంలేదేమిటి? ఆకలితో, శోకంతో అల్లాడుతూ అనుక్షణం చావు బ్రతుకులమధ్య సమరంచేస్తున్నాను. నా బ్రతుకంతా పట్టెడు మెతుకులకోసం పాకులాడడంతో సరిపోయింది. ఓ భూదేవీ! నీకు నేను భారమైపోయానా?

ఆ రాత్రి నేను చచ్చిపోవచ్చునని మనసులో లీలగా తోచింది. కొంచెం నిబ్బరం తెచ్చుకుందామని ప్రయత్నించాను. నా బలమంతా ఉపయోగించి ఎలాగైనా ప్రాణాలు నిలుపుకుందామని చూచాను. వెంటనే నాకు 'జలజ' జ్ఞాపకం వచ్చింది. మంగళవారంనాడు నన్నామె కలుసుకోమంది మళ్ళీ నా జన్మలో ఆమెను చూడగలనా? భరించలేని బాధ, బ్రహ్మ రాక్షసిలాంటి భయం నన్నావరించాయి. అగ్నిజ్వాలలు, ఆపలేని వేడి, ఆర్పలేని వేడి, పెద్ద మంట. భగభగమని, ధగధగ మని మండుతోన్న మంటలు. నా చుట్టూ – నా కళ్ళముందు. భూమ్యాకాశాలుకలిసి తగలబడుతున్నాయి. చిటపటమని మండేచితి. అగ్నిపర్వతాలన్నీ ఏకమైనాయి. కొండవిదయ్యాలన్నీ కొలువుతీర్చాయి. జగత్తంతా ఘూర్ణిల్లుతోంది. ప్రళయం! బ్రహ్మాండభాండమంతా పటపటమని బ్రద్దలవుతోంది! ప్రళయం! మహాప్రళయం! జగత్ప్రళయం! సర్వనాశనం!

ఆ తర్వాత నాకేమీ కనిపించలేదు, వినిపించలేదు ...

* * *

మరునటిరోజు ఉదయాన్నే మెలుకువ వచ్చింది. నా వళ్ళంతా చెమటపట్టిఉంది. బట్టలన్నీ చెమటలో తడిసి ముద్ద లాగా అయిపోయినాయి. చన్నీళ్ళల్లో స్నానంచేసినట్లుగాఉంది.

జ్వరంవచ్చినట్లుగా నాడి వేగంగా కొట్టుకుంటోంది. మొదట్లో నా కేమీ అర్థంకాలేదు. నా కేం జరిగిందో, ఎందువల్ల ఇలా అయిపోయానో ఊహించలేకుండా ఉన్నాను. నా వళ్ళంతా పరిశీలించి చూచుకున్నాను. నా రూపమే మారిపోయింది. పూర్తిగా మారిపోయింది. మారురూపు. నన్ను నేనే గుర్తించలేకపోతున్నాను. గదిలో నే నెటువైపున పడుకొనిఉందీ, తల, కాళ్లూ ఎటుపక్కన పెట్టిందికూడా తెలియలేదు.

క్రమక్రమంగా క్రిందిభాగంలో గేదెలు చేస్తున్న చప్పుడు వినిపించ నారంభించింది. మెల్లగా మోచేతిమీద లేచాను. నా తల్లోంచి నీరుకారుతోంది. పక్కమీద తడిమిచూచాను. పక్కంతా తడిసిఉంది. అక్కడక్కడ వెంట్రుకలు రాలిపడున్నాయి. నా పాదాలు కొంచెం ఉబ్బి వాచినట్లుగా ఉన్నాయి. అవి నాకంతగా బాధకలిగించలేదుగాని, బరువెక్కి మొద్దుబారి ఉన్నందువల్ల కాళ్లు అటూ, ఇటూ కదిలించలేకపోయాను.

సాయంత్రం వరకూ అలాగే పడుకొనిఉన్నాను. ఇక అస్తమానంకావస్తోంది. తిన్నగాలేచి గదిలో కొద్దిగా అటూ ఇటూ తిరగటం మొదలుపెట్టాను. అడుగువెయ్యటం కష్టంగా ఉంది. ఎంతో పూనికతో నిలబడుతూ మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ నడిచాను. నే నంతగా బాధపడలేదు. అలా అయిందని విచారించలేదు. దాన్ని గురించిఆలోచించలేదుకూడా. క్రమక్రమంగా నా కాళ్లు స్వాధీనంలోకి వచ్చాయి.

ఆ తర్వాత బయటికి వెళ్లాను. నాకు మళ్ళీ ఆకలిబాధ తెలుస్తోంది. ఆ పాడు ఆకలి తిరిగీ నన్ను బాధపెట్టడం మొదలు పెట్టింది. ఛీ. నాకు సిగ్గులేదు. తిండిమీద కోరికను చంపుకోలేకుండాఉన్నాను. తిండిమీద ఇష్టం తప్పితే బాగుండిపోను.

అసలు తిండిమీద అభిలాషే నన్నింతవరకు తెచ్చింది. ఆకోరిక నా కడుపులో గూడుకట్టుకొనిఉంది. కనిపించకుండా కొరికి తినేస్తోంది. ఆకోరిక చిన్నపురుగులాగా కనిపించకుండా నాకడుపులో నివసిస్తోంది. కొంతసేపు నెమ్మదిగా ఒకప్రక్కన తొలుస్తోంది. ఆ తర్వాత మరోవైపుకు వెళ్ళి అక్కడ కొంచెంసేపు తొలవడం ప్రారంభిస్తోంది. ఆ మధ్యలో కొద్దిక్షణాలు విశ్రాంతి తీసుకుంటోంది.

నా కేమిటి జబ్బు? ఏ రోగమూలేదు. ఒకటే రోగం. అన్నంలేని రోగం. బాగా ఆయాసంగాఉంది. అలుపు వస్తోంది. నెమ్మదిగా నడుస్తున్నప్పటికీ వళ్ళంతా చెమటపడుతోంది. మార్కెటుదాకా వెడదామనుకున్నాను. కాని చాలా దూరముంది. నెమ్మదిగా అలాగే అడుగులో అడుగువేసుకుంటూ చాలాసేపటికి మార్కెటు దగ్గరికి వచ్చాను. విపరీతంగా చెమట పట్టింది. ముఖంమీదినుంచి కారినచెమట కళ్ళమీదకు జారింది. కళ్లు కప్పేసినందువల్ల కనిపించడంలేదు. ఆ చెమటకాస్త తుడుచుకుందామని ఒక్కక్షణం ఆగాను. నే నెక్కడ నిలబడి ఉందీ తెలియడంలేదు. నా చుట్టూమాత్రం భయంకరమైన రణగొణ ధ్వనులు వినిపిస్తున్నాయి.

హఠాత్తుగా కారుహారన్ వినిపించింది. హారన్ చప్పుడు చాలబలంగా, హెచ్చరిక చేసినట్లుగాఉంది. ధ్వని వినబడడంతోటే నావళ్లు కంపరమెత్తింది. ఒకప్రక్కకు తప్పుకోబోయాను. కాని బలహీనంవల్ల కాళ్లుతడబడ్డాయి. దయ్యంలాంటి 'లారీ' ఒకటి నా ప్రక్కనుంచి పోయింది. 'మడ్గార్డు' నా కోటుమీద రాచుకొనిపోయింది. లారీనిండా బస్తాలువేసి ఉన్నాయి. లారీమీద 'గవర్నమెంటుఫుడ్ సప్లై డిపార్టుమెంటు' అని వ్రాసిఉంది.

ఆరిభగవంతుడా! గండంగడిచింది. లేచినవేళ మంచిది కాబట్టి సరిపోయింది. ఎముకలు గుల్లకావాల్సినమాట. వళ్లంతా హూనంఅయ్యేది. నడిరోడ్డుమీద ఈడ్చేవాడూ, ఏడ్చేవాడూ లేక కుక్కచావు చచ్చేవాణ్ణి.

నడిరోడ్డుమీదినుంచి ఒకప్రక్కకు పోదామని నడవగలిగినంత వేగంగా నడిచాను. కాని నాచుట్టూ జనంమూగుతున్నారు. నన్నాపుచేసి ఏంప్రమాదం జరిగిందోఅని విచిత్రంగా చూడసాగారు. వాళ్లంతా అలా నాచుట్టూ మూగుతూఉంటే నాకు చిన్నతనమనిపించింది. అయినా ఏముందని? ఏమంత పెద్ద దెబ్బతగిలిందని? నిజానికి అలాంటి గండాలు ఎన్నిగడిచాయో! దీనివల్ల మరొకటి ఏమైందీఅంటే, నాబూటు ముక్కలుముక్కలుగా నలిగిపోయింది. నాకాలుపైకెత్తి చూచుకున్నాను. కాలి బొటనవేలినుండి బొటబొటమని నెత్తురుకారుతోంది. ఫరవా లేదు. లారీవాళ్లను అనవలసిన పనిలేదు. వాళ్లుమాత్రం కావాలని ఇలా చేస్తారా! అక్కడికీ పాపండ్రైవరు రెండుమూడుసార్లు గట్టిగా హారన్‌ఊదాడు. నా దగ్గరకి వచ్చేసరికి కొంచెం బ్రేకు వేసి నెమ్మదిగానే పోనిచ్చాడు. ఆ గాభరాలో నేనతనివైపు చూచిన క్షణంలో, అతనుకూడా ఎంతోకంగారుగా నావైపు చూచాడు. నిజంగా ఆలారీనిఆపి అతన్ని వేడుకున్నట్లయితే నాకేమైనా సహాయంచేసేవాడేమో? లారీమీద ఉన్నబస్తాలు బియ్యమో, గోధుమలో, పంచదారో అయిఉంటుంది. అన్నం లేక బాధపడుతున్నానని చెపితే అతను బియ్యమైనా పెట్టించేవాడేమో? పోనీలే. పేదవాళ్లకోసం ప్రభుత్వం ఆహారపదార్థాలు తీసుకపోతోంది. ఈ దేశనింగురోజుల్లో రెండుపూటలా అన్నంతినలేని దౌర్భాగ్యులు ఎంతమంది ఉంటారు? నిజంగా

అలాంటి నిరుపేదలందరికి ప్రభుత్వం ఈ ఆహారపదార్థాలు సప్లయిచేస్తే నేను మరణించినా ఫరవా లేదు. మరి ఆపదార్థాలు పేదవాళ్ల చేతుల్లోకే పోతున్నాయా! లేక...

నాకడుపులో భగభగమని మండుతోంది. ఏమీతోచడంలేదు. ఏంచేయడానికీ పాలుబోవడంలేదు. పిచ్చిపుట్టినట్లుగా ఉంది. ఎవర్ని అడగను? ఏమనిఅడగను? హోటళ్లదగ్గరికివెళ్లి ఏదైనా తింటానికి పెట్టమని అడిగితే? ఛీ! ఆపనిచేయలేను. ఎవరైనాచూస్తే ఏమనుకుంటారు? తెలిసినవాళ్లు చాలమంది ఉన్నారు. నలుగురిలో ఎంతనీచంగా ఉంటుంది?

ఎటువైపు నడుస్తున్నదీ తెలియడంలేదు. ఒక్కక్షణం ఆగి చుట్టుప్రక్కల పరిశీలించి చూచాను. అవును మాంసం అమ్మే దుకాణాలముందు నిలబడిఉన్నాను. అది మాంసంమార్కెట్టు. ఆగల్లీలో అన్నీ మాంసంఅమ్మే దుకాణాలే. వచ్చే పోయేజనం సందడిగాఉంది. మాంసం, బుట్టల్లోపెట్టుకొని పోతున్నారు. ఒక దుకాణంముందు ఒక్కక్షణంచూస్తూ నిలబడ్డాను. మాంసంతింటే కాస్తవంట్లోకి సత్తువవస్తుందేమో? 'మాంసం మాంసేనవర్ధతే.' బక్కచిక్కిన నాదేహంబలుస్తుంది. మంచి మాంసంతినక ఎన్నిరోజులైంది! దుకాణందగ్గరికివెళ్లి ఒకమాంసం ముక్క పెట్టమని అడగడానికి నిశ్చయించుకున్నాను. పచ్చి మాంసం తినడానికే బయలుదేరాను. కడుపులో భగభగమని మండుతోంటే పచ్చి, వెచ్చి నాకేంతెలుస్తుంది? 'క్షుధాతురాణాం నరుచిర్నపక్వం.'

దుకాణంముందుకువెళ్లి నిలబడ్డాను. అతను, మాంసం ముక్కలుముక్కలుగా కొట్టి తూచి బేరంఇస్తున్నాడు. ఏమని అడగను? మళ్లీ సందేహించాను. నాదైన్యస్థితి అతనుచూడా

లని కళ్లు తేలవేసి ఎదురుగా చాలసేపు నిలబడ్డాను. కాని ఆ దుకాణాదారు నన్ను పరికించలేదు. నా విషయం పట్టించు కోలేదు. ఒక ఆడమనిషి నిలబడి మాంసంకొంటోంది.

గబగబ కొట్టుదగ్గరికి వెళ్లాను.

'ఒకచిన్న మాంసంముక్క పెడతారా? కుక్కపిల్ల గోల చేస్తోంది. అన్నాను చేయిచాపుతూ.

నిజంగా నా ప్రక్కన కుక్కపిల్ల ఉన్నట్లు నటించాను. అది మొరుగుతూ గోలచేస్తున్నట్లూ, నేను దాన్ని సముదా యిస్తున్నట్లూ ఊహించుకుని అద్భుతంగా నటించాను.

ఆ దుకాణాదారు మారుమాట్లాడలేదు. ప్రక్కలకు చూడలేదు. ఒక మాంసంముక్కతీసి నా చేతిలోపెట్టాడు.

'మీకు చాలా పుణ్యముంటుంది. థ్యాంక్సు'.అన్నాను. నేను చేయి వెనక్కుతీసుకుంటూ.

'ఈ మాత్రానికేనా?ఏంఫరవాలేదు.'అన్నాడతను తిరిగి.

నేనొస్తోంటే ఆ ఆడమనిషి నా వైపు అదోరకంగా చూచి నవ్వింది. నా అసలు విషయంకాస్తా పసికట్టిందేమో? నా బండారం బయటపడెయ్యదుకదా!

నా గుండెలు దడదడమని కొట్టుకుంటున్నాయి. దొంగ లాగా మనుషుల్ని తప్పుకుంటూ ఆ వీధిమలుపు తిరిగాను. మాంసంముక్క కోటుక్రింద దాచుకున్నాను. అలా నడుస్తూ చిన్న గల్లీలోకివచ్చాను. అక్కడ మనుషులెవ్వరూలేరు. దీపం వెలుతురుకూడా కనిపించడంలేదు. అక్కడొక పాడుబడ్డ ఇల్లు కనిపించింది. పడిపోయిన గోడలు, విరిగిన తలుపు. తలుపు కానుకుని చేరగిలబడ్డాను. మెల్లగా మాంసంముక్క బయటికి తీసి కొంచెం కొంచెం కొరుకుతూ తినడం ప్రారంభించాను.

నా కేమీ రుచి తెలియడంలేదు. చప్పగా ఉంది. నెత్తురు కారుతూ ఒకవిధమైన కంపుకొడుతుంది.

కొంచెమైనా లోపలికిపోయిందో, లేదో నాకడుపులో తిప్పటం మొదలుపెట్టింది. నోట్లోకి నీళ్లూరాయి. బొళుక్కుమని కక్కాను. ఆపుకుందామని ఎంతప్రయత్నించినా ఆగలేదు. నాకళ్లల్లో చీకట్లు కమ్మాయి. ఆతిన్నదికాస్తా ఇముడ్చుకుందామని శక్తంతా ధారపోశాను. ప్రయోజనం కలగలేదు. ఆ మాంసం నాకడుపులో ప్రేగుల్ని కదిల్చివేసింది. ఊపిరాడడం లేదు. ఉక్కిరిబిక్కిరి అయిపోయాను. ఏంచేస్తాను? నిస్సహాయుణ్ణి; నిష్టదరిద్రుణ్ణి; నిలువెల్లా చెమటలుపోశాయి. నిలువుగ్రుడ్లు పడ్డాయి. కోపంవచ్చింది. మాంసంమీద వెగటుపుట్టింది. అదింకా అసహ్యం కావాలని దానిమీదనే కక్కాను. చివరకా ముక్కను విసిరి తలుపుకేసికొట్టాను. బలవంతానా పళ్లుకొరికాను. నరాలన్నీ ఉబికించాను. రెండుచేతులూ పైకెత్తి గుప్పిళ్లు బిగించాను. నేలమీద కూలిపోయాను... ఆకాశం వైపుచూస్తూ ఏడ్చాను. వెక్కివెక్కి ఏడ్చాను. నా అసమర్థత, ద్వేషం, రోషం... దేవుణ్ణితిట్టాను. నాగుప్పిళ్లు విడిపోయినాయి. నా వ్రేళ్లు పక్షిగోళ్లలాగా ఆకాశంలోకిచూస్తూ సిటారుగా నిలబడి ఉన్నాయి. ఆకాశంవంకచూస్తూ ఆపుకోలేని ఉక్రోషంతో పెద్దగా అరిచాను.

"ఓ భగవంతుడా! నీకు హృదయంలేదు. నీది రాతి గుండె. చెప్తున్నానువిను. నీవింక నిలబడలేవు. సర్వనాశనమై పోతావు. ఒకవేళనీవు నిలబడాలని ప్రయత్నించినా; నీవూ, నీస్వర్గం, నీ సకలైశ్వర్యాలూ, పాపమనే మంటలవల్ల భగభగ

మని మండిపోతాయి! ఇదినిజం! ఇదినాశాపం! మరొకమాట చెప్తానువిను. నిన్ను నమ్మాను. వేనోళ్ల ప్రార్థించాను. దాసానుదాసుడనై ప్రవర్తించాను. కాని నన్ను నిరాకరించావు. నా మొరాలకించకుండా నాప్రార్థనలు తృణీకరించావు. నీ కర్తవ్యాన్ని నీవు గుర్తించలేదు. అంచేత నిన్ను వదిలిపెడుతున్నాను. శాశ్వతంగా వదిలిపెడుతున్నాను. ఇకనిన్ను స్మరించలేను. నీ ముఖంచూడలేను.... చావడానికి సిద్ధమైయుండికూడా నిన్ను స్మరించాను. కాని నన్నుచూచి నీవు నవ్వావు. పరిహాసం చేశావు. పట్టనట్లు ఊరుకున్నావు. నన్నునీవు నరకంలోవడేసి యమయాతనలు పెడుతున్నానని అనుకుంటున్నావేమో? అది వట్టిది. అలా చేయడంకూడా నీచేతకాదు. లేక నన్ను నీతో పాటు స్వర్గంలోకి తీసుకవెళ్లి సకలైశ్వర్యాలూ అనుభవింపచేద్దామనుకుంటున్నావేమో? అందుక్కూడా నీకుశక్తిలేదు. నీవీరెండు పనులూ చేయలేవు. నీవు అసమర్థుడివి. ఎందుకూపనికిరాని దద్దమ్మవు. నీ వైకుంఠం నాకువెగటు. నీ ఐశ్వర్యాలు నాకసహ్యాం. నేనిప్పుడు సర్వస్వతంత్రుణ్ణి. సమస్తబంధనాలనుంచీ విముక్తి పొందాను. ఇక నీవెలుగు నాకక్కరలేదు. వెలుగును చూడలేను. చీకటి. చీకటంటే నాకిష్టం. భయంకరమైన చీకటి! రాక్షసివంటి చీకటి. అంధకారాన్ని ఆశ్రయిస్తాను. శాశ్వతంగా అందులోకి వెళ్లిపోతాను. నాజీవనశోభకు అదేసాధనం!

"పనిలేకతినికూర్చున్న ఓ దేవుడా! ఇంకాచెప్తున్నావిను. ప్రపంచంలోఉన్న మూర్ఖుల్నీ, ఆధ్యాత్మికంగా దరిద్రులైన మానవుల్నిపోగుచేసి నీ స్వర్గంలో నింపుకున్నావు. బుద్ధిలేని మనుషులందర్నీ వశపరుచుకొని, సింహాసనం ఆక్రమించుకుని వాళ్ళమీద పెత్తనం చెలాయిస్తూ పరిపాలన సాగిస్తున్నావు. నీ

నిండుసభలో నృత్యంచేసేదెవరు? అప్సరసలా? పరిశుద్ధులైన దేవ కన్యలా? కాదు కాదు. భూమిమీద పుట్టి, భూమిమీద పెరిగి బ్రతుకుగడవక పట్టెడుమెతుకులకోసం కలకాలం పడుపువృత్తి సాగించిన పతితలు, వేశ్యలు! వాళ్లు తమ అంత్యదశలో నిన్ను స్మరించారు. అందుకని వాళ్లందర్నీ తీసుకవెళ్ళి నీ స్వర్గంలో అప్సరసల్ని చేశావు. కుళ్లిపోయినస్త్రీలకు కృత్రిమాలంకారాలు చేసి వాళ్లతో కులుకుతూ కూర్చున్నావు. నీవు కులటలకు ప్రభువు అయినావు.

నీ కుటిలత్వాన్ని నా మీదప్రయోగించావు. భరించ లేని బాధలుపెట్టావు అయినా నే నెప్పుడూ నీ కెదురుతిరగలేదు. ఆ సంగతి నీకు తెలీదూ? సర్వజ్ఞుడవే! నీ సర్వజ్ఞత్వం మంటకలిసి పోయిందా! నా జీవితంలో నిన్ను స్మరించనిక్షణంలేదు. నా శరీ రంలో నీవుప్రవహించని రక్తనాళంలేదు. దీనబాంధవుడనిబిరుదు పొందిన ఓ రాక్షసుడా! ఇదేనా నీవు నాకు చూపించిన ప్రతి ఫలం! మరొక్కమాట. ఈ క్షణంనుంచి నీకూ నాకూ సంబం ధంలేదు. నీళ్లు వదుల్తున్నాను. ఇంతకాలం వృథాగా నీ నామం ఉచ్చరించినందుకు నా నాల్కను ముప్ఫయిరెండుపళ్లను తిడు తున్నాను. ఈ గంటనుంచీ నీవు నా విరోధివి. నీ శక్తి, నీ శోభ నాకికఅక్కర్లేదు. అనవసరంగా నీ సేవలో నా జీవితమంతా వ్యర్థంచేసుకున్నాను. ఇక నీ పేరు ఉచ్చరించనని ప్రతిజ్ఞచేస్తు న్నాను. ఒట్టుపెట్టుకుంటున్నాను. పొరపాటునఅయినా నీ పేరు తలిస్తే పళ్లూడతీయుంచుకుంటాను. నాలుక కోయించుకుంటాను. నీవు నిజంగా ఉన్నట్లయితే నా ఈ చివరిమాటలు విను. నేను బ్రతికిఉన్నా చచ్చిపోయినా చెప్పగలిగిందిఇంతే. ఇవే నా చివరి నమస్కారాలు. సెలవుతీసుకుంటున్నాను. శాశ్వితంగా శలవు

తీసుకుంటున్నాను. నా దోవన నేను వెళ్ళిపోతున్నాను. శాశ్వతమైన దోవ. తిరుగులేనిదోవ. నాకు నేనై వెళ్ళిపోతున్నాను. ప్రతిమనిషిలో, ప్రతిమృగంలో, ప్రతిపక్షిలో, ప్రతి రెమ్మలో, కొమ్మలో, పువ్వులో, ఆకులో, మంచుబిందువులో, అడుగడుగునా నేనై, అణువణువులో నేనై సర్వాంతర్యామినై వెళ్ళిపోతున్నాను. సెలవు...'' నిశ్శబ్దం.

తలుపును ఆధారంగాచేసుకుని నిలబడిఉన్నాను. నా వళ్ళంతా వణుకుతోంది. అంతసేపు ఏడ్చినందువల్ల అప్పుడప్పుడు ఎక్కిళ్లు వస్తున్నాయి. నాలోనేను గొణుక్కుంటున్నాను. రక రకాలుగా తిడుతున్నాను. ఒట్లు పెట్టుకుంటున్నాను. అలా దాదాపు ఒక గంటసేపుగడిపాను. ఇంతలో ఎవరో ఇద్దరు మనుషులు మాట్లాడుకుంటూ ఆదోవన వస్తున్నారు. తిన్నగా మొండిగోడలు పట్టుకొని నడకసాగించాను. మళ్ళీ మామూలుగా రోడ్డుమీదికొచ్చాను. వెలుతురుచూచాను. రోడ్ల ప్రక్కన రకరకాల వస్తువులు క్రిందపరిచి అమ్ముతున్నారు. ఒక చోట రెడీమేడ్ చొక్కాలు, లాగులు, బనీన్లు, జాకెట్లు, గౌనులు, కర్చీపులు గుట్టగాపడేసి ఉన్నాయి. ఆ సందడినుంచి తప్పించుకొని దూరంగా వెళ్లాలనిపించింది. సూటిగా నడుస్తున్నాను. నా వళ్ళంతా ఇంకా వణుకుతూనేఉంది. మధ్య మధ్య ఎక్కిళ్లు వస్తూనే ఉన్నాయి. నాకు కాలంసమీపించినట్లనిపించింది. చివరిపాట, చావుపాట పాడుతున్నాను. ఆ మాటకొస్తే చావును ఎదురుచూస్తూ నడిరోడ్డుమీద పడుకుంటాను. దుఃఖం రాను రాను నన్ను రాయిలామారుస్తోంది. దెబ్బతగిలిన నా పాదం తీపుపుడుతోంది. కాలుమొత్తం పగులగొట్టుక పోతోంది.

ఆ విధంగా హార్బరుదగ్గరికి వచ్చాను. నన్ను వెనుక

నుంచి ఎవరో పిలిచారు. తిరిగిచూచాను. కాళ్ళీడ్చుకుంటూ ఒక కుంటివాడు నా దగ్గరికొచ్చాడు.

'ఇటేపు ఒకరిక్షా వచ్చింది చూచారా బాబయ్యా' అడిగాడతను ఆదుర్దాగా.

నాకేమీ అర్థంకాలేదు. ఎవరతను? ఏమిటాకంగారు? ఒక్కక్షణం అతనివైపు చూచాను. అతను వరిగెత్తుకుంటూ వస్తున్నట్లుంది. రొప్పుతున్నాడు. అతనిచేతిలో పొగాకు కాడ లున్నాయి. ఏంజవాబు చెప్పాలో అర్థంకాలేదు.

'ఏరిక్షా?' నేను చూళ్ళేదే? నేనూ ఇప్పుడే వస్తున్నాను అన్నాను నేను నింపాదిగా.

ఆకుంటివాడు అటూ, ఇటూ కంగారుపడిచూస్తున్నాడు. నాకేమీఅర్థంకాక మళ్ళీ ఇలాఅడిగాను.

'ఏమిటిసంగతి? ఎవరున్నారు రిక్షాలో?'

'ఏంలేదుబాబయ్యా. ఒకదొర రిక్షామీద ఇటొచ్చిండు. నూటేసుకొని ఉండాడు. డబ్బులియ్యాలి బాబయ్యా'.

'అయితే ఇంకాముందుకుపోయిచూడు.' అన్నానునేను.

వాడు తలఊపాడు. క్రీగంటితో నావైపుచూస్తూ కుంటి కాలు ఈడ్చుకుంటూ ముందుకుపోతున్నాడు. కాస్తపొగాకు పెట్టమని అడగాలనిపించిందినాకు. పోయేవాణ్ణి పిలిచాను.

'ఏయ్'

వాడు రెండడుగులు వెనుక్కువచ్చాడు.

'కొంచెంపొగాకు పెడతావా?'

వాడు మారుపలక్కుండా ఒకకాడలో సగంతుంచి నాచేతిలోపెట్టాడు.

'ఏంచేస్తుంటావు నీవు?' అడిగాను పొగాకుతుంపు జేబు లో పెట్టుకుంటూ.

'చెప్పులుకుడతాను' మళ్లీవాడు నా వంకఓరగా చూచాడు.

అవును. నాకిప్పుడు జ్ఞాపకంవచ్చింది. ఆకుంటివాడు వాడే. చెప్పులుకుడతాడు. ఇదివరకొకసారి వాడికోసం నాస్వెట్టరు తాకట్టుపెట్టి డబ్బుతెచ్చిఇచ్చాను. వాడునన్ను గుర్తుపట్టాడేమో! అనుమానంగా క్రీగంటచూచాడు.

వాడు వెళ్ళిపోతున్నాడు. పిలుద్దామనుకున్నాను కాని మళ్ళీ మనస్కరించలేదు. వాడిదోవన వాణ్ణిపోనీక ఎందుకు మళ్లీతగలాటకం? వాడికోసం నాస్వెట్టరు తాకట్టుపెట్టాను. ఒక రోజు ఉదయం. ఆ రోజు మొదలుకొని ఇంతవరకూ నా జీవితం దినదినం దిగజారి పోతోంది.

నేనొక గోడపట్టుకొని నిలబడి ఉన్నాను. అక్కణ్ణుంచి వెళ్లిపోదామని ప్రయత్నించాను. గోడపట్టువదలి నడవబోయే సరికి కాళ్లు తడబడ్డాయి. ఇంతలో, 'కాలచక్రం' ఎడిటర్ నా కెదురుగా వచ్చాడు. నాకుమరీ వళ్లు వణుకుపుట్టింది. బలవంతాన కాళ్లు నిలదొక్కుకుని నిలబడ్డాను. కాని అతనికి ముఖం చూపలేక పోతున్నాను. ఈ స్థితిలో నన్నుచూచి అతనేమనుకుంటాడు? పోనీ ఎగిరి రోడ్డుమీద పడిపోతే! అతన్ని నా మీదిగుండా నడిచిపొమ్మని ప్రార్థిస్తే! నా ముఖంమీద తొక్కుకుంటూ పోతాడు. కనీసం అతన్నిచూచి నమస్కారం కూడా చేయలేక పోయాను.

బహుశా 'కాలచక్రం' ఎడిటర్ నాస్థితి కనిపెట్టినట్లుంది. దగ్గరిగా వచ్చి ఇలా పలకరించాడు.

'అప్పటినుంచీ ఇప్పటివరకూ మళ్లీ కనిపించలేదేం? కథ పట్టుకరమ్మని చెప్పానుగా, ఏమైందీ?'

నేను మాట్లాడలేక పోయాను. కళ్ళవెంట నీళ్లుతిరిగాయి. జవాబు చెప్పడానికి నోరురాలేదు. తిరిగీ అతనే అడిగాడు.

'ఏం ఇంతవరకూ కథపూర్తిచేయలేదా?'

'లేదు. వ్రాయలేకపోయాను.'

ఈ ఒక్కమాటా అనేసరికి నా వళ్ళంతా వణుకుతోంది. కళ్ళనుంచి నీళ్లు బొటబొటమనికారాయి. అతను నా పట్లచూపిస్తున్న ఆదరణకు, నేనున్న అసహాయస్థితికి, దుఃఖం పొర్లుకొస్తోంది. ఆపుకోవాలని, అది అతను గమనించకుండాఉండాలని ప్రయత్నంచేశాను. గొంతుసవరించుకోటానికై ముఖంఒకవైపుకు తిప్పి దగ్గాను. ఎడిటర్ నా వైపుచూస్తూ ముక్కునలుపుకున్నాడు.

'అయితే ఇన్నిరోజులనుంచీ ఎట్లాగడుపుకుంటున్నావ్?' తిరిగీ ప్రశ్నించాడతను.

'చాలా కష్టంగాఉంది. పస్తులుంటున్నాను. పచ్చిమంచినీళ్లుకూడా తాగలేదు. అన్నంతినక ఇప్పటికి-...' గొంతుపెగుల్చుకొని అతికష్టంమీద జవాబుచెప్పాను.

'బాగుంది. నీకుబ్రతకాలనిలేదటయ్యా! ఇలాగయితే ఈ పట్నంలో నీ కెవరుదిక్కు.' అన్నాడతను జాలిగా జేబులో చేయిపెడుతూ.

అవమానంతో నా తల వాలిపోయింది. అతను అన్న దాంట్లో అబద్ధం ఏమాత్రంలేదు. నే నెలాంటి దుస్థితిలో అతని కంటబడ్డాను!

అతను పర్సుతీశాడు. అందులోంచి పదిరూపాయలనోటు తీసి నా చేతిలోపెట్టాడు. డబ్బిస్తున్నందుకు అతనేమీా కించపడ

లేదు. ఆదరంతో అభిమానంతో ఆడబ్బు నా చేతుల్లో పెట్టాడు. నేను చచ్చిపోవడం అతనికిష్టంలేదు. అంచేత అలాచేశాడు. నేను నంగిమాటలతో ఏదో గొణిగాను. ఆ డబ్బు అక్కర్లేదని చెప్పడానికి ప్రయత్నించాను. అలా అన్యాయంగా డబ్బుతీసుకోవడం ఏంమర్యాద? పైగా అంతపెద్దమొత్తం ... నిజంగా అంతసొమ్ముతీసుకోడానికి నేను తగను ... ...

'ఊ, త్వరగా వెళ్లు.' అన్నాడు 'ఎడిటర్' తనచేతి గడియారంచూస్తూ. 'నాకుపనుంది. అర్జంటుగా స్టేషనుకు వెళ్లాలి.'

నేనా పదిరూపాయలు తీసుకున్నాను. నాశరీరం పులకరించింది. సంతోషం. ఆ సంతోషంలో మాటాడలేకపోయాను. కనీసం అతనికి నమస్కారమైనా చేయలేదు.

'ఆరోగ్యం పాడుచేసుకోకు. శాంతనిదానంగా ఆలోచించి ఆ కథపూర్తిచేయి. నీవుబాగా వ్రాయగలవు. వస్తాను.'

అంటూ అతను వెళ్లిపోయాడు. అతను కొంచెందూరం వెళ్లిపోయింతర్వాత కృతజ్ఞత తెల్పలేదేఅని బాధకలిగింది. అతనుచేసిన సహాయానికి కాళ్లుపట్టుకుని కళ్లకద్దుకున్నా తప్పులేదు. గబగబనడిచి అతన్ని కలుసుకోవాలని ప్రయత్నించాను. కాని కాళ్లుసాగడంలేదు. కాలు కదపలేకపోయాను. అప్పటికే అతను చాలదూరం వెళ్లిపోయాడు. గొంతెత్తి పిలిచాను. కీచుగొంతు. నాపిలుపతనికందలేదు.

ఎడిటర్ నిలబడ్డచోటనే నిలబడిఉన్నాను. నిశ్శబ్దంగా, నింపాదిగా నాలోనేను దుఃఖించాను. 'అటువంటి పుణ్యాత్ముణ్ణి నాజన్మలో చూడలేదు.' నాలోనేననుకున్నాను. పదిరూపాయల నోటు దీపం వెలుతుర్లో అటూ ఇటూతిప్పి చూచాను. అవును.

అది పదిరూపాయలు. చెక్కు-చెదరని కొత్తనోటు. మసకమసగ్గా ఉన్ననాళ్లల్లో అది మెరుపులా మెరిసింది. 'సందేహంలేదు' నాదగ్గర పదిరూపాయలున్నాయి. ఎంతకాలంతర్వాత నాచేతిలో కింత డబ్బొచ్చిందీ! అవును. చాలాకాలంతర్వాత - బహుశా ఒకయుగం' మళ్లీ నాలో నేననుకున్నాను.

చాలాసేపు అక్కడే ఒంటరిగా నిలబడ్డాను. నాలో నేను అనేకం జ్ఞాపకం తెచ్చుకున్నాను. ఆ తర్వాత నెమ్మదిగా 'వసంత విహార్' దగ్గరికొచ్చాను. లోపలికి వెళ్లి గదికావాలని అడిగాను. వెంటనే వెయిటర్ నాకు బెడ్ చూపించాడు.

♦ ♦ ♦ ♦

మంగళవారం.

బాగా ఎండకాస్తోంది. చలికూడా అంతగా లేదు. మంచి గాలివీస్తోంది. చాలా హాయిగాఉంది. ఉల్లాసంగా, ఉత్సాహంగా......

హోటల్లో నా కన్నీ అమిరాయి. మధ్యాహ్నం హోటల్నుంచి బయలుదేరాను. సెంటర్లలో నిలబడి జనాన్నిచూస్తూ ఆనందించాను. తిరిగినబజారే తిరుగుతూ మధ్యాహ్నమంతా దివ్యంగా గడిపాను. ఆ తర్వాత 'జలజ' ఇంటివైపు బయలు దేరాను. ఏడుగంటలు కావస్తోంది. 'జలజ' ఇంటికెదురుగా ఒకచిన్న పార్కు-ఉంది. అక్కడికివెళ్ళి కూర్చున్నాను. ఎదురుగా కన్పిస్తున్న రెండో ఇంటివైపు చూస్తూకూర్చున్నాను. క్షణంక్షణం ఆదుర్దాగా మేడమీదికిటికీలవైపు చూస్తున్నాను. ఏ నిమిషంలోనో 'జలజ' మెరుపులా కనపడవచ్చు. ఏంజరుగుతుందో? రాగానే ఆమెను ఏమనిపలకరించను? 'గుడ్‌మా

ర్నింగ్' అంటే బాగుంటుందా? లేక 'నమస్తే' అంటే నాజూగ్గా ఉంటుందా? అసలివేవీఅనక చిరునవ్వునవ్వి ఊరుకుంటే!

ఇలా అర్థంలేని ఆలోచనలతో చాలసేపుకూర్చున్నాను. చివరకు ముందుగావచ్చాననిపించింది. ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్లు ఒంటరిగా అంతసేపక్కడ కూర్చోడంబాగులేదు. పార్కులోంచిలేచి ఆ చుట్టుపక్కలున్న వీధులు తిరిగాను. కొంతసేపటికి ఒకగడియారాల షాపుముందరకొచ్చిచూస్తే సరీగ్గా ఎనిమిది గంటలైంది. ఇక వెళ్ళటంమంచిది. ఈపాటికామె రావచ్చు. కాలుకొంచెం వడిచేసి నడవసాగాను. కాని నా బొటనవేలు కొంచెం నొప్పిగాఉంది. అంతకన్నా నాకేమీ కష్టంగాలేదు.

మేడకెదురుగా కొంచెంసేపు నిలబడ్డాను. ఆమె ఇంకా రాలేదు. రాదాఏమిటి? లేక వచ్చివెళ్లిందా? కాదు. ఆమె అసలురాలేదు. ఏదోపనిమీద కొంచెం ఆలస్యమైయుంటుంది. ఇప్పుడు ముంచుకపోయిందేమిటి? నేనే ఆమెకోసం నిరీక్షిస్తూ నిలబడతాను. 'ఓ' జలజ నావెనుకనుండి వచ్చింది.

'గుడ్ ఈవినింగ్.' అన్నాను నేనువెంటనే. చిరునవ్వునవ్వడం మరిచిపోయాను.

'పాపంమీరొచ్చి చాలసేపయినట్లుంది?' అన్నదామె.

'మరేంఫరవాలేదు. నీవింట్లోంచి వస్తావేమో అనిచూస్తున్నాను. ఇలా ఎటువైపునుంచి వచ్చావ్?

'మా పెదనాన్నొచ్చాడు. ఆయనతోకల్సి వెళ్లాల్సొచ్చింది' అన్నదామె.

'ఓ అలాగా!'

మేమిద్దరం కలిసినడుస్తున్నాం. మూలతిరుగుల్లో కానిస్టేబుల్ నిలుచొనిఉన్నాడు. మాఇద్దరివైపుఅదోఇదిగాచూచాడు.

'మరిమనం ఎక్కడికి వెడుతున్నాం?' మధ్యలో ఆగి అడిగిందామె.

'నీఇష్టం. ఎక్కడికైనాసరే.' అన్నానునేను.

ఆమెపక్కన నవ్వింది.

'బాగుంది. నేనొక్కదాన్ని ఏంచెప్పను? నా ఇష్టమేనా ఏమిటి? మీ ఇష్టంకూడా చెప్పండి.' అంది నవ్వుతూనే.

ఒక్కక్షణం నిశ్శబ్దం. ఆతరవాత మళ్ళీ నేనే పలకరించాను.

'మీమేడవైపు చూచాను. మీఇంట్లోదీపం వెలగడం లేదేమిటి? కిటికీల్లోంచి వెలుతురు కనిపించలేదు'

'అవును. ఇంట్లో ఎవ్వరూలేరు. నేనొక్కదాన్నే' అన్న దామె సంతోషంతో.

'అయితే మీ ఇంటికెళ్ళగూడదూ? నిన్నుచూస్తూ అక్కడ ఎంతసేపైనా కూర్చోగలను' అన్నాను నేను ఏదో ఉద్రేకంతో.

కాని అలా ఎందుకన్నానాఅని వెంటనే బాధకలిగింది. తప్పుగా తలుస్తుందేమో. ఇది నేను అతిచొరవ చేసుకుని మాట్లాడడంకాదూ? ఆవిడమనస్సుకు కష్టంకలిగి వెళ్ళిపోతుందేమో? అలాగయితే ఇక ఆమెనుచూచే ప్రాప్తంకూడాఉండదు. ఆమె ఏమంటుందో అని ఎదురుచూస్తూ నిలబడ్డాను.

'అలాగే. చూస్తూనిలబడండి. మరేంచేయగూడదు సుమా!' అన్నదామె అతిసుకుమారంగా. ఇద్దరం మేడమీది కెళ్ళాం.

పైన చీకటిగాఉంది. ఆమె నాచెయ్యిపట్టుకొని నడవ లోకి తీసుకెళ్ళింది.

'ఇక్కడెవ్వరూలేరు. మీరేంభయపడక్కర్లేదు. సర

దాగామాట్లాడుకోవచ్చు' అన్నదామె. ఆమె దీపంవెలిగించింది. లాంతరుకాదు. కొవ్వొత్తి. కొవ్వొత్తి వెలిగిస్తూనవ్వింది. నవ్వుతూ ఇలాఅంది.

'మీరిప్పుడు నావైపు చూడగూడదు. నాకు చాలా సిగ్గేస్తుంది. నిజంగా మీరు నావంక చూచినట్లయితే నేను మళ్ళీ ఆపని చేయను. తెలిసిందా?'

'ఏపని చేయవు?' అని అడిగాను.

'పోద్దురూ, అంతా వేళాకోళం...అహ! హ!... అదే ...మళ్ళీ ముద్దుపెట్టుకోను!'

'నిజంగా! ఆపనిమాత్రంచేయకు. నీకు పుణ్యముంటుంది'. మళ్ళీ ఇద్దరం పెద్దగా నవ్వాం.

ఆమెను దగ్గరికి తీసుకుందామని చేతులుచాపాను. కాని ఆమె పారిపోయింది. టేబుల్‌చుట్టూతిరుగుతూ చప్పట్లుకొట్టింది. పసిపిల్లలా పకపకనవ్వుతూ ఆటలాడింది. మా యిద్దరిమధ్య టేబుల్‌మీద కాండిల్ వెలుగుతోంది.

'నన్ను పట్టుకోండి చూద్దాం.' అంటూ ఆమె అవతలి వైపు నిలబడి మళ్ళీ పకపకనవ్వింది.

నేను పరుగుతోవెళ్ళి ఆవిణ్ణి పట్టుకోడానికి ప్రయత్నించాను. ఆమె పమిటచెంగు నా చేతికిచిక్కింది. అంతలో ఆమె తప్పించుకోవాలని చూచింది. ఆపెనుగులాటలో కాలుజారి నేను క్రిందపడ్డాను. నా కాలికి దెబ్బతగిలిఉన్నందువల్ల ఆపుకోలేకపోయాను.

నేను కంగారుపడుతూ మెల్లగా లేచి నిలబడ్డాను. ఆవిడ తలమీది ముసుగు తొలగిపోయింది.

'ఏమిటి అసహ్యంగా ఈమాత్రానికే పడిపోయారూ!' అడిగిందామె మిలమిలమెరిసేకళ్లతో నావైపుచూస్తూ.

'అవును. నిజమే. పడిపోయాను.'

'ఎందుకు కుంటుతున్నారు? కాలికేమైంది?'

'ఆ, ఏమీలేదు. ఏదోకొంచెం దెబ్బతగిలింది. అదంత పెద్ద లెక్కలోదికాదులే'

'క్రిందటిసారి కనిపించినప్పుడు వేలికేదో కట్టుకట్టుకొని ఉన్నారు. ఈసారికాలికి బాగానేఉంది మీవరస. ఎప్పుడూ ఏదోఒకనొప్పితో బాధపడుతుంటారే !'

'మరేంలేదు. మొన్నఒకరోజు పరిగెత్తడంలో...'

'ఆ! ఏమిటీ! పరిగెత్తారా? ఎందుకూ ! మళ్లీ తాగారా ఏమిటి కొంపతీసి. ఏమిటి మరీమీరు ! ఇంత చిన్నతనంలోనే ఇలా పాడైపోయారేమిటి ? అంటూ ఆమె చూపుడువేలుతో నన్నడ్డగించింది. ఏదోదీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు ముఖకవళిక మారిపోయింది.

'సరే. కూర్చుందాం... అక్కడొద్దు. ఇటువైపు కూర్చుందాం. ఇలారండి... హు, మప్పితంగా మాట్లాడే వాళ్లతో ఇదేఇబ్బంది. మూతిబిగించుకొని గంభీరంగా నటిస్తారు. గుట్టుగా పనులుచేస్తారు. మాటవరసకుచెప్తాను. మీరలా కూర్చొని చెయ్యి వెనకాలనుంచి మెల్లగా నాకుర్చీమీద|వేసారనుకోండి. కావాలనేమీరలాచేశారనుకోండి. తీరా ఎందుకలా చేశారని నేనడిగితే,'అబ్బే, నాకు తెలీకుండానేఅలాజరిగింది కాని మరేంలేదు'అని జవాబుచెప్తారుమీరు. నిజంగా ఈవిషయంలో మిమ్మల్ని చాలసార్లు కనిపెట్టాను. ఇప్పుడుకూడామీరలాగే ప్రవర్తిస్తున్నారు. 'పైగా నేనెప్పుడూ వినయవిధేయతలతో మెలిగే

మనిషినని' చెప్పడానికి ప్రయత్నిస్తారు. అలాచెప్పి నన్ను ఒప్పించాల్సినపనిలేదు. విషయంమభ్యపెట్టడంకంటె మీరేంచేయలేరు. అంతకన్నా ఏంచేయడానికీ మీకుధైర్యంలేదు. అదుగో—అప్పుడు మొదటిసారి కనిపించినప్పుడు— మీరు తాగిఉన్నారు. నన్ను నడిబజార్లో వెంటాడారు. 'మీపుస్తకం పోయిందండీ, నిజంగా మీపుస్తకం పడిపోయిందండీ' అంటూ నావెంటబడ్డారు! హా! హా! హా! ఆతడవ ఎంతసాహసం చేశారు! నిజంగా అలాచేయడానికి మీకు సిగ్గనిపించలేదూ!'

నేను ముఖం చిన్నబుచ్చుకుని కూర్చుని ఉన్నాను. ఆవిడమాటలు వింటూన్నకొద్దీ నాగుండె వేగంగాకొట్టుకోవడం మొదలుపెట్టింది. నా నరాల్లో రక్తం పరిగెడుతోంది.

'ఏం మాట్లాడరేం?' మందహాసంతో అడిగిందామె.

'ఏంచెప్పను డార్లింగ్' అన్నాను నేను. 'నీవు చాలా తమాషాఅయిన పిల్లవు. నీ మాటలు వింటోంటే ముద్దొస్తున్నాయి. నేనేం మాట్లాడను? క్షణక్షణానికే నీవు నన్నాకర్షిస్తున్నావు. నీ చూపులు, చేష్టలు, నీ మాటలు, మనస్సూ, ప్రతిదీ నన్ను మోహింపచేస్తోంది. మంత్రముగ్ధుణ్ణై చేతులు కట్టుకుని కూర్చున్నాను. నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. నా సర్వాంగాలూ నీ స్వాధీనమైపోయాయి. ముఖ్యంగా నీ కళ్ళు తారల్లా తళతళ మెరుస్తూ నన్ను మూర్ఛితుణ్ణిగాచేస్తున్నాయి. అబ్బా! నిజంగా నీకళ్లు పూలు... అలాంటికళ్లు నాజన్మలో చూడలేదు... నాకు పిచ్చెక్కిపోతోంది...నిన్ను మనసారా ప్రేమిస్తున్నానుడార్లింగ్...అంతకన్నా ఈదీనుడేంచేయగలడు? —నిజంగా నీ అందాన్ని చూడటానికీ, నిన్ను ప్రేమించటానికీ

నేను తగను...నీ పేరేమిటి? నిజంగా నీ అసలుపేరేమిటో నా కిప్పుడు చెప్పాలి.'

'వద్దు. నాపేరు దాదాపు మరచిపోవడానికి ప్రయత్ని స్తున్నాను. నాకు తెలుసు మీారడుగుతారని. నిన్నల్లా ఆలో చించాను. ఏం చెపుదామాఅని. కాని___.'

'నీకు నేనేం పేరుపెట్టానో తెలుసా? జలజ! ఎలావుంది? కవిత్వంలా లేదూ?...'

'జలజా?'

'అవును.'

'సంస్కృతంలా ఉంది. ఫరవాలేదు. బాగానేఉంది.' అన్నదామె.

చాలసేపు తర్జనభర్జనలు జరిగింతర్వాత మా యిద్దరి పేర్లూ ఒకరికొకరం చెప్పుకున్నాం. మేమిద్దరం మంచంమీాద కూర్చుని ఉన్నాం. ఆవిడ నాకు దగ్గరిగా జరిగి కూర్చునిఉంది. ఆమె తన కాలిబొటనవేలితో ఎదురుగాఉన్న కుర్చీని కదిలి స్తోంది. మళ్ళీ మేం మాట్లాడుకోవటం మొదలుపెట్టాం.

'ఇవాళ శాస్త్ర గడ్డం చేసుకున్నట్లున్నారే!' అన్నదామె. 'క్రిందటిసారి చాలా అసహ్యంగా ఉన్నారు. దానికితోడు వేలి కొక గుడ్డపేలిక చుట్టుకున్నారు. పైగా నన్ను కాఫీతాగడానికి మీాతో హోటలుకు తీసుకెడతానన్నారు. ఇంకానయం. దేవుడి దయవల్ల వెళ్ళకపోబట్టి సరిపోయింది. లేకపోతే నలుగురిలో నగుబాట్లయ్యేది.'

'కనుక, నే నసహ్యంగా ఉన్నానని ఆసారి నాతో రానన్నావన్నమాట.' అన్నాను నేను.

'కాదు.' అంటూ ఆమె నేలవైపు చూచింది. 'నా కా ఉద్దేశం లేనేలేదు. దైవసాక్షిగా చెపుతున్నాను. నాకాతలంపు రానేలేదు.'

'ఇదుగో చెప్తున్నాను విను. చక్కని బట్టలువేసుకుని నాతోకలిసి షికార్లు చెయ్యొచ్చుననుకుంటున్నావుకాబోలు. సినిమాలకూ, డ్రామాలకూ, బజార్లకూ, బీచికీ తిరగొచ్చు ననుకుంటున్నావేమో పాపం. మేడమీద ఒంటరిగాకూర్చుని కలలుగనిఉంటావు. కాని ఏంలాభంలేదు. నేను వాటికి తగిన వాణ్ణికాదు. బీదవాణ్ణి. చాలాబీదవాణ్ణి.' దాచకుండా ఉన్న విషయం చెప్పాను.

ఆవిడనావైపు అదోరకంగా చూచింది.

'నిజంగా?' ఆమె ప్రశ్నించింది.

'అవును. నిజంగానేను దరిద్రుణ్ణి. ఏంచేయను?' మా ఇద్దరిమధ్య కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఆ తర్వాత ఆమె ఇలాఅంది.

'సరే. ఏంచేస్తాం? నేనుకూడా మీవంటిదాన్నే.' అంటూ తమాషాగా తలఊపింది. ఆమెనోటివెంట వచ్చే ప్రతి అక్షరంనుండీ అమృతధారలు వర్షిస్తున్నాయి. క్షణ క్షణానికీ నన్నాకర్షిస్తోంది. ముఖం కొంచెంప్రక్కకు తిప్పికూర్చొని ఉంది. ఒకచెంపనేను చెప్పేమాటలు వింటోంది. మరొకవైపు బలంగా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు నా మీదికి వదుల్తూనన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తోంది.

'ఓ సంగతిచెప్పనా?' అన్నానునేను. 'అదేమిటంటే... మరి... మరిముందేచెప్తున్నాను. నీవు కోపంతెచ్చుకో కూడదు, తెలిసిందా!—క్రిందటిరాత్రి నేను పడుకునేటప్పుడు

నా ఎడమచెయ్యి సొంతం నీకప్పచెప్పాను. నీవు నా చెయ్యి మీద తలపెట్టి హాయిగా నిద్రపోయావు. ఆ తర్వాత నేను...'

'ఓ అలాగా! వర్ణనబాగానే ఉంది.' అంటూ ఒక్క క్షణం ఆగిందామె. 'నేను దూరంగా ఉన్నాను కదూ! అందు కని నన్నుగురించి కలలుకనిఉంటారు. నా పరోక్షంలో అంత బాధపడ్డారా? అవును పాపం పడరూమరి! ఇప్పుడెదురుగా ఉన్నానుగా! మీ ప్రియురాలికోసం ఏంత్యాగం చేస్తారో చెయ్యండి... మీ సంగతి నాకు తెలుసు అంతా బూటకం.'

'ఏం? ఎందుకని? నామాట నమ్మకం లేదన్నమాట. మనస్ఫూర్తిగా చెపుతున్నాను. నీవు నా ప్రేయసివి. ప్రాణ ప్రియవు.'

'ఏమో మిమ్మల్ని నమ్మడంకష్టం. ఏధ్యాసలోవుండి మాట్లాడుతున్నారో!'

'అవును. నన్నుగురించి నీవు ఎన్నైనా అనుకుంటావు.' అంటూ నాచేత్తో ఆమెనడుమును చుట్టాను.

'ఏం? ఎందుకనుకోగూడదూ? మీరేమైకంలోనో ఉండి మాట్లాడవచ్చు.' అందామె.

నాకు చాల బాధకలిగింది. 'ఆమెందుకూ నన్నలా అపార్థంచేసుకోవడం? నేనెప్పుడూ ఏదోమైకంలో ఉండేవాణ్ణా? నన్నొక చపలచిత్తుణ్ణిగా భావిస్తోందికాబోలు.'

కాని చలించకుండా ఆమె చెయ్యిపట్టుకొని దగ్గరికి తీసు కున్నాను. వెంటనే ఆమె మెల్లగా చెయ్యివదిలించుకొనికొంచెం అవతలికి జరిగింది. దాంతో నాధైర్యంకాస్త సన్నగిలింది.

అవమానం పొందినట్లుగా బాధపడ్డాను. కిటికీలోంచి బయటికి చూచాను.

'ఏం, ముఖం ముడుచుకుని అటుచూస్తున్నారూ? ఈ మాత్రానికే కోపంరావాలా?' అంటూ ఆమెరెండుచేతుల్తో కళ్లు గట్టిగా మూసుకుంది. విపరీతంగా నవ్వడం మొదలుపెట్టింది. వెకిలగా, చిలిపిగా, కిలకిలమని నవ్వుతోంది. ఆమెచేష్టలు నన్ను ఆశపెడుతున్నాయి. ఆశపెడుతూ తృప్తిగలిగించనందువల్ల నాకు బాధ ఎక్కువైంది.

'ఏదీ! నా హృదయేశ్వరీ! ఒక్కసారి కళ్ళు తెరువు' అంటూ గభాలున నా రెండుచేతులూ ఆమె మెడకు వేసి చుట్టాను.

'ఏమిటీ చేష్టలు? ఈ పిల్లకేమీ పిచ్చి పుట్టలేదుగదా? మైమరచి ప్రవర్తిస్తుందేమిటి?...'

ఆమె కదలకుండా కూర్చొనిఉంది. ఇంకాకళ్ళు మూసుకునే ఉంది. ఏం మాట్లాడకుండా ప్రతిమలా కూర్చుంది. ఆవేశంతో నేనామెను కౌగలించుకున్నాను. గట్టిగా నా హృదయానికి హత్తుకున్నాను. అప్పటికీ ఆమె పల్లెత్తుమాటకూడా అనలేదు. మాఇద్దరి వక్షస్థలాలూ ఏకమైనాయి. ఇద్దరిగుండెలు గుర్రపు డెక్కల్లా కొట్టుకుంటున్నాయి. నేనామెను బలంగా ముద్దుపెట్టుకున్నాను.

నాకు వళ్ళు తెలియలేదు. నా అవయవాలు స్వాధీనం తప్పాయి. సర్వం మరిచిపోయాను. ఆ ప్రేమకలాపంలో ఏవో నా నోటికివచ్చిన పిచ్చి పిచ్చిమాటలు మాట్లాడాను. ఆమె నోట్లో నోరుపెట్టి ఏమేమో చెప్పాను. పాలుకారే ఆమెచెక్కిళ్లు పలుమార్లు ముద్దుపెట్టుకున్నాను. ఆ పల్లవాధరి పెదవులనుండి

స్రవించే మధురమైన అమృతధారలు అనేకసార్లు పీల్చాను. కాని నేను తనివిజెందలేదు. నా దాహం తీరలేదు.

ఆమె మంచంమీద వెల్లికలపడుకొనిఉంది. జాకెట్టు గుండీలు రెండు ఊడదీశాను. ఆమె వక్షోజాలు గుండ్రగా, తెల్లటి వెలగపండ్లలా వాయిల్ జాకెట్టు చాటున దోబూచు లాడుతూ తొంగి తొంగిచూస్తున్నాయి.

'నేనుచూడొచ్చా?' అంటూ మిగతాగుండీలు ఊడ దీయడానికి ప్రయత్నించాను. కాని మొరటుగా ఉన్న నా చేతు లకవి సాధ్యపడలేదు. పైగా క్రిందభాగములో జాకెట్టు బిగు తుగా ఉంది. అంచేత గుండీలు ఊడిరాలేదు.

'ఏదీ, ఒక్కసారి ... ఒక్కసారిచూస్తాను... కొంచెం ...కొంచెం చూడనివ్వవ్!'

ఆమె ఒకచేయి నా మెడమీదవేసి దగ్గరికి తీసుకొంది. రెండోచేత్తో మెల్లగాజాకెట్టుగుండీలు ఒక్కొక్కటిఊడదీస్తోంది. మధ్యమధ్యకళ్ళెగ్రేస్తూ నవ్వుతోంది. 'అబ్బా. ఏంకళ్ళవి! ఎంత చక్కనికళ్లు. ఏమిటా ఆకర్షణ! ఆమెకళ్లు విప్పినంతసేపూ పద్మాలు భయంతో వికసించకుండా ఉండిపోతాయి.'

ఆమె జాకెట్టు రెండుచీలికలుగా విచ్చుకుంది. ఆమె కట్టుకున్న జార్జెట్టుచీరె జారిపోతోంది. లోపలిలంగాబాంది వదు లుగా ఉంది ... మొద్దుబారి ఉన్న నా చేతులు ఆమె వక్షో జాలు......

'ఏమిటిది? పక్కమీద, నా చేతులమీద, కుచ్చులు కుచ్చులు వెంట్రుకలు రాలాయి!' అన్నదామె లేవడానికి ప్రయత్నిస్తూ.

'అవునుగాని, ఏదీ, ఒక్కసారి... ఊఁ... వక్షస్థలంలో తలదూర్చడానికి ప్రయత్నించాను.

కాని హఠాత్తుగా ఆమెలేచింది. బహుశా వ్యవహారం చాలాదూరం పోయిందనుకున్నదో ఏమో? తనచీరె వదులై పోయిన విషయంకూడా గమనించింది. గబగబ చీరె, జాకెట్టు సవరించుకుంది.

'మీ వెంట్రుకలిలా కుచ్చులు కుచ్చులు ఊడిరావడానికి కారణమేమిటి?' తిరిగీ ఆమె ప్రశ్నించింది.

'ఏమో తెలీదు.'

'కాదు. మీ ఆరోగ్యం చెడిపోయింది. అందుకే అలా వెంట్రుకలూడిపోతున్నాయి. మీకు తాగుడూ మొదలైన దురలవాట్లున్నాయి. దురభ్యాసాలవల్ల మీ వళ్లు చెడిపోయింది. నిజంగా చెప్పండి. మీ రెలాంటి జీవితంగడిపారు? లేకపోతే ఇంత చిన్నతనంలోనే ఇలాఎందుకు జరుగుతుంది? తప్పించుకో వాలని ప్రయత్నించకండి. దాచకుండా ఉన్న విషయం చెప్పండి.'

'సరే చెప్తానుగాని ముందునన్నొకసారి నీవక్షోజాల్ని ముద్దుపెట్టుకోనీయి.'

'మీకు పిచ్చెక్కిందాఏమిటి ? ముందాసంగతి చెప్పండి.'

'కాదు ప్రేయసీ! ముందునన్నా పనిచేయనీ. ఒక్కసారి.'

'హుష్, ఏమిటా పిచ్చిమాటలు. వీల్లేదు... ముందు మీరెట్టువంటివారో వివరంగాచెప్పండి... తర్వాత అలాగే చేద్దురుగాని... మీసంగతి తెలుసుకోవాలనిఉంది... హో, మిమ్మల్ని చూస్తుంటే నాకు భయమేస్తోంది.'

ఆమె అలా పట్టుపట్టడంవల్ల నా మనస్సుకు చాలబాధ కలిగింది. అవును. ఆవిడ నన్ననుమానిస్తోంది. నా జీవితం,

భయంకరమైన నాబ్రతుకు తెలుసుకోవాలని కుతూహలపడు తోంది. దీనివల్ల ఎలాంటిపరిణామం సంభవించినా నేను చేయ గలిగిందిలేదు. దాచకుండా అన్నివిషయాలు ఆమెతో చెప్పాను. పట్నంలో నే గడిపిన భయంకరమైనజీవితాన్ని, ప్రతిసంఘటన, దాచకుండా ఒక్కొక్కటి పూసగుచ్చినట్లు చెప్పాను. ఆమె అభి మానాన్ని సంపాదించాలని నాకేమీలేదు. అంచేత అన్నివిష యాలు వివరంగాచెప్పాను. ఆఖరుకు నేను కొట్లోకుర్రాడి దగ్గర మోసంచేసి చిల్లరడబ్బులు కాజేసినవిషయంకూడా దాచుకోకుండాచెప్పాను.

నా మాటలు వింటూన్నకొద్దీ ఆమెముఖం వెల వెల పోతోంది. కళ్లుపెద్దవిచేసి, నోరుతెరుచుకొని, నేనుచెప్పిన ప్రతి ముక్క ఆమెశ్రద్ధగా విన్నది. కళకళలాడే ఆమెకళ్ళు దిగ్భ్రాంతి చెందాయి.

'సరే. ఇంకేముంది? అంతాచెప్పాను. నా జీవితఫల కాన్ని నీముఖంముందు పెట్టాను. ఇంకా ఆవిషయాలు మరిచి పోదాం' అన్నానునేను చివరకు.

కాని ఆమె ముఖకవళికలు మారిపోయినాయి. దిగాలు పడి కూర్చుంది. నిరాశా, నిస్పృహలు ఆమెముఖంలో తాండవిస్తున్నాయి. మధ్య మధ్య 'భగవంతుడే మిమ్మల్ని కాపాడాలి' అని రెండు మూడు సార్లంది.

ఆమె మంచంమీదినుంచి లేచినిలబడింది. నేనామెను పట్టుకోడానికి ప్రయత్నించాను. నవ్విద్దామని, చక్కిలిగింతలు పెట్టి సంతోషపెడదామని ప్రయత్నం చేశాను. రెండుచేతులు పెనవేసి దగ్గరికి తీసుకున్నాను. ఆమె తనజాకెట్టు సరిచేసుకుంది. ఊడిపోయిన గుండీలు మళ్ళీపెట్టుకుంది.

'ఎందుకామె అలాచేయడం. ఆమెకళ్ళకు నేనంత అసహ్యాంగా కనపడుతున్నానా! అవును. నా వెంట్రుకలూడిపోతున్నమాటనిజమే. కాని దానికినే నేం చెయ్యను? నా తప్పా అది! నేనేం తాగలేదు. నా కేం దురభ్యాసాలున్నాయి?' ఇలా ఆలోచించినకొద్దీ నాకు చాలకష్టమనిపించింది. బలవంతాన ఆమెను మళ్ళీమంచంమీద పడుకోబెట్టడానికి ప్రయత్నించాను. కాని ఆమె పెనుగులాడి తమాషాగా తప్పించుకుంది.

'ఏమిటి? చెప్పండి. ఏంకావాలిమీకు?' అడిగిందామె తాపీగా.

'ఏంకావాలినాకు? నీవు... నీవు... అంతే.'

అంటూమళ్లీ ఆమెను పట్టుకోబోయాను.

నిజంగా నాకేంకావాలి. ఆమె నాకుదూరమై పోకుండా ఉండాలి. అదే నా ఆకాంక్ష. నామీద ఏవో లేనిపోని అనుమానాలు కల్గించుకుని అవతలికివంపేస్తే నేను బ్రతకలేను.

'వద్దు...వద్దు...' అంటూ ఆమెదూరంగా తప్పుకుంది.

'ఏంచేయను. ఒక్కసారి...'

'వీల్లేదు... మీకు పిచ్చిఉంది... పిచ్చిమనిషివి.' అంటూ పెద్దగాఅరిచిందామె.

ఆమెమాటలు నా చెవులకతికర్కశంగా వినిపించాయి. సూదుల్లాగా నాగుండెల్లో గుచ్చుకున్నాయి.

'అంటేఏమిటి నీఉద్దేశ్యం? అడిగానునేను వెనక్కుతగ్గుతూ.

'ఏముందీ! మీకుకొంచెం పిచ్చుంది. అదినేనిదివరకే గమనించాను. మొదట్లోమీరు నా వెంటబడ్డప్పుడు, ఆ తర్వాత కలుసుకున్నప్పుడుకూడా, మీవాలకం, మీధోరణీ, అంతా

పిచ్చివాళ్లకుమల్లేనే ఉంది. అప్పుడేఅనుమానం కలిగింది. కాని... ఇంకానన్ను మోసపుచ్చకండి. దయచేసి ఇంతటనైనా నన్నొదిలిపెట్టండి.'

ఆమెధోరణి నన్ను పూర్తిగా మార్చివేసింది. ఆమెలో వచ్చిన మార్పు-'ఏమిటిది? అసలిలా ఎందుకు జరిగినట్లు? అసలీ కలయిక ఎందుకేర్పడాలి! భగ్నప్రేమ. అసంపూర్ణ ప్రేమకలాపం! అర్ధరతి... కడుపునిండని భోజనం...'

నాకుకోపం వచ్చింది. వళ్ళంతా ఉడికిపోతోంది. తిరిగీ ఆమెను బలాత్కారంగా పట్టుకున్నాను. ఆమెతన బలమంతా ఉపయోగించి పెనుగులాడింది. కచ్చపుట్టి దీపం ఆరిపోవాలని కొవ్వొత్తిని క్రిందికితోసాను. దీపం ఆరిపోయింది. గదంతా చీకటైంది. ఆమె ఇంకా పెనుగులాడుతూనే ఉంది.

'వద్దు. వద్దు... నన్నొదిలిపెట్టండి. మీకు పుణ్యముంటుంది. దణ్ణం పెడతాను. కావాలంటే ఒకసారి ముద్దుపెట్టుకోండి ... సరేనా!'

నే నాగిపోయాను. ఆమెను వదిలిపెట్టి దూరంగా నిలబడ్డాను. 'కావాలంటే ఒకసారి ముద్దుపెట్టుకోండి.' ఆమె అన్న ఈ మాట నన్ను మరింత బాధపెట్టింది. నష్టపరిహారంగా నాకో ముద్దిస్తానంది. దాంట్లో ఇదే భావం ధ్వనిస్తోంది.

'ఇదిగో అమ్మాయ్, ఒక్కమాట చెప్తాను విను. ఈ వ్యవహారం నా కేమీ అర్థంకావడంలేదు. నా కంతా అయోమయంగాఉంది. మనిద్దరం ఏదో ... ... దాగుడు మూతలాడుతున్నట్లు ...'

ఆమె తిరిగీ దీపం వెలిగించింది. ఆమె చేతులు వణుకుతున్నాయి. నే నూరకచూస్తూ మంచంమీద కూర్చున్నాను.

ఆమె గోడనున్న గడియారంవంక చూచింది. 'అరె! మా పెదనాన్నొచ్చే వేళయింది.' అన్నదామె.అంతే. మరేమీ అనలేదు.

నా కర్థమైంది. హెచ్చరిక. మంచంమీదనుంచి లేచాను.

'మీ పెదనాన్న మిలిటరీలో పనిచేశాడుకదూ?' అని అడిగాను నేను.

'అవును. ఆఫీసరుగా పనిచేశారు. మీకెలా తెలుసు?'

'తెలిసేదేముంది. నాకలాతోచింది. చెప్పాను. అంతే.'

'అదేమిటి, అర్థంలేనిమాట.''

'అవును. నిజంగానే. నాకేంతెలీదు. ఊరికె నోటికివచ్చిన మాట అనేశాను. అప్పుడప్పుడలాగే అంటూఉంటాను. ఇది కూడా నా పిచ్చిలో ఒకభాగమే. అహ, హ! నా వెర్రితనానికి ఇదొకగుర్తు.'

ఆమె నావైపు తేరిపారచూచింది. మరేమీ జవాబు చెప్పలేదు. ఇక అక్కడున్నందువల్ల ప్రయోజనంలేనట్లుతోచింది. నేనుండడం ఆమెకిష్టంలేనట్లు భావించాను. మెల్లగా తలుపు దాకా వెళ్లాను. 'ఇకనన్నామె ముద్దుపెట్టుకోదుకదూ? కనీసం వాకిలిదాకావచ్చి సాగనంపదుకదూ?' ఒక్కక్షణం నిరీక్షిస్తూ నిలుచున్నాను.

'అయితే ఇక మీరు వెళుతున్నారా?' అడిగిందామె. దూరంగానే నిలబడి అన్నదీమాట.

ఆమె అడిగిందానికి నేనేమీ జవాబుచెప్పలేదు. నా మనస్సు కలతపడిఉంది. వెళ్ళేటప్పుడు ఏదైనా ఒకమాట విసిరి వెడదామనుకున్నాను. ఆ మాట ఆమెకు కలకాలం జ్ఞాపకం ఉండాలి. కాని ఏమనటానికీ నా బుద్ధికి తట్టలేదు. 'ఆమెకూ,

నాకూ ఇంతటితో రుణంతీరినట్లే నా! ఇక మళ్లీ ఆమెను కలుసుకో వడం ఉండదు. ఇదే చివరిసారి.' చివరిమాట నా నోటినుంచి రావడంలేదు. అలా నిలుచుని ఆమెవైపు కొంచెంసేపుచూచాను. 'ఏదో పొరపాటైంది. నోరుజారి ఆ మాట అనేశాను. నన్ను క్షమించండి. మరేమీఅనుకోకండి.' అన్నదామెగద్గదస్వరంతో.

"ప్రపంచంలో మనుషులు శాశ్వతంగా ఉండరు. మాటలు శాశ్వతంగాఉంటాయి. ఆమాటకోసమే మహాత్ములు పుడతారు, బ్రతుకుతారు, ఆ మాటకోసమే చస్తారు. ప్రపంచంలో అన్నిటికంటె కష్టమైనదీ, అందరికి చేతకానిదీ, మనిషిని అర్థంచేసుకోవడం. నాకూ అలాంటిగతే పట్టింది. ఏంచేయను? దురదృష్టవంతుణ్ణి. నన్ను చాలామంది అర్థంచేసుకోలేక పోయారు. నీవూ అంతే. అందుకు నాకు కోపం ఎందుకు? నన్న ర్థంచేసుకున్నవాళ్లు ఒకరిద్దరున్నారేమో! అదీ సరీగ్గా చెప్పలేను. నా మనస్సు బహుసున్నితమైంది. ఏమాత్రం మాటపట్టింపు వచ్చినా విపరీతంగా బాధపడతాను. వీటన్నిటికి మూలకారణం నా దారిద్ర్యం. జీవితమంతా దరిద్రాన్ని కౌగలించుకొని బ్రతి కాను. దారిద్ర్యమే నా మనస్సును పరిపరివిధాల మార్చింది. జీవితంలో శాంతిలేకుండాచేసింది. అయితే ఒకవిధంగా నాకు దారిద్ర్యంవల్ల కొంతమేలుకూడా కలిగింది. పడరానిపాట్లు పడ్డందువల్ల బ్రతుకులోని పరమరహస్యాన్ని పరిశోధించడానికి అవకాశం కలిగింది. అగాధమైన ఆలోచన, అంతఃకరణను పరి శీలించగలశక్తి ఏర్పడ్డాయి. అష్టైశ్వర్యాలూ అనుభవిస్తూ ఆలో చించేవాడికంటె, అష్టకష్టాలుపడుతూ ఆలోచించేవాడు గొప్ప వాడు. సందేహంలేదు. అలాంటివాడు ప్రతి అణువులోని

సత్యాన్నీ చూడగలడు. దరిద్రుడు తానుచూస్తున్న ప్రతి ప్రాణినీ అర్థంచేసుకోగలడు. వింటున్న ప్రతిమాటనూ తూచి విలువగట్టగలడు. తనను తాను తెలుసుకోగలడు. సృష్టి యావత్తూ అతని అధీనంలో ఉంటుంది. అతను సర్వజ్ఞుడు. సర్వం అనుభవించినవాడు. అతను నిజంగా జీవిస్తాడు. నిజాన్ని పరిశీలిస్తాడు. నిజంగా నిజమైన మానవుడు నిరుపేద. అతని ఆత్మలో అన్ని వేళలా అగ్ని జ్వలిస్తూ ఉంటుంది .

పెద్ద ఉపన్యాసమిస్తూ చాలసేపు మాట్లాడాను. కాని నేను మాట్లాడుతున్న కొద్దీ ఆమె కంగారుపడుతోంది. చివరకామె ఒకటిరెండుసార్లు 'ఇస్! రామచంద్రా!' అంటూ నిట్టూర్పులు విడిచింది. ఇక ఆమెను కష్టపెట్టడం నాకిష్టంలేదు. నా భావాలెటువంటివో, నాతత్వం ఎలాంటిదో ఆమెకెరుక పరిచాను. మళ్లీ పెద్దగా ఇలాఅన్నాను.

"ఇక నేను వెళ్లిపోతున్నాను. ఇక నేను వెళ్లిపోతున్నాను. వాకిలిదాకా వచ్చాను. నీకు కనిపించడంలేదూ? మరిసెలవు. వెడతాను. కాని నన్ను సాగనంపడానికి వాకిలిదాకా రావడం కూడా నీకిష్టంలేదు. 'నేనెప్పుడు వెళ్లిపోతానా' అని చూస్తున్నావు. కదూ? నన్నెందుకు శాంతిగా వెళ్లనివ్వవ్? నేనుచేసిన అపకారమేమిటి? నీజీవితానికి నేనేం ఆటంకమైయాను? ఇప్పుడు నేనేం అడ్డంవచ్చాను? ఒక్కసారిగా నీమనస్సెందుకు మారిపోయింది? అంతలో నామీదెందుకసహ్యం కలిగింది? మాటతో నన్ను హింసించావు. ఇంతకుముందెప్పుడూ నేనింతబాధ పడలేదు. కాని నేను పిచ్చివాణ్ణికాదు. నీవనుకున్నట్లు నాకేమాత్రం పిచ్చిలేదు. నిదానంగా ఆలోచించుకుంటే నీకే తెలుస్తుంది. ఏదీ, ఒక్కసారిదగ్గరకు రాకూడదూ? 'వెళుతున్నారా' అని అప్యా

యతగా అడిగి నీకోమలహస్తాన్ని నాకందివ్వకూడదూ! ఎందుకు నీకంతభయం! నేనేంరాక్షసున్నా! నిన్నేంచేస్తానని. కావాలంటే నీకాళ్ల దగ్గర మోకరిల్లగలను. కాని 'ఆపని' మాత్రం చేయను. 'ఆపని' ఎన్నటికీచేయను. వింటున్నావా? నీవు నన్నుచూచి భయపడుతున్నావనే, నీదగ్గరికి రాదలచుకోలేదు. ఇక్కణ్ణుంచి ఒక అంగుళమైనా కదిలానా? పసుపు ముద్దల్లాగఉన్న నీ కాళ్లు పట్టుకొని నమస్కరిద్దామన్నా నీవు నన్ను దగ్గరికి రానివ్వడం లేదు. నీపాదాలమీదపసుపుపొడిగా ఉండటానికికూడా నాకర్హత లేదనిభావించావు. ఆమాటనడానికి నీనోరెలావచ్చిందో నాకర్థం కావడంలేదు. నేను పిచ్చివాణ్ణా! అబద్ధం! నీవు నమ్మకపోవచ్చు. కాని నాకు పిచ్చిలేదు. ఒకటిమాత్రం నిజం. ఎప్పుడో చాలా కాలంక్రిందట అహర్నిశలు ఆలోచిస్తూ ఉండేవాణ్ణి. అప్పుడు నాకు కొంత చిత్తచాంచల్యం కలిగినమాట వాస్తవమే. వేళకు భోంచేసేవాణ్ణికాదు. అన్నంతినాలనేమాటే జ్ఞాపకంఉండేది కాదు. అలావేళకు భోంచేయడం మరిచిపోయి ఆలోచించు కుంటూ, రాసుకుంటూ కూర్చునేవాణ్ణి. అంతే. రానురాను నాకాహారంమీద ఇష్టంతప్పిపోయింది. ఇంతకన్నా నేను చేసిం దేమీలేదు. తాగలేదు. తిరగలేదు. సత్యంచెపుతున్నాను. అబద్ధమాడినట్లయితే పైనభగవంతుడు చూస్తున్నాడు...... ఆ చిల్లరడబ్బులు తీసుకోవడమైనా కావాలని చేయలేదు. నాకు డబ్బుతో అవసరముండి ఆపనిచేయలేదు. అవసరమైతే అప్పుతీసు కరాగలను. నాకు అప్పుపుడుతుంది. అయిదంతస్థుల మేడలో ఉండే...... కోటీశ్వరులదగ్గర అప్పుతీసుకరాగలను. నాజేబులో పుష్కలంగా డబ్బున్నప్పుడైనా నేను కడుపునిండా అన్నంతిని ఎరగను. కావాల్సినవన్నీ కొనుక్కొని ఎరగను. దాదాపు

అవన్నీ మరిచిపోయాను. నాకలా అలవాటైపోయింది. అంత కన్నా మరేంలేదు. ఎందుకలా దూరంగానిలబడి చూస్తావ్? సమాధానంచెప్పవేం? ఒక్కమాటైనా మాట్లాడవేం! ఊరికె నిలబడి నేనెప్పుడువెళ్ళిపోతానా అని చూస్తున్నావు......"

ఆమె పరిగెత్తుకుంటూ నాదగ్గరికొచ్చింది. రెండు చేతులూ నామెడకువేసి చుట్టింది. అధైర్యంతో అవనమ్మ కంతో ఆమెనుచూస్తూ నిలబడ్డాను. 'ఆమె మనస్ఫూర్తిగా ఇలాచేసిందా! లేక ఎలాగైనా నన్ను వదిలించుకోవాలని ఈ పన్నాగంపన్నిందా?' ఆమె కళ్ళనుండి నీళ్ళు కారుతున్నాయి. ముద్దుపెట్టుకోమని పెదవులందించింది. కాని నేనేమీ చెయ్య లేదు. చూస్తూ నిలుచున్నాను. నాకామెమీద నమ్మకం పోయింది. 'నిజంగా నన్ను ప్రేమిస్తోందా? నాకోసం త్యాగం చేస్తోందా? లేక ఇదే చివరసారని వీడ్కోలిస్తూ ఉందా?'

ఆమె ఏదో మెల్లగా అన్నది. 'ఎలాగైనా మిమ్మల్ని ప్రేమిస్తున్నాను.' అన్నట్లు నాకు వినిపించింది. ఆమె మాట అస్పష్టంగా, అతినీరసంగాఉంది. గట్టిగా కౌగలించుకుని కొద్ది క్షణాలుగడిపింది. నన్నువంచి ముద్దుపెట్టుకోవాలని ప్రయత్నిం చింది. కాని నేనేమీ చలించలేదు. నిటారుగా నిలబడిఉన్నాను. చివరికిలా అన్నాను.

'నీవు చాల తమాషాఅయిన పిల్లవు!'

ఇంతకన్నా నేనేమీ మాట్లాడలేదు. మెల్లగా ఆమె పట్టువదలించుకొని గిరక్కున మళ్ళాను. నేను మెట్లుదిగి వెళ్ళిపో తుంటే ఆమె నా వెనకాల నిలబడిఉంది.



# నాలుగో అధ్యాయం

చలికాలం ప్రవేశించింది. విపరీతమైన చలి. ఎముకలు కొరికే చలి. ప్రొద్దుటిపూట మంచుకురుస్తోంది. ప్రతివీధీ, ప్రతి ప్రాణీ, చలికి గడగడ వణుకుతున్నాయి. ప్రతిశబ్దం ఏదో కొత్తగా విన్పిస్తోంది. బండిచక్రంలో, గుర్రపుడెక్కల్లో, ప్రతి మనిషి గొంతులో, దేవాలయంగంటలో, ఏదో కొత్తగా, ప్రతి ధ్వనులు వినిపిస్తున్నాయి. మనుషులమాటలు చలిగాలికి గల గల మంటున్నాయి. చెట్ల ఆకులూ, పక్షులరెక్కలూ, చలికి తడిసిపోయినాయి.

వారంతర్వాతహారం గడుస్తోంది. కాని వాతావరణం మారలేదు.

నేనొకహోటల్లో బరచేస్తున్నాను. చిన్నహోటలు. ఇరుకైన సందులోఉంది. హోటల్లో ముఖ్యంగా తయారుచేసే ఫలహారాలు ఇడ్లీ, సాంబారు, వడ, దోసె, కాఫీ, టీ. ఇవి ఉదయం, సాయంత్రం రెండుపూటలూ తయారుచేస్తారు. అక్కడ కూర్చోడానికి కుర్చీలుగాని, భోంచేయడానికి బల్లలు గాని లేవు. ఒకటిరెండు పాత బెంచీలుమాత్రం ఉన్నాయి. కాస్త డబ్బున్నవాళ్లెవ్వరూ అక్కడికిరారు. అంతా అలగాజనం. రిక్షావాళ్లూ, జట్కావాళ్లూ, ఫ్యాక్టరీ పనివాళ్లూ, కూలీలు తరచు టీ తీసుకోడానికి అక్కడికి వస్తుంటారు.

ఉండడానికి గదులుకూడా ఎక్కువలేవు. పైనమాత్రం చిన్నగదొకటిఉంది. ప్రస్తుతం అందులోనే నేనుంటున్నాను. ఏంచేయను? అంతకన్నా గత్యంతరంలేదు. అప్పుడు నేనున్నపరి

స్థితిలో నాకదే స్వర్గంలా ఉంది. రోడ్డుమీద పడుకోకుండా ఏదో కాస్త తలదాచుకోడానికి వీలుగా ఉంది.

నా దగ్గరి డబ్బు ఎప్పుడో అయిపోయింది. అయినా నేను హోటలు వదిలిపెట్టలేదు. ఏదో హక్కున్న వాడికిమల్లే అక్కడే ఉంటున్నాను. అది నా కలవాటైపోయింది. హోటలు యజమానురాలు నన్నేమీ అడగలేదు. అయినప్పటికీ ఏదో కొంత డబ్బైనా ఇవ్వకపోతే బాగుండదని బాధపడుతున్నాను. నాకు డబ్బొచ్చే ఆధారం కనిపించడంలేదు. అప్పటికి కథలు వ్రాసి చాలాకాలమైంది. మళ్ళీ కొత్తరచనలు చేయడానికి ప్రయత్నిస్తున్నాను. ప్రొద్దస్తమానం రోడ్లవెంట తిరుగుతూ ఆలోచిస్తున్నాను. అప్పుడప్పుడు పదిపంక్తులు హోటల్లో కూర్చొని వ్రాస్తున్నాను. కాని పూర్తికావడంలేదు. పైగా తృప్తికరమైన మంచి రచన ఒక్కటికూడా బయటికిరాకుండా ఉంది. ఏంచేయను? నాదురదృష్టం.

పైనగదిలోకూర్చొని రచననుగురించి ఆలోచిస్తున్నాను. ఒక చక్కని 'సంగీతరూపకం' వ్రాయడానికి నోట్సు తయారు చేశాను. కాని ఎంతచేసినా రచన సాగకుండా ఉంది. అది పూర్తయితే 'కాలచక్రం' ఎడిటర్ నాకు తప్పకుండా కొంత డబ్బిస్తాడు. అదిహోటల్లో జమకట్టవచ్చు. మళ్ళీ కొంతకాలం నిశ్చింతగా గడిచిపోతుంది.

రచన ఎందుకు పూర్తిచేయలేకుండా ఉన్నానో అర్థం కావడంలేదు. నేను వెనుకటంత బాధపడడంలేదు. హోటల్లో ఎలాంటిదో ఓలాంటిది, వేళకింతతిండి పడేస్తున్నారు. ప్రొద్దుటా, సాయంత్రంకూడా ఇడ్లీ... టిఫిన్ తింటున్నాను. అంచేత నేను బలహీనంగా లేను. వ్రేళ్ళకు గుడ్డపీలికలు చుట్టుకోవాల్సిన అవ

సరం లేకుండా ఎంతసేపైనా వ్రాయగలను. గదికూడా బాగానే ఉంది. కిటికీలోంచి వీధిలోకిచూస్తూ కూర్చోవచ్చు. ఉత్సాహం తెచ్చుకోవచ్చు. అన్నివిధాల నాకెంతో హాయిగాఉంది. ఇన్ని అవకాశాలుండీ కూడా రచన ఎందుకు పూర్తిచేయలేక పోతు న్నానో అర్థంకావడంలేదు .........

హోటలు యజమానురాలు నాగదిలోకి వచ్చింది. ఆమెచేతిలో పొడుగాంటి పుస్తకముంది.

'ఇందులో పద్దులుకాస్త కూడిపెట్టండి. పద్దులు పొర పాటు పడ్డాయి. లెక్కలో తప్పుందని నా అనుమానం' అన్న దామె పుస్తకం నాచేతికందిస్తూ.

పద్దుపుస్తకం తీసుకొని చూడడం మొదలుపెట్టాను. ఆమె నా కెదురుగా నావైపుచూస్తూ కూర్చుంది. పద్దులన్నీ పై నుంచి క్రిందికొకసారి కూడాను. సరీగానేఉంది. మళ్లీ క్రింది నుంచిపైకి కూడాను, తిరిగీ అదేమొత్తం వచ్చింది. ఇక తప్పె క్కడున్నట్లు? నేనామెవైపుచూచాను. నేనేం చెపుతానో అని ఆమె ఆదుర్దాగా ఎదురుచూస్తోంది. ఆదేసమయంలో ఆమె గర్భవతిగా ఉన్నట్లు గమనించాను. అవును. ఆమెగర్భవతిగా ఉంది. కడుపు స్పష్టంగా కనపడుతోంది.

'తప్పేంలేదు. సరీగ్గానేఉంది.' అన్నానునేను.

'అలాకాదు. మళ్లీ ఒకమాటు ప్రతిఅంకె, జాగ్రత్తగా చూడండి. అందులో తప్పకుండా తప్పుంటుంది. లేకపోతే అంత మొత్తం ఎక్కణ్ణుంచి వచ్చిందీ?' అన్నదామె తిరిగీ.

ప్రతిపద్దూ పైకిచదువుతూ పరీక్షగాచూడడం మొదలు పెట్టాను.

'లాంతరువత్తి 0-1-0, సబ్బు 0-4-6, నూనె 0-5-6, ఉల్లిపాయలు 0-1-6, పంచదార 0-6-0, మినపప్పు...'

అలాంటిపని నేనెప్పుడైనాచేస్తేకదూ! నాముఖం, నాకేం చేతనవుతుంది? ఆకోమటిపద్దులు కూడుతోంటే నాబుర్రతిరిగి పోతోంది. తలనిండా అంకెలు. కానులు, అర్ధణాలు, అణాలు. ఆమె చెప్పేతప్పు ఎక్కడుందో కనిపెట్టాలని మనస్ఫూర్తిగా పనిచేశాను. ప్రతిపద్దూ జాగ్రత్తగాకూడాను. కాని తప్పు కని పెట్టలేకపోయాను. అలా కొద్దినిముషాలు చేసేసరికి నాదృష్టి చలించసాగింది. ఆ అంకెలన్నీ నాతల్లో అటూఇటూ పరిగె డుతూ ఆడుకోవడం మొదలుపెట్టాయి. చివరకు ఏదిజమ, ఏది ఖర్చు తెలుసుకోలేకపోయాను. జమా, ఖర్చు మొత్తంకలిపే శాను. ఆఖరుకు ఒకపద్దుదగ్గరికివచ్చి ఆగిపోయాను. 'చింతపండు వీశె 0-2-0.'

'ఈ లెక్కంతా పిచ్చిరాతగా ఉంది. ఏమిటీపద్దు?

'చింతపండు వీశె 0-2-0' చింతపండు ఇంతచౌకగా ఎవడిస్తాడు? అంతా తప్పుడురాత.' అన్నాను నేను కొంచెం విసుగ్గా.

'అవునవును. అదంతే, సరీగ్గా నేఉంది. అది మామూలు చింతపండుకాదు. పాతచింతపండు. చెంబులుతోమే చింతపండు. చౌకగా ఇస్తారు. ఆపద్దు సరీగ్గానే వ్రాశారు. తప్పేంలేదు. తర్వాత చూడండి' అన్నదామె.

'ఓ! అలాగా! అర్థమైంది.' అన్నానునేను తలఊపుతూ. నిజానికి నాకేమీ అర్థంకాలేదు. పాతచింతపండు అంటే ఏమిటో, అదెందుకంత చౌకగా ఇస్తారో నామట్టిబుర్రకేమీ తెలియలేదు. ఆమె తృప్తికోసం అవునన్నట్లు తలఊపాను. అంతే.

మరొకసారి ప్రయత్నించాను. ఎలాగైనా ఆ లెక్క తేల్చాలని సాయశక్తులా పోరాడాను. ఊహు. ప్రయోజనం కనిపించలేదు. నావళ్ళంతా చెమటపట్టింది. ఆమె ఇంకా నా మాటకోసం ఎదురుచూస్తూ కూర్చొనేఉంది. చివరకిలా అన్నాను.

'చూడండి. మొదటినుండి చివరిదాకా ప్రతిపద్దూ జాగ్రత్తగా కూడాను. ప్రతిఅంకె పొరపాటు పడకుండా లెక్క వేశాను. నాకు తెలిసినంతవరకూ తప్పెక్కడాలేదు. ఒక్క కానీ కూడా పొరపాటు కనిపించడంలేదు.'

'తప్పేంలేదూ! నిజంగా తప్పులేదా?' అన్నదామె.

ఆమె మాటల్లో అనుమానం స్పష్టంగా ధ్వనిస్తోంది. నేనంతగా చెప్పినా, నామాటమీద ఆమెకు నమ్మకం కలగలేదు. లెక్కలో తప్పుందనీ, నేను కనిపెట్టలేక పోయానని ఆమె ఉద్దేశ్యం.

నా చేతిలోంచి పుస్తకం తీసుకుంటూ తిరిగీ ఆమె ఇలా అంది.

'బహుశా మీకు కూడికలొచ్చివుండవు. ముఖ్యంగా అణాలు, పైసలు కూడి లెక్కవేయలేరు. లెక్క తెలిసినవాళ్ళయితే నిముషంలో తేల్చేస్తారు.'

ఆమె నిక్కచ్చిగా, నిర్మొహమాటంగా మాట్లాడింది. నన్నొక పనికిమాలిన దద్దమ్మకింద జమకట్టింది. సిగ్గుతో తలొంచుకున్నాను.

ఆమె వాకిలిదాకా వెళ్ళి నా వైపు చూడకుండానే ఇలా అంది.

'మీకు కాస్త శ్రమకలిగించాను. మరేమీ అనుకోకండి.'

ఆమె వెళ్ళిపోయింది.

కొద్ది నిమిషాలతర్వాత మళ్ళీ తలుపు చప్పుడైంది. తిరిగి చూచాను. అమే. మళ్ళీ వచ్చింది.

'ఇదుగో చూడండీ! ఇలా అడుగుతున్నందుకు తప్పుగా అనుకోకండీ! మీరు మాకీమధ్యలో డబ్బేమీ ఇవ్వలేదు. మీ ఖాతాలో బాకీఉంది. నిన్నటికి సరీగ్గా మీరొచ్చి మూడు వారాలైంది. అంతేనా?'

'అవును. నిజమే.' అన్నాను నేను.

'మరిట్లాగతే మా కెలా గడుస్తుంది చెప్పండి? గంపెడు పిల్లలూ మేమూ. ఇంట్లో పదిమంది తినేవాళ్ళం. మీబోటి వాళ్ళందరికీ బాకీలుపెడితే మేం బాగుపడినట్లే.! హోటలు మూసేసి నెత్తిన చెంగేసుకుని ...'

నే నిక ఆమెను మాట్లాడనీయకుండా మధ్యలో అందుకున్నాను.

'నే నొక పుస్తకం రాస్తున్నాను. ఈ విషయం ఇదివర కొకసారి మీకు చెప్పాననుకుంటాను. అది పూర్తికాగానే నాకు డబ్బొస్తుంది. వెంటనే మీకిచ్చేస్తాను ....'

'అది నిజమేనండీ, ఎన్నిరోజులు చూచినా, మీ పుస్తకాలూ, మీ రాతలూ, పూర్తికాకపోతేఎట్లా?'

'అలా అనకండి. తొందర్లోనే, పూర్తవుతుంది. బహుశా ఈ రాత్రికో, రేపు ప్రొద్దునో; భావాలు మనసులోకిరావాలి గాని రాయడం ఎంతసేపు? చూడండి. మీరు చూస్తూనే ఉన్నారుగా. అహర్నిశలూ ఆలోచిస్తూనే ఉన్నాను. వ్రాయడానికి ప్రయత్నిస్తూనేఉన్నాను. కాని ఏంచేయను? అందరి

పనులలాంటిది కాదిది. కథలు రాయడానికి ఒకసమయమంటూ ఉంటుంది. ఆ సమయం ఎప్పుడో కానిరాదు. ఒక గంటలో రావచ్చు. ఒకరోజులో రావచ్చు. మనం రమ్మంటే రాదు. దానంతటది అది రావాల్సిందే...'

ఆమె వెళ్ళిపోయింది. నేచెప్పింది ఆమె అర్థంచేసుకున్నట్లు కనపడదు. ఆమెకు నా మీద విశ్వాసం సడలింది.

ఆమె వెళ్ళిపోగానే నా బుర్ర ఆలోచనతో నిండి పోయింది. నిజం ఆలోచిస్తే దీన్నుండి బయటపడేమార్గం కని పించడంలేదు. నా తెలివి దివాళాతీసింది. నా బుద్ధి బూడిదై పోయింది. అణాలు, పైసలు కూడలేని అసమర్థుణ్ని. అందుకే ఆమె నన్ను పనికిమాలినవాడికింద జమకట్టింది. కథలు, కావ్యాలూ, పెద్దపెద్దపుస్తకాలు రాస్తానంటే ఆమెలా నమ్మ తుంది ? నే నెంత నచ్చజెప్పడానికి ప్రయత్నించినా ఆమె నన్ను అర్థంచేసుకోలేదు. నన్నొక మనిషిగా లెక్కకు తీసుకోదు !

వీధిలోకిచూస్తూ కిటికీదగ్గరనిలబడ్డాను. బజార్లో కొందరు పిల్లలు ఆడుకుంటున్నారు. పేదవాళ్ళ బిడ్డల్లాగా ఉన్నారు. చింపిరి తలలు, చిరిగిన బట్టలు. ఆపిల్లలు, మధ్యలో ఖాళీసీసా ఒకటిపెట్టి అటూ ఇటూ దొర్లిస్తున్నారు. మధ్యమధ్య కీచు గొంతులుపెట్టి అరుస్తున్నారు. వాళ్ళ పక్కనుంచి ఒక తోపుడు బండి వస్తోంది. ఆ బండిమీద చాలా సామాన్లు ఉన్నాయి. బహుశా ఎవరో ఇల్లు ఖాళీచేసి మరొక ఇంట్లోకి మకాం మారుస్తున్నట్లుంది. పరుపులు, పాతకుర్చీలు, చిరిగిన చాపలు, బిందెలు, పెద్ద బక్కెట్టు, రోలు, ఇనపపెట్టె...సామానంతా బండినిండా ఉంది. పైన ఎత్తుగాఉన్న పరుపుమీద ఒక చిన్న అమ్మాయి కూర్చొనుంది. కేవలం పసిబిడ్డ. అందవికారంగా,

అమాయకంగా ఉంది. ముక్కువెంట చీముడికారుతోంది. ఎత్తుగాఉన్న వరుపుమీద కూర్చొని సామాన్లు పడిపోకుండా తన చిన్నచేతుల్తో అదుముతోంది. ఆ అమ్మాయి, తలక్రిందికి వంచి సీసాను దొర్లిస్తూ రోడ్డుమీద ఆడుకుంటున్న కొంటెపిల్లల వైపు చూస్తోంది. అమ్మో!...అంత ఎత్తునుంచి ఆ అమ్మాయి అలాచూస్తూ క్రిందపడిపోతే......

వీధిలోజరిగే ప్రతివ్యవహారం నాకంట బడుతూనేఉంది. ఇంతలో వెనుక వంటింట్లోంచి, సంగీతం వినిపించింది. అవును. నాకు తెలుసు. హోటలుపనివాడు. అప్పుడప్పుడు వాడి వ్యవహారం ముదురుతూ ఉంటుంది. కూనరాగాలు తీస్తూఉంటాడు. కాని వాడి గొంతెంత అసహ్యంగా ఉంటుందో చెప్పలేను. మొద్దువెధవ. వాడికెందుకో సంగీతంమీద మోజు.

హఠాత్తుగా వీధిలో పిల్లలు పోట్లాడుకోవటం నాకంట బడింది. ఇద్దరు పిల్లలు గభాలున ముందుకుదూకి ఒకర్నొకరు తిట్టుకుంటున్నారు. ఇద్దరూ చిన్నపిల్లలే. నేను గుర్తుపట్టాను. అందులో ఒకడు మా హోటలు యజమాని కొడుకు. నేను కిటికీ రెండు తలుపులూ పూర్తిగా తీశాను. ఆ పిల్లలు ఎందుకు పోట్లాడుకుంటున్నారో, ఏం తిట్టుకుంటున్నారో వినాలని కిటికీ లోంచి తలపెట్టి చూస్తున్నాను. క్షణంలో నా కిటికీక్రింద గుంపెడు పిల్లలు పోగయినారు. తలలుపైకెత్తి నా వైపుచూడ సాగారు. వాళ్ళెందుకునావైపుచూస్తున్నారు? వాళ్ళకేంకావాలి? పైనుంచి నన్నేదైనా క్రిందపడేయమంటున్నారా? చిల్లపెంకులు, సిగరెట్టుముక్కలు, చిత్తుకాగితాలు, చెత్త, చెదారం పైనుంచి కిందపడేస్తే అవి ఒకరిమీద ఒకరు రువ్వుకొని ఆనందించాలను కుంటున్నారా? ఇంతలో ఆ యిద్దరు పిల్లలూ మరీపెద్దగా తిట్టుకో

వడం మొదలుపెట్టారు. బూతులు; బండబూతులు, నోటికి వచ్చినట్లు తిట్టుకుంటున్నారు. దొంగ, వెధవ, ముండ, రండ, చంపుతా, నరుకుతా, ... వాళ్లిద్దరిముఖాల్లో క్రోధం జ్వలిస్తోంది. కళ్లు ఎర్రగాచేశారు. కలియబడటానికి సిద్ధంగాఉన్నారు. ఇంతలో మా హోటలుయజమానురాలు, అందులో ఒక కుర్రాడితల్లి. వాళ్ళదగ్గరికి పరిగెత్తింది. కాని ఆ పిల్లలిద్దరూ ఆమెను చూడలేదు.

'అవును. వాడే ముందు నన్నుకొట్టాడు. నా గొంతు పట్టుకొని నులిమేశాడు. నేను చాలాసేపటివరకు మాట్లాడలేక పోయాను.' అని ఆ కుర్రాడు వాళ్ళమ్మతో ఫిర్యాదుచేశాడు. రెండోకుర్రాడు దూరంగానిలబడి కోరచూపులు చూస్తున్నాడు.

'పోరా ముండ; పైగా అబద్ధాలు చెపుతున్నావా? నీవు ముందు నన్ను తిట్టలేదూ? ఎందుకు పాపం అని ఊరుకున్నాను. లేకపోతే నిన్నీపాటికి ...' రెండోకుర్రాడు పెద్దగా అరిచాడు.

లేవలేకుండాఉన్న ఆ యిల్లాలు ఈషణ్మాత్రం ఇంగితజ్ఞానంలేకుండా అవతలి కుర్రాడిమీాద అరవడంమొదలుపెట్టింది. భూతకిలాగా ఆమె ఆకారం, ఆ పెద్దపొట్ట, గొంతుచించుకొని అరుస్తోంది. ఆమె తన అఘాయిత్యంతో కాసేపట్లో బజారంతా గడగడలాడించింది. అవతలి కుర్రాడిమీాదకురికి వాడి చెయ్యి పుచ్చుకుంది.

'నోరుమూయరా పుండాకోర్! చిన్నకుర్రాణ్ణిచేసి చేయిచేసుకుంటావా? చెమడాలొత్తేను. ఏదీ, మళ్ళీ అను ... నీ సంగతి నాకు తెలీదూ! ఒక అబ్బా, అమ్మకు పుడితేకదూ

నీకు మంచిబుద్ధులు రావడానికీ? నీ చార ఎటువంటిదో బజా రంతా తెలుసు. నిన్నేంచేస్తానో చూడు!'

'నే నేం అనలేదు.'

'నీవే మావాణ్ణి కొట్టావ్.'

'ఊహుఁ. నే నేం అనలేదు''

'హుష్-నిన్నొదిలిపెడతానా!'

నేను కిటికీదగ్గర నిలబడి ఇదంతా పరీక్షగాచూస్తున్నాను. ఆ ఇల్లాలినోరు పెచ్చుపెరిగిపోతోంది. ఆమెకు కోపం చల్లారే టట్లు కనుపించడంలేదు. ఈభయంకరమైనదృశ్యాన్ని చూస్తోంటే నాకు చిరాకుపుట్టింది. ఎలాగైనా ఆ తగాదాను చల్లార్చాలను కున్నాను. ఆ చిన్నకుర్రాణ్ణి పైకిరమ్మని పిలిచాను. ఒక్క నిముషం వచ్చిపొమ్మని రెండుసార్లు పిలిచాను. తగాదాను ఏదో రకంగా సర్దుబాటుచెయ్యాలని నా ఉద్దేశ్యం. చివరసారి పెద్దగా కేకవేశాను. గభాలున ఆ కుర్రాడితల్లి తలెత్తి నావంక తీక్ష ణంగా చూచింది. ఆమె చూపుల్లో ద్వేషం, రోషం,అసూయ, అహంకారం, కనిపిస్తున్నాయి. జరిగిందంతా చూస్తున్నానని ఆమె గ్రహించింది. చిన్నతనమైంది కాబోలు! తన అఘాయి త్యానికి నేను అడ్డువచ్చాననుకుంది కాబోలు? తన గుట్టు బట్ట బయలైందని ఆమె ఆవేదన. తన పరువు నిలబెట్టుకోవాలని అవ తల కుర్రాణ్ణి వదిలేసి, తనకొడుకు రెక్కపుచ్చుకుంది. దండించే దానికిమల్లే వాణ్ణి చరచర ఇంట్లోకి లాక్కుపోయింది. నేను వినాలని ఆమె పెద్దగా ఇలా అంటోంది.

'నీకు బుద్ధిలేదుట్రా! చూచినవాళ్ళేమనుకుంటారు? నీవే పోకిరివెధవవని...సిగ్గులేదూ?'

ఆమె అనే ప్రతిమాటా నాకు వినపడుతూనేఉంది. 'నా

మీద ఎందుకంత కసి. కుర్రాడిమీదపెట్టి నానాతిట్లు తిడు తోంది. నా తప్పేమిటి? నే నేం చేశాను? ఏం చేయనక్క ర్లేదు. దీనికంతకూ కారణం నా తెలివితక్కువ. బుద్ధిహీనత. లేకపోతే నాకీ చిల్లరవిషయాలతో పనెందుకు? ప్రతివిషయాన్నీ గమనిస్తూఉండడం, ప్రతిదీ పరీక్షించడం నాకో అలవాటై పోయింది. బహుశా నా పిచ్చితనానికిది లక్షణమేమో!' ఇలా ఆలోచించుకున్నకొద్దీ నాలో ఆవేదనఎక్కువైంది. ఏదో వెర్రి ఆవేశం వచ్చింది. కాని తమాయించుకున్నాను. తిరిగీ నన్ను నేనే ఈ విధంగా హెచ్చరించుకున్నాను.

'ఒక్కమాట చెపుతాను విను. ఎందుకూ అనవసరంగా బాధపడడం? నీవు బాధపడడానికే పుట్టావ్. బాధలతోనే బ్రతుకుతున్నావ్. చివరకు బాధపడిచస్తావ్. అంతే. నీ జీవి తంలో అనేక సంఘటనలు జరిగాయి. ఇదికూడా అలాంటిదే. ఒక దుస్సంఘటన. తలవని తలంపుగా జరిగింది. దానికోసం విచారించాల్సిన పనిలేదు. ఇందాకామె లెక్కచూచిపెట్టమని నీ దగ్గరికొచ్చినప్పుడే నీ సంగతి తేలిపోయింది. పద్దులుకూడా, కూడలేనిదద్దమ్మవని నిన్నామె అవహేళనచేసింది. డబ్బివ్వకుండా బసచేయడానికి ఇదేమీ ధర్మసత్రంకాదన్నది. ఓ మూర్ఖుడా! నీ బ్రతుకంతాఇంతే-అడుగడుగునా అవమానం, అహర్నిశలూ ఆకలి ...'

ఇలా వెర్రిగా ఆలోచిస్తోంటే హఠాత్తుగా నాకు నవ్వొ చ్చింది. వికృతంగా నవ్వాను. పెద్దగా నవ్వాను. ఆ తర్వాత కొద్దిక్షణాలు నిశ్శబ్దం. క్రమక్రమంగా నా మనస్సు కుదుట పడింది. మామూలుస్థితికి వచ్చాను. బల్లముందు కూర్చొని మళ్ళీ రచనప్రారంభించాను. 'రూపకం' వ్రాస్తున్నాను. రచన

బాగా వస్తోంది. అత్యుత్తమంగా తయారౌతోంది. అలుపు, ఆయాసం లేకుండా, మధ్యలో ఆపకుండా అలా ఒకగంటసేపు వ్రాశాను.

రచనలోవచ్చే ఒకముఖ్యమైన సంఘటనమీద మనస్సు కేంద్రీకరించాను. ఒక పుస్తకాలషాపులో పుస్తకాలన్నీ తగల బడిపోతాయి. ఇదీ అందులోవచ్చే సంఘటన. దీన్నిగురించి తీవ్రంగా ఆలోచిస్తోంటే నా మనస్సు మరోరకంగా మారింది. తగలబడేవి పుస్తకాలుకాదు. పుర్రెలు; మనుషుల పుర్రెలు... ప్రపంచంలోని మనుషుల మెదళ్ళన్నీ, ఒకేవిధంగా, ఒకేచోట, ఒకేరాత్రి భగభగమని మండిపోతున్నట్లు సృష్టిస్తాను. విచి త్రంగా చిత్రిస్తాను.

గభాలున తలుపు చప్పుడైంది. హోటలు యజమాను రాలు సరాసరి లోపలికొచ్చింది. వీపునెవరో చరిచినట్లు ఉలిక్కిపడ్డాను.

'ఒక కొత్తమనిషి వచ్చాడు. ఆయనగారికి ఈ గది ఇవ్వాలి. మీరీరాత్రికి మాతోపాటు క్రిందిగదిలో ఉండండి. మీరక్కడే పక్కవేసుకుని పడుకోవచ్చుకూడా.'

అంటూ ఆమె నా బల్లమీదున్న కాగితాలన్నీ మడత పెట్టి కట్టకట్టడం మొదలుపెట్టింది. నా సమాధానం లేకుండానే ఆమె అలా నా కాగితాలన్నీ సర్దుతోంది. కాగితాలన్నీ మీదవి క్రిందా, క్రిందవిమీదా తారుమారైనాయి.

నా మనస్సుచెదిరిపోయింది. రాసుకుంటూఉంటే రాక్షసిలావచ్చి వసంతా పాడుచేసింది. కోపం, దుఃఖం కూడా వచ్చాయి. కాని నేనేమీ అనలేదు. ఒక్కమాటకూడా మాట్లాడకుండా కుర్చీమీదనుంచి లేచినిలబడ్డాను. చుట్టచుట్టిన

కాగితాలన్నీ ఆమె నా చేతిలోపడేసింది. ఇక నేను చేయగల్గిం దేమీలేదు. గదిఖాళీచేయాల్సిందే. రచనచేయడానికి ఏదో కాస్త మంచిసమయం వచ్చిందనుకుంటే ఆ కాస్తా గంగలో కలిసింది.

క్రిందకు వెడుతోంటే మెట్లమీదనే ఆ క్రొత్తమనిషి ఎదురుపడ్డాడు. అతను పరదేశిలాఉన్నాడు. పుష్టిగల శరీరం. మంచి యువ్వనంలో ఉన్నాడు. అతని దుస్తులుచూస్తే పర దేశాలకు ప్రయాణంచేస్తున్నవాడిలా కనపడ్డాడు. వెనకాలే కూలివాడున్నాడు. అతని సామాన్లు తెస్తున్నాడు.

'ఇతని వాలకంచూస్తే ఎక్కువరోజులు ఉండేలాలేదు. బహుశా ఈ ఒక్కరాత్రి ఇక్కడ బసచేస్తాడేమో. రేపు పొద్దున్నే ఊరికెళ్ళిపోవచ్చు. 'పోనీ ఏంచేస్తాం? ఈ రాత్రి ఎక్కడో ఒకచోట కళ్లుమూసుకుంటే, రేపటికి మళ్ళీ నా గది నాకొస్తుంది. రచన పూర్తిచేయొచ్చు.'

నేను క్రిందిగదిలో ఉన్నాను. ఆ ఇంట్లోవాళ్ళందరికీ, అదొక్కటే గది. అందరూ రాత్రింబవళ్లు అక్కడేపడి పొర్లాడు తుంటారు. ఆమె, ఆమె భర్త, ఆమె లేవలేనితండ్రి, నలుగురు పిల్లలూ అందరూ అందులోనే మణుగుతారు. వంటవాడు వంటింట్లోనే ఉంటూఉంటాడు. అమెకూడా రాత్రిపూట వంటింట్లోనే పడుకొంటుంది.

నా కక్కడికి వెళ్లాలనిలేదు. కాని ఏం చేయను? ఇష్టం లేకపోయినా తప్పనిసరైంది. గదివాకిట్లోకివెళ్లి కొంచంసేపు నిల బడ్డాను. కాని నన్నెవరూ పలకరించలేదు. నా విషయం పట్టించుకోనూలేదు.

ఆమె మొగుడు తనస్నేహితుడితో చీట్లాడుతున్నాడు. ఒకచిన్నకుర్రాడు మంచంమీద అటూఇటూ గంతులేస్తున్నాడు. ఆ మంచంమీదే ఒకమూల ముసలాడు, ఆమెతండ్రి, తల క్రిందికివ్రేలాడేసుకొని కూర్చున్నాడు. ఎదురురొమ్ముమీద చేతులుపెట్టుకొని ఆయాసపడుతున్నాడు. పాపం, ఏదో బాధ. అతని తల పూర్తిగా నెరసిపోయింది. చిక్కిశల్యమై పేనులాగా ఉన్నాడు.

'ఈ రాత్రికి నన్నిక్కడుండమన్నారు.' అన్నాను నేను అతనితో.

'నా భార్య చెప్పిందా?' అడిగాడతను.

'అవును. నా గదిలోకి మరెవరో కొత్తమనిషివచ్చాడు.'

ఆ తర్వాత అతనేమీ సమాధానంచెప్పలేదు. తిరిగీ పేకాడడం మొదలుపెట్టాడు. ఈ హోటలుయజమానికి ఇరవై నాలుగుగంటలూ చీట్లాడడంతప్ప మరేం పనిలేదు. సన్నగా బక్కచిక్కి ఉంటాడు. ఏంజబ్బో తెలీదు. చీట్లపేకతప్ప మరేం పనిలేదు. పైగా డబ్బులుపెట్టి పావలో, అర్థో పడేసి అస్తమానం కూర్చుంటాడు. వస్తుందో, పోతుందో తెలీదు. హోటల్లోకి ఎవరు వస్తున్నదీ, పోతున్నదీ,అక్కడేంజరుగుతున్నదీ,వ్యాపారం ఎలా నడుస్తున్నదీ; అతనికేం పట్టదు. అతనిభార్యే పెత్తనం చేస్తోంటోంది. అంతా నడుపుతూఉంటుంది. ఆవిడే యజమాని. అన్నివేళలా లోపలికీ, బయటికీ తిరుగుతూ వచ్చేపోయేవాళ్ళను ఆకర్షిస్తూఉంటుంది. ఆమె చేతిక్రింద చాలమంది జనంఉన్నారు. కూలీలు, ఫ్యాక్టరీపనివాళ్లూ, రైల్వేపోర్టర్లు, డాక్‌వర్కర్లూ తరచు అక్కడికివస్తుంటారు. కొందరు హోటల్లోకి ప్రయాణీకుల్ని తీసుకొస్తూఉంటారు. అందుకామె వాళ్ళకు కొంత కమీషన్

ముట్ట చెపుతూ ఉంటుంది. అప్పుడప్పుడు అన్నంకూడా పెట్టి పడుకో డానికి జాగా ఇస్తుంది. యజమానితో చీట్లాడేవాడు కూడా ఆ రకంలోవాడే.

ఓ ఇద్దరు పిల్లలు, లోపలికొచ్చారు. ఇద్దరూ ఆడపిల్లలే. వాళ్ళముఖాలమీద మడ్డికారుతోంది. వాళ్ళబట్టలు చాల అస హ్యంగా ఉన్నాయి. ఇంతలో ఆమెకూడా లోపలికొచ్చింది. ఈ రాత్రి కెక్కడుండాలని ఆమె నడిగాను. అందరితోపాటు ఆ గదిలోనేపడుకోమని ఆమెసమాధానంచెప్పింది. అలాఅంటూనే ఆమె గదిలో హడావుడిగా అటూ ఇటూ తిరుగుతూ ఏదో సామాన్లు సర్దుకుంటూఉంది. నా వంక చూడనేలేదు. ఆమె సమాధానంతో నా కాళ్లు చల్లబడ్డాయి. తలుపు కానుకొని నిలబడిఉన్నాను. నాపై కోపంచూపించకుండా ఉండాలనీ, ఎలా గైనా నన్ను కనికరించాలని, అతిదీనుడ్నై నిలబడ్డాను.

'అలాగే కానీయండి. మీ ఇష్టం.' అన్నాను చివరకు. ఇంకా ఆమె అటూ ఇటూ తిరుగుతూ ఏదో పనితొందర్లోఉంది.

'అప్పుపెట్టడానికి మాకుశక్తి లేదని ముందే చెప్పాను. డబ్బులేకుండా బాకీలుపెట్టి బసఇవ్వడానికి వల్లకాదని చెప్పలేదూ?' అన్నదామె విసుక్కుంటూ.

'నిజమేనమ్మా! చెప్పలేదని ఎవరన్నారు? నా కథపూర్తి కాగానే డబ్బొస్తుంది. వెంటనే చేతుల్లో పెడతానని నేనూ చెప్పానుగా! దానికెందుకింత రాద్ధాంతం. పోనీ మరో అయిదు రూపాయలు అదనంగా ఇస్తాను. సరేనా.' అన్నాను నేను కోపాన్ని దిగమింగుకుంటూ.

కాని నా కథపూర్తవుతుందనీ, డబ్బొస్తుందనీ ఆమెకు

నమ్మకంలేదు. ముల్లొచ్చి అరిటాకుమీదపడ్డా, అరిటాకుపోయి ముల్లుమీదపడ్డా అరిటాకుకే మోసం. హోటలు వదిలిపెడితే నాకు వేరేదోవలేదు. హోటల్లోఉంటే అవమానం. ఏంచేస్తాం? తప్పదు.

*　　　*　　　*　　　*

కొద్దిరోజులు గడిచాయి. నేనా ఇంటివాళ్ళతోపాటు కిందగదిలోనే ఉంటున్నాను. రాత్రిళ్లుకూడా అక్కడేకింద పడుకుంటున్నాను. కొత్తగావచ్చిన ప్రయాణికుడు ఇంకా అక్కడేఉన్నాడు. పైన నేనుండే గదిలోనే పీఠంవేసుకొని కూర్చున్నాడు. అక్కణ్ణుంచి త్వరలో కదిలేటట్లు కనిపించదు. పైగా మధ్యాహ్నం హోటలు యజమానురాలు కిందికొచ్చి నేను వినేటట్లుగా చెప్తోంది. అతను చాల మంచివాడనీ, నెల రోజులఅద్దె ముందుగానే అడ్వాన్సు ఇచ్చాడనీ చెప్పింది. పైగా అతనేదో పరీక్షకు కూర్చోవాలట. అందుకోసం చదువుతు న్నాట్ట. ఆమె చెపుతున్నదంతా నే విన్నాను. నా కర్థమైంది. ఇక అతను ఆ గది వదిలిపెట్టడు. కనుక నేనిందులోఉండే ఆశ లేదు. నాకా గదితో శాశ్వతంగా ఋణంతీరిపోయింది.

ముందరి వసారాలో ఒక మూలకూర్చొన్నాను. ఏదైనా వ్రాసుకోవాలంటే కూర్చోడానికింతకన్నా జాగాలేదు. నేను వ్రాస్తున్న 'రూపకం' అంతటితోనే ఆగిపోయింది. ఈ మధ్యలో మరికొన్ని కొత్తభావాలొచ్చాయ్. అద్భుతమైనప్లాట్. దాన్ని ఒక ఏకాంక నాటకంగా వ్రాయాలనుకున్నాను. 'సంధ్య' అని పేరుపెట్టాను. కథావస్తువుపౌరాణికయుగంలోది. అందులోవచ్చే ప్రధానపాత్రలు: మూఢభక్తిగల ఒక వేశ్య. దేవాలయంలో, దైవసాన్నిధ్యంలో వ్యభిచరిస్తుంది. ఆమె అలా చేయడానికి

కారణం! కామాంధకారంతో కళ్లుకనపడక కాదు. తెలిసి, కావాలని, పట్టుదలకు అలా చేసింది. పుణ్యాన్ని దూరంచేసుకోవాలని, స్వర్గాన్ని తిరస్కరించాలనీ, ఆమె అలా చేసింది. వైకుంఠంపై ఆమెకు వెగటుపుట్టింది. దేవుడి పూలపాన్పును తన శయ్యగా చేసుకుంది. దేవుడి కళ్ళ ఎదుట ఘోరమైన పాపాన్ని చేసింది.

ఇలా ఆలోచనల్లో మునిగిపోయి గంటలతరబడిగడిపాను. చివరకామె నా కళ్ళముందు నిలబడింది. నే నెలా ఉంటుందని ఊహించానో, అలాంటి రూపంతోనే ఆమె ప్రత్యక్షమైంది. సన్నగా, పొడుగ్గా పాలిపోయిన శరీరంతో, పరాభవింపబడ్డ ముఖంతో ఆమెనావంక చూస్తోంది. జరీచీరె కట్టుకుని జావళీ పాడుతూ, విచిత్రంగా, విలాసంగా నృత్యంచేస్తోంది. ఆమె చూపులు భరించశక్యంకాకుండాఉన్నాయి.ఏదోవెర్రిఆవేశంలో మునిగిపోయాను. ఆమె విచిత్రమైన ఆకారాన్ని చూస్తూ వికృతమైనచర్యలు గమనిస్తూ రెండుగంటలుసేపు 'నాటిక' వ్రాశాను. దాదాపు పన్నెండుపేజీలు వ్రాశాను. ఆ తర్వాత వ్రాయలేకపోయాను. అలుపొచ్చింది. పైగా అరగంటసేపటిబట్టీ లోపలపిల్లలేడుస్తూ గడబిడచేస్తున్నారు. అంచేత ఇక వ్రాయలేకపోయాను. కాస్త ఊపిరితీసుకుందామని బయటికెళ్ళిపోయాను. రోడ్ల వెంట నడుస్తూ. నాటిక ఎలాపూర్తిచేయాలా అని ఆలోచంచసాగాను. సాయంత్రమైంది. ఒక చెప్పులషాపుముందు నిలబడిఉన్నాను. సరిగ్గా ఆ షాపుముందు ఎందుకు నిలబడ్డానో నాకే తెలీదు. నా వెనుకనుంచి మనుషులు మాట్లాడుకుంటూపోతున్నారు. హాఠాత్తుగా నన్నెవరో పిలిచారు.

'గుడ్ ఈవినింగ్.'

వెనక్కు తిరిగిచూచాను.

'హల్లో.' అన్నాను నేను ఆలోచించకుండా. ఒక్క క్షణం తేరిపారచూచింతర్వాత గుర్తుపట్టాను. అతను మూర్తి.

'ఊఁ! ఏమిటి కబుర్లు? బాగున్నావా?' అడిగాడు మళ్లీ మూర్తి.

'ఓ! మనం బాగాలేందెప్పుడు...మామూలే.'

'అయితే ఇంకా అక్కడే పనిచేస్తున్నావా?'

'అక్కడంటే?'

'అదేనోయ్. అతను. 'కమలా బుక్ డిపో.'

'కమలా బుక్ డిపో!'

'అవును. ఇదివరకొకసారి పుస్తకాలషాపులో పనిచేస్తున్నానని చెప్పావుకదూ?'

'ఓ! అదా! గుర్తొచ్చింది. అతనికోటి వేగలేమోయ్. చేరిన వారంరోజుల్లోనే ఉద్వాసన చెప్పాం.'

'ఏం? ఎందుకని?'

'ఏకో పద్దు పొరపాటుగ్రాశానని...'

'తప్పుడు పద్దా? ...'

అంటూ ఆగిపోయినాడు మూర్తి. తప్పుడులెక్కగ్రాశావని ముఖాన అడిగేశాడు. అతందేమో పోయినట్లుగా ఆదుర్దాగా అడిగాడు. నే నతనివైపు పరీక్షగాచూచాను. నా మనస్సు చాల బాధపడింది. అవమానం పొందాను. సమాధానం చెప్పకుండా తలొంచుకున్నాను.

'పొరపాటనేది ఎంతటివాళ్ళకైనా వస్తుందిలే. ఇందులో ఆశ్చర్యమేముంది?" అన్నాడు మళ్లీ మూర్తి. నన్ను ఓదారుస్తున్నట్లుగా.

నేను బుద్ధిపూర్వకంగానే ఆతప్పు చేశాననీ, యజమా నిని మోసంచేశాననీ అతనినమ్మకం.

'ఏమోయ్! ఎందుకంత వ్యంగ్యంగా మాట్లాడతావ్? నేను దురుద్దేశ్యంతో ఆ తప్పుడు పద్దు వ్రాశానంటావా! అతని సొమ్ము అపహరించాలనీ, అతన్ని మోసంచేయాలనీ, నే నలా చేయలేదు.' అన్నాను నేను.

'కాదు మిష్టర్. నే నేం అలా అనడంలేదు. నీ మాటల ధోరణినిబట్టి నే నలా అర్థంచేసుకున్నాను. వాణ్ణి ఎలాగైనా బుట్టలో పెట్టాలని ట్రిక్ చేశావేమోనని...' అతను ఏదో తప్పుకోబోయాడు.

'అలా చేసేవాణ్ణయితే ఇదివరకే బాగుపడిఉందును. కాగితంమీద ఒకఅంకె పొరపాటుపడ్డంతమాత్రాన, వాడు దొంగనీ, దగాకోరనీ, ప్రచారంచేస్తుంది సంఘం. మంచిగా మర్మం ఎరక్కుండా, నిజాయితీగా, నిక్కచ్చిగా, బ్రతికేవాణ్ణి గనుకనే నా కిన్ని కష్టాలుప్రాప్తించాయి. అవతలవాణ్ణి అన్యాయంచేయడమే నా ధ్యేయంగాపెట్టుకున్నట్లయితే అందరిలాగా నేనూ హాయిగా బ్రతకనూ? ఇంతకాలంగా ఇన్నిబాధలుపడి నే నింకా బ్రతికున్నాను అంటే, అది నేనుకాదు బ్రతికిఉంట. నాలోఉన్న నిజాయితీ - నాలోఉన్న మంచితనం. అంతే. అంతకన్నా మరేం చెప్పలేను.'

ముఖంతిప్పి అవతలివైపు నిలబడ్డాను. ఎదురుగావస్తోన్న ఒక ఆడమనిషిమీద నాదృష్టిపడింది. ఆమె ఎర్రనిచీరెకట్టుకొని ఉంది. పక్కనెవరోమగమనిషికూడా ఉన్నాడు. నాకెందుకో అదేపనిగా ఆమెనుచూడాలనిపిస్తోంది. ఆమెదుస్తులు, ఆ నడకా, నన్నాకర్షిస్తున్నాయి. మూర్తితో మాట్లాడుతూ అటుమళ్లినిల

బడి ఉన్నట్లయితే ఆమెనుచూచే అవకాశం ఉండేదికాదు. నా వెనుకనుంచి ఆమెవెళ్లిపోయేది. అసలామెకూ, నాకూ ఏమిటి సంబంధం? ఆమెను చూడాలనే ఆకాంక్ష నాకెందుకుగల్గుతోంది! మూర్తి ఏదో చెపుతున్నాడు. కాని అతనిమాటలు నేను వినిపించుకోలేదు. అతనివైపు మళ్ళలేదుకూడా. రాను రాను దగ్గరకొస్తోన్న ఆ ఆడమనిషిమీదనే నాదృష్టంతాఉంది. ఆమె నా పక్కనుంచి వెడుతోంటే నా గుండెల్లోనుంచి బాణం దూసుకపోతున్నట్లుగాఉంది. పెదవులు కదల్చకుండా మనస్సులో అనుకున్నాను.

'జలజా!'

అప్పుడే మూర్తికూడా ఇటుతిరిగిచూచాడు ఆ ఇద్దర్నీ చూచాడుకూడా. ఆడమనిషి ప్రక్కనే మగమనిషి-మూర్తి తలొంచి వాళ్లిద్దరికే 'శాల్యూట్' చేశాడు. నేనేమీ వాళ్ళను పలకరించలేదు. శాల్యూట్ చేయలేదు. 'హల్లో' అనికూడా అనలేదు. తేక తెలీకుండా ఏమన్నా చేశానేమో! ఆ రోడ్డు మలుపు తిరిగేంతవరకూ వాళ్ళిద్దరూ కన్పిస్తూనే ఉన్నారు. ఆమె ఎర్రనిజార్జెట్టుచీరె నా కళ్ళల్లో మెరుస్తూనేఉంది. ఆ తర వాత వాళ్లిద్దరూ కనిపించకుండా వెళ్ళిపోయారు.

'ఎవరోయ్ అతను, ఆమెవెంట వెళ్ళేమనిషి?' అడిగాడు మూర్తి.

'తెలీదూ! జమీందారుకొడుకు. అదే... ఆపేరుగల జమీందారు...ఆమెవరో నీకు తెలుసా?'

'ఒకరకంగా తెలుసు. నీవామెనెరగవ్?'

'తెలీదు.' అన్నానునేను.

'అయితేమరి, ఆమెనుచూడగానే తలొంచి శాల్యూట్ చేశావ్?'

'నేనా?'

'ఆఁ. ఆఁ! నీవే! పోనీ ఏంచేయలేదులే. అదిసరేగాని ఆమెందుకూ, వెళుతూఉన్నంతసేపూ నీవైపలాచూచింది?'

'ఆమె నీకెలా తెలుసు?' అడిగాను నేను.

నిజానికి ఆమెవరో అతనికి తెలీదు. ఒకరోజు మూర్తి, మరిద్దరు జల్సాస్నేహితులూ కలిసి 'మారిస్' హోటల్నుంచి వస్తున్నారు. అప్పటికి చాల ప్రొద్దుపోయింది. అప్పుడీఅమ్మాయి ఒంటరిగా వెడుతోంది. వాళ్లు ఆ అమ్మాయిని పలకరించారు. కాని ఆమె సరీగ్గా సమాధానం చెప్పకుండా తిరస్కరించింది. చివరకాముగ్గురిలో ఒకడు, ఘటికుడు. అఖండుడు. ఆడవాళ్లని పడగొట్టడంలో ఆరితేరినదిట్ట. మొదట్లో ఏదో బెట్టుసరి చేయడం ఆడవాళ్ల అలవాటు. మనవాడిలాంటి బెదరింపులకు అదిరేరకంకాదు. వాడెలాగైతేనేం ఆమెవెంటబడ్డాడు. చదువుకున్న ఆడవాళ్లుకూడా మగాళ్లతో కలిసిమెలిసితిరక్కుండా తిరస్కరించడం నాగరికతలక్షణంకాదని చెప్పాడు. ఇంకా ఏవేవో కోతలుకోసి ఆమెను క్రిందా, మీదా పెట్టాడు. రాత్రిపూట ఆడకూతురు ఒంటరిగా వెళ్లడం బాగులేదనీ, ఇంటిదాకా తోడువస్తాననీ కోరాడు. తానొక ఫొటోగ్రాఫర్ ననికూడా పరిచయం చేసుకున్నాడు. చివరకామె బెట్టుసరంతా మాయమైపోయి వాడితోనవ్వడం, హాస్యాలాడడం మొదలుపెట్టింది. ఆఖరుకతను ఆమె వెంటవెళ్లాడు.

మూర్తికి ఆమెనుగురించి తెలిసినవిషయంఇది. 'ఆతర్వాత ఏంజరిగింది?' అడిగాను నేను మూర్తిని.

'ఏం జరిగిందా? ఏం జరుగుతుంది?' అన్నాడు మూర్తి

ఇద్దరం కొద్దిక్షణాలు మౌనంగాఉన్నాం.

'అయితే అతను జమీందారన్నమాట. ఊ. బాగానే ఉంది. ఇప్పుడామె అతనితో సంబంధం పెట్టుకున్నదన్నమాట. ఇక ఆమెనుగురించి చెప్పుకోవాల్సిన పనిలేదు' అన్నాడుమూర్తి నిట్టూర్పులిడుస్తూ.

నేనేంమాట్లాడలేదు. నామనస్సు ఆలోచనలతో నిండి పోయింది. అవును. ఇప్పుడా ధనవంతుడామెను ఆకర్షించాడు. ఆమెప్రేమను సంపాదించుకున్నాడు. ఇప్పుడామెకు అతనిమీద మోజు. ఇందులో విచిత్రమేముంది? ఓ, ఇలాజరగడం మామూలే. అనుకోవాల్సిన పనిలేదు. నేనారోజే ఆమెకు నీళ్లొదిలాను. అంతటితోటే ఆసంబంధం తెగిపోయింది. ఆమెను మళ్లీ జ్ఞాపకంచేసుకోవడం శుద్ధ తెలివితక్కువ. ఇప్పుడు నన్ను బాధిస్తున్న విషయంఒక్కటే. నేను తలొంచి శాల్యూట్ చేశానా! ఆమెనుచూచి 'హల్లో' అనిపలకరించానా? నిజంగా! ఎందుకలా చేశాను? లేదు. ఇలాంటి నీచపు మనుషుల్ని నేను గౌరవించను. ఆమె అదేపనిగా నావైపుచూచిందా? ఎందుకూ? జరిగినవిషయం తెలుచుకొని నాపై సానుభూతి చూపించడానికా? ఒకవేళ చేసినపనికి ఆమెకు పశ్చాత్తాపం కలిగినా ఇప్పుడు చేయగలిందేమీలేదు. చేయిజారిపోయింది. ఆమెకు పశ్చాత్తాపం కలిగినంతమాత్రాన నేనువెళ్లి ప్రాధేయపడతానా? అలాంటి బుద్ధితక్కువపని ఎన్నడూచేయను. ఇప్పుడామె పంచప్రాణాలూ ఆ జమీందారు. మంచిదే. వాళ్లిద్దరే సుఖపడనీ.

అన్నిరోజులూ ఇలాగేఉండవు. సమయంవస్తుంది. నాకూ ఒక రోజు వస్తుంది. ఆమె ప్రక్కనుంచి వెళుతూకూడా, కన్నెత్తి చూడకుండా ప్రభువులా ప్రవర్తిస్తాను. అలాంటి ఎర్రటి జార్జెట్టు చీరెలు అమ్మకానికి ఎన్నిఉన్నాయని అడుగుతాను. అహా! హా! అలాంటి టైంరావడం ఎంతసేపు! నానాటకం పూర్తయితే గంటలో నాజేబుల్నిండా డబ్బులు గలగల్లాడ తాయి. ఈమెను నాకాళ్లావేళ్లా పడేట్టుచేస్తాను... అహా! హా! హా! ఈ సీతాకోకచిలుకను చేతుల్లోపెట్టుకొని ఆడిస్తాను...

'వస్తాను. మూర్తి' అన్నాను నేను మెల్లిగా.

'అప్పుడేవెళ్లి ఏంచేస్తావోయ్' అన్నాడుమూర్తి నన్ను ఆపాలని.

'ఏంచేస్తాను. ఏదో వ్రాసుకుంటాను. నాకాధారం అంతకన్నా ఏముంది? ప్రస్తుతం ఒకగొప్ప నాటకం రాస్తున్నాను. 'సంధ్య'. పౌరాణిక యుగంలో కథ తీసుకున్నాను?

'బాగుంది. దానివల్లనైనా నీవు బాగుపడితే...' కొంచెం ఆశ్చర్యం కనపరుస్తూ అన్నాడు మూర్తి.

'బాగుపర్చినా, చెడగొట్టినా నేను లెక్కచేసేవాణ్ణి కాదు. బహుశా ఒక వారంరోజుల్లోనే నన్నుగురించి మరికొన్ని విషయాలు తెలుసుకుంటావులే.' అంటూ వెళ్లిపోయాను.

హోటలుకు రాగానే యజమానురాల్ని ఒక లాంతరు ఇప్పించమని ప్రార్థించాను. లాంతరు లేకపోతే నా పనిసాగదు. ఎలాగైనా ఈ రాత్రి నాటకం పూర్తిచేయాలి. దృశ్యమంతా నా కళ్ళకు కనబడుతోంది. తెల్లవారేసరికి తప్పకుండా చాలా భాగం వ్రాయగలను. లాంతరు ఇప్పించమని అతిదీనంగా అడి గాను. కాని నన్నుచూడగానే ఆమె ముఖం తిప్పేసుకుంది.

ఆమె ముఖాన పేలాలు వేగుతున్నాయి. వెళ్ళిపోకుండా శనిలా దాపురించానని ఆమెకు చెడ్డ బాధగా ఉంది. ఆమె ఎంత చీదరించుకున్నా, తిట్టుకున్నా మరి నాకు తప్పదుగా! మళ్ళీ నే నే ప్రాధేయపడ్డాను. గొప్పనాటకం రాస్తున్నాననీ, చాలవరకు పూర్తయిందనీ, ఇంకా ఒకటి రెండు దృశ్యాలుమాత్రం మిగిలి ఉన్నాయనీ చెప్పాను. ఎలాగైనా ఈ రాత్రికి ఆ కాస్తా పూర్తి చేస్తే రేపు థియేటర్ వాళ్ళను కలుసుకొని ఆ నాటకం ఆడే ఏర్పాటు చేయించుకుంటానని కూడా చెప్పాను. లాంతరిప్పిస్తే ఎంతో సహాయంచేసినట్లు ...

కాని ఆమెదగ్గర లాంతరు లేదు. ఆమె ఒక్క క్షణం ఆలోచించింది. కాని ఎక్కడా వేరే లాంతరున్నట్లు ఆమెకు తోచలేదు. ఇక ఎటొచ్చీ నేను పన్నెండుగంటలదాకా మేలుకొని కావలా కాస్తే వంటింట్లో లాంతరు నా కిస్తుంది. పోనీ నే నొక కొవ్వొత్తి ఎందుకు కొనుక్కోకూడదూ? నాలిక కొరుక్కున్నాను. కాండిల్ కొనుక్కోడానికి నా దగ్గర కానీకూడా లేదని ఆమెకు తెలుసు.

అందరూ ఉండే ఆ గదిలో నే నేనూ ఒకమూల కూర్చున్నాను. వంటవాడున్నాడు. పనిచేసేపిల్ల కూడా అక్కడే కూర్చొనిఉంది. వంటింట్లో చీకటిగా ఉంది. కనుక అక్కడిలాంతరింకా వెలిగించలేదని తోచింది. అయినా నేనేంమాట్లాడలేదు. హఠాత్తుగా ఆ పనిచేసేపిల్ల నన్నుగురించి ఇలాఅంది.

'ఇందాక మిమ్మల్ని ఆ సెంటర్లో చూసినట్లుజ్ఞాపకం. ఆ పెద్దమేడమీదనుంచి వస్తున్నారు. ఇవాళెవరైనా చుట్టాలు భోజనానికిపిలిచారా?' అంటూ ఆ పిల్ల వెకిలిగా నవ్వడం మొదలుపెట్టింది.

ఆసమయంలో నేను జేబులోంచి కాగితాలుతీసి వ్రాయ డానికి ప్రయత్నిస్తున్నాను. కాగితాలు మోకాళ్ళమీదపెట్టు కొని వ్రాయాలని మధనపడుతున్నాను. కాని ఒక అక్షరం కూడా సాగలేదు. యజమానురాలి కూతుళ్ళిద్దరూ అక్కడి కొచ్చి గోలప్రారంభించారు. వాళ్ళచేతిలో ఒకచిన్న పిల్లికూన ఉంది. దానివంటిమీద బొచ్చంతా ఊడిపోయింది. లేవలేకుండా చావడానికి సిద్ధంగాఉంది. అలాంటి పిల్లికూనను పట్టుకొని ఆ పిల్లలిద్దరూ దానికళ్ళలో వ్రేళ్లుపెట్టి పొడుస్తున్నారు. దానికళ్ళ ల్లోంచి నీళ్లుకారి ముక్కుల్లోకి పోతున్నాయి. హోటలు యజ మాని, మరిద్దరూ బల్లదగ్గరకూర్చొని యథాప్రకారంగా చీట్లాడుతున్నారు. ఇక యజమానురాలు ఏదో పనిచేయకుండా ఊరిక ఉంటుందా! ఆమె పాతచీరె ముందరవేసుకొని కుటు తోంది. ఈగందరగోళంలో నేను వ్రాసుకోలేకుండా ఉన్నానని ఆమె గమనించకపోలేదు. అంతాచూస్తూకూడా నా విషయం పట్టనట్లు ఊరుకుంది. పనిచేసేపిల్ల నన్నుగురించి ఎత్తిపొడుస్తూ అన్నమాటలువిని ఆమె చిరునవ్వునవ్వింది కూడా. ఆ ఇంట్లో ఎవ్వరూ నా కనుకూలంగాలేరు. అందరూ నాకు వ్యతిరేకులే. అంతా నన్నుసహ్యించుకునేవాళ్లే. అసలు బంగారంలాంటి నా గది పోగొట్టుకున్నందువల్ల ఇన్నితిప్పలొచ్చాయి. అతనెవరో వచ్చి దాన్ని ఆక్రమించుకున్నాడు. నా కీగతి పట్టింది. ఆఖరుకు పనిచేసేపిల్లకూడా నన్ను అవమానిస్తోంది. పిల్లికళ్లు, ముఖాన పెద్దమచ్చ, ఇల్లిల్లూతిరిగి పనిచేసుకొని బ్రతికే పసిముండ కూడా నేను లోకువైపోయాను. ఆ పిల్లనన్ను ఎగతాళి చేయడం ఇదే మొదటిసారికాదు. ఇంతకుముందుకూడా రెండు మూడుసార్లు ఇలాగే చేసింది.

జరిగినవన్నీ జ్ఞాపకంవస్తున్నాయి. మనస్సు పరిపరి విధాల పరిగెడుతోంది. రచన సాగేటట్లులేదు. కాగితాలు మడిచి జేబులోపెట్టుకున్నాను. ఆ పనిచేసేపిల్ల ఇంకా నాకెదురుగా కూర్చునేఉంది. ఆ పిల్లకింకా యుక్తవయస్సుకూడా రాలేదు. ఆపిల్లకు నా విషయాలతో ఏంపనో తెలియడంలేదు. ప్రతిదఫా నామీదికి దూకుతుందెందుకు? నేనొక పెద్దమేడమీది నుంచి వస్తుంటేమాత్రాం ఆపిల్లదేంపోయింది? ఆమెకేం అపకారం జరిగింది? కొద్దిరోజులక్రితం ఒకరోజు పైన నాగదిలో కూర్చునిఉండగాకూడా ఇలాగేచేసింది. ఏదో మేకుగుచ్చుకొని నాకోటు కొద్దిగా చిరిగింది. అదిచూచి ఆ పిల్ల వెకిలిగా వెర్రిగా నవ్వింది. మొన్న ఒకరోజు నేను వ్రాసి అవతలపారేసిన చిత్తు కాగితాలన్నీ ఏరి పట్టుకపోయి ముందువసారాలో కూర్చుంది. చదువొచ్చిన దానికిమల్లే అవిచూస్తూ ఏదోపెద్దగా పిచ్చిపిచ్చి మాటలు చదవడం ప్రారంభించింది. అందరూ వినేలాగ ఏదో హాస్యంచేసింది. నారచనలు అంతపనికిమాలినవాటిక్రింద జమ కట్టడానికి ఆమెకేం హక్కుంది? ఆ పిల్లను నేనేంపనిచేసిపెట్టమని అడగడంలేదే! కనీసం ఒకచిన్నపనికూడా నేనెన్నడూ చెప్పలేదు. నాపని నేనేచేసుకుంటూ ఉంటాను. క్రిందకు వచ్చేటప్పుడుకూడా బట్టలు అవీ, నేనే మోసుకొచ్చుకున్నాను. ఒకరోజు నా వెంట్రుకలు అక్కడక్కడ నెరిసాయని వేలుపెట్టి చూపిస్తూ పకపక నవ్వింది. నాబూట్లు ఆమూల పడేసిఉంటే వాటిని పట్టుకొచ్చింది. అందులో ఒకటి లారీక్రిందపడి తుక్కుతుక్కు అయిపోయిందికదూ? దాన్ని ఎత్తిచూపిస్తూ ఇలాఅంది. 'ఎందుకీబూట్లు? తీసి బయటపారేస్తాను. ఇవి కుక్కలు తింటాని కూడా పనికిరావు.' నిజమే. ఆపిల్లచెప్పినట్లు ఆబూట్లు

ఎందుకూ పనికిరావు. మరేంచేయను? మంచివి సంపాదించుకో డానికి నాకు తాహతెక్కడుంది?

అలా కూర్చొని జరిగిన విషయాలన్నీ తలంపుకు తెచ్చుకున్నాను. ఇంతలో ఆ యిద్దరు పసిపిల్లలు ముసలాయన మంచం మీదచేరి నానా గందరగోళంచేయడం మొదలుపెట్టారు. మంచంమీద అటూ ఇటూ, గంతులేస్తున్నారు. ఆ ముసలాడు యమయాతన అనుభవిస్తూ ఏదో బాధపడుతూంటే ఈ పిల్లలిద్దరూచేరి ఇంకా ఏడిపిస్తున్నారు. నారపీచులు తీసుకొచ్చి అతనిచెవుల్లో కూరుతున్నారు. ఇదంతా చూస్తూకూడా నాకెందుకని ఊరుకున్నాను. పాపం ఆ ముసలాడేంచేయగలడు? వాళ్ళనేమీ అనలేదు. అఖరుకు చేతులుకూడా కదల్చలేదు. పుసులుకట్టిన అతని కళ్ళనుంచి నీరుకారుతోంది. తండ్రిచీట్లాడుతూ తనపిల్లలుచేసేగోల చూస్తూనే ఉన్నాడు. వాళ్ళను అదిలించకపోగా, వాళ్ళుచేస్తున్న ఘనకార్యంచూచి ఆనందిస్తున్నాడు. తనకూతుళ్ళగొప్పతనం, తనస్నేహితులతోకూడాచెప్పి పకపక నవ్వుతున్నాడు. కళ్ళఎదట ఇదంతాజర్గుతోంటే చూస్తూ ఊరుకోలేకపోయాను. నాకెంతో కష్టమనిపించింది. ఆ పిల్లల్ని ఇవతలికి లాగేద్దామని లేచి ముసలాడి మంచందగ్గరికెళ్ళాను. పిల్లలకు తెలీకపోతేమాత్రం దున్నపోతులాతాను చూస్తూన్నాడుగా! వాళ్ళనుకాస్త ఇవతలికి రమ్మనుకూడదూ?

నేను మంచందగ్గరికి వెళ్ళడంచూచి తండ్రి ఇలా కసురుకున్నాడు.

'ఊరుకో—అక్కడికి వెళ్ళకు. అతనికి పక్షవాతంవచ్చింది. ఒంటరిగా ఉండనీయవయ్యా.'

నేను వెనక్కు మళ్లాను. యథాప్రకారం నా స్థానంలో

వచ్చికూర్చున్నాను. అతనికి భయపడికాదు. ఎందుకు? అనవస రంగా తగాదావడి, ఈ రాత్రి కిక్కడ తలదాచుకునే అవకాశం కూడా లేకుండాపోతుంది. గుప్పచప్పనఊరుకున్నాను. అయినా నా కెందుకు? వాళ్ల కుటుంబవ్యవహారాలతో నా కేంపని? నే నెందుకు జోక్యం కల్గించుకోవాలి? సగం చచ్చిపోయిఉన్న ఆ ముసలాణ్ణి రక్షించాలని ప్రయత్నించడం వట్టి మూర్ఖత. రాయిలా చూస్తూకూర్చున్నాను,

ఆ ఇద్దరుపిల్లలూ ముసలాణ్ణి వదిలిపెట్టలేదు. ముక్కుల్లో కళ్ళల్లో వేళ్లుపెట్టి పొడుస్తున్నారు. మధ్యమధ్య గోళ్ళతో గిల్లు తున్నారు. ముసలాడు వాళ్ళిద్దరివైపు వికృతంగా చూస్తు న్నాడు. అలా ఉండిఉండి ఆ ముసలాడు హఠాత్తుగా వీపుపైకెత్తి తుపుక్కున ఉమ్మేశాడు. ఒకపిల్ల ముఖంమీద పడింది. మళ్ళీ రెండోసారి అలాగే ఇంకోపిల్ల ముఖాన ఉమ్మేశాడు. కాని అది ఆపిల్లమీద పడలేదు. ఇంతలో తండ్రిచేతిలో పేకముక్కలు అవతలపారేసి చివాలునలేచాడు. ముసలాడి మంచందగ్గరకు విసురుగా వెళ్లాడు. అతనిముఖం ఎర్రబారింది.

'నీకుబుద్ధిలేదూ! పోతులాపడుకొని మనుషులముఖాల మీద ఉమ్మేస్తావా?' అంటూ పెద్దగాఅరిచాడు తండ్రి.

'అరెబాబూ! ఆ ఇద్దరుపిల్లలూ అతన్ని యమభటుల్లా పీడిస్తున్నారు. అతనిగుండెల్లో అగ్నిపర్వతాలు బ్రద్దలవు తున్నాయి. ఆ ముసలాడికి శాంతిలేదు. సుఖంలేదు.' అను కున్నాను నాలోనేను.

నేను పల్లెత్తుమాటకూడా అనలేదు. ఈగందరగోళ మంతా చూస్తోంటే నాకు భయంపుడుతోంది. వళ్ళంతా వణుకుతోంది. ఇంతలో తండ్రి నావైపుతిరిగి ఇలాఅన్నాడు.

'హు. అలాగ్రుడ్లు మిటకరించుకొని చూస్తావేం? ఎదురుగాచూస్తూ నోరుమూసుకుని నిలుచోకపోతే చెప్పకూడా దయ్యా పెద్దమనిషివి?'

వెంటనే భార్యఅందుకుంది. ఇల్లంతా నోరుచేసుకుని బ్రహ్మాండంగా తిట్టడం ప్రారంభించింది. ఓ! ఇల్లంతా తిట్లూ అరుపు, కేకలు, బొబ్బలు,......యమలోకం.

'నోరుకొవ్వెక్కిందా, మరేమన్నా నా? ఇదుగో-ఇంట్లో ఉండదలుచుకుంటే మీఇద్దరూ నోరుమూసుకుని పడుండండి. అణాకాసు సంపాదించలేని అసమర్థులు మీరూ మనుషులేనా? నోరుమూసుకుని పడిఉండక పెద్ద పెద్దమాటలు దేనికీ? చీట్లాడం తప్ప చిల్లికానితేలేని దేబెముఖం నీవూను. ఇక ఆయనఉండనే ఉన్నాడు. తేరగా తిండిపడేస్తోంటే తినికూర్చోలేక ఏదోకుంపటి తెచ్చిపెడుతుంటాడు. ఊరంతా తిరిగొస్తున్నా ఉబుసుపోదు కామాలు. అర్థరాత్రప్పుడు ఇంట్లో ఏమిటేగలభా! ఇదుగో చెపుతున్నా. ఇంతటనైనా నోళ్లుకట్టేయండి. లేకపోతే నేనే వచ్చి ఆపనిచేస్తాను. ఛీ, ఛీ! ఇట్లాంటి మనుషుల్ని నే నెక్కడా చూళ్లేదు. మళ్లీ చెపుతున్నా. ఈ ఇంట్లో నోరుమెదల్చడానికి మీకెవ్వరికీ హక్కులేదు. మీ తాతగాళ్లసొమ్ము తెచ్చి ఇక్కడ పెట్టలేదు. బయటకెళ్లి మీ ఇష్టంవచ్చినట్లు తందనాలాడండి. ఛీ. అసలు నాకెందుకీగోల? నేను నా ఇష్టంవచ్చిన చోటికి వెళుతున్నాను. అబ్బ. ఈ కొంపలో సుఖంలేదు. నా ఇష్టంవచ్చినచోటికి నేను పోతున్నా తెలిసిందా?'

నేనేం మాట్లాడలేదు. నోరువిప్పలేదు. తలుపుకానుకుని కూలబడ్డాను. ఆమెకేకలతో ఇల్లంతా దద్దరిల్లిపోతోంది.

31

నేనేమన్నా మాట్లాడితే ఆమెమరీ నా మీద విరుచుకపడు తుంది. నోరుమూసుకుని కూర్చున్నానా, ఇదంతా నా వల్లేజరి గిందని ఇంకా తిట్టిపోస్తుంది. రెండువిధాలాచిక్కే. అయినా ఊరుకోవడమే మంచిది. అసలు నేను మాట్లాడేదేముంది?ఏమని సమాధానం చెపుతాను? బయటికి వెళ్ళిపోదామన్నా, చీకటి. ఈ అర్ధరాత్రి చలిలో నాకు దిక్కెవరు? అంచేత కుక్కినపేనులా పడిఉండడమే మంచిది......కూర్చునే ఉన్నాను. బయటికెళ్లి పోవడానికి ప్రయత్నించలేదు కూడా. ఎదురుగా గోడకు ద్రౌప దీవస్త్రాపహరణం పటం వ్రేలాడుతోంది. దాని వైపుచూస్తూ కూర్చున్నాను.

ఇంతలో పేకాటఆడేవాళ్ళలో ఒకతను ఇలా అన్నాడు.

'నావల్లమీకిబ్బంది కలిగినట్లయితే చెప్పండమ్మా! వెళ్లి పొమ్మంటే పోతాను.'

'అబ్బే. నిన్నుకాదు. నేను నిన్నుగురించి ఏమీ అన లేదు. ఎవర్నిగురించి నేనంటున్నదీ నాకే తెలుసు. ఇక్కడే ఉన్నాడు. చెపుతాను. ఆమనిషి ఎవరైందీ తొందర్లోనే చెపు తాను...' అన్నదామె.

మధ్య మధ్య ఆగుతూ మాట్లాడుతోంది. రాను రాను ఆమె మాటలవల్ల స్పష్టంగా అర్థమాతోంది. ఆమాటలన్నీ అనడం నన్నేనని స్పష్టంగా తెలుస్తోంది.

'ఊరుకో మారుమాట్లాడకు. అంతే.' నాలోనేను చెప్పుకున్నాను. 'ద్రౌపదిలా, గజేంద్రుడిలా, హరిశ్చంద్రుడిలా, జేసస్‌లాగా, సోక్రటేస్‌లాగా బాధలు భరించు. కష్టాల్నికడు పులో జీర్ణించుకో. అవమానాల్ని దిగమ్రింగు. అంతే... చిన్న

పిల్లాడిలా ప్రవర్తించావు, అయినా 'జలజ' కూడా నిన్నవమా నించింది. తప్పదు. తలదాచుకో......'

'నీకుకాదు చెప్పేది? వినబడడంలేదూ? చెముడొ చ్చిందా! ఎన్నిసార్లు చెప్పాలి? తక్షణం ఇక్కణ్ణుంచి వెళ్లిపో- ఈఇంట్లో ఒక్కక్షణం ఉండడానికి వీల్లేదు' నామీదికొచ్చి గద్దిస్తూ అన్నది యజమానురాలు.

నేను వీధివాకిలివైపు చూచాను - వెళ్ళిపోవాలనికాదు. ఏదో వెర్రిగాచూచాను. తలుపు లోపలగడియ వేసిఉంది. తల తిరిగిపోతోంది. కాళ్లు వణుకుతున్నాయి. కళ్లల్లో నీళ్లు ...

హఠాత్తుగా ఆమెభర్త అందుకున్నాడు. ఇంతకుముందు నా మీద విరుచుకపడ్డ ఆ పెద్దమనిషి ఇప్పుడు విచిత్రంగా నన్ను సమర్థిస్తున్నాడు.

'వద్దు. అతన్ని ఈ అర్థరాత్రిలో బయటికి గెంటెయకు. పుణ్యానికి రోడ్డుమీద చచ్చాడూఅంటే మన పీకలమీదికొస్తుంది. చేతులకు బేడీలుపడతాయి.' అన్నాడాయన.

అలా నన్ను బయటకిగెంటివేస్తే చట్టప్రకారం వాళ్ళకు శిక్షపడుతుందేమో! నాకు తెలీదు. బహుశా అలాంటి రూలు ఉందేమో! ఎలాగైతేనేం ఆమె తిన్నగా మాట్లాడకుండా లోపలి కెళ్ళింది. ఒక పళ్లెంలో కొంచెం అన్నం, పులుసూ, తెచ్చి నా ముందు పెట్టింది. కాని నేను ముట్టుకోలేదు. ఆ పెద్దమనిషి ఏమైనా అనుకుంటాడేమో అని తినబోతున్నట్లుగా నటించాను.

నేనులేచి ముందరివసారాలోకి వెడుతోంటే యజమానురాలు మళ్ళీనన్ను పిలిచిపెద్దగా ఇలాఅంది.

'కాని ఇవ్వాల్టితో ఆఖరు. ఇదేచివరరాత్రి రేపిక్కడ ఉండడానికి వీల్లేదు.'

'అలాగే, అలాగే,' అన్నానునేను తలొంచుకొని.

పోనీలే. రేపటిసంగతి రేపు. ఎక్కడో మరోచోటు వెతుక్కుంటాను. ఈ రాత్రికి రోడ్డుమీద పడుకోకుండా రక్షిం చింది. అంతేచాలు.

తెల్లవారుఝామున 5 గంటలదాకా నిద్రపోయాను. అప్పటికింకా పూర్తిగా తెల్లవారలేదు. మసక మసక చీక టిగాఉంది. నా ఒళ్ళంతా పట్టుకపోయింది. పక్కలేదు. క్రింద పడుకోవడం. లేచి పంపుదగ్గరికిపోయి కాసినినీళ్లు త్రాగాను. తెల్లవారితే యజమానురాలు కంటబడుతుంది. ఆమెకెలా ముఖంచూపడం? మెల్లగా వీధివాకిలి తీసుకొని బయటికి వెళ్ళి పోయాను.

ఇద్దరు పోలీసులు నా కంటబడ్డారు. మొట్టమొదట నేను చూచింది వాళ్లనే. తెల్లవార్లూ గస్తీతిరిగిన కానిస్టేబుల్సు. ఆ తర్వాత క్రమక్రమంగా రోడ్లమీద జనం నడవడం ప్రారంభిం చారు. కొద్దిగా మంచుపడుతోంది. చలివదల్లేదు. ఏమీ ఆలో చించకుండా, దారీతెన్నూ లేకుండా రోడ్డువెంట నడుస్తున్నాను. అలా చాలదూరం నడిచాను. చివరకు హార్బరుదరిదాపులోకి వచ్చాను. నా కాళ్లు పీకుతున్నాయి. కడుపులో ఆకలివేస్తోంది కూడా. జనసమ్మర్దంలేని ఒకచోట కూలబడ్డాను. కునికిపాట్లు పడుతూ తలొంచుకుని చాలసేపు కూర్చున్నాను. ఆకలి తోలు స్తోంది. నాకేం తోచడంలేదు. కళ్లు మూసుకుపోయినాయి. నిద్రపట్టింది ...

నేనులేచేసరికి వీధులన్నీ జనసమ్మర్దంగాఉన్నాయి. కార్లు, బండ్లు, జనం, ధ్వనులు. అప్పటికి బాగా ప్రొద్దెక్కింది. మబ్బు లేదు. బాగా ఎండకాస్తోంది. రోజూ మబ్బులుచేస్తోంది. ఇవాళ

పెళపెళమని ఎండకాస్తోంది. ఇన్ని చీకటిరోజులతర్వాత ఇవాళ ఎండ. నాకేదో వెర్రిఆవేశం వచ్చింది. గభాలున గుండెమీద కొట్టుకున్నాను. 'ఆ' అని అరిచాను. కాని నా గొంతురాచుక పోయివుంది. ఆశబ్దం నాకు చాల అసహ్యంగా వినిపించింది. అప్రయత్నంగా కళ్ళవెంట నీరుకారడం మొదలుపెట్టింది. 'వెలుతురు చూడలేను. వెలుగులోంచి వేలాది పలుగులు నన్ను పట్టి పొడుస్తున్నాయి.' పెద్దగా ఏడ్వడం మొదలుపెట్టాను.

'ఏంజరిగిందినాయనా?' దోవన పోతోన్న ఒకాయన నన్నుచూచి అడిగాడు.

కాని నేనుసమాధానం చెప్పలేదు. లేచిగబగబ నడవడం మొదలుపెట్టాను. చేతులతో ముఖం కప్పుకున్నాను. నా ముఖం మనుషులకు చూపించకుండా త్వర త్వరగానడిచి బ్రిడ్జి దగ్గరికి వచ్చాను. ఎదురుగా హార్బరు కన్పిస్తోంది. ఒకపెద్ద ఓడ లంగరువేసుకుని బరువులు దిగుమతిచేస్తోంది. ఓడమీద తళ తళ మెరుస్తూ ఎర్రజెండా ఎగురుతోంది. ఓడమీద పేరుచదివాను. 'కోపెగారా.'

ఓడనుచూస్తూ చాలసేపు నిలబడ్డాను. ఎండకు తళతళ మెరుస్తోన్న సముద్రం, తెరిపిలేకుండా ముఖాలు ఎర్రబారి వార్పులో పనిచేస్తోన్న మనుషులు, నాకు ఉత్సాహంకల్గించాయి. ఏదో కొత్తరక్తం ప్రవహించింది. అక్కడకూర్చొని కొంతసేపు నాటకంవ్రాస్తే బాగుంటుందని తోచింది. వెంటనే జేబులోంచి కాగితాలు బయటికి తీశాను.

నాటకంలో ఒకసన్యాసి పాత్రఉంది. అతనికొక ఉపన్యాసంపెడితే బాగుంటుందని తోచింది. ఆలయంలో జరిగిన అధర్మాన్ని ఖండిస్తూ ధర్మోపన్యాసం చేస్తాడు. కాని మళ్ళీఅది

బాగలేదనిపించింది. చివరకు దేవాలయాన్ని అపవిత్రంచేసిన ఆవేశ్యనే మాట్లాడించాను.

దాదాపు అరపేజీ వ్రాశాను. కాని చుట్టూఉన్న వాతావరణం నా కనుకూలించలేదు. పనివాళ్ల అరుపులు, ఎడ తెగకుండా విన్పిస్తోన్న ఇనపగొలుసుల చప్పుడు, సర్దుతోన్న రకరకాల సామాన్లమోతలు; నాచుట్టూ రణగొణధ్వనులు విన్పిస్తున్నాయి. అంచేత ఎక్కువసేపు వ్రాయలేకపోయాను. నా ఆలోచనలకు అంతరాయం కల్గుతోంది. అక్కణ్ణుంచి లేచాను. కాగితాలు మడిచి తిరిగీ జేబులో పెట్టుకున్నాను.

ఎటువెళ్లడానికీ తోచడంలేదు. మనస్సుకొంచెం కుదుట పడింది. ఉత్సాహంగానేఉంది. కాని ఎక్కడికివెళ్లను? నడక ప్రారంభించాను. చాలదూరం నడిచాను. ఎక్కడనిలబడడానికీ, ఎలాగడపడానికీ ఆస్కారంలేకుండాఉంది.'పోనీ మళ్లీ హోటలుకే వెడితే? వద్దు. ఆమె తిట్టిపోస్తుంది. మెడపట్టి గెంటేస్తుంది. మరెక్కడుండాలి? ఎంతసేవుతిరగాలి.'... అనేక ప్రదేశాలు తిరిగాను. చివరకు అసహ్యంగా ఉండేచోట్లుకూడా చూచాను. మనుషులు వెళ్లనిచోట్లు, వెళ్లలేనిచోట్లు, తిరిగాను. ఆఖరుకు విసుకుపుట్టింది. తిరిగీ హోటలుకు వెళ్లడానికే నిశ్చయించు కున్నాను.

'అవును. అంతకన్నా గత్యంతరంలేదు. ఆమె తిట్టినా దీవించినా నోరుమూసుకుని కాలంగడపాలి. గర్వంతో పొగరు బోతుగా ప్రవర్తిస్తే నాకేనష్టం. పైగాహోటలు వదిలిపెట్టి ఎంతసేపైంది? బహుశా రెండుమూడు గంటలవుతుందేమో? ఈ కొంచెంసేపటికే నాజాగాపోతుందా! వెడతాను. హోట లుకేవెడతాను. నాకూ ఆస్థలానికీ ఇంకా ఋణంతీరలేదు. కాక

పోతే యజమానురాలితో చెప్తాను. మీతో చెప్పి మీదగ్గర సెలవు తీసుకొనిపోదామని, వచ్చానని చెపుతాను. నేనెంత బాకీపడ్డానో లెక్కచూచి చెప్పమని అడుగుతాను.'

వీధివాకిలి దగ్గరిగా వేసిఉంది. వణుకుతోన్న చేతుల్తో మెల్లగా తలుపుతీసుకుని లోపలికి ప్రవేశించాను. ముందు వసారాలో నిలబడ్డాను. గది తలుపుదగ్గర హోటలు యజమాని నిలబడి ఉన్నాడు. అతనివంటిమీద చొక్కాలేదు. తలవొంచి, తలుపు రంధ్రాల్లోంచి గదిలోకి తొంగితొంగి చూస్తున్నాడు. నాకేమీ అర్థంకాలేదు. ఒక్కక్షణం తర్వాత అతను నన్ను చూచాడు. చప్పుడు చేయకుండా మెల్లగా దగ్గరికిరమ్మని సైగ చేశాడు.

'ఇలా రావయ్యా' రహస్యంగా అన్నాడతను.

నేను మెల్లగా చప్పుడుకాకుండా కాలిబొటనవ్రేళ్లమీద నడిచి దగ్గరికివెళ్లాను.

'అక్కడచూడు ఏంజరుగుతుందో!' అన్నాడతను. అంటూ 'హి, హి, హి' అని పళ్లికిలించాడు.

'బెజ్జంలోంచి సరీగాచూడు. కన్పిస్తోందా? ఆముసలాడికైనా బుద్ధిలేదు చూచావా!'

గదిలో మంచంమీద ఇద్దరువ్యక్తులు నాకు కనిపించారు. హోటలు యజమానురాలు, ఆ కొత్తగా వచ్చిన ప్రయాణీకుడు: వాళ్ళిద్దరూ...మసకమసకచీకట్లో ఆమెకాళ్లు తెల్లగా... మంచంమీద ఒకవైపు పక్షవాతంతో బాధపడుతున్న ఆమె తండ్రి, గోడకానుకుని కూర్చున్నాడు. కదలకుండా, మెదలకుండా శవంలా చేరగిలబడి ఉన్నాడు. మంచంపైన గోడకు దేవుడిపటం వ్రేలాడుతోంది.

నేను వెనక్కుతిరిగి యజమానివైపు చూచాను. అతను నవ్వుతున్నాడు. అతనికి నవ్వు ఆగడంలేదు.

'ముసలాణ్ణిచూచావా, ఎట్లాచూస్తూ కూర్చున్నాడో!' అన్నాడతను రహస్యంగా.

అతనుమళ్ళీ తలుపు రంధ్రంలోంచి లోపలికి చూడడం మొదలుపెట్టాడు.

ఇక నేనక్కడ నిలుచోలేక పోయాను. ఆదృశ్యాన్ని చూడలేకపోయాను. వెళ్ళి వసారాలో కిటికీలో కూర్చున్నాను. ఆదృశ్యం నా ఆలోచనలన్నిటిని మార్చివేసింది. 'సరే. నాకూ ఆ విషయానికీ సంబంధమేమిటి? ఆమె మగడే మనస్ఫూర్తిగా ఒప్పుకొని తన కళ్లెదట అంతపనిజర్గుతోంటే చూస్తూ ఊరుకున్నాడు. పైగా ఆనందిస్తున్నాడు కూడా. భార్య చెడుప్రవర్తన అతనికే సమ్మతమైనప్పుడు నా కెందుకీబాధ? అనవసరం. ఇక ఆ ముసలితండ్రిమాటా! అతనేంచేస్తాడు. చావడానికి సిద్ధంగా ఉన్నాడు. ఈ ప్రపంచంలోలేడు. అసలా ముసలాడి ప్రాణమే పోయి ఉండొచ్చు. అతను చచ్చిపోయినాడు. బహుశా ఈ ఉదయమే తెల్లారగట్ల ఊపిరిపోయి ఉండొచ్చు.'

మళ్లీ నా రచన కాగితాలు బయటికితీసి వ్రాయడానికి ప్రయత్నించాను. కాని రచనమీద దృష్టి కేంద్రీకరించలేక పోతున్నాను. కిటికీలోంచి వీధిలోకిచూచాను. రోడ్డుమీద ఒక పరిక చిన్నకుర్రోడు కాగితపు పడవలతో ఆడుకుంటున్నాడు. ఆ వసివాడు చాల సంతోషంగాఉన్నాడు. రోడ్డుమీద బండ్లు, బస్సులూ వస్తాయనికూడా అతనికి తెలిసినట్లులేదు. కాగితం పడవలు కుప్పగాపెట్టుకొని ఒక్కడే ఆడుకుంటున్నాడు. గభాలున వాడులేచి రోడ్డుమధ్యకు పరిగెత్తాడు. పైన మేడవైపు

చూచి పెద్దగా తిట్టడం మొదలుపెట్టాడు. పై అంతస్థులో గడ్డం పెంచుకున్న ఒక పెద్దమనిషి కిటికీదగ్గర నిలబడిఉన్నాడు. అతను పైనుంచి ఉమ్మేస్తే ఆ పసివాడిముఖాన పడింది. అంచేత కోపంతో ముఖం ఎర్రగాచేసుకుని ఆ కుర్రాడతన్ని 'అమ్మ, అక్క' అని బూతులు తిడుతున్నాడు. కాని ఆ మేడమీద పెద్ద మనిషి ఏమీ సమాధానంచెప్పకుండా నవ్వుతున్నాడు. కొద్ది నిమిషాలిలా గడిచాయి. చివరకు పాపమా పసివాడు ఏంచేయ లేక ఏడ్వడం మొదలుపెట్టాడు..

నా రచన సాగేటట్లు కన్పించడంలేదు. అనేక దృశ్యాలు నా కంటబడుతూఉన్నందువల్ల మనస్సు స్థిమితంగాలేదు. ఇంకా హోటలుయజమాని తలుపుదగ్గరనిలబడి బెజ్జాల్లోంచి గదిలోకి తొంగిచూస్తూనేఉన్నాడు. ఇక అక్కడ కూర్చున్నందువల్ల ప్రయోజనంలేదనిపించింది. మెల్లగాలేచి మేడమీదికి వెళ్ళడా నికి నిశ్చయించుకున్నాను. యజమాని నా వైపు చూచాడు. చప్పుడులేకుండా వెళ్ళమని సైగచేశాడు. కాని నేనతన్ని లక్ష్య పెట్టలేదు. అతని చేష్టలు నా కసహ్యంగాఉన్నాయి. కోపంతో కాళ్లు చప్పుడుచేస్తూ గబగబ నడిచాను. మెట్లెక్కి మేడమీదకు వెళ్లాను. ఇదివరకు నేనున్న గదిలోకేవెళ్లాను. గదిలో ఎవ్వరూ లేరు. 'నే నిక్కడ కూర్చొని కొంతసేపు వ్రాసుకుంటే ఏం? ఏం కొంపలు మునుగుతాయి?'

వెళ్లి బల్లముందు కూర్చున్నాను. కాగితాలన్నీ టేబుల్ మీదపరిచి నాటకాన్నిగూర్చి తీవ్రంగా ఆలోచించడం మొదలు పెట్టాను. కలంబాగా సాగుతోంది. విచిత్రమైన పాత్రలు,

వివిధరకాల సంభాషణలు, చకచక నడుస్తున్నాయి. కొద్ది నిముషాల్లో కొన్ని పేజీలు వ్రాశాను.

ఒకచక్కని ఆలోచనతట్టింది. 'గుడిగంటలు' గుళ్లో గంటలమోత, నాటకంలో ఒకచక్కని సన్నివేశం. బ్రహ్మాండమైన ఘంటానాదం వినిపిస్తుంది. ఇలా ఆలోచిస్తుండగా హఠాత్తుగా మెట్లమీద చప్పుడైంది. భయంతో నావళ్లు వణకటం మొదలుపెట్టింది. చేతిలో పెన్సలు అలాగే పట్టుకున్నాను. ఒక్క మాటకూడా వ్రాయలేకపోయాను. తలుపుతీసుకుని ఆ ఇద్దరూ గదిలోకొచ్చారు. హోటలు యజమానిభార్య, ఆకొత్తగా వచ్చిన ప్రయాణీకుడు.

నేను క్షమాపణ చెప్పుదామని అనుకుంటూ ఉండగా, నాకంటెముందుగానే ఆమె ఇలా అరిచింది.

'మళ్లీ ఇక్కడొచ్చి కూర్చున్నావేం? వెళ్లిపోకుండా!'

'క్షమించండి' అన్నానునేను. ఆపైన మాట్లాడలేకపోయాను.

'నీవు బయటికినడవకపోతే పోలీసుల్ని పిలవాల్సొస్తుంది.' అన్నదామె తిరిగీ.

నేను లేచాను.

'మీతో చెప్పి సెలవుతీసుకొనిపోదామని వచ్చాను. అంతే. మీరొస్తారని కనిపెట్టుకొని కూర్చున్నాను. ఇక్కడ నేనొక వస్తువుకూడా ముట్టుకోలేదు. ఊరికె కుర్చీలో కూర్చున్నాను....' గద్గదస్వరంతో సమాధానం చెప్పాను.

'అవునవును. మరేం ఫరవాలేదు. ఇంతమాత్రానికేం పోయిందీ? పోనీ పాపం ఒక్కడూ కూర్చున్నాడు. అతను–' అన్నాడా ఆగంతకుడు.

అప్పటికి నేను మేడదిగి చివరమెట్ల దగ్గరికివచ్చాను. నా వెనకాలే అడుగులో అడుగువేసుకుంటూ ఆమె వస్తోంది. నాకు విపరీతంగా కోపం వచ్చింది. లావుగా, బలసిన ఆమె ఆకారం, ఆమె ప్రవర్తన నాకసహ్యాం అనిపించాయి. నా మడమలు తొక్కుతూ భూతకిలా నా మీాదకు దూకుతూ నడుస్తోంది. ఆమెను నానాతిట్లు తిట్టి, చేసినపనికి చీవాట్లుపెడదామనుకున్నాను. నాలికమీాదకొచ్చి మళ్ళీ ఆగిపోయాను. తమాయించుకున్నాను. 'పోనీ, భ్రష్టుముండ. ఆమెకు సిగ్గులేకపోతే, నాకైనా ఉండొద్దూ? ఆ పక్కనున్న మగాడైనా ఏమైనా అనుకుంటాడు.' ఏం మాట్లాడకుండా వసారాలోకి వచ్చాను. ఆమెకూడా నా వెనకాలే వచ్చింది.

'వెడుతూ వెడుతూ ఆమెకు బుద్ధివచ్చేలా ఒక్కమాట అనివెడితే బాగుండు.' ఆమాటకోసం ఆలోచిస్తూ ఒక్కక్షణం నిలబడ్డాను. 'ఆమాట ఆమెజన్మలో మరపురాకుండా ఉండాలి. కలకాలం జ్ఞాపకముండాలి.'

ఇంతలో బయటినుంచి ఒకతను లోపలికొచ్చాడు. నా పేరుచెపుతూ నేనెక్కడున్నానని ఆమెనడిగాడు. ఆమె సమాధానం చెప్పింది. కాని నేనటువైపు చూడకుండా ఒక పక్కకు నిలబడి ఉన్నాను.

అతను నా దగ్గరికొచ్చి శాల్యూట్ చేశాడు. జేబులోంచి ఒకకవరు తీసి నాచేతికిచ్చాడు. పట్టించుకోకుండా, పరధ్యాన్నంగా కవరుచింపి చూశాను. లోపలయాభై రూపాయల నోట్లు ఉన్నాయి.—మరేంలేదు. ఉత్తరంలేదు. ఒక అక్షరం ముక్క-కూడాలేదు.

అతన్నడిగాను.

'ఏమిటిది? ఎవరిచ్చారీ కవరు?'

'ఓ, పేరుమాత్రం చెప్పలేను. ఒక ఆడమనిషి నాచేతికి చ్చింది.' అన్నాడతను. నేనొక్క-క్షణం కదలకుండా నిలబడ్డాను. అతను వెళ్ళిపోయాడు.

ఆ అయిదునోట్లు, మళ్ళీకవరులో పెట్టాను. కవరుమడత పెట్టాను. కవరూ, నోట్లూకూడా నలిగిపోయేలాగా చేతిలో గుండ చేశాను. యజమానురాలు కొంచెందూరంగా నిలబడి క్రీగంట నన్ను కనిపెడుతోంది. సరిగ్గావెళ్ళి ఆమె ముఖాన పడేటట్లుగా దాన్ని విసిరేశాను. అంతే. నేనొక్క మాటకూడా అనలేదు. పల్లుకదల్చలేదు. అదే సరైనపద్ధతి. మంచిగా మర్యాదగా బ్రతికేవాడు అనవసరమైన మాటలు మాట్లాడడు. తన పరువు, ప్రతిష్ట, తనప్రతిభ, ప్రజ్ఞ, అంతాకూడా ఒకచిన్నపనిలో చూపెడతాడు. అంతే. ఆమె, కవరు విప్పతీసి చూచుకొంటోంది... అహా, హా! హా! ఇప్పుడు తెలుస్తుందామెకు నేనెటువంటివాణ్ణో! ఒక్క-క్షణంలో యాభైరూపాయలు ఆమెముఖాన విసిరిపారేశాను. ఇలాంటిడబ్బును లెక్క-చేసేవాణ్ణికాదని ఆమెకు తెలుస్తుంది. మాటపడని మనిషినని ఇప్పుడైనా గ్రహించదూ? దుర్మార్గురాలు. ఇలాంటి పశువులకీశాస్తి జరగాల్సిందే!...

నేను వెళ్లిపోతున్నాను. ఎక్క-డికి? ఏదో అనంతంలోకి. రోడ్డుమీద నడుస్తోంటే హఠాత్తుగా నాకు తలతిరగడం మొదలు పెట్టింది. తూలిపడబోయి ఒక ఇంటిగోడ పట్టుకొన్నాను. ఒక్క-అడుగుకూడా ముందుకువేయలేక పోయాను. సరీగా నిలబడడానికి కూడా నాకు చేతకాలేదు. గోడకు వ్రేలాడబడి ఉన్నాను. అలా కొద్దిక్షణాలు గడిచేసరికి నాకు పూర్తిగా స్పృహతప్పి పోతున్నట్లుగా తోచింది. పిచ్చికోపం రావడంవల్ల

నేను మరీ నీరసపడి పోయాను. తిన్నగా కాలుతీసి పేవ్‌మెంటు మీద పెట్టడానికి ప్రయత్నించాను. ఎలాగైనా బలం తెచ్చుకుందామని అనేకవిధాల పోరాడాను. పళ్లుగట్టిగా బిగబట్టాను. ముఖాన ముడతలుపడేలా కనుబొమలు పైకెత్తాను. కళ్లుపెద్దవి చేశాను. అవసానకాలం ఆసన్నమైందని తోచింది. చేతుల్తో గోడనుగట్టిగా అదుముతూ బలవంతాన ఇవతలికి రావడానికి శాయశక్తుల పోరాడాను. నా కళ్ళముందు నేల, ప్రతివస్తువు గిర్రునతిరిగి పోతోంది. ఎక్కిళ్లు వస్తున్నాయి. క్రిందకూలబడి పోయాను. నేను కావాలని అలాచేయలేదు. కాళ్ళల్లో సత్తువ లేక చతికలబడ్డాను. నేను చచ్చిపోవడమే సంభవిస్తే నిలబడి చచ్చిపోగలను. కూర్చుని సుఖంగా చచ్చిపోవాల్సిన అవసరం లేదు. నాముందునుంచి రోడ్డుమీద చిన్నతోపుడుబండిపోతోంది. బండిమీద బుట్టలున్నాయి. బుట్టలనిండా బంగాళా దుంపలు న్నాయి. కాని పిచ్చికోపంవల్ల, మూర్ఖత్వంవల్ల, నా కెందుకో అందులో ఉన్నవి బంగాళాదుంపలుకావనీ, అవి కాబేజీలని తోచింది. అందులో ముమ్మాటికీ కాబేజీలే ఉన్నాయని స్థిర పరుచుకోవడం కోసం కఠినంగా ఒట్లుపెట్టుకున్నాను. అయినా అందులో ఉన్నవి బంగాళాదుంపలేనని, నేనబద్ధం ఆడుతున్నా నని ఎవరో నాతోవాదిస్తునారు. కాని నేను నా మొండివాదాన్ని వదిలిపెట్టలేదు. పదేపదే, పలువిధాల, అందులో కాబేజీలే ఉన్నాయని గట్టిగా చెపుతున్నాను. చివరకు మూడువ్రేళ్లుపైకి చూపిస్తూ, తల్లిసాక్షిగా, దైవసాక్షిగా, గురువుసాక్షిగా అందులో కాబేజీలే ఉన్నాయని ప్రమాణం చేశాను. నా పెద వులు వణుకుతున్నాయి. ఫెళఫెళ విరిగిపోతున్నాయి.

కొంతసేపు గడిచింది. అలా దోవపక్కనే కూలబడి

ఉన్నాను. నాముఖంమీద, గొంతుమీద పోసినచెమట తుడుచు కున్నాను. మెల్లగా రెండు మూడుసార్లు ఊపిరి పీల్చుకున్నాను. సూర్యాస్తమయం కావస్తోంది. మళ్ళీ నా పరిస్థితినిగూర్చి ఆలో చించుకోసాగాను. నాకడుపులో ఆకలిదహిస్తోంది. భగ భగ మండుతోంది. మరికొద్దిసేపట్లో చీకటిపడుతుంది. మళ్లీరాత్రి. భయంకరమైన రాత్రి. అసలు రాత్రికి 'నేనక్కడ గడపాలా' అనేదే ప్రశ్న. నేనుండివచ్చిన హోటలుమీదికి మనస్సు పోయింది. 'అవును. ఇక నేనక్కడికివెళ్ళడమనేది పడదు. డబ్బు లేకుండాహోటళ్ళలోఎవరుండనిస్తారు. పైగా అప్పుడప్పుడు ఆమె నాకింతకూడు పడేసిందికూడా. పాసిందో, పులిసిందో, తిటు తూనో, దీవిస్తూనో, ఇంత తెచ్చిముందు పడేసేది. నావల్ల కష్టంకల్గికూడా నిన్నరాత్రి ఆమె మళ్ళీ నాకింతఅన్నం తెచ్చి పడేసింది. కనుక ఆమెననవలసిన పనిలేదు. డబ్బివ్వకుండా వారాలతరబడి నేను వాళ్ళఇంట్లో ఉన్నాను. ఎవరు మటుకు ఎంతకాలం ఉండనిస్తారు? నేనే ఆమెపట్ల అసహ్యంగా ప్రవర్తిం చాను. ఆఖరుకు ఆడమనిషి అనికూడా లెక్కచేయకుండా ఆమె ముఖాన యాభైరూపాయలు విసిరికొట్టాను......

యాభై రూపాయలు! ఈలవేశాను. ఆ డబ్బెవరు పంపారు? ఆ డబ్బెక్కణ్ణుంచి వచ్చిందో ఊహించుకుంటూ ఓ అయిదునిముషాలసేపు గడిపాను. హృదయంలో ఆవేదన బయ లుదేరింది. అవమానం దహించసాగింది. 'జలజా' అన్నాను మెల్లగా. మొన్ననేగా నేను నిశ్చయించుకున్నాను? మళ్ళీ ఎప్పుడూ ఆమెముఖం చూడకూడదనీ, డబ్బుసంపాయించి మహారాజునై ఆమెను అవమానపరుస్తాననీ ప్రతిజ్ఞ చేశాను? అంతలోనే అందుకు భిన్నంగా ప్రవర్తించాను. ఆమెడబ్బుకు

ఆశపడ్డాను. చేతులుచాచాను. ఆమెకు లొంగిపోయాను. డబ్బుతో ఆమెనన్ను వంచించింది. నాకుభిక్షపెట్టింది. వీల్లేదు. వీల్లేదు. ఎంతమాత్రం వీల్లేదు. నేనాతుచ్ఛమైన సొమ్ముకు అమ్ముడుపోవడానికి వీల్లేదు. నా అవమానాలకూ, అవజయాలకూ అంతులేకుండా ఉంది. ఆమె సహాయమే లభించకపోతే నేను బ్రతకడానికే వీల్లేదా? ఛీ, ఛీ!... మోకాళ్ళమీద తలపెట్టుకున్నాను. రెండుచేతుల్తో నుదుటిమీదకొట్టుకున్నాను. అపకీర్తి, అప్రతిష్ట, నన్ను నలువైపులా చుట్టుముట్టి అగ్నిజ్వాలలై దహిస్తున్నాయి. అయిపోయింది—ఇక నేను మనిషిగా బ్రతకడానికి మార్గంలేదు! ఇదేనాకు అంత్యదశ! నాజీవితానికి చివరి ఘడియ! నా బాధలకు పరాకాష్ట! అనామకురాలైన ఒక ఆడదాని సొమ్ముకుచేయిచాచి ఆత్మాభిమానాన్ని చంపుకున్నాను. ఇంతకన్నా మరేంకావాలి? మనిషైనవాడికి ఇంతకన్నా వేరే మరణంలేదు.........

మళ్ళీ ఆ యాభై రూపాయలు ఆమెకు తిరిగి ఇచ్చివేయాలి. ఆమె సొమ్ము అవతలపారేసేమార్గం చూడాలి. హోటలుయజమానురాలి దగ్గరికెళ్ళి ప్రయోజనంలేదు. ఆమె చేతుల్లోంచి ఆ డబ్బు తిరిగిరావడం కల్ల. ఎలాగైనా మరో విధంగా సొమ్ము సంపాయించి 'జలజ'కు పంపిస్తాను. బహుశా ఇప్పుడు అయిదుగంటలు దాటిఉంటుంది. థియేటర్ మేనేజర్ను కలుసుకుంటాను. ఇంతలో మిగిలిఉన్న ఆ శాస్త్ర నాటకం పూర్తిచేయాలి.

జేబులోనుంచి రచనకాగితాలు బయటికి తీశాను. మొదటనుంచీ రాసినంతవరకు ప్రతిపంక్తీ చదువుకున్నాను.

ఎలాగైనా ఆ చివరి సీనులు పూర్తిచేయాలని పట్టుదలతో వ్రాయడం ప్రారంభించాను.

కాని రచన సాగడంలేదు. అడుగడుగునా రకరకాల ఆలోచనలు, అనుమానాలు వస్తున్నాయి. ప్లాటుకు తగినట్లుగా, పాత్రల ఔచిత్యానికి భంగంరాకుండా మాటలు పడడంలేదు. అర్థంలేని వాక్యాలు, అనవసరమైన సంభాషణలు, ఏవో పిచ్చి పిచ్చిగా వ్రాస్తున్నాను.

ఆగిపోయాను. తీరాచూస్తే వెనుకరాసిన సీనులకు, ఇప్పుడువ్రాసిన సీనుకు సంబంధమేలేదు. ప్రతిపాత్ర, తన ప్రవృత్తికి భిన్నంగా ప్రవర్తించింది. సంభాషణలు ఒకదాన్నొకటి ఖండిస్తున్నాయి. వళ్ళుతోకోపానికి పెన్సల్ని మధ్యకు రెండుగా చీల్చివేశాను. గభాలున ముందుకుదూకి ఆ వ్రాతప్రతి మొత్తాన్ని నడిమికి రెండుగా చింపాను. ప్రతికాగితాన్ని నలిపివేశాను. నా కోటుతీసి దూరంగా విసిరిపారేసి దానిమీదిగుండా నడిచాను. 'అయిపోయింది. నాబ్రతుకు అంతమైంది. నేను చచ్చిపోయాను.' అని నాలో నేను అనుకున్నాను. 'సోదర సోదరీమణులారా! మహాజనులారా! నేను చచ్చిపోయాను.' రెండుమూడుసార్లు నా కోటును తొక్కుకుంటూ అటూఇటూ నడిచాను.

కొంచెందూరంగా రోడ్డుమధ్య పోలీసునిలబడి నాచర్యలు కనిపెడుతున్నాడు. నేను తలెత్తిచూచేసరికి అతనూ నా వైపే చూస్తున్నాడు. మా ఇద్దరికళ్లూ కలిశాయి. అతనలా చాలసేపటి బట్టి అక్కడ నిలుచుని నా వ్యవహారమంతా చూస్తున్నట్లుగా ఉంది. నేను మళ్ళీ నా కోటుతీసితొడుక్కొని అతనిదగ్గరికి వెళ్లాను.

'ఇప్పుడెన్నిగంటలైందో చెప్తారా?' అడిగాను నేను.

అతను తన గడియారం చూచాడు.

'అయిదున్నర కావస్తోంది.' అన్నాడతను. అతని దృష్టంతా నా మీద నేఉంది.

'సరీగ్గా అయిదున్నరైందా? సరీగ్గా అయిదున్నర. కరెక్టు. మీరు చాల కరెక్టుగా, ఖచ్చితంగా డ్యూటీచేస్తున్నారు. నేను చూస్తూనే ఉన్నాను' అంటూ నేను వెళ్ళిపోయాను. అతను ఆశ్చర్యంగా నోరు తెరచుకొని నా వంక చూస్తున్నాడు.

రాయల్ హోటలుదగ్గరికి వెళ్ళి వెనక్కు తిరిగి చూచాను. అతనింకా అదేవిధంగా నా వైపుచూస్తూ నిలబడిఉన్నాడు.

అహ, హ! అలాంటి వెధవల్తో ఆ విధంగానే ప్రవర్తిం చాలి. మచ్చపడకుండా వాత పెట్టాలి. నొప్పి తెలీకుండా దెబ్బ కొట్టాలి. మర్యాదగాబుద్ధిచెప్పాలి! ... పోలీసువాడికి తగిన ప్రాయశ్చిత్తంచేశానని నాలో నాకు సంతోషంగాఉంది. ప్రతి నరంలో ఏదో, ఉత్సాహం, ఉద్రేకం పొంగుతున్నాయి. నా కేమీ బాధలేదు. గాలిపడగలాగా పోతున్నాను. మార్కెట్టు దగ్గరికి వచ్చాను. అంగళ్ళచుట్టూ అనేకసార్లు తిరిగాను. చివ రకు చర్చి దగ్గరకివచ్చి కూర్చున్నాను.

ఆ యాభైరూపాయల్ని గురించి ఆలోచించాల్సిన పని లేదు. ఆ డబ్బుతిరిగి ఇచ్చివేసినా, ఇవ్వకపోయినా, మునిగి పోయిందేమీలేదు. ఆ డబ్బు నాకందింది. ఎవరు పంపితేనేం? ఆ సొమ్మునాదే. ఎవరుపంపిందీ పూర్తిగా విచారించకుండానే, దాన్ని నేను మరొకరి కిచ్చేశాను. ఇకదానికోసం చేయగల్గిం దేమీలేదు.

రోడ్లన్నీ సందడిగాఉన్నాయి. నా చుట్టూ ధ్వనులు. ఏదోహాయిగా గడుపుదామని కూర్చున్నాను. కాని ఆ యాభై

రూపాయల విషయం నా మనస్సులో ఇంకా తొలుస్తూనే ఉంది. దాన్ని మరిచిపోదామని ఎంతప్రయత్నించినా సాధ్యంకావడం లేదు. చివరకు కోపంవచ్చింది. చేతులు పైకెత్తి పిడికిళ్లు బిగించాను. ఆ డబ్బుతిరిగి పంపేసినట్లయితే 'జలజ' మనస్సుకు కష్టం కలిగేది. అసలు నే నెందుకలా చేయాలి? అసలు ఎవరే సహాయంచేయబోయినా, 'నో. థ్యాంక్సు, మరేం పరవాలేదు' అనిచెప్పి తప్పుకోవడం నా కలవాటు. అంచేత అవకాశంఉన్నప్పుడుకూడా నే నెవర్నీ ఉపయోగించుకోలేకపోయాను. మాట వరసకి ఆ హోటలు, పట్టుదలపట్టి పోగొట్టుకున్నాను. నా దగ్గర డబ్బున్నప్పుడుకూడా, అన్నీ అనుభవించడానికిఅవకాశంఉన్నప్పుడుకూడా,దానివల్ల, లవలేశంకూడా సుఖాన్ని పొందక పరుల కిచ్చివేశాను. లేనప్పుడు బాధపడ్డాను. ఉన్నప్పుడైనా అనుభవించలేదు. ఇదీ నా జీవితం. ముక్కూ-ముఖం తెలీని మనుషుల కూడా అనేకసార్లు డబ్బిచ్చివేశాను. నా తత్వం అలాంటిది. 'జలజ' నాకు డబ్బుపంపించింది. దానికి నే నేం చేయను? నిజానికి ఆమె చేయగల్గిందదే.అప్పుడప్పుడుఅయిదో,పదో పంపుతూ ఉండడం. పాపం ఆ పిల్ల నన్ను ప్రేమిస్తోంది కాబోలు. బహుశా గాఢంగా ప్రేమిస్తోంది ... ఆ పిల్ల నాపై వెర్రిప్రేమ పెట్టుకుందనే అభిప్రాయం కలిగింది. పాపం, పిచ్చిపిల్ల!

---

ఆరుగంటలైంది. కొంచెందూరంగా లాంతరు స్తంభం క్రింద ఒకముసల్దికూర్చొని ఉంది. కళ్లుపెద్దవిచేసి తేరిపారచూచాను. అలా కొంతసేపు చూచింతర్వాత ఆ ముసలమ్మను గుర్తుపట్టాను. అవును. ఆ శనగలమ్ముకొనే ముసల్దే! నా కడుపులో ఆకలిమండుతోంది. లేచి మెల్లగా ఆమెదగ్గరికి వెళ్లాను.

అవును. ఆమే. ఆముసల్దే; శనగలుకాదు. చేగోడీలు. బుట్టనిండా పోసుకుని అమ్ముకుంటోంది. ఎదురుగాపోయి నిలబడ్డాను.

'ఏం ముసలమ్మా! నన్ను గుర్తుపట్టావా?'

'లేదు.' అన్నదామె నావంకచూస్తూ.

నాకు నవ్వొచ్చింది. ఆమె నన్ను తమాషాచేస్తోంది. ఎరిగికూడా ఎరగనట్లు నటిస్తోంది.

'ఏం జ్ఞాపకం రాలేదూ! ఒకరోజు నీకు చాలా డబ్బిచ్చానే అతనూ నేను.'

'ఓ, నీవా అయ్యా? అవును. జ్ఞాపకం వస్తున్నాది. నీవేనా ...'

డబ్బు సహాయంచేశానని ఆమె నాకు కృతజ్ఞత తెల్పబోతుంటే నే నడ్డగించాను.

'అవును. నేనిప్పుడు నీదగ్గర చేగోడీలు తీసుకుందామని వచ్చాను.' అన్నాను నేను బుట్టవైపుచూస్తూ. కాని ఆమె నామాట పట్టించుకున్నట్లులేదు. తిరిగీ ఇలా అన్నాను.

'అవును. నేనిప్పుడు చేగోడీలు కొంటానికే వచ్చాను. అన్నీ ఇవాళ అక్కర్లేదు. అందులో కొంతడబ్బుకు మాత్రమే ఇప్పుడు తీసుకుంటాను.'

'నీవు సరుకుతీసుకోడానికొచ్చావా?'

'అవును.' అంటూ మెల్లగా నవ్వుతున్నాను. ఆముసలమ్మ అనుమానం మనిషిలాఉంది. అప్పటికే బుట్టలోంచి ఒక 'చేగోడీ' తీసుకుని తినడం మొదలుపెట్టాను.

ఇదిచూచి ఆముసల్ది బుట్టమీదగుడ్డకప్పి తనదగ్గరకి జరుపుకుంటోంది. బహుశా నేను వెనుక ఇచ్చిన డబ్బుక్రింద ఇవితీసుకోవద్దనేమో ఆమెఉద్దేశ్యం.

'ఆడబ్బు నీవే ఇచ్చావుగదయ్యా! అదేందాంగసామ్మా ఏం? పోలీసులకు పట్టిస్తావా?'

అన్నదామె బుట్టచంకలోకి తీసుకొనిలేవాలని ప్రయత్నిస్తూ.

'కాదు. నిజంగా అందుకోసంకాదు. నిన్ను పోలీసులకు పట్టించడానికి నేను రాలేదు.'

'మరైతే అంతడబ్బు అప్పుడు నా కెందుకిచ్చావు?' అడిగిందా ముసలమ్మ.

నే నంతా చెప్పాను. స్పష్టంగా అంతా అర్థమయ్యే లాగా చెప్పాను. ఆ విధంగా అందరికీ అకారణంగా డబ్బివ్వడం నా కలవాటనికూడా చెప్పాను. 'అప్పిచ్చినాన రే, అవతలవాళ్లు రశీదుగాని, చేవ్రుత్తరంగానీ ఇస్తానన్నా నేను తీసుకోను. అక్కర్లేదు. మరేం ఫర్వాలేదు. మీకు నేను డబ్బిచ్చినసంగతి దేవుడికి తెలుసు.' అని అనేవాణ్ణని చెప్పాను.

కాని నే నెంతచెప్పినా ఆ ముసలిదానికి అర్థంకాలేదు. అంతకు ముందెవ్వరూ, ఎవ్వరూకూడా ఆమెకు ముందుగా డబ్బిచ్చినపాపాన పోలేదు. అంచేత నేను ముందు డబ్బిచ్చావనిచెపితే ఆమెకు అనుమానంగాఉంది.

నేను మరికొన్ని చేగోడీలు తీసుకున్నాను. ఆమెకుకోపం వచ్చింది. ఏదో గొణుక్కుంది. నిజాని కామెను దోచుకోవాలనే అభిప్రాయం నాకులేదు. నాకు విపరీతమైన ఆకలిగాఉంది. నిజానికి ఆమెకెంత డబ్బిచ్చాను! నాలుగు 'చేగోడీలు' తిన్నంత మాత్రాన ఆ సొమ్మంతా చెల్లుబడిఅయిపోయిందా? నే నిచ్చిన డబ్బులో నాల్గోవంతుకూడా, నేను సరుకుతీసుకోలేదు. మరి ఆ ముసలిదానికెందుకంత కష్టం? ...

ఆఖరుకు బుద్ధిపూర్వకంగా పది 'చేగోడీలు' తీసి ఆమె నాచేతుల్లో పెట్టింది. ఇక వెళ్ళిపొమ్మని బ్రతిమలాడింది. దండం పెట్టింది.

నేనక్కణ్ణుంచి వెళ్ళిపోయాను. ఆముసల్ది ఎంతమూర్ఖురాలు! మార్కెట్టు ప్రాంతంలోతిరుగుతూ ఆ చేగోడీలన్నీ తినేశాను. అన్ని చేగోడీలు క్షణంలో ఎలా తినేశానో ఆభగవంతుడికే తెలియాలి! మరేంలేదు. ఆకలికి ఆవురావురుమని అన్నీ తినేశాను. మరి దానికేంచేస్తాం? చివరకొక 'చేగోడి' మిగిలి ఉంది. దాన్ని ఆచంటివాడికివ్వాలని తోచింది. వాడే... ఆహోటలుదగ్గర కాగితపు పడవల్తో ఆడుకునే పసివాడు. అమాయకంగాఉండే ఆకుర్రాడిముఖం మరిచిపోలేకుండా ఉన్నాను. పైన మేడమీదనున్న పెద్దమనిషి వాడిముఖాన ఉమ్మేసినప్పుడు వాడికెంతకోపం వచ్చిందీ! పాపం ఏమీచేయలేక ఆపసివాడు వెక్కివెక్కిఏడ్చాడు. ఇప్పుడింతకూ వాడునాకు కన్పిస్తాడో లేదో?

వస్తూవస్తూ దోవలో నేను కూర్చొని నాటకం వ్రాసిన చోటుచూచాను. నేను చింపిపారేసిన నా రచనకాగితాలు కొన్ని ఇంకా అక్కడే పడిఉన్నాయి. మరికొన్ని గాలికి అటూ ఇటూ పోయినాయి. ఆ పోలీసు ఇంకా అక్కడే డ్యూటీ చేస్తున్నాడు. నేను మెల్లగా ఆ కుర్రాడు ఆడుకుంటూ కూర్చున్నచోటికి వచ్చాను. కాని వాడక్కడలేడు. ఆ వీధిలోనే దాదాపు మనుష్యసంచారంలేదు. ఆ చీకటివేళ వాడెక్క

డుంటాడు? ఇక నేను వాణ్ణిచూడను. చూచే ప్రాప్తంలేదు. బహుశా ఆ పసివాడు ఇంట్లో లోపల ఉండిఉంటాడు. చేతిలో 'చేగోడీ' ఆ తలుపుదగ్గర పెట్టాను. తలుపును రెండు మూడు సార్లు గట్టిగాతట్టి అక్కణ్ణుంచి వెళ్ళిపోయాను. 'అవును. ఆ కుర్రాడు తప్పకుండాదాన్ని చూస్తాడు. బయటికిరాగానే ముందు వాడికళ్ళకు ఆ 'చేగోడి' కన్పిస్తోంది. తీసుకొని తింటాడు' అనుకున్నాను నాలోనేను. నా కెంతోసంతోషమైంది.తృప్తిగాఉంది.

హార్బరు దగ్గరికొచ్చాను. నా కిప్పుడు ఆకలిగాలేదు. మనస్సులోకి ఏదో విచిత్రమైన ఊహాలువస్తున్నాయి. వార్ఫు లోకివెళ్లాను. అక్కడొక చెక్కపెట్టెఉంటే దానిమీద కూర్చున్నాను. ఎదురుగా 'కోపెగొరో' ఓడ కన్పిస్తూనేఉంది. 'ఈ రాత్రివేళ రహస్యంగా ఆ ఓడ లంగరుమోకు తెగగొడితే? లేక హఠాత్తుగా ఓడకు నిప్పంటిస్తే!' నా కేవో పిచ్చిపిచ్చి ఆలోచనలు వస్తున్నాయి. ఏం చేయడానికి తోచడంలేదు. అలా కొంత సేపు కూర్చున్నాను. ఎదురుగా 'కోపెగొరో' ఓడ. ఓడమీద తళతళమెరుస్తూ ఎగురుతోన్న ఎర్రజండా!

పట్టాలమీదినుంచి వస్తోన్న 'కెప్టెన్' కన్పించాడు. అతనిచేతిలో ఎర్రని లాంతరుంది. అతనితో మాట్లాడాలని లేచి నిలబడ్డాను. కాని యేం నిశ్చయించుకోలేక పోయాను. పైగా 'కెప్టెన్' నాతోమాట్లాడకపోవచ్చుకూడా.

'ఈరాత్రి ఓడ బయల్దేరుతుందా కెప్టెన్?అడిగాను నేను

'అవును. కొద్దిసేపట్లో బయల్దేరుతుంది.' అతను ఇంగ్లీషులో సమాధానం చెప్పాడు.

'పోతే-మీకెవరైనా మనిషి కావాల్సిఉందా?

అలా అడిగినప్పుడు నా నాలుక మడతపడింది. అతను కావాలంటాడో, అక్కర్లేదంటాడో; అతని సమాధానంకోసం నిరీక్షిస్తూ నిలబడ్డాను.

'కుర్రాడై తేతప్ప పనికిరాడు' అన్నాడతను.

'కుర్రాడా!' అంటూ నేను నాకళ్లద్దాలు తీసి జేబులో పెట్టుకున్నాను. గబగబ అతని వెనకాలే నడుస్తూవెళ్లి డెక్ మీది కెక్కి నిలబడ్డాను.

'నా కనుభవంలేదు. కాని ఒకసారిచూపిస్తే ఏ పనైనా చేయగలను. ఓడలో ఏం సరుకుంది?' అడిగాను నేను.

'కంకర వేశాం. వస్తూబొగ్గు వేసుకొస్తాం.' అన్నాడు కెప్టెన్.

'ఓ! ఏదైనా పర్వాలేదు. ఏ పనైనా చేయడానికి సిద్ధంగాఉన్నాను.'

'ఇంతకుముందెప్పుడూ నీవు సముద్రంమీద ప్రయాణం చేయలేదా?'

'లేదు. అయితేమాత్రం ఏం? మీరు నన్ను పరీక్షచేసి చూడండి. ఒకచిన్నపని చెప్పిచూడండి. నేను పనికొస్తానో, లేదో. నే నెటువంటిపనైనా సులభంగా నేర్చుకోగలను.'

కెప్టెన్ ఆలోచిస్తూ నిలబడ్డాడు. ఎలాగైనా ఆ ఓడమీద ప్రయాణంచేయడంఖాయమని నిశ్చయించుకున్నాను. ఇంతలో భయంకరంగా సముద్రఘోష విన్పించింది.

'ఏమాలోచించారు కెప్టెన్? నిజంగా నేను ఏ పనైనా చేయగలను 'నే నెప్పుడూ చేయాల్సినదానికంటే ఎక్కువకష్టం చేసేవాణ్ణి. అవసరమైతే ఒకేసారి రెండు గడియారాలుతీసుకో గలను.'అన్నాను నేను.

'సరే, ప్రయత్నించు. నీ చేతకాకపోతే నేను సహాయం చేస్తాను' అన్నాడు కెప్టెన్. 'ఓ, యస్' సంతోషంతో సమాధానం చెప్పాను.

అతను నాకు పనిపప్పగించాడు. నా వళ్ళంతా చెమట పట్టింది. బలహీనంవల్ల జ్వరంవచ్చినట్లుగాఉంది. ఒకసారి తలెత్తిచూచాను. పట్నం రంగురంగుల విద్యుద్దీపాలతో వెలుగుతోంది, ఇల్లూ, ప్రతికిటికీ తళతళమెరుస్తున్నాయి. ప్రస్తుతానికి పట్నం - విచిత్రమైన ఆ నగరానికి స్వస్తిచెప్పాను.

---

లక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, గుంటూరు-1.

